శ్రీః

మహాకవి శ్రీకాలిదాస విరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## అష్టమః సర్గః

వ్యాఖ్యాత : డా॥ సూరం శ్రీనివాసులు



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారి, మోహనరావు దంపతులు**

510, Pride Block Platinum County, Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

శ్రీః

మహాకవి శ్రీకాలిదాస విరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

**అష్టమః సర్గః**

**వ్యాఖ్యాత : డా॥ సూరం శ్రీనివాసులు**

ప్రథమముద్రణ : మహాశివరాత్రి - 2021

ప్రతులు : 200

పుటలు : 224

వెల రూ. : 150/-



510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Karshak Art Printers**
**HYDERABAD**

శ్రీః

మహాకవి శ్రీకాలిదాస విరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## అష్టమః సర్గః



### నవపరిణీతవరవధ్వోః ప్రణయచేష్టావర్ణనమ్

**అవ :** నవపరిణీత–గిరిజారహఃకేలిమపి వివర్ణయిషుస్తత్రభవాన్ కాలిదాసోఽష్టమం సర్గమారభతే.

**శ్లో॥ పాణిపీడనవిధేరనన్తరం శైలరాజదుహితుర్హరమ్ప్రతి ।**
**భావసాధ్వసపరిగ్రహాదభూత్కామదోహదసుఖం మనోహరమ్ ॥ 1**

**అవ :** పార్వతీపరమేశ్వరుల పరిణయం తర్వాత పార్వతిలో ప్రారంభమైన సుఖస్పర్శానుభవాన్ని వర్ణించటం.

**పదవిభాగం :** పాణి–పీడన–విధేః అనన్తరం శైల–రాజ–దుహితుః హరం ప్రతి భావ–సాధ్వస–పరిగ్రహాద్(త్) అభూత్ కామ–దోహద–సుఖం మనోహరమ్.

**అన్వయక్రమం :** (అథ) శైల–రాజ–దుహితుః పాణిపీడనవిధేః అనన్తరం హరం ప్రతి భావ–సాధ్వస–పరిగ్రహాత్ కామదోహదసుఖం మనోహరమ్ అభూత్.

**ప్రతిపదార్థం :** పాణి...విధేః : పాణి–పీడన = పాణిగ్రహణమనే, విధేః = శాస్త్రవిహితమైన పనియొక్క, అనన్తరమ్ = తర్వాత, శైల... దుహితుః : శైల–రాజ = కొండలతేనియొక్క, దుహితుః = కుమార్తెకు (పార్వతికి); హరమ్ ప్రతి = పరమేశ్వర విషయకమైన; భావ... పరిగ్రహాత్ : భావ = అభిలాషతో కూడిన, సాధ్వస = వెరపుయొక్క, పరిగ్రహాత్ = స్వీకారంవలన, కామ... సుఖమ్ : కామ = కామ విషయకమైన, దోహద = కోరికలోని, సుఖమ్ = సుఖము; మనః+హరమ్ = మనస్సును దోచేదిగా, అభూత్ = అయినది.

**తాత్పర్యం :** పార్వతీపరమేశ్వరుల వివాహమైన తరువాత కొండలతేని కూతురయిన పార్వతికి శివవిషయికంగా కామకాంక్ష కలిగింది. ఆ కోరికకు వెరపుకూడా తోడు కావటంతో అది మనోహరంగా రూపుదిద్దుకొంది.

**విభక్తులు/క్రియలు :** 1. **పాణిపీడనవిధేః – విధేః** – విధ్యోః – విధీనామ్ : విధిశబ్దః ఇకారాన్త పుంలింగం: పంచమీ/షష్ఠీ విభక్తి ఏకవచనం; 2. **అనన్తరం** – అవ్యయం; 3. **శైలరాజదుహితుః – దుహితుః** – దుహిత్రోః – దుహితౄణాం : దుహితృ శబ్దః ఋకారాన్త స్త్రీలింగః. షష్ఠీవిభక్తిః; 4. **హరమ్** – అకారాన్తపుంలింగహరశబ్దః ద్వితీయా విభక్తిః. ఏకవచనం; 5. **ప్రతి** –అవ్యయం; 6. **భావసాధ్వసపరిగ్రహాత్ – పరిగ్రహాత్** – పరిగ్రహాభ్యాం – పరిగ్రహేభ్యః – అకారాన్త పుంలింగ పరిగ్రహశబ్దః. పంచమీ విభక్తి+ఏకవచనం. 7. **కామదోహదసుఖమ్** – సుఖం సుఖే సుఖాని – అకారాన్త–నపుంసకలింగసుఖశబ్దః. ప్రథమావిభక్తి ఏకవచనం; 8. **మనోహరమ్ – మనోహరం** – మనోహరే – మనోహరాణి – అకారాన్తనపుంసకలింగః మనోహరశబ్దః ప్రథమావిభక్తి ఏకవచనం; 9. **అభూత్** – క్రియ.

**సమాసాలు : 1. పాణిపీడనవిధేః –** పాణేః పీడనం, తస్య విధిః, తస్మాత్; 2. **శైలరాజదుహితుః** – శైలానాం రాజా, తస్య దుహితా, తస్యాః; 3. **భావసాధ్వసపరిగ్రహాత్ –** భావస్య సాధ్వసస్య చ పరిగ్రహః, తస్మాత్ (అథవా) భావమిశ్రం సాధ్వసం, తస్మాత్; 4. **కామదోహదసుఖమ్** – కామే దోహదం, తస్య సుఖమ్; 5. **మనోహరమ్** – మనసః హరం.

**సంధులు :** 1. విధేః+అనన్తరమ్ = విధేరనన్తరమ్ – **విసర్గసంధి;** 2. దుహితుః+హరమ్ = దుహితుర్హరమ్ – **విసర్గసంధి;** 3. ...గ్రహాత్+అభూత్ = గ్రహాదభూత్ – **జశ్త్వసంధి,** ఝలాం జశోఽన్తే;

**పాఠాన్తరాలు :** కామదోహదసుఖమ్ – కామదౌహృదసుఖమ్. కామదోహదమనోహరం వపుః

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు:**

1. పాణిః – పణాయన్తే వ్యవహరన్తి అనేన ఇతి పాణిః, పణ ధాతువుపై "అశిపణాయ్యోరుడాయలుకౌ" చ "ఉణాదిసూత్ర"ంతో ఇణ్ ప్రత్యయం, ఆయా భావం కూడా.

2. భావః భావయతి పదార్థాన్ ఇతి భావః. భూ ధాతువుపై ప్రేరణార్థంలో ణిచ్, నందిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః' సూత్రంతో అచ్ ప్రత్యయం. 'భవతేశ్చేతి వక్తవ్యమ్' అని కాశికావచనం కాబట్టి భవతి ఇతి భావః అని అయినా చెప్పవచ్చు.

భావపదం సత్తార్థకం

శ్లో॥ 'నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥'

అని భగవద్గీతావచనం (2/16). సదసత్తులకు కూడా భిన్నమైనది తొలిదశ అని ఋగ్వేదం లోని నాసదీయసూక్తం చెప్తుంది. (నాసదాసీన్నో సదాసీ త్తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్).

అలంకారికంగా భావం యౌవనంలోని స్త్రీల సత్త్వజాలంకారాలలో ఒకటి.

శ్లో॥ యౌవనే సత్త్వజాః స్త్రీణామలంకారాస్తు వింశతిః ।
భావో హావశ్చ హేలా చ త్రయస్తత్ర శరీరజాః ॥ 2/30

**నిర్వికారాత్మకాత్ సత్త్వాద్భావ**స్తత్రాద్యవిక్రియా । 2/33

ప్రకృతశ్లోకంలో పార్వతిలో వర్ణించిన భావమిదే. సత్త్వంలో పుట్టిన తొలి మార్పు. సాత్త్విక సంచారి స్థాయిభావాలకు కూడా భావమనే వ్యవహారం.

'భావా ఇతి కథమ్? కిం భవన్తీతి భావాః, కిం వా భావయన్తీతి భావాః? ఉచ్యతే. వాగంగసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తీతి భావాః ఇతి' నాట్యశాస్త్రమ్, 7వ అధ్యాయం.

**దోహదమ్ : అథ దోహదమ్**

శ్లో॥ ఇచ్ఛా కాంక్షా స్పృహేహాతృడ్వాంభాలిప్సా మనోరథః ।
కామోఽభిలాషస్తర్షశ్చ... అని అమరకోశం సాధారణమైన కోరికను దోహదమంటుంది. దోహం దదాతీతి దోహదః. "**అతోనుపసర్గే కః**" సూత్రంతో దా ధాతువుపై క ప్రత్యయం.

విశేషంగా గర్భిణీల కోరికలను దోహదం అంటారు. అది తీరకపోతే దోషమనీ, తప్పక తీర్చాలనీ యాజ్ఞవల్క్యసంహితావచనం.

**శ్లో॥ దోహదస్యాప్రదానేన గర్భో దోషమవాప్నుయాత్ ।**
**వైరూప్యం మరణం వాపి తస్మాత్ కార్యం ప్రియం స్త్రియాః** ॥ 3/79

దోహద పదార్థంలోనే దౌర్హృదపదోపయోగం కూడా. భవభూతి ఉత్తరరామచరితంలో "**యః కశ్చిద్గర్భదౌహృదో భవేదస్యాః సోఽవశ్యమచిరాన్మానయితవ్యః**' అని రామమాతృవచనంగా అష్టావక్రునిచే చెప్పిస్తాడు.

తరువులను పుష్పింపజేయటానికి చేసే క్రియావిశేషాన్ని వృక్షదోహదమంటారు. రఘువంశకావ్యంలో

**శ్లో॥ కుసుమం కృతదోహదస్త్వయా – యదశోకోఽయ ముదీరయిష్యతి ।**
**అలకాభరణం కథం ను తత్ – తవ నేష్యామి నివాపమాల్యతామ్ ॥** 8/62

అయా చెట్లకు పాటించవలసిన దోహదవిశేషాలను మల్లినాథసూరి వ్యాఖ్యానంలో ఇలా వివరిస్తాడు.

**శ్లో॥ స్త్రీణాం స్పర్శాత్ ప్రియంగుర్వికసతి వకులః శీధుగండూషసేకాత్**
**పాదాఘాతాదశోకస్తిలకకురవకౌ వీక్షణాలింగనాభ్యామ్ ।**
**మన్దారో నర్మవాక్యత్ పటుమృదుహసనాచ్చమ్పకో వక్త్రవాతాత్**
**చూతో గీతాన్న మేరుర్వికసతి చ పురో నర్తనాత్ కర్ణికారః ॥**

**కామదోహదమ్** – కామదోహద పదానికి మల్లినాథసూరి కామసంవర్ధకమైన దోహదక్రియనే అర్థంగా చెప్పాడు. వృక్షదోహదం వలెనే కామదోహదం కూడా. '**తరుగుల్మ లతాదీనామకాలే కుశలైః పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదమ్**" అలాగే హరునిలో కామసంవర్ధన కోసం పార్వతిలోని భావసాధ్వసభరితమైన చేష్టావిశేషం దోహదమవుతుంది. 'కార్యభూతోఽనుభావం స్యాత్ కటాక్షాదిః శరీరజః' అని కటాక్షభ్రూవిక్షేపాదులను అనుభావాలుగా చెప్పారు ఆలంకారికులు. స్థాయిభావం ప్రేక్షకులలోగానీ శ్రోతలలో గానీ రసరూపాన్ని పొందటానికి అనుభావాలే సహకరిస్తాయి.

**అష్టమసర్గౌచిత్యం :** అష్టమసర్గప్రతిపాదితమైన విషయం పార్వతీపరమేశ్వరులు అన్యోన్యాలంబనంగా వున్న **సంభోగశృంగారవర్ణన**. ఇది ఉచితమా? అనుచితమా? అన్నదొక ప్రశ్న. ఎందుకంటే అనుచితమైతే రసభంగమైనట్లే.

**శ్లో॥ అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్ ।**
**ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా ॥**

అని ఆనందవర్ధనుడు ఔచిత్యబంధమే రసోపనిషత్తు అన్నాడు. ఆ యా ప్రకృతులకు (వ్యక్తులకు) ఏది సముచితమో దాన్ని పాటించటమే కర్తవ్యమని ఆనందవర్ధనవచనం.

''తస్మాదభినేయార్థేఽనభినేయార్థే వా కావ్యే యదుత్తమప్రకృతేరుత్తమ–ప్రకృతిభిర్నాయికాభిః సహ గ్రామ్యసమ్భోగవర్ణనం తత్పిత్రోః సంభోగవర్ణనమివ సుతరా–మసభ్యమ్. తథై**వోత్తమదేవతావిషయకమ్**' అని ఉత్తమపాత్రలలోనైనా, ఉత్తమ దేవతలలోనైనా గ్రామ్యలక్షణాలు లేకుండా ఉత్తమప్రకృతికి తగినట్లు శృంగారవర్ణన దోషం కాదని ప్రతిపాదించాడు.

కుమారసంభవకావ్యవ్యాఖ్యాతలు విభిన్నాభిప్రాయాలను ప్రకటించారు. నారాయణ పండితుడు తన వివరణ వ్యాఖ్యలో వాటిని వివరించారు. "అత్రాష్టమః సర్గః గౌరీ సంభోగవర్ణనాత్ వాచయితుం, శ్రోతుం, వ్యాఖ్యాతుం వా న యుక్తః. ఏతచ్ఛీలానాం దేవతాశాపాదాయుషః క్షయో భవిష్యతీతి' ఇది మాధవాభిప్రాయం. ఇటువంటి వర్ణనను వ్యాఖ్యానిస్తే ఆయుఃక్షీణం కావచ్చునని భయపడుతున్నానని. దక్షిణావర్తుడు కూడా తాను వ్యాఖ్యానించటానికి భయపడుతూ అన్వయాన్ని మాత్రమే చెప్తానన్నాడు. మల్లినాథసూరికి ఇటువంటి సందేహాలు రాలేదు. అరుణాచలనాథుడు భయపడుతున్న వారిఅభిప్రాయాలను ఖండించాడు.

"పార్వతీపరమేశ్వరయోః శరీరగ్రహణమాత్రమపి లోకానుగ్రహార్థమేవ...
యేన కేనాపి ప్రకారేణ భగవతి మనః ప్రణిధానమేవ ముక్తికారణమిత్యుక్తం భాగవతే
**శ్లో॥ కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ వా ।**
**నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే ॥** ఇతి.

మహాకవిరపి కామినాం చిత్తం పార్వతీపరమేశ్వరపాదారవిన్దాసక్తం విధాతుమేవాష్టమే. అస్మిన్ సర్గే వాత్స్యాయనశాస్త్రానుసారిణీం పదవీమురరీచకార... తదనుబద్ధాని వచనాని తు స్తుతావేవ పర్యవస్యన్తీతి అలమతి ప్రసంగేన" -

పార్వతీపరమేశ్వరులు దేహధారణచేయటమే లోకానుగ్రహం కోసం. భాగవతంలో ముక్తిమార్గాలు చాలా చెప్పాడు మహర్షి కామక్రోధదులవి. ఈ సర్గలో కాళిదాసు వాత్సాయన మార్గాన్ని అనుసరిస్తూ కాముకుల మనస్సులు కూడా పార్వతీపరమేశ్వరుల పాదారవిందాలపై ఆసక్తిని కల్గించటానికి ఈ మార్గాన్ని ఎంచుకొన్నాడు.

వర్ణనక్రమంలో అనౌచిత్యం లేకపోతే ఆదిదంపతుల అనురాగచేష్టావర్ణన కూడా లోకోపకారార్థమే. కావ్యమర్యాదలతోపాటు మానవీయమర్యాదలను కూడా అతిక్రమించకపోతే ఆ వర్ణన సముచితమే.

**క్రియాదర్శం** అభూత్ - అభూతామ్ - అభూవన్

భూ సత్తాయాం ధాతువు లుఙ్ (సూత్రం - లుఙ్) ప్రథమపురుషైకవచనం - అకర్మకం - సేట్.

**ఛందస్సు -** ఈ సర్గలో చివరి శ్లోకం తప్ప మిగిలినవన్నీ రథోద్ధతావృత్తాలే. **రాన్నరావిహ రథోద్ధతా లగౌ** - రనరలగ.

*

**అవ :** ఇదానీం లక్షణరీత్యా నవోఢత్వమేవ దశభిః ప్రపఞ్చయతి.

పార్వతి స్పందించకపోయినా ఆమె వైముఖ్యం కూడా పరమేశ్వరునికి ప్రీతియే కలిగినదని వర్ణించుట.

**శ్లో॥ వ్యాహృతా ప్రతివచో న సన్దధే గన్తుమైచ్ఛదవలమ్బితాంశుకా ।**
**సేవతే స్మ శయనం పరాఙ్ముఖీ సా తథాఽపి రతయే పినాకినః ॥ 2**

**ప.వి. :** వ్యాహితా ప్రతివచః న సన్దధే గన్తుమ్ ఐచ్ఛత్ అవలమ్బిత+అంశుకా సేవతే స్మ శయనం పరాఙ్ముఖీ సా తథా అపి రతయే పినాకినః.

**అ :** సా వ్యాహృతా ప్రతివచః న సన్దధే అవలమ్బితాంశుకా (సతీ) గన్తుమ్ ఐచ్ఛత్ పరాక్+ముఖీ (సతీ) శయనం సేవతే స్మ. తథాపి పినాకినః రతయే (అభూత్).

**ప్ర :** సా = ఆ పార్వతి, వ్యాహృతా (సతీ) = పిలువబడినదై, ప్రతివచః = సమాధానాన్ని, న సన్దధే = ఇవ్వలేదు (ఆధరించలేదు), అవ... శుకా (సతీ) : అవలంబిత = పట్టుకొనబడిన (లాగబడిన), అంశుకా (సతీ) = పైటకొంగు గలదై, గన్తుమ్ = వెళ్లు టకు, ఐచ్ఛత్ = ఇష్టపడింది. పరాఙ్+ముఖీ (సతీ) = పెడమొగం గలదై, శయనమ్ = పక్కను, సేవతే స్మ = సేవించు చుండెను. తథా - అపి = అయినప్పటికీ, పినాకినః = పినాకికి (ఈశ్వరునికీ), రతయే = ప్రీతికొరకే, (అభూత్) = ఉండెను.

**తా :** (శివుడు) పార్వతిని పలుకరించినా బదులు చెప్పలేదు. పైటకొంగు పట్టుకొన్నా వెళ్లటానికే ఇష్టపడింది. శయ్యపై పెడమొగంగానే పడుకొంది. అయినా పరమేశ్వరునకు ప్రీతినే కలిగించింది.

**విభక్తులు/ క్రియలు : 1. వ్యాహృతా** - వ్యాహృతే - వ్యాహృతాః. వ్యాహృతా శబ్దః ఆకారాన్తస్త్రీలింగః. ప్రథమావిభక్త్యేకవచనం; 2. **ప్రతివచః** - ప్రతివచసీ - ప్రతివచాంసి. ప్రతివచశ్శబ్దః సకారాన్తనపుంసకలింగః. ద్వితీయావిభక్త్యేకవచనం; 3. **న** = అవ్యయం; 4. **గన్తుమ్ -** అవ్యయం; 5. **అవలంబితాంశుకా...** శుకే .... శుకాః. ఆకారాన్త-స్త్రీలింగః అవలంబితాంశుకాశబ్దః ప్రథమావిభక్త్యేకవచనం; 6. **శయనమ్ -** శయనే - శయనాని, శయనశబ్దః అకారాన్తనపుంసకలింగః. ద్వితీయావిభక్త్యేకవచనం; 7. **పరాఙ్ముఖీ -** పరాఙ్ముఖ్యౌః - పరాఙ్ముఖ్యః. పరాఙ్ముఖీశబ్దః ఈకారాన్తస్త్రీలింగః. ప్రథమావిభక్త్యేకవచనం; 8. సా - తే - తాః. తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః. ప్రథమా-విభక్త్యేకవచనం; 9. **తథా - అపి** అవ్యయాలు; 10. **రతయే/రత్యై** - రతిభ్యామ్ - రతిభ్యః. రతిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః. చతుర్థీవిభక్త్యేకవచనం; 11. పినాకినః - .... - పినాకినామ్, పినాకిన్ శబ్దః నకారాన్తః పుంలింగః, షష్ఠీవిభక్త్యేకవచనం.

| 12. 1. | **సన్దధే** | సన్దధాతే | సన్దధిరే | సమ్ పూర్వక |
| --- | --- | --- | --- | --- |
| | సన్దధిషే | సన్దధాథే | సన్దధిధ్వే | ధాతువుపై (డుధాఞ్ |
| | సన్దదే | సన్దధివహే | సన్దధిమహే | ధారణే) లిట్ ప్ర.ఏ. |

2. ఐచ్ఛత్ :

| ఐచ్ఛత్ | ఐచ్ఛతామ్ | ఐచ్ఛన్ | ఇషు ఇచ్ఛాయామ్ |
| --- | --- | --- | --- |
| ఐచ్ఛః | ఐచ్ఛతమ్ | ఐచ్ఛత | ధాతువుపై లఙ్ |
| ఐచ్ఛమ్ | ఐచ్ఛావ | ఐచ్ఛామ | ప్ర.ఏ. |

3. సేవతే స్మ :

| సేవతే | సేవతే | సేవన్తే | షేవృ సేవనే – |
| --- | --- | --- | --- |
| సేవసే | సేవేథే | సేవధ్వే | ధాతువుపై లట్ – |
| సేవే | సేవావహే | సేవామహే | ప్ర.ఏ. |

**సమాసాలు/ సంధులు :**

1. అవలమ్బితమ్ అంశుకం యస్యాః సా అవలమ్బితాంశుకా ; 2. ప్రతివచః+న = ప్రతివచో న; 3. పశ్చాత్+భేదమ్ = పశ్చాద్భేదమ్

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

1. పినాకీ – పినాకః అస్య అస్తీతి పినాకీ. ద్వాదశరుద్రులలో ఒకరు పినాకి అని మత్స్యపురాణకథనం.

**శ్లో॥ అజైకపాదహిర్బుధ్న్యో విరూపాక్షోఽథ రైవతః ।**
**హరశ్చ బహురూపశ్చ త్ర్యంబకశ్చ మహేశ్వరః ॥**

**శ్లో॥ సావిత్రశ్చ జయన్తశ్చ పినాకీ చాపరాజితః ।**
**ఏతే రుద్రాః సమాఖ్యాతాః ఏకాదశగణేశ్వరాః ॥**

ఏకాదశ రుద్ర నామ పరిగణనంలో వివిధాభిప్రాయాలున్నాయి. కొన్ని చోట్ల పినాకీ పదముండదు. అయితే మహాభారతంలోని దానధర్మపర్వంలో కూడా ఏకాదశరుద్ర పరిగణనలో పినాకీ పదముంటుంది.

ప్రకాశికావ్యాఖ్యాకారుడు పార్వతీపరమేశ్వరశృంగారవర్ణన విషయంలో దక్షిణావర్తుని అభిప్రాయాన్ని ప్రకటించి నిరాకరిస్తాడు.

**'అత్ర దక్షిణావర్త ఆహ – అస్య ప్రకరణస్య శివయోః సంభోగవిషయత్వాత్ రసభావాన్**

**వివిచ్య వక్తుం బిభేమి. తస్మాదన్వయమాత్రాది క్రియత**' ఇతి. ఏతదల్పజ్ఞతా విలసితం. యతః ప్రసిద్ధలౌకికోత్తమనాయకవ్యవహారమనుకుర్వతోః అనయోః మహానటయోః లీలామాత్రాత్మికాసు ప్రవృత్తిషు పరమార్థబుద్ధిర్యస్యాస్తి తస్యైవాయం దోషః. యస్య తు సా నాస్తి తస్య తద్వివేచనమపి శివయోః స్తుతౌ పర్యవస్యతి ।

మహానటులైన పార్వతీపరమేశ్వరులు లౌకికోత్తమనాయికానాయకవ్యవహారాన్ని అనుసరించటం లీలామాత్రమని దానిలో పరమార్థబుద్ధి కలగటమే దోషమని అరుణగిరి నాథుని వివరణ.

పరాఙ్ముఖీత్వం బిబ్బోకానుభావం. '**పరాఙ్ముఖీత్వం శీర్షం పరావృత్తః శిరోభవేత్।**' అని అభినయదర్పణం పరావృత్తమనుపేర అనుభావాన్ని నిర్వచించి విలాసాది గాత్రా-జానుభావాలలో దీని వినియోగమని చెప్పింది. అయితే పరాఙ్ముఖీత్వం బిబ్బోకా-నుభావమైనా (**గర్వాభిమానాదిష్టేఽపి బిబ్బోకోఽనాదరక్రియా - దశరూపకం**) బిబ్బోక-కారణం గర్వాభిమానాలతో పాటు సిగ్గు కూడా. కాబట్టి బిబ్బోకం త్రపానుభావమై పార్వతీగతమైన త్రపాభావాన్ని కూడా ప్రకృతశ్లోకం వ్యక్తం చేస్తుంది.

పరాఙ్ముఖీత్వం అనుభావవిశేషం. సాధారణస్థితిలో అది అనురాగసూచకమూ, ప్రియరాగవివర్ధకమూ కూడా అవుతుంది. నాగానందంలో జీమూత వాహనుడు మలయవతిలోని వైముఖ్యాన్ని ప్రీతి జనకంగా ఎలా భావించాడో గమనించండి.

**శ్లో॥ దృష్టాదృష్టిమధో దదాతి కురుతే నాలాపమాభాషితా**
**శయ్యాయాం పరివృత్య తిష్ఠతి బలాదాలింగితా వేపతే ।**
**నిర్యాన్తీషు సఖీషు వాసభవనాన్నిర్యాన్తు మే వేహతే**
**జాతా వామతయైవ మేఽద్య సుతరాం ప్రీత్యై నవోఢా ప్రియా॥**

-నాగానందం 3/4

*

**శ్లో॥ కైతవేన శయితే కుతూహలాత్పార్వతీ ప్రతిముఖం నిపాతితమ్ ।**
**చక్షురున్మిషతి సస్మితం ప్రియే విద్యుదాహతమివ న్యమీలయత్ ॥ 3**

**అవ :** పార్వతిలోని అనురాగాంకురం పొటమరించుటను వర్ణించటం.

**ప.వి. :** కైతవేన శయితే కుతూహలాత్ పార్వతీ ప్రతిముఖం నిపాతితమ్ చక్షుః ఉన్మిషతి సస్మితం ప్రియే విద్యుద్+ఆహతమ్ ఇవ, న్యమీలయత్.

**అన్వ :** ప్రియే కైతవేన శయితే పార్వతీ కుతూహలాత్ ప్రతిముఖం నిపాతితం చక్షుః ప్రియే సస్మితం ఉన్మిషతి విద్యుద్+ఆహతమ్ ఇవ న్యమీలయత్.

**ప్ర :** ప్రియే = వల్లభుడు, కైతవేన = సాకుతో, శయితే = పడుకొనగా/నిద్రించగా, పార్వతీ = గిరిసుత, కుతూహలాత్ = కౌతుకంతో, ప్రతిముఖమ్ = శివునకభిముఖంగా, నిపాతితమ్ = లగ్నం చేయబడిన, చక్షుః = కంటిని (చూపును), ప్రియే = పెనిమిటి, సస్మితమ్ = చిఱునవ్వుతో, చక్షుః = కంటిని, ఉన్మిషతి = తెరవగా, విద్యుదాహతమ్ ఇవ : విద్యుత్ = మెరుపుతీగెచే, ఆహతమ్ ఇవ = కొట్టబడినదో అన్నట్లు, ని+అమీలయత్ = మూసివేసినది.

**తా :** (పార్వతి ప్రతిక్రియ పరిశీలించాలని) పరమశివుడు నిదురను నటిస్తూ పడుకొనినాడు. పార్వతి దానిని వాస్తవంగా భావించి ఆయనపై తన దృష్టిని ప్రసరింపజేసింది. శివుడు నవ్వుతూ కన్ను తెరవగానే తాను కన్ను మూసికొన్నది.

**విభక్తులు/ క్రియలు :** 1. కైతవేన : **కైతవేన** - కైతవాభ్యాం - కైతవైః, అకారాన్త-నపుంసకలింగః కైతవశబ్దః. తృతీయైకవచనమ్; 2. శయితే : **శయితే** - శయితయోః - శయితేషు. అకారాన్తపుంలింగః శయితశబ్దః. సప్తమ్యేకవచనమ్; 3. కుతూహలాత్: **కుతూహలాత్** - కుతూహలాభ్యాం - కుతూహలేభ్యః, అకారాన్తనపుంసకలింగః కుతూహలశబ్దః. పంచమ్యేకవచనమ్; 4. పార్వతీ : **పార్వతీ** - పార్వత్యౌ - పార్వత్యః. ఈకారాన్తస్త్రీలింగః పార్వతీశబ్దః. ప్రథమైకవచనమ్; 5. ప్రతిముఖమ్ - అవ్యయం; 6. నిపాతితమ్ : **నిపాతితం** - నిపాతితే, నిపాతితాని. అకారాన్తనపుంసకలింగః నిపాతితశబ్దః. ప్రథమైకవచనమ్; 7. చక్షుః : **చక్షుః** - చక్షుషీ - చక్షూంషి సకారాన్తనపుంసకలింగః చక్షుశ్శబ్దః. ప్రథమైకవచనమ్; 8. ఉన్మిషతి : **ఉన్మిషతి** - ఉన్మిషతోః - ఉన్మిషతు - నకారాన్తపుంలింగః ఉన్మిషతి శబ్దః. సప్తమ్యేకవచనమ్; 9. సస్మితమ్ : **సస్మితం** - సస్మితే - సస్మితాని. అకారాన్తనపుంసకలింగః సస్మితశబ్దః. ప్రథమైకవచనమ్; 10. ప్రియే : **ప్రియే** - ప్రియయోః - ప్రియేషు. అకారాన్తపుంలింగః ప్రియశబ్దః. సప్తమ్యేకవచనమ్; 11. విద్యుత్+ఆహతమ్ : **ఆహతమ్** - ఆహతే - ఆహతాని - ఆహతశబ్దః అకారాన్తనపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 12. ని+అమీలయత్ : **న్యమీలయత్** - న్యమీలయతామ్ - న్యమీలయన్ నిపూర్వకః మీల్ నిమేషణే ధాతుః ప్రేరణార్థే లజ్ ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :**

1. చక్షుః+ఉన్మిషతి = చక్షురున్మిషతి - విసర్గసంధి; 2. విద్యుత్+ఆహతమ్ = విద్యుదాహతమ్ - జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. విద్యుతా ఆహతమ్ = విద్యుదాహతమ్, తృతీయాతత్పురుషః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**కైతవేన** – కితం వాయతి కితేన వాతి వా ఇత్యర్థే కితోపపదాత్ వా ధాతోః '**అతోఽ నుపసర్గే కః**' ఇతి సూత్రేణ క ప్రత్యయః, '**ఆతో లోప ఇటి చ**' ఇతి ఆకారలోపశ్చ. కితవ పదసిద్ధిః. కితవస్య కర్మ వా కైతవమ్.

కిత పదం సంశయార్థకం – సంశయంతో ప్రవర్తించేవాడు కితవుడు. కితవుని కర్మ కైతవం.

**శ్లో॥ కైతవం కపటం కూటం వ్యాజచ్ఛద్మో పధిచ్ఛలమ్ ।**
**మిషం నిభం చ నిర్దిష్టం వ్యపదేశశ్చ సూరిభిః ॥**

అని హలాయుధకోశం. కితవత్వం జూదగాడి లక్షణంగా భావించి – వాస్తవానికి అలా నిరూపించే అవకాశం లేకపోయినా – కితవకర్మను కైతవమనీ, అది కపటత్వమనీ భావించారు ప్రజలూ, గ్రంథకర్తలూను. కపటత్వార్థంలో భాగవతప్రయోగం –

**శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతామ్ ।**
**వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్ ॥**

నిద్రాకైతవం సంభోగశృంగారాన్ని వర్ణించటంలో ఒక ఫలవంతమైన చేష్ట. అమరుకుడు తన శతకంలో ఈ చేష్టను, తత్పరిణామక్రమాన్నీ మనోహరంగా వర్ణించాడు.

**శ్లో॥ శూన్యం వాసగృహం విలోక్య శయానాదుత్థాయ కించిచ్ఛనైః**
**నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్ ।**
**విస్రబ్ధం పరిచుమ్బ్య జాతపులకామాలోక్య గణ్డస్థలీం**
**లజ్జానమ్రముఖీప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా ॥**

**లజ్జాపచయం :** పూర్వశ్లోకంలో (2) పార్వతిలోని లజ్జ వర్ణింపబడింది. ఈ శ్లోకంలో లజ్జ కొంతమేర తొలగిపోవటాన్ని వర్ణిస్తున్నాడు కవి. పరమేశ్వరుడు నిద్రావ్యాజంతో శయినించియున్నప్పుడు తాను కుతూహలంతో చూడటం, పరమేశ్వరుడు చూడగానే లజ్జకు వ్యంజకాలైన అనుభావాలు. కౌతూహలం మనోధర్మం. దర్శనం, నేత్రనిమీలనం శరీరధర్మాలు.

**అలంకారం : విద్యుదాహతమ్ ఇవ** చక్షుః న్యమీలయత్ – ఇది ఉత్ప్రేక్షాలంకారం. నిమీలనానికి కారణాన్ని ఉత్ప్రేక్షించాడు కవి. ఇవ పదం ఉపమావాచకమే కాక **ఉత్ప్రేక్షావ్యంజకం కూడా.**

**శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।**
**ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥**

*

**శ్లో॥నాభిదేశనిహితస్సకమ్పయా శఙ్కరస్య రురుధే తయా కరః ।**
**తన్నితమ్బ(తద్దుకూల)మథ చాభవత్స్వయం దూరముచ్ఛ్వసితనీవిబన్ధనమ్ ॥4**

**అవ :** పార్వతి చనవుచూపకున్నా తనువు తానంతతానే అనుకూలించుట.

**ప.వి. :** నాభి-దేశ-నిహితః సకమ్పయా శంకరస్య రురుధే తయా కరః తద్-దుకూలమ్ అథ చ అభవత్ స్వయం దూరమ్ ఉచ్ఛ్వసిత-నీవి-బన్ధనమ్.

**అన్వ :** నాభిదేశనిహితః శంకరస్య కరః సకంపయా తయా రురుధే । అథ చ తద్-దుకూలం స్వయం దూరమ్ ఉచ్ఛ్వసిత-నీవి-బన్ధనమ్ అభవత్.

**ప్ర :** నాభి... నిహితః : నాభి-దేశ = బొడ్డుకు దగ్గర తావులో, నిహితః = ఉంచబడిన, శంకరస్య = శివునియొక్క, కరః = చేయి, సకమ్పయా = వణుకుగలిగిన, తయా = ఆమెచే, రురుధే = అడ్డగింపబడెను. అథ చ = అయిననూ, తద్-దుకూలమ్ = ఆమె బట్ట, స్వయమ్ = తనంతగా, దూర... బన్ధనమ్ : దూరమ్ = ఎక్కువగా (బాగా), ఉచ్ఛ్వసిత = విడువబడిన, నీవి-బన్ధనమ్ = కోకముడి గలదిగా, అభవత్ = అయినది.

**తా :** శంకరుడు ఆమె పొక్కిలికి దగ్గరగా చేయి వేశాడు. ఆమె వణుకుతూ (అనంతర కార్యక్రమానికి ఉపక్రమింపబోయే) ఆ చేతిని అడ్డగించింది. అయినా కూడా ఆమె వస్త్రం (చీర) కోకముడిని స్వయంగా వదిలించుకొన్నది.

**విభక్తులు - క్రియలు :** 1. నిహితః : **నిహితః** - నిహితౌ - నిహితాః - అకారాన్తః పుంలింగః నిహితశబ్దః ప్రథమైకవచనమ్; 2. సకమ్పయా : **సకమ్పయా** - సకమ్పాభ్యాం - సకమ్పాభిః. ఆకారాన్తస్త్రీలింగః సకమ్పాశబ్దః ప్రథమైకవచనమ్; 3. శంకరస్య : **శంకరస్య** - శంకరయోః - శంకరాణామ్. అకారాన్తః పుంలింగః శంకరశబ్దః. ప్రథమైకవచనమ్; 4. రురుధే : **రురుధే** - రురుధాతే - రురుధిరే-రుధిర్ ఆవరణే ధాతోః లిటి ప్రథమైకవచనమ్; 5. తయా : **తయా** - తాభ్యాం - తాభిః దకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 6. కరః : **కరః** - కరౌ - కరాః. అకారాన్తః పుంలింగః కరశబ్దః. ప్రథమైకవచనమ్; 7. దుకూలమ్ : **దుకూలం** - దుకూలే - దుకూలాని. అకారాన్తః నపుంసకలింగః దుకూలశబ్దః. ప్రథమైకవచనమ్; 8. అథ - అవ్యయం; 9. చ - అవ్యయమ్; 10. అభవత్ : **అభవత్** - అభవతామ్ - అభవన్. భూ సత్తాయాం ధాతోః లజి ప్రథమపురుషైకవచనమ్; 11. స్వయమ్ - అవ్యయమ్; 12. దూరమ్ : **దూరం** - దూరే - దూరాణి. అకారాన్తః నపుంసకలింగః దూరశబ్దః ప్రథమైకవచనమ్; 13. ...బన్ధనమ్ : **బన్ధనం** - బన్ధనే - బన్ధనాని. అకారాన్తనపుంసకలింగః బన్ధనశబ్దః. ప్రథమైకవచనమ్;

**సంధులు :** 1. తత్+దుకూలమ్ = తద్దుకూలమ్ – జశ్త్వసంధి; 2. చ+అభవత్ = చాభవత్ = సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. నాభేః దేశః, నాభిదేశః తస్మిన్ నిహితః = నాభిదేశనిహితః; 2. కమ్పేన సహ వర్తతే ఇతి సకమ్పా, తయా = సకమ్పయా; 3. తస్యాః దుకూలమ్ = తద్దుకూలమ్; 4. ఉచ్ఛ్వసితం నీవేః బన్ధనం యస్మిన్ తత్ = ఉచ్ఛ్వసితనీవిబన్ధనమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**నాభిః** – ణహ బన్ధే ధాతువుపై '**నహోభశ్చ**' అని ఇఞ్ప్రత్యయం. ధాతువునకు భాదేశం.

నాభిస్తు క్షత్రియే పుమాన్ । చక్రమధ్యే ముఖ్యనృపేఽథో ప్రాణ్యవయవే ద్వయోః । స్త్రియాం కస్తూరికాయాం స్యాత్. (ఉణాదికోశః)

నాభిదేశంపై శంకరుడు చేయి వేయటం సాభిప్రాయమే. నాభిదేశం మణిపూర చక్రస్థానం. అది శివునకే అధిష్ఠానం. కాబట్టి స్వాధిష్ఠానప్రదేశంపై తాను చేయివేయటం సముచితమే.

**శ్లో॥ తదూర్ధ్వం నాభిదేశే తు మణిపూరం మహాప్రభమ్ ।**
**మేఘాభం విద్యుదాభం చ బహుతేజోమయం తతః ॥** … …

**శ్లో॥ శివేనాధిష్ఠితం పద్మం విశ్వాలోకనకారణమ్ ॥** (తన్త్రమ్)

అంతేగాదు ఆ మణిపూరంలో దేవతీర్థం కూడా ఉంటుంది. దానిలో స్నానం మోక్షహేతువు.

**శ్లో॥ మణిపూరే దేవతీర్థం పంచకుణ్డం సరోవరమ్ ।**
**తత్ర శ్రీకామనాతీర్థం స్నాతి యో ముక్తిమిచ్ఛతి ॥** (రుద్రయామలమ్.)

**సకమ్పయా :** శివకరస్పర్శతో పార్వతికి కంపం కలిగింది. అది వేపథువు అనే సాత్త్వికభావం. '**రాగరోషభయాదిభ్యో వేపథుర్గాత్రకమ్పనమ్**' (ప్రతాపరుద్రీయం) రాగం వలన గానీ, రోషంవలన కానీ, భయం వలన కానీ అటువంటి ఏ భావం వలన కానీ వాటి సముదాయంవలన గానీ శరీరంలో కలిగే వణుకు కంపం – అదే **వేపథువు**. అది అనుభావరూపం. మనస్సులోని భావానికి ప్రకటనాత్మకమైన చేష్ట.

స్వయంసంపన్ననీవీబన్ధశైథిల్యం కామశాస్త్రప్రసిద్ధం. అమరుకుడు ఒక శ్లోకంలో ఆ స్థితిని ఇలా వర్ణించాడు.

**శ్లో॥ కాన్తే తల్పముపాగతే విగలితా నీవీ స్వయం బన్ధనాత్**
**వాసో విశ్లథమేఖలాగుణధృతం కించిన్నితమ్బే స్థితమ్ ।**

**ఏతావత్సఖి వేద్మి సాంప్రతమహం తస్యాంగసంగే పునః**
**కోఽయం కాస్మి రతం ను వా కథమితి స్వల్పాపి మే న స్మృతిః ॥**

– అమరుకమ్ 101

**విరుద్ధాలంకారం :** నీవీ స్వయం శ్లథనం ద్వారా సాధ్వసోపశమనం (భావశాంతి), దాని ద్వారా రత్యాసక్తి వ్యక్తమవుతాయి. వ్యతిరిక్తమైన ప్రయత్నం. అందువల్ల విరోధాలంకారం. "**విరుద్ధస్తత్ప్రయత్నశ్చేద్విపరీతః ఫలేచ్ఛయా**". *

**శ్లో॥ ఏవమాలి! నిగృహీతసాధ్వసం శఙ్కరో రహసి సేవ్యతామితి ।**
**సా సఖీభిరుపదిష్టమాకులా నాస్మరత్ప్రముఖవర్తిని ప్రియే ॥ 5**

**అవ :** పార్వతి క్రమంగా వెరపునుండి బయటపడుటను వర్ణించటం.

**ప.వి. :** ఏవమ్ ఆలి! నిగృహీత – సాధ్వసమ్ శంకరః రహసి సేవ్యతామ్ ఇతి । సా సఖీభిః ఉపదిష్టమ్ ఆకులా న అస్మరత్ ప్రముఖవర్తిని ప్రియే ॥

**అన్వ :** ఆలి! శంకరః నిగృహీత – సాధ్వసం రహసి ఏవం సేవ్యతామ్ ఇతి సఖీభిః ఉపదిష్టం ప్రియే ప్రముఖవర్తిని సా న అస్మరత్.

**ప్ర :** ఆలి! = చెలి!, శంకరః = శివుడు, నిగృహీత–సాధ్వసమ్ : నిగృహీత = విడువబడిన, సాధ్వసమ్ = వెఱపు కలుగునట్లుగా, రహసి = ఏకాంతంలో, ఏవమ్ = ఇలా... ఇలా.. సేవ్యతామ్ = సేవింపబడుగాక, ఇతి = అని, సఖీభిః = చెలికత్తియలచే, ఉపదిష్టమ్ = చెప్పబడినదానిని, ప్రియే = వల్లభుడు, ప్రముఖ–వర్తిని = ఎదుటనుండగా, సా = ఆ పార్వతి, న అస్మరత్ = గుర్తుచేసికొనలేకపోయెను.

**తా :** ఏకాంతంలో భయాన్ని వీడి శంకరునితో ఇలా ఇలా ప్రవర్తించాలని చెలికత్తెలు పార్వతికి చెప్పారు. కానీ శంకరుడు ఎదుట నిలువగానే ఆమె ఆ బోధను విస్మరించింది.

**విభక్తులు – క్రియలు :** 1. ఏవమ్ – అవ్యయం; 2. ఆలి! : **ఆలి!** – ఆలీ –ఆలయః ఇకారాన్తః స్త్రీలింగః ఆలిశబ్దః సంబోధనప్రథమైకవచనమ్; 3. నిగృహీతం సాధ్వసం యథా (భవతి) తథా – అవ్యయమ్; 4. శంకరః : **శంకరః** – శంకరౌ –శంకరాః అకారాన్తః పుంలింగః శంకరశబ్దః. ప్రథమైకవచనమ్; 5. రహసి : **రహసి** – రహసోః – రహస్సు – సకారాన్తః నపుంసకలింగః రహస్ శబ్దః. సప్తమ్యేకవచనమ్; 6. సేవ్యతామ్: **సేవ్యతాం** – సేవ్యేతాం – సేవ్యన్తామ్; షేవృ సేవనే ధాతోః కర్మణి లోటి ప్రథమ–పురుషైకవచనమ్; 7. ఇతి – అవ్యయం; 8. సా : **సా** – తే – తాః; దకారాన్తః స్త్రీలింగః తచ్ఛబ్దః ప్రథమైకవచనమ్; 9. సఖీభిః : సఖ్యా – సఖిభ్యామ్ – **సఖీభిః**

ఈకారాన్తః స్త్రీలింగః సఖీశబ్దః తృతీయైకవచనమ్; 10. ఉపదిష్టమ్ : **ఉపదిష్టమ్** – ఉపదిష్టే – ఉపదిష్టాని – అకారాన్తః నపుంసకలింగః ఉపదిష్టశబ్దః ద్వితీయైకవచనమ్; 11. ఆకులా : **ఆకులా** – ఆకులే – ఆకులాః; ఆకారాన్తః స్త్రీలింగః ఆకులా శబ్దః ప్రథమైకవచనమ్; 12. న – అవ్యయం; 13. అస్మరత్ : **అస్మరత్** – అస్మరతామ్ – అస్మరన్; స్మృ చిన్తాయామ్ ధాతోః లజి ప్రథమపురుషైకవచనమ్; 14. ప్రముఖవర్తిని : **వర్తిని** – వర్తినోః – వర్తిత్సు – నకారాన్తః పుంలింగః వర్తిన్ శబ్దః సప్తమ్యేకవచనమ్; 15. ప్రియే : **ప్రియే** – ప్రియయోః – ప్రియేషు – అకారాన్తః పుంలింగః ప్రియశబ్దః సప్తమ్యేకవచనమ్.

**సంధులు :** 1. శంకరః + రహసి = శంకరో రహసి (విసర్గసంధి); 2. సఖీభిః + ఉప-దిష్టమ్ = సఖీభిరుపదిష్టమ్ (విసర్గసంధి); 3. న+అస్మరత్ = నాస్మరత్ (సవర్ణదీర్ఘసంధి)

**సమాసాలు :** 1. నిగృహీతం సాధ్వసం యస్మిన్ కర్మణి (భవతి) యథా తథా = నిగృహీతసాధ్వసమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

శంకరః – "శం కల్యాణం కరోతీతి శంకరః శమ్+కృ 'శమి ధాతోః సంజ్ఞాయామ్' ఇతి అచ్ అస్య వ్యుత్పత్తిర్యథా –

**శ్లో॥ సదా ధ్యానాచ్చ భక్తానాం పవనం యన్నిరామయమ్ ।**
**భూతనాథత్వమప్యస్మాత్తేనాహం శంకరః స్మృతః ॥"**

– స్కందపురాణమ్ – శబ్దకల్పద్రుమః.

కామశాస్త్రవిధిలో నాయికకు సఖీజనుల ఉపదేశానికి చాలా ప్రాధాన్యముంది. ఆత్మీయ భావనతో వారు చేసే సూచనలు, ఉపదేశాలూ జీవితాన్ని దిద్దుకోవటానికి సహకరిస్తాయి. గోనర్దీయ ప్రతిపాదనమిలా ఉంది. "యథా గోనర్దీయః

**శ్లో॥ హాస్యేన నర్మవచసా నవోఢాం లజ్జితాం ప్రియామ్ ।**
**విముక్తలజ్జాం కుర్వీత నిపుణైశ్చ సఖీజనైః ॥**

–కుమారసంభవం–ప్రకాశికావ్యాఖ్య.

సఖీజనుల ఉపదేశాల లేమి నాయికకు అసౌకర్యాన్ని కూడా కలిగిస్తుందని అమరుకుని భావం.

శ్లో॥ సా పత్యుః **ప్రథమేఽపరాధసమయే సఖ్యోపదేశం** వినా
**నో జానాతి** స విభ్రమాంగవలనావక్రోక్తిసంసూచనమ్ ।

స్వచ్ఛైరచ్ఛకపోలమూలగలితైః పర్యస్తనేత్రోత్పలా
బాలా కేవలమేవ రోదితి లుఠల్లోలోదకైరశ్రుభిః ॥

ఇక్కడ ఇతి కర్తవ్యతాజ్ఞానం లేనందువల్ల ఆ బాల కంటతడిపెట్టుకొనవలసి వచ్చింది. సఖీజనోపదేశవిధానాన్ని కూడా కాళిదాసు 7వ సర్గలో వర్ణించియున్నాడు.

శ్లో॥ పత్యుశ్శిరశ్చన్ద్రకలామనేన - స్పృశేతి సఖ్యాపరిహాసపూర్వమ్ ।
సా రంజయిత్వా చరణే కృతాశీః - మాల్యేన తాం నిర్వచనం జఘాన ॥7/19

'కాళ్ళకు పారాణిపెట్టి భర్త శిరస్సు మీది చంద్రకళను ఆ పాదంతో తాకమని పరిహాస పూర్వకంగా చెలులు పార్వతికి బోధించారట. ఇటువంటి బోధనలు కృష్ణదేవరాయలుకు నర్మసచివుల ద్వారా లభించి ఉంటే తిమ్మనకు పారిజాతాపహరణం వ్రాయవలసి వచ్చేదే కాదేమో!

*

**శ్లో॥ అప్యవస్తుని కథాప్రవృత్తయే ప్రశ్నతత్పరమనఙ్గశాసనమ్ ।**
**వీక్షితేన పరిగృహ్య పార్వతీ మూర్ధకమ్పమయముత్తరం దదౌ ॥ 6**

**అవ :** పార్వతి క్రమంగా పరమేశ్వరునికి శిరఃకంపంతో ప్రత్యుత్తరమివ్వటం.

**ప.వి.:** అపి అవస్తుని కథా-ప్రవృత్తయే ప్రశ్న-తత్పరమ్ అనంగ-శాసనమ్ ।
వీక్షితేన పరిగృహ్య పార్వతీ మూర్ధ-కంపమయమ్ ఉత్తరం దదౌ ॥

**అన్వ :** పార్వతీ కథాప్రవృత్తయే అవస్తుని అపి ప్రశ్న-తత్పరమ్ అనంగ-శాసనం వీక్షితేన పరిగృహ్య మూర్ధ-కమ్పమయమ్ ఉత్తరం దదౌ.

**ప్ర :** పార్వతీ = గిరిసుత, కథా-ప్రవృత్తయే = మాటలు కొనసాగటానికి, అవస్తుని అపి = విషయం లేకపోయినా, ప్రశ్న-తత్పరమ్ = ప్రశ్నించుటలో ఆసక్తి గల్గియున్న (ఏదో ఒకటి అడుగుతున్న), అనంగ-శాసనమ్ = పరమేశ్వరుని, వీక్షితేన = చూపుతో, పరిగృహ్య = అంగీకరించి (దగ్గరై), మూర్ధ-కమ్ప-మయమ్ = తల నూపుటలతో కూడిన, ఉత్తరమ్ = సమాధానాన్ని, దదౌ = ఇచ్చింది.

**తా :** సంభాషణను కొనసాగించటం కోసం పరమశివుడు ఏ సంబంధమూ లేని విషయాలను ప్రస్తావించి అడుగుతుంటే పార్వతి కంటిచూపుతోనే దగ్గరై తల ఊపులతోనే సమాధానమిచ్చింది.

**విభక్తులు - క్రియలు :** 1. అపి - అవ్యయం; 2. అవస్తుని : **అవస్తుని** - అవస్తునోః - అవస్తుషు; ఉకారాన్తః నపుంసకలింగః అవస్తు శబ్దః సప్తమ్యేకవచనమ్; 3.

కథాప్రవృత్తయే : **ప్రవృత్తయే** – ప్రవృత్తిభ్యాం – ప్రవృత్తిభ్యః; ఇకారాన్తః స్త్రీలింగః కథాప్రవృత్తిశబ్దః చతుర్థ్యేకవచనమ్; 4. ప్రశ్నతత్పరమ్ : **తత్పరం** – తత్పరౌ – తత్పరాన్; అకారాన్తః పుంలింగః తత్పరశబ్దః ద్వితీయైకవచనమ్; 5. అనంగశాసనమ్ : **అనంగశాసనమ్** – అనంగశాసనౌ – అనంగశాసనాన్; అకారాన్తః పుంలింగః అనంగశాసనశబ్దః ద్వితీయైకవచనమ్; 6. వీక్షితేన : **వీక్షితేన** – వీక్షితాభ్యాం – వీక్షితైః – అకారాన్తః నపుంసకలింగః వీక్షితశబ్దః తృతీయైకవచనమ్; 7. పరిగృహ్య – పరిపూర్వకాత్ గ్రహ ధాతోః క్త్వా ప్రత్యయః, తస్య ల్యప్ చ – అవ్యయం; 8. పార్వతీ : **పార్వతీ** – పార్వత్యౌ – పార్వత్యః – ఈకారాన్తః స్త్రీలింగః పార్వతీశబ్దః ప్రథమైకవచనమ్; 9. మూర్ధకమ్పమయమ్ : **కమ్పమయం** – కమ్పమయే – కమ్పమయాని – అకారాన్తః నపుంసకలింగః కమ్పమయశబ్దః ద్వితీయైకవచనమ్; 10. ఉత్తరమ్ : **ఉత్తరమ్** – ఉత్తరే – ఉత్తరాణి – అకారాన్తః నపుంసకలింగః ఉత్తరశబ్దః. ద్వితీయైకవచనమ్; 11. దదౌ : **దదౌ** – దదతుః – దదుః – డుదాఞ్ దానే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. అపి+అవస్తుని = అప్యవస్తుని – యణాదేశసంధి.

**సమాసాలు :** 1. కథాయాః ప్రవృత్తిః, తస్యై కథాప్రవృత్తయే; 2. ప్రశ్నే తత్పరః, తమ్ = ప్రశ్నతత్పరమ్; 3. శాస్తే ఇతి శాసనః, అనంగస్య శాసనః అనంగశాసనః, తమ్ అనంగశాసనమ్; 4. మూర్ధకమ్పమయమ్ – మూర్ధ్నః కంపః = మూర్ధకంపః మూర్ధ-కమ్పాత్ ఆగతమ్, మూర్ధకంపమయమ్ "**మయట్ చ**" సూత్రంతో మూర్ధకంపశబ్దంపై మయట్ ప్రత్యయం.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**కథా : 'ప్రబంధకల్పనా కథా'** అని అమరకోశం. 'ప్రబంధస్య **వాక్యవిస్తరస్య** యా కల్పనా రచనా సా కథా యథా నాటకరామాయణాదౌ'' అని మాహేశ్వరటీక. నాటక-రామాయణాలు పూర్తిగా కల్పనలు కాకపోవచ్చు. అందుకే 'వాక్యవిస్తరస్య' అని కల్పన క్రియా కర్మ అని వివరణ, "ప్రబంధే న కల్పనా అథవా ప్రబన్ధస్య అభిధేయస్య కల్పనా స్వయం రచనా ఇతి సారసుందరీ." ప్రబంధస్య కల్పనా రచనా బహ్వనృతాస్తోకసత్యా" ఇతి భరతః.

**శ్లో॥ ప్రబన్ధకల్పనాం స్తోకసత్యాం ప్రాజ్ఞాః కథాం విదుః ।**
**పరమ్పరాశ్రయా యా స్యాత్ సా మతాఖ్యాయికా క్వచిత్ ॥** (శబ్దకల్పద్రుమః)

భార్యాభర్తలమధ్య, అందునా నవోఢుల మధ్య సంభాషణ కొనసాగటానికి కథ – వాక్యకల్పన – అనగా అభిధేయవిషయకల్పన అవసరమవుతుంది.

అయితే అది అవస్తు విషయం కావలసి ఉంటుంది. నూత్నవధూవరులకు తమ గురించి మాటాడుకోవాలన్నా, ఇతరులను గురించి మాటాడుకోవాలన్నా కూడా ప్రమాదమే. అన్యోన్యస్పందన ఎలా ఉంటుందో తెలీదు కాబట్టి.

ఉత్తరరామచరితనాటకంలో వనవాససమయంలో సీతారాములు - అప్పటికి పెండ్లయి కొంతకాలం గడచినా - ఏవేవో మాటాడుతున్నారనే అంటాడు భవభూతి.

**శ్లో॥ కిమపి కిమపి మన్దం మన్దమాసక్తియోగా - దవిరళితకపోలం జల్పతోరక్రమేణ ।**
**అశిథిలపరిరమ్భవ్యాపృతైకైకదోష్ణో - రవిదితగతయామా రాత్రిరేవవ్యరంసీత్ ॥**

సీతారాములు 'కిమపి కిమపి' - వస్తువిరహితంగానే మాటాడుకుంటున్నారట.

తలపంకించి అయినా పార్వతి వెరపువీడి ప్రత్యుత్తరమివ్వగలగటానికి కారణం పరమేశ్వరుని మనః ప్రవృత్తిపై అవగాహన. నారాయణపండితుని మాటలలో...

**శ్లో॥ వీక్షితేన తదాకారావలోకనేన పరిగృహ్య**
**అంగీకృత్య పరమధూర్తోఽయమిత్యవధార్యేత్యర్థః ।**
**శ్లో॥ ఆకారైరింగితైర్గత్యా స్వరహాసావలోకనైః ।**
**నేత్రవక్త్రవిలాసైశ్చ జ్ఞాయతేఽన్తర్గతం మనః ॥** - మనుస్మృతి : 8/26

ఇతి స్మృతేరితి భావః.

**అలంకారం :** అవస్తుని కథాప్రవృత్తి అన్నది కారణం లేకపోయినా కార్యోత్పత్తి కథనం. కావ్యానికి ఇతివృత్తాన్నే శరీరంగా అంగీకరించారు కాబట్టి. కారణం లేకపోయినా కార్యోత్పత్తి కాబట్టి విభావనాలంకారం. '**విభావనా వినాపి స్యాత్కారణం కార్యజన్మచేత్।**'*

**శ్లో॥ శూలినః కరతలద్వయేన సా సన్నిరుధ్య నయనే హృతాంశుకా ।**
**తస్య పశ్యతి లలాటలోచనే మోఘయత్నవిధురా రహస్యభూత్ ॥ 7**

**అవ :** పరమేశ్వరుని కన్నులను చేతులతో మూయటంలో పార్వతి విఫలప్రయత్నం.

**ప.వి. :** శూలినః కరతల-ద్వయేన సా సన్నిరుద్ధ్య నయనే హృత+అంశుకా
తస్య పశ్యతి లలాట-లోచనే మోఘయత్న-విధురా రహసి అభూత్.

**అన్వ :** రహసి హృత+అంశుకా సా కరతల-ద్వయేన శూలినః నయనే సన్నిరుద్ధ్య తస్య లలాటలోచనే పశ్యతి మోఘ-యత్న-విధురా అభూత్.

**ప్ర :** రహసి = ఏకాంతంలో, హృత+అంశుకా = లాగబడిన పైట గలదై, సా = ఆ పార్వతి, కరతల-ద్వయేన = రెండు అరచేతులతో, శూలినః = పరమశివునియొక్క, నయనే = రెండు కన్నులనూ, సన్నిరుధ్య = గట్టిగా మూసి, తస్య = ఆయనయొక్క,

లలాట–లోచనే = నుదుటి కన్ను, పశ్యతి = చూచుచుండగా, మోఘ... విధురా : మోఘ = విఫలమైన, యత్న = ప్రయత్నంవలన, విధురా = వ్యాకులపడినదిగా, అభూత్ = అయినది.

**తా :** పరమేశ్వరుడు ఏకాంతంలో పార్వతిపైట తొలగించాడు. పార్వతి రెండు చేతులతో శివుని రెండుకళ్ళనూ మూసింది. అయితే పరమశివుని నుదుటికన్ను పార్వతిని చూసింది. దానితో తన ప్రయత్నం విఫలమైనందుకు వ్యాకులపాటుకు గురి అయింది.

**విభక్తులు – క్రియలు :** 1. శూలినః : **శూలినః** – శూలినోః – శూలినామ్ ; నకారాన్తః పుంలింగః శూలిన్ శబ్దః షష్ఠీవిభక్త్యేకవచనమ్; 2. కరతలద్వయేన : ... **ద్వయేన** – ద్వయాభ్యాం – ద్వయైః; అకారాన్తః నపుంసకలింగః కరతలద్వయశబ్దః తృతీయైకవచనమ్; 3. సా : **సా** – తే – తాః; దకారాన్తః స్త్రీలింగః తచ్ఛబ్దః ప్రథమైకవచనమ్; 4. సమ్+ని+రుధ్–ల్యప్ = అవ్యయం; 5. నయనే : నయనం – **నయనే** – నయనాని; అకారాన్తః నపుంసకలింగః నయనశబ్దః ద్వితీయాద్వివచనమ్; 6. హృతాంశుకా : **హృతాంశుకా** – హృతాంశుకే – హృతాంశుకాః; ఆకారాన్తః స్త్రీలింగః హృతాంశుకాశబ్దః ప్రథమైకవచనమ్; 7. తస్య : **తస్య** – తయోః – తేషామ్; దకారాన్తః పుంలింగః తచ్ఛబ్దః షష్ఠ్యేకవచనమ్; 8. పశ్యతి : **పశ్యతి** – పశ్యతోః – పశ్యత్సు; తకారాన్తః పుంలింగః పశ్యత్ శబ్దః సప్తమ్యేకవచనమ్; 9. లలాటలోచనే : ...**లోచనే** – లోచనయోః – లోచనేషు; అకారాన్తః పుంలింగః లలాటలోచనశబ్దః సప్తమ్యేకవచనమ్; 10. మోఘయత్నవిధురా : **విధురా** – విధురే – విధురాః; మోఘయత్నవిధురాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 11. రహసి : **రహసి** – రహసోః – రహస్సు; సకారాన్తః నపుంసకలింగః రహశ్శబ్దః సప్తమ్యేకవచనమ్; 12. అభూత్ : **అభూత్** – అభూతామ్ – అభూవన్; భూ సత్తాయామితి ధాతోః లుఙి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. హృత+అంశుకా = హృతాంశుకా – సవర్ణదీర్ఘసంధి ; 2. రహసి+అభూత్ = రహస్యభూత్ – యణాదేశసంధి

**సమాసాలు :** 1. కరయోః తలే (లౌ) = కరతలే(లౌ), తయోః ద్వయమ్, తేన కరతలద్వయేన; 2. హృతమ్ అంశుకం యస్యాస్సా = హృతాంశుకా; 3. లలాటే లోచనం యస్య తస్మిన్ = లలాటలోచనే; 4. మోఘశ్చ అసౌ యత్నః, మోఘయత్నః తేన విధురా మోఘయత్నవిధురా

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**హృతాంశుకా :**

'**స్వయం దూరముచ్ఛ్వసితనీవిబన్ధనమ్**' అని నాలుగవ శ్లోకంలో నీవిబన్ధవిముక్తిని

స్వయం సంజాతమన్న కవి అంశుక విషయంలో కూడా కర్తృపదాన్ని ప్రయోగించలేదు. అయితే **హృతాంశుకా** అన్న విశేషణంలో **హృత** అని కర్మణి ప్రయోగం ద్వారా కర్తను సూచిస్తున్నాడు. ఆ కర్త పరమేశ్వరుడు కావచ్చు, తత్స్వరూపాలలో ఒకటి అయిన వాయువు యొక్క ప్రభావం కావచ్చు.

హృతాంశుకత్వంలో కర్తను చాటు చేసినట్టు, లలాటలోచనదర్శనంలో కర్మను కనిపించనీయలేదు కవి. దర్శనం వాస్తవమే కానీ దేని దర్శనమే చెప్పకుండా వదిలివేయటం ఉత్తమకవితాతత్త్వాన్ని చాటి చెప్తోంది. దర్శన మాత్రానికే పార్వతి పరమశివుని కన్నులను మూసి దృష్టిని నిరోధించవలసి వచ్చింది. అది త్రపా చేష్ట. మనోహరమైన అనుభావం. అయితే ఆ చేష్ట విఫలమైంది. ఆయన త్రినేత్రుడు కాబట్టి. ఈమె కున్నది రెండు చేతులే కాబట్టి. రహసి అన్న పదం త్రపా సాంద్రతను అభివ్యక్తం చేస్తుంది. ఈ త్రపనే వ్రీడ పేరుతో సంచారిభావాలలో పరిగణిస్తుంది అలంకారశాస్త్రం.

శ్లో॥ **చేతస్సంకోచనం వ్రీడానంగరాగస్తవాదిభిః ।** - (ప్రతాపరుద్రీయమ్ - రస)

భావగతంగా వ్రీడ మనస్సంకోచం. దాని అనుభావం వ్రీడాహేతుకార్యప్రతిబంధ ప్రయత్నం. లేదా ఆత్మగోపనం. ఇక్కడ పరమేశ్వరనయననిరోధం చేష్ట. ఇది నయన నిరోధమే కానీ దృష్టి నిరోధం కాకపోవటం మరో విశేషం.

ఇలా భావధ్వని ప్రధానమై శ్లోకం **ఉత్తమకావ్యత్వాన్ని** పొందుతోంది.

**ఇదముత్తమమతిశయిని వ్యంగ్యే వాచ్యాత్ ధ్వనిర్బుధైః కథితః** - (కావ్యప్రకాశః)

అని ధ్వనికావ్య (ఉత్తమకావ్య) లక్షణం.

**ధర్మతత్పరత :** పార్వతి ముగ్ధ. సాంప్రదాయిక కుటుంబానికి చెందినది. ప్రాక్తజన్మవిద్యా సంస్కారాలు గలది. (ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః - కుమారసంభవం - 1/30). ఆ సంస్కారవిశేషం పార్వతి పరమేశ్వరుని కనులు మూసే ప్రయత్నం చేసిందని కవి భావించి యుండవచ్చు.

**శ్లో॥ నాంజయన్తీం స్వకే నేత్రే న చాభ్యక్తామనావృతామ్ ।**
**న పశ్యేత్ ప్రసవన్తీం చ తేజస్కామో ద్విజోత్తమః ॥** - మనుస్మృతి - 4/44

హృతాంశుకత్వం కారణంగా అనావృతగా తనను చూడటం పరమేశ్వరునికి దోషకారణం కావచ్చునేమో అని పార్వతి కనులు నిరోధించినదనవచ్చు. అయినా అదీ నిష్ఫలమే అయింది.

**విషాదనాలంకారం :** ఇది విషాదనాలంకారం. "**ఇష్యమాణవిరుద్ధార్థసంప్రాప్తిస్తు విషాదనమ్**" – అని లక్షణం. కోరుకున్న దానికి భిన్నమైన ఫలితం లభించటం. శివనేత్ర నిమీలనద్వారా తాను కంటబడగూడదని పార్వతి భావించినా మూడవకన్ను కారణంగా కనిపించక తప్పకపోవటం ఇక్కడ విరుద్ధఫలప్రాప్తి. *

**శ్లో॥ చుమ్బనేష్వధరదానవర్జితం సన్నహస్తమదయోపగూహనే(నమ్) ।**
**క్లిష్టమన్మథమపి ప్రియం ప్రభోర్దుర్లభప్రతికృతం వధూరతమ్ ॥ 8**

**ప.వి. :** చుమ్బనేషు అధర–దాన–వర్జితమ్ సన్న–హస్తం అదయా+ఉపగూహనే ।
క్లిష్ట–మన్మథమ్ అపి ప్రియం ప్రభోః దుర్లభ–ప్రతికృతం వధూ–రతమ్ ॥

**అన్వ :** చుమ్బనేషు అధరదానవర్జితం అదయ+ఉపగూహనే సన్న–హస్తం దుర్లభ–ప్రతికృతం వధూ–రతం క్లిష్ట–మన్మథమ్ అపి ప్రభోః ప్రియమ్ అభూత్.

**ప్ర :** చుమ్బనేషు = ముద్దులాడుటలలో, అధర... వర్జితమ్ : అధర = క్రిందిపెదవి యొక్క, దానేన = ఇచ్చుటతో, వర్జితమ్ = కొరవడినదీ, అదయ+ఉపగూహనే : అదయ = జాలిలేకుండా, ఉపగూహనే = కౌగిలించుటలో, సన్న–హస్తమ్ = బిగువుతప్పిన చేతులు గలదీ, దుర్లభ–ప్రతికృతమ్ : దుర్లభ = కష్టసాధ్యమైన, ప్రతికృతమ్ = ప్రతిచర్యలూ గలదీ అయిన, వధూ–రతమ్ = క్రొత్తపెళ్లికూతురితో సంభోగం, క్లిష్ట–మన్మథమ్ అపి = సంభోగేచ్ఛగలదైననూ, ప్రభోః = జగదీశ్వరునికి, ప్రియమ్ = నచ్చినదే, అభూత్ = అయినది.

**తా :** పరమేశ్వరుడు పార్వతిని చుంబించినప్పుడు పార్వతి అధరమందించలేదు. నిర్దయగా కౌగిలించుకొనబోయినా ఆమె చేతులు బిగియటంలేదు. పరమశివుని చేష్టలకు ప్రతిచర్యలను చేయటం లేదు. అందువలన పరమశివుని సంభోగేచ్ఛ అపరిపూర్ణం. అయినా వధూరతం పరమేశ్వరునకు నచ్చింది.

**విభక్తులు – క్రియలు :** 1. చుంబనేషు : చుంబనే – చుంబనయోః – **చుంబనేషు**; అకారాన్తః నపుంసకలింగః చుమ్బనశబ్దః సప్తమీబహువచనమ్; 2. అధరదానవర్జితమ్: **వర్జితం** – వర్జితే – వర్జితాని; అకారాన్తః నపుంసకలింగః అధరదానవర్జితశబ్దః ప్రథమైకవచనమ్; 3. సన్నహస్తమ్ : ... **హస్తం** – హస్తే – హస్తాని; అకారాన్తః నపుంసకలింగః సన్నహస్తశబ్దః ప్రథమైకవచనమ్; 4. అదయోపగూహనే : ...**గూహనే** – గూహనయోః – గూహనేషు; అకారాన్తః నపుంసకలింగః అదయోపగూహనశబ్దః సప్తమ్యేకవచనమ్; 5. క్లిష్టమన్మథమ్ : ... **మన్మథం** – మన్మథే – మన్మథాని; అకారాన్తః నపుంసకలింగః క్లిష్టమన్మథశబ్దః ప్రథమైకవచనమ్; 6. అపి – అవ్యయం; 7. ప్రియమ్

: **ప్రియం** – ప్రియే – ప్రియాణి; అకారాన్తః నపుంసకలింగః ప్రియశబ్దః ప్రథమైకవచనమ్; 8. ప్రభోః : **ప్రభోః** – ప్రభ్వోః – ప్రభూణామ్; ఉకారాన్తః పుంలింగః ప్రభుశబ్దః షష్ఠ్యేకవచనమ్; 9. దుర్లభప్రతికృతమ్ : ... **కృతం** – కృతే – కృతాని; అకారాన్తః నపుంసకలింగః దుర్లభప్రతికృతశబ్దః ప్రథమైకవచనమ్; 10. వధూరతమ్ : **వధూరతం** – రతే – రతాని; అకారాన్తః నపుంసకలింగః వధూరతశబ్దః ప్రథమైకవచనమ్.

**సంధులు :** చుంబనేషు+అధర = చుంబనేష్వధర – యణాదేశసంధి; 2. అదయ+ ఉపగూహనే = అదయోపగూహనే – గుణసంధి; 3. ప్రభోః+దుర్లభ = ప్రభోర్దుర్లభ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. అధరస్య దానమ్ అధరదానం, తేన వర్జితమ్ = అధరదానవర్జితమ్; 2. సన్నౌ హస్తౌ యస్మిన్ తథాభూతం = సన్నహస్తమ్; 3. న వర్తతే దయా యస్మిన్ తథాభూతమ్ అదయమ్, అదయేన ఉపగూహనమ్, తస్మిన్, అదయోపగూహనే; 4. క్లిష్టః మన్మథః, యస్మిన్ తథాభూతం, క్లిష్టమన్మథమ్; 5. దుఃఖేన లభ్యతే ఇతి దుర్లభం, దుర్లభం ప్రతికృతం యస్మిన్ తథాభూతమ్, దుర్లభప్రతికృతమ్; 6. వధ్వాః రతమ్ = వధూరతమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**చుమ్బనేషు :** చుబి భావే ల్యుట్ । ముఖసంయోగవిశేషే ।

శ్లో॥ "**సమాశ్లిష్టాస్సమాశ్లేషైశ్చుమ్బితా చుమ్బనైరపి ।**
**దష్టాశ్చ దంశనైః కాంతం దాసీ కుర్వన్తి యోషితః ॥**" సా.ద.

చుమ్బనస్థానమాహ కామశాస్త్రే–

**శ్లో॥ ముఖే స్తనే లలాటే చ కణ్ఠే చ నేత్రయోరపి ।**
**జఘనే కర్ణయోశ్చైవ కక్షోరూభగమూర్ధసు ॥**
**చుమ్బనస్థానమిత్యుక్తం విజ్ఞేయం కాముకైరపి ॥** – వాచస్పత్యమ్

'చుమ్బనేషు' అని బహువచనప్రయోగంలో వచనౌచిత్యం కనిపిస్తుంది. క్షేమేంద్రుడిలా నిర్వచించాడు వచనౌచిత్యాన్ని–

**శ్లో॥ ఉచితైరేవ వచనైః కావ్యమాయాతి చారుతామ్ ।**
**అదైన్యధన్యమనసాం వదనం విదుషామివ ॥**

ఉచితైరేకద్విబహువచనైః కావ్యం చారుతామాయాతి. అదైన్యోదారచేతసాం విదుషామివ వదనమ్ ఇవ చిరౌచిత్యచారుభిః వచోభిః (ఔచిత్యవిచారచర్చ)

ప్రకృత శ్లోకంలో బహువచనం బహువారకృతప్రయత్నాన్ని, లేదా బహుచుమ్బన స్థానకృతప్రయత్నాన్ని తెలియజేస్తూ పార్వతిలోని భావశబలతను ధ్వనిపంజేస్తుంది.

**శాకుంతల సన్నివేశం :** చుమ్బనేష్వధరదానవర్జితమ్' - ఈ పాదస్వరూపాన్ని అభిజ్ఞాన శాకున్తలంలో విస్తరిస్తాడు కాళిదాసు-

**శ్లో॥ ముహురంగుళిసంవృతాధరోష్ఠం - ప్రతిషేధాక్షరవిక్లవాభిరామమ్ ।**
**ముఖమంసవివర్తిపక్ష్మలాక్ష్యాః - కథమప్యున్నమితం న చుమ్బితం తు ॥**

శకున్తలా విషయిక దుష్యన్తకృత విఫలయత్నం ఇక్కడ కనిపిస్తోంది. కుమారసంభవం లోని పాదం శాకున్తలంలో శ్లోకమైంది.

**వధూరతమ్ - క్లిష్టమన్మథమ్ :** వధూ, క్లిష్టమన్మథ పదాలను మల్లినాథుడిలా వివరించాడు-

"వధూః స్నుషా నవోఢా స్త్రీ భార్యా సృష్టాంగనాసు చ" ఇతి విశ్వః । అయం లజ్జాసాధ్వసాభ్యాం సంక్లిష్టోపచారత్వాత్ సంక్లిష్టసమ్భోగః । తదుక్తం భూపాలేన" యువానౌ యత్ర సంక్షిప్తసాధ్వసవ్రీడయాదిభిః । ఉపచారాన్నిషేవన్తే స సంక్లిష్ట ఇతీరితః ॥ ఇతి॥

ఈ శ్లోకంలోని నాయిక ముగ్ధ. స్వీయానాయిక మూడు విధాలు. వాటిలో మొదటిది ముగ్ధ. "నవనవకామయౌవనసనాథయు నల్పరతంబు గల్గునయ్యువిదయె ముగ్ధ' (నరసభూపాలీయము - 2/24)

రామరాజభూషణుని ఉదాహరణం -

శ్లో॥ ఆలాపంబున కుత్తరంబొసఁగ దాయాసంబునంగాని తా
నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మర్దముం
దాళంజాలదు కౌగిలీయదు తనూతాపంబు చల్లారగా
నే లజ్జావతి తద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే. 2/25 *

**శ్లో॥ యన్ముఖగ్రహణమక్షతాధరం దత్తమవ్రణపదం నఖం యత్ ।**
**యద్రతం చ సదయం ప్రియస్య తత్పార్వతీ విషహతే స్మ నేతరత్ ॥ 9**

**అవ :** రాత్రి విషయాలు ఉదయం చెలులకు చెప్పటానికి పార్వతి త్వరపడటం.

**ప.వి. :** యత్ ముఖగ్రహణమ్ అక్షత+అధరమ్ దత్తమ్ అవ్రణ-పదం నఖం చ యత్।
యత్ రతం చ సదయం ప్రియస్య తత్ పార్వతీ విషహతే స్మ న ఇతరత్ ॥

**అన్వ :** పార్వతీ ప్రియస్య అక్షత+అధరం ముఖ- గ్రహణం యత్, అవ్రణపదం దత్తం నఖం చ యత్, సదయం రతం చ యత్ తత్ విషహతే స్మ న ఇతరత్ ।

**ప్ర :** పార్వతీ = గిరిసుత, ప్రియస్య = వల్లభునియొక్క, అక్షత+అధరమ్ = గాయపడని పెదవి గల, ముఖ–గ్రహణమ్ = ముఖచుంబనం, యత్ = ఏదిగలదో, సదయమ్ = జాలితో కూడిన, రతమ్ = సంభోగం, యత్ చ = ఏది గలదో, తత్ = దానినే, విషహతే స్మ = సహించింది, ఇతరత్ = మిగిలిన వానిని , న = సహించలేదు.

**తా :** పార్వతికి పరమేశ్వరుడు తనను తన పెదవికి గాయం కాకుండా ముద్దాడటం, గాటు కనిపించని రీతిగా గోటితో గుచ్చటం, దయతో కూడినట్లుగా (తేలికగా) కౌగిలించుకోవటం మాత్రమే నచ్చాయి. మరేవీ నచ్చలేదు.

**విభక్తులు – క్రియలు :** 1. యత్ : **యత్** – యే – యాని; దకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. ముఖగ్రహణమ్ : **గ్రహణం** – గ్రహణే – గ్రహణాని; అకారాన్తః నపుంసకలింగః గ్రహణశబ్దః ప్రథమైకవచనమ్; 3. అక్షత+అధరమ్ : **అధరమ్** – అధరే – అధరాణి; అకారాన్తః నపుంసకలింగః అక్షతాధరశబ్దః ప్రథమైకవచనమ్; 4. దత్తమ్ : **దత్తం** – దత్తే – దత్తాని; అకారాన్తః పుంలింగః దత్తశబ్దః ప్రథమైకవచనమ్; 5. అవ్రణపదమ్ : **అవ్రణపదమ్** – అవ్రణపదే – అవ్రణపదాని; అకారాన్తః నపుంసకలింగః అవ్రణపదశబ్దః ప్రథమైకవచనమ్; 6. నఖమ్ : **నఖం** – నఖే – నఖాని; అకారాన్తః నపుంసకలింగః నఖ శబ్దః ప్రథమైకవచనమ్; 7. చ – అవ్యయం; 8. యత్; 9. రతమ్ : **రతం** – రతే – రతాని; అకారాన్తః నపుంసకలింగః రతశబ్దః ప్రథమైకవచనమ్; 10. సదయమ్ : **సదయం** – సదయే – సదయాని; అకారాన్తః నపుంసకలింగః సదయశబ్దః ప్రథమైకవచనమ్; 11. ప్రియస్య : **ప్రియస్య** – ప్రియయోః – ప్రియాణామ్; అకారాన్తః పుంలింగః ప్రియశబ్దః షష్ఠ్యేకవచనమ్; 12. తత్ : **తత్** – తే – తాని; దకారాన్తః నపుంసకలింగః తచ్ఛబ్దః ప్రథమైకవచనమ్; 13. పార్వతీ : **పార్వతీ** – పార్వత్యౌ – పార్వత్యః; ఈకారాన్తః స్త్రీలింగః పార్వతీశబ్దః ప్రథమైకవచనమ్; 14. విషహతే స్మ : **విషహతే (స్మ)** – విషహేతే (స్మ) – విషహన్తే (స్మ); వి పూర్వక షహ మర్షణే ధాతువు మీద లటి ప్రథమపురుషైకవచనమ్; 15. న – అవ్యయం; 16. ఇతరత్ : **ఇతరత్** – ఇతరే – ఇతరాణి; అకారాన్తః నపుంసకలింగః ఇతరశబ్దః ప్రథమైకవచనమ్;

**స్మ :** విషహతే లట్ (వర్తమానకాలం). స్మ చేరినందువల్ల క్రియాపదం భూతకాలార్థాన్ని ఇస్తుంది. “అతీతవాక్యపూరణయోరయం (స్మ) వర్తతే. అతీతే కథయతి స్మ. వాక్యపూరణే ‘అంగ స్మ విద్వన్! మాణవకమధ్యాపయ మా స్మ కరోత్ కార్షీత్ వా” అవ్యయకోశః 382 పుట.

**'లట్ స్మే' సూత్రం ద్వారా స్మ పరమైనపుడు లట్ లిడర్థాన్ని ఇస్తుంది.**

**సంధులు :** 1. యత్+ముఖ = యన్ముఖ - అనునాసికసంధి; 2. అక్షత+అధరమ్ = అక్షతాధరమ్ - సవర్ణదీర్ఘసంధి; 3. యత్+రతమ్ = యద్రతమ్ - జశ్త్వసంధి; 4. న+ఇతరత్ = నేతరత్ - గుణసంధి.

**సమాసాలు :** 1. ముఖస్య గ్రహణమ్ - ముఖగ్రహణమ్; 2. అక్షతః అధరః యస్మిన్ తత్ - అక్షతాధరమ్; 3. వ్రణానాం పదం యస్య న విద్యతే తత్ అవ్రణపదమ్.

**పదవ్యుత్పత్తి - కావ్య నిఘంటు ప్రమాణాలు :**

పూర్వశ్లోకంలో పార్వతి లజ్జా సాధ్వసాల కారణంగా పాక్షికంగా నిరోధిస్తూ చేసిన అనుభావాలకు, సమాధానరూపంగా ఈ శ్లోకం కనిపిస్తుంది. ఆ అనుభావాలలోని ఆంతర్యాన్ని పరమశివుడు గ్రహించి తదనుగుణంగా, ఆ భావాలు భంగపడకుండా అనంతర ప్రవృత్తిని ప్రదర్శించినట్లు ఈ శ్లోకరచన. అధరదానవర్జనం, సన్నహస్తత రెండు అనుభావాలు. పర్యవసానం క్లిష్టమన్మథత్వం. అందుకే ప్రకృతశ్లోకంలో అధరదానవర్జనకు సమాధానంగా అక్షతాధరత్వం. ఉపగూహనవేళలో చేతులు అడ్డుపెట్టింది (సన్నహస్తం) కాబట్టి.

దానికి సమాధానంగా అవ్రణపదనఖత్వం. క్లిష్టమన్మథమైనది కాబట్టి దానికి ప్రతిగా సదయం రతం. కాళిదాస జాగరూకతకూ, కవితాచమత్కృతికీ శిరసువంచక తప్పదు.

**రఘువంశప్రయోగం :** 'రఘువంశే చాయమేవార్థః దృష్టాంతత్వేన దర్శితః -

**శ్లో॥ సదయం బుభుజే మహాభుజః - సహసోద్వేగమిమం వ్రజేదితి ।**
**అచిరోపనతాం స మేదినీం - నవపాణిగ్రహణాం వధూమివ ॥** (8-7)

**వాత్స్యాయనుడు** ఈ విషయాన్ని కామశాస్త్రంలో ప్రస్తావించినట్లు ప్రకాశికా వివరణ వ్యాఖ్యలు. వాత్స్యాయనవచనమిది-

కుసుమసమధర్మాణః హి యోషితః సుకుమరోపక్రమాః. తాస్త్వనధిగతవిశ్వాసైః ప్రసభముపక్రమ్యమాణాః సంప్రయోగద్వేషిణ్యః భవన్తి. తసాత్సామ్నైవ ఉపచరేత్. (3-2-8)

మల్లినాథుడు తన వ్యాఖ్యలో రతి రహస్యకారుని శ్లోకాన్ని ఉదాహరించి చూపాడు. "తత్ చుమ్బనం నఖం సురతం వా న సహతే స్మ. నవోఢాత్వాదితి హృదయమ్-"

తదుక్తం రతిరహస్యే-

"**శ్లో॥ నాత్యన్తమానులోమ్యేన న చాతిప్రతిలోమతః ।**
**సిద్ధిం గచ్ఛన్తి వా తస్మాన్మధ్యేన సాధయేదితి ॥ నవోఢామ్**' ఇతి" -

**విధ్యలంకారధ్వని :** పై నుదాహరించిన కామశాస్త్రసూచనలను బట్టి అక్షతాధరత్వాదులు సిద్ధవిషయాలే. కానీ అవి తిరిగి ప్రసక్తమయ్యేటట్లు ధ్వనింపజేయటం వలన విధ్యలంకారధ్వని. "**సిద్ధస్యైవ విధానం యత్తమాహుః విధ్యలంకృతిమ్**" - ఇది విధ్యలంకార లక్షణం. *

## ప్రభాతే పార్వత్యా సఖీజనంప్రతి సహ్రీకవర్తనమ్

**శ్లో॥ రాత్రివృత్తమనుయోక్తుముద్యతం సా విభాతసమయే సఖీజనమ్ ।**
**నాకరోదపకుతూహలం (రహః)హ్రియా శంసితుం చ హృదయేన తత్వరే॥10**

**ప.వి. :** రాత్రి-వృత్తమ్ అనుయోక్తుమ్ ఉద్యతమ్ సా విభాత-సమయే సఖీ-జనమ్ ।
న అకరోత్ అపకుతూహలం హ్రియా శంసితుం చ హృదయేన తత్వరే ॥

**అన్వ :** సా విభాత-సమయే రాత్రి-వృత్తమ్ అనుయోక్తుమ్ ఉద్యతం సఖీజనం అపకుతూహలం న అకరోత్. రహః శంసితుం చ హృదయేన తత్వరే చ ॥

**ప్ర :**సా = ఆమె (పార్వతి), విభాత-సమయే = (మరునాటి) ఉదయవేళలో, రాత్రి-వృత్తమ్ = ఆ రేయి జరిగిన దానిని, అనుయోక్తుమ్ = అడగడానికి, ఉద్యతమ్ = ప్రయత్నించిన, సఖీ-జనమ్ = చెలికత్తెలను, అపకుతూహలమ్ = ఆసక్తిని తొలగిపోయినవారినిగా, న అకరోత్ = చేయలేదు. రహః = ఏకాంతంలో, శంసితుమ్ = చెప్పటానికి, హృదయేన = మనసా, తత్వరే చ = వేగిరపడింది కూడా!

**తా :** తెలవారగనే పార్వతి చెలికత్తెలు రాత్రి జరిగిన వృత్తాంతాన్ని గురించి పార్వతిని అడగటానికి సిద్ధపడ్డారు. వారి కుతూహలాన్ని ఆమె తొలగించలేదు. ఆ విషయాలను ఏకాంతంలో చెప్పాలని త్వరపడింది.

**విభక్తులు - క్రియలు :** 1. రాత్రివృత్తమ్ : **వృత్తం** - వృత్తే - వృత్తాని - అకారాన్తః నపుంసకలింగః వృత్తశబ్దః ద్వితీయైకవచనమ్; 2. అనుయోక్తుమ్ - అను - ఉపసర్గపూర్వక యుజ్ ధాతోః తుమున్ ప్రత్యయః - అవ్యయమ్; 3. ఉద్యతమ్ : **ఉద్యతమ్** - ఉద్యతౌ - ఉద్యతాన్; అకారాన్తః పుంలింగః ఉద్యతశబ్దః ద్వితీయైకవచనమ్; 4. సా : **సా** - తే - తాః; దకారాన్తః స్త్రీలింగః తచ్ఛబ్దః ప్రథమైకవచనమ్; 5. ప్రభాతసమయే : **సమయే** - సమయయోః - సమయేషు; అకారాన్తః పుంలింగః సమయశబ్దః సప్తమ్యేకవచనమ్; 6. సఖీజనమ్ : **జనం** - జనౌ - జనాన్; అకారాన్తః పుంలింగః జనశబ్దః

ద్వితీయైకవచనమ్; 7. న – అవ్యయమ్; 8. అకరోత్ : **అకరోత్** – అకురుతామ్ – అకుర్వన్; డు కృఞ్ కరణే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్; 9. అపకుతూహలమ్: **అపకుతూహలమ్** – అపకుతూహలౌ – అపకుతూహలాన్; అకారాన్తః పుంలింగః అపకుతూహలశబ్దః ప్రథమైకవచనమ్; 10. రహః – అవ్యయమ్; 11. హ్రియా : **హ్రియా** – హ్రీభ్యాం – హ్రీభిః; హ్రీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 12. శంసితుమ్ – శంస్ ధాతోః తుమున్ ప్రత్యయం – అవ్యయమ్; 13. చ – అవ్యయమ్; 14. హృదయేన : **హృదయేన** – హృదయాభ్యాం – హృదయైః; హృదయశబ్దః అకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 15. తత్వరే : **తత్వరే** – తత్వరాతే – తత్వరిరే; ఞిత్వరా సంభ్రమే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. న+అకరోత్ = నాకరోత్ – సవర్ణదీర్ఘసంధి; 2. అకరోత్+అప = అకరోదప... – జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. రాత్రౌ వృత్తమ్ = రాత్రివృత్తమ్; 2. ప్రభాతమితి సమయః, తస్మిన్ – ప్రభాతసమయే; 3. సఖ్యశ్చ తే జనాః – సఖీజనాః; 4. అపగతం కుతూహలం యస్మాత్ తత్ – అపకుతూహలమ్

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**రహః :** రహశ్శబ్దం విజనవాచకం **అవ్యయం**. అయితే దేశవాచకం కాకపోతేనే రహశ్శబ్దం అవ్యయమనీ, సురతవాచకమైన రహశ్శబ్దమూ ఉందని ఉజ్జ్వలదత్తు వచనం. మేదినీకోశాదులు రహశ్శబ్దాన్ని నపుంసకలింగశబ్దంగానే చెప్తున్నాయి.

ప్రకృతశ్లోకంలో సురతార్థాన్ని చెప్పినా కుదురుతుంది. అయితే సురతాన్ని గుప్తంగానే ఉంచి రాత్రి జరిగినది అనటంలోనే ఔచిత్యం కనిపిస్తుంది.

**నాకరోత్ అపకుతూహలమ్** – కొంత విలక్షణమైన ప్రయోగం. రాత్రివృత్తాన్ని ప్రశ్నిస్తున్న చెలులకు దానిని చెపితే ఆ కుతూహలం తొలగుతుంది. చెప్పకపోయినా చెప్పటం లేదులే అని కుతూహలం తగ్గుతుంది. శంసితుం చ తత్వరే – అన్న ఉత్తర వాక్యాన్ని బట్టి చెప్పి తొలగించలేదనీ, ఆ విషయాన్ని సాకాంక్షంగానే నిలిపిందని భావమేర్పడుతుంది. మనస్సులో మాత్రం చెప్పాలని త్వరపడింది. మల్లినాథవ్యాఖ్య ఈ రీతిగానే వివరించింది.

'ఉద్యతం ప్రవృత్తం సఖీజనం హ్రియా లజ్జయా అపకుతూహలం నిరాకాంక్షం నాకరోత్ । **న కించిదాచష్ట** ఇత్యర్థః. హృదయేన హృదా చ శంసితుం తత్వరే త్వరితాభూత్. ఔత్సుక్యాదితిభావః । త్వరా సంభ్రమాదీనామనుభావత్వాత్" –

ప్రకాశికా, వివరణవ్యాఖ్యాతలు (అరుణగిరినాథ నారాయణ పండితులు) పార్వతి చెప్పలేదంటూనే కారణాన్ని ప్రకారాంతరంగా సంభావించారు.

"...లజ్జయా ఉత్తరం న దదౌ । శంసితుం చ హృదయేన తత్వరే ఇతి హర్షేణ రహసి **ప్రత్యేకం** నివేదయితుమైచ్ఛదిత్యర్థః" (ప్రకాశికా)

"హర్షోద్రేకవశాత్ రహసి తాభ్యః **ప్రత్యేకం** కథయితుం సద్య ఏవ తాసాం పృథగ్భావమైచ్ఛదిత్యర్థః" (వివరణమ్)

ఇక్కడ ప్రత్యేకం, పృథగ్భావం - అని రెండు పదాలు. పృథగ్భావ మంటే శివునకు దూరంగా ఏకాంతంగా వెళ్ళటమా? లేక చెలులనూ విభజించి విడివిడిగా చెప్పటమా? అని సంశయించవచ్చు. చెలులయినా అందరూ సమానస్థాయిలో ఆంతరంగిక విషయాలన్నీ వినదగ్గవారు కాకపోవచ్చు. అసలు అనుయోగం పరమేశ్వరునినుండీ దూరంగా వచ్చిన తరువాతనే కాబట్టి శివునుండీ వేరుపరచి అనటంలో ఔచిత్యం లేదు. అందువల్ల ఎవరికెంతమేర చెప్పవచ్చో, వారికంతమేర చెప్పటానికి సిద్ధపడి అడగగానే అందరిముందు నోరు విప్పలేదు. విడివిడిగా అనుభవాలను వారితో పంచుకోవాలనుకొన్నది అనటమే సముచితం. *

**శ్లో॥ దర్పణే చ పరిభోగదర్శినీ పృష్ఠతః ప్రణయినో నిషేదుషః ।**
**ప్రేక్ష్య బిమ్బమనుబిమ్బమాత్మనః కాని కాన్యపి చకార లజ్జయా? ॥ 11**

**ప.వి. :** దర్పణే చ పరిభోగ-దర్శినీ పృష్ఠతః ప్రణయినః నిషేదుషః ।
ప్రేక్ష్య బిమ్బమ్ అనుమిమ్బమ్ ఆత్మనః కాని కాని అపి చకార లజ్జయా ॥

**అన్వ :** దర్పణే పరిభోగ-దర్శినీ (సా) పృష్ఠతః నిషేదుషః ప్రణయినః బిమ్బమ్ ఆత్మనః అనుబిమ్బమ్ చ ప్రేక్ష్య లజ్జయా కాని కాని అపి చకార ।

**ప్ర :** దర్పణే = అద్దంలో, పరిభోగ-దర్శినీ : పరిభోగ = సుఖానుభవచిహ్నాలను, దర్శినీ = చూస్తున్న, సా = ఆ పార్వతి, పృష్ఠతః = వెనుకవైపు, నిషేదుషః = నిలిచియున్న, ప్రణయినః = వల్లభునియొక్క, బిమ్బమ్ = ప్రతిబింబాన్ని, ఆత్మనః = తనయొక్క, అనుబిమ్బం చ = ప్రతిబింబాన్ని కూడా, ప్రేక్ష్య = చూసి, లజ్జయా = సిగ్గుతో, కాని కాని అపి = ఏవేవో, చకార = చేసింది.

**తా :** పార్వతి అద్దం ముందు నిలిచి తన పరిభోగచిహ్నాలను అద్దంలో చూసుకొంటోంది. ఆమె వెనుకే పరమేశ్వరుడు నిలిచి గమనిస్తున్నాడు. అద్దంలో తమ ప్రతిబింబాలను గమనించిన పార్వతి సిగ్గుపడి ఏవేవో (చేష్టలు) చేసింది.

**విభక్తులు – క్రియలు :** 1. దర్పణే : **దర్పణే** – దర్పణయోః – దర్పణేషు; దర్పణశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 2. చ – అవ్యయమ్; 3. పరిభోగదర్శినీ : **దర్శినీ** – దర్శిన్యౌ – దర్శిన్యః; పరిభోగదర్శినీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. పృష్ఠతః = అవ్యయమ్. పృష్ఠ పదం మీద తసి ప్రత్యయం. (ఆద్యాదిభ్య ఉపసంఖ్యానమ్ – వార్తికమ్); 5. ప్రణయినః : **ప్రణయినః** – ప్రణయినోః – ప్రణయినామ్; ప్రణయిన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 6. నిషేదుషః : **నిషేదుషః** – నిషేదుషోః – నిషేదుషామ్; నిషేదివస్‌శబ్దః సకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 7. ప్రేక్ష్య – అవ్యయమ్. ప్రపూర్వక ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం; 8. బింబమ్ : **బింబమ్** – బింబే – బింబాని; బింబశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 9. అనుబింబమ్ : **అనుబింబమ్** – అనుబింబే – అనుబింబాని; అనుబింబశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 10. ఆత్మనః : **ఆత్మనః** – ఆత్మనోః – ఆత్మనామ్; ఆత్మన్‌శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 11. కాని : కిం – కే – **కాని**; కిం శబ్దః మకారాన్తః నపుంసకలింగః ద్వితీయాబహువచనమ్; 12. అపి – అవ్యయమ్; 13. చకార : **చకార** – చక్రతు – చక్రుః; డు కృఞ్ కరణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 14. లజ్జయా : **లజ్జయా** – లజ్జాభ్యాం లజ్జాభిః; లజ్జా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్.

**సంధులు :** 1. ప్రణయినః+నిషేదుషః = ప్రణయినో నిషేదుషః – విసర్గసంధి; 2. కాని+అపి = కాన్యపి – యణాదేశసంధి.

**సమాసాలు :** 1. పరిభోగదర్శినీ – పరిభోగుం ద్రష్టుం శీలమ్ అస్యాః ఇతి.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**పృష్ఠతః :** పృష్ఠపదం మీద 'ప్రతియోగే పంచమ్యాస్తసిః' అనే సూత్రానికి అనుబంధంగా ఉన్న 'ఆద్యాదిభ్య ఉపసంఖ్యానమ్' అనే వార్తికంతో తసి ప్రత్యయం.

పృష్ఠతః అంటే వెనుక. శరీరం యొక్క వెనుక అయితే అది వీపు. ఆ అర్థంలోనే దానికి ప్రయోగం.

**శ్లో॥ పృష్ఠతస్తు శరీరస్య నోత్తమాంగే కథంచన ।**
**అతోఽన్యథా తు ప్రహరన్ ప్రాప్తః స్యాత్ చౌరకిల్బిషమ్ ॥**–మనుస్మృతి – 8/300

**ప్రణయీ :** 'ప్రణయః అస్య అస్తీతి ప్రణయీ । ప్రణయః ప్రేమా । ప్రణయాస్స్వామీ । విస్రమ్భయాంచాప్రేమాణః ' ఇత్యమరః. స్వామీ ఇతి హేమచన్ద్రః.

**కాని కాని :** ఇక్కడ బహువచన ప్రయోగం అర్థవంతం. దానిని వివరిస్తూ వివరణ-వ్యాఖ్యాకారుడు-

"అత్ర బహువచనేన యుగపదేవ బహూనాం వికారాణాముత్పత్తిర్దర్శితా । వీప్సయా పునః అనేకవారమన్యేషాం వికారాణామప్యుత్పత్తిర్ద్యోత్యతే. అపి శబ్దయుక్తః కింశబ్దో వక్తు-మశక్యతాం ప్రతిపాదయతి పార్వతీ దర్పణే సంభోగచిహ్నావలోకనసమయే భావ పరీక్షార్థం పృష్ఠబాగావస్థితస్య ప్రియతమస్య ప్రతిబిమ్బం నిజప్రతిబిమ్బస్య పశ్చాదవలోక్య మనసాం వచసామప్యగోచరాన్ వికారాన్ యుగపదేవ కృతవతీ"

**కాని కాని :** నామవాచకంతో నిర్దిష్టరూపంలో ఏ చేష్టనూ ప్రకటించకుండా అనిర్వచనీయంగా వాటిని చెప్పటం వాటి ఆనంత్యాన్నీ, వైవిధ్యాన్నీ సూచిస్తుంది. ఇది అవివక్షితవాచ్యధ్వని భేదాలలో ఒకటి అయిన **అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి తావలం**.

**శ్లో॥ స్మృతాపి తరుణాతపం కరుణయా హరన్తీ నృణా-**
**మభంగురతనుత్విషాం వలయితా శతైర్విద్యుతామ్ ।**
**కళిందగిరినందినీతటసురద్రుమాలంబినీ**
**మదీయమతిచుమ్బినీ భవతు కాపి కాదంబినీ ॥** - (రసగంగాధరం - 1/1)

ఇక్కడ '**కాపి** కాదంబినీ' అనటంలో అనిర్వచనీయతా వైభవం కనిపిస్తుంది.

**లజ్జయా :** రసభావాలను వాచ్యం చేయటం వమనాఖ్యదోషమని ఆలంకారికుల భావన. ఇక్కడ లజ్జ వాచ్యం చేయబడింది. కాబట్టి దోషమని శంకింప వలసివచ్చును.

ప్రకృతం లజ్జా కారణంగా కలిగిన కార్యాలు (కాని కాని) విధేయవాక్యవిషయాలు. లజ్జ తత్కారణం. అది కరణమాత్రం. విధేయవిషయాలు వాచ్యం కావటం దోషం కావచ్చు. అనువాద్యమాత్రవిషయాలు వాచ్యాలయినా దోషం లేదు. లజ్జ ప్రధానం కాదు. ఆ చేష్టలే ప్రధానం. అవి ప్రత్యేకించి అర్థాంతరసంక్రమితవాచ్యాధ్వనిరూపంలో ఉండటం అదనపు శోభను కల్గిస్తోంది కూడా.

'కాని కాని' పదబంధం లజ్జానుభావాలను ఆలంకారికులు చెప్పినరీతిగా వ్యక్తం చేస్తుంది. ఎవ్వరూ చెప్పనివైనా కావచ్చు. అప్పటి కప్పుడు ఆ పాత్ర యొక్క శీలార్జవాదులకు అనుగుణమైన అనిదంపూర్వచేష్టావిశేషాలయినా కావచ్చు. అవన్నీ విధేయవిషయాలు. సిగ్గు వాటికి కారణం. వాగ్విన్యాసంలో అప్రధానం. *

**శ్లో॥ నీలకణ్ఠపరిభుక్తయౌవనాం తాం విలోక్య జననీ సమాశ్వసత్ ।**
**భర్తృవల్లభతయా హి మానసీం మాతురస్యతి శుచం వధూజనః ॥ 12**

**అవ :** పార్వతిని పరిశీలనగా చూచి తల్లి తృప్తిపడుట.

**ప.వి. :** నీలకంఠ–పరిభుక్త–యౌవనాం తాం విలోక్య జననీ సమ్+ఆశ్వసత్ ।
భర్తృవల్లభతయా హి మానసీం మాతుః అస్యతి శుచం వధూ–జనః ॥

**అన్వ :**జననీ నీలకంఠపరిభుక్త–యౌవనాం తాం విలోక్య సమాశ్వసత్. హి. వధూజనః భర్తృవల్లభతయా మాతుః మానసీం శుచమ్ అస్యతి.

ప్ర **:** జననీ = తల్లి (మేన), నీల... యౌవనామ్ : నీలకంఠ = శివునిచే, పరిభుక్త = అనుభవింపబడిన, యౌవనామ్ = యౌవనంగల, తామ్ = ఆ పార్వతిని, విలోక్య = చూసి, సమాశ్వసత్ = ఊరటపడింది. హి = అది యుక్తమే, వధూ–జనః = స్త్రీజనం, భర్తృ–వల్లభతయా = భర్తకు ఇష్టం కావటం ద్వారానే, మాతుః = తల్లికి, మానసీమ్ = మనస్సులోని, శుచమ్ = నలతను, అస్యతి = పోగొట్టగలదు.

**విభక్తులు - క్రియలు :** 1. నీలకణ్ఠపరిభుక్తయౌవనామ్ : **యౌవనాం** – యౌవనే – యౌవనాః; ...యౌవనా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 2. తామ్ : **తాం** – తే – తాః; దరానాపకతః స్త్రీలింగః తచ్ఛబ్దః ద్వితీయైకవచనమ్; 3. విలోక్య : అవ్యయం, విపూర్వక లోకృ దర్శనే ధాతువుపై ల్యప్ ప్రత్యయం; 4. జననీ : **జననీ** – జనన్యౌ – జనన్యః; ఈకారాన్తః స్త్రీలింగః జననీశబ్దః ప్రథమైకవచనమ్; 5. సమాశ్వసత్ : **సమాశ్వసత్** – సమాశ్వసతామ్ – సమాశ్వసన్; సమ్ – ఆ ఉపసర్గ పూర్వక శ్వస్ ప్రాణనే ధాతోః లఙ ప్రథమపురుషైకవచనమ్; 6. భర్తృవల్లభతయా : **వల్లభతయా** – వల్లభతాభ్యాం – వల్లభతాభిః; వల్లభతా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 7. హి – అవ్యయమ్; 8. మానసీమ్ : **మానసీం** – మానస్యౌ – మానసీః; మానసీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 9. మాతుః : మాతుః – మాత్రోః – మాతౄణామ్; మాతృశబ్దః ఋకారాన్తః స్త్రీలింగః షష్ఠ్యేకవచనమ్; 10. శుచమ్ : **శుచం** – శుచౌ – శుచః; శుక్ శబ్దః చకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 11. వధూజనః : **జనః** – జనౌ – జనాః; జనశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. మాతుః+అస్యతి = మాతురస్యతి – విసర్గసంధి.

**సమాసాలు :** 1. నీలకంఠ పరిభుక్త యౌవనామ్ – నీలః కణ్ఠః యస్య సః, తేన పరిభుక్తం యౌవనం యస్యాః, తామ్ – నీలకంఠపరిభుక్తయౌవనామ్; 2. భర్తృవల్లభతయా – భర్తరి వల్లభతా, తయా; 3. వధూశ్చ అసౌ జనః – వధూజనః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**హి :** **"స్ఫుటార్థ–నిశ్చయ–పాదపూరణ–విశేషావధారణ–ప్రత్యుక్తిషు–వర్తతేఽ యమ్"** (అవ్యయకోశః – 391 పు) ప్రస్తుతం నిశ్చయార్థకం **'హి'** అవ్యయమ్.

**క్రియౌచిత్యం : 'సమాశ్వసత్'** అన్నది పూర్వార్థం లోని కథాభాగసంబన్ధమైన క్రియాపదం అత్యన్తం సముచితం. పార్వతి పరమేశ్వరునికై తపించుటయే మేనకు ఇష్టం లేదు. నివారించే ప్రయత్నం చేసినా పార్వతి వినలేదు.

**శ్లో॥ ఇతి ధ్రువేచ్ఛామనుశాసతీ సుతాం - శశాక మేనా న నియన్తుముద్యమాత్ ।**
**క ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః - పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్ ॥**-5/5

ఆ స్థితిలో పార్వతి తపస్సు నారంభించింది. తనలోని విలక్షణవృత్తిప్రవృత్తులనూ, నామరూపాలనూ తానే వివరించి చెప్పాడు పరమశివుడు.

**శ్లో॥ వపుర్విరూపాక్షమలక్ష్యజన్మతా-**
**దిగమ్బరత్వేన నివేదితం వసు ।**
**వరేషు యద్బాలమృగాక్షి మృగ్యతే**
**తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే ॥** - 5/72

ఈ మాటలన్నది పరమేశ్వరుడైనా మేన కూడా ఇలాగే ఆలోచించింది. కాబట్టి కూతురి బ్రతుకూ, భవిష్యత్తూ ఎలా ఉండబోతోందో అని ఆమె ఆవేదన. అందుకే నీలకణ్ఠపరిభుక్తయౌవన అయిన తనయను చూచి **ఊరట చెందింది.**

ప్రకాశికాకారుడు **'సమాశ్వసత్'** పదప్రాధాన్యాన్ని ఇలా వివరించాడు-

"మహతా ప్రయత్నేన లబ్ధస్యాపి దేవస్య అతిగమ్భీరప్రకృతిత్వేన అవిగాహ్యత్వాత్ తద్విషయే దుహితుర్వాల్లభ్యస్య **సంశయితత్వాత్** తదేకజీవితాయాః మేనాయాః శోకస్తత్పరిభోగదర్శనపర్యన్తమనువృత్త ఇతి ద్యోత్యతే'

వివరణవ్యాఖ్యాకర్త దాన్ని సాధారణవిషయంగా భావించి **'జననసమయాదారభ్య** క్రమేణ పరివర్ధమానం తాపమపాచకార' అని వివరించాడు.

**అర్థాంతరన్యాసాలంకారం :** మేనా మనోవర్ణన విశేషవిషయం. దాన్ని సామాన్యంతో సమర్థిస్తే అర్థాంతరన్యాసాలంకారః 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః' అని అర్థాంతరన్యాసాలంకారలక్షణం. శ్లోకంలో ఉత్తరార్ధంలో సామాన్యవిషయాన్ని చెప్తున్నాడు కాళిదాసు -

శ్లో॥ భర్తృవల్లభతయా హి మానసీం - మాతురస్యతి శుచం వధూజనః ।

కాళిదాసకవి ప్రతిపాదించిన సామాన్యాంశాన్ని నారాయణపండితుని మాటల్లో చూద్దాం-

"మాతరో హి దుహితృజననాదారభ్య కథం మే దుహితా భవిష్యతి. కుత్ర వా గమిష్యతి భర్తురభిమతా వా భవిష్యతి అనభిమతా వా భవిష్యతి ఇత్యాదిచిన్తయా ప్రతిక్షణం విజృంభమాణం దుఃఖం భర్తృవల్లభత్వావధారణానన్తరమేవ పరిత్యజన్తీతి లోకప్రసిద్ధ మిత్యర్థః."

అభిజ్ఞానశాకున్తలంలో కణ్వుడు కూడా ఇలాంటి మాట అంటాడు అయితే కొంచెం తేడాతో.

**శ్లో॥ అర్థో హి కన్యా పరకీయ ఏవ - తామద్య సంప్రేష్య పరిగ్రహీతుః ।**
**జాతో మమాయం విశదః ప్రకామం - ప్రత్యర్పితన్యాస ఇవాన్తరాత్మా ॥**

అత్తవారింటికి పంపటం వరకే తన బాధ్యత అని కణ్వుడు భావిస్తే అక్కడ, భర్తృవల్లభగా మారే వరకు ఎలా ఉంటుందో అని మేన వంటి తల్లులు భావిస్తారని వ్యాఖ్యాతలు భావించారు.

*

**శ్లో॥ వాసరాణి కతిచిత్కథఞ్చన స్థాణునా పదమకార్యత ప్రియా ।**
**జ్ఞాతమన్మథరసా శనైశ్శనైస్సా ముమోచ రతిదుఃఖశీలతామ్ ॥ 13**

**అవ :** పార్వతి క్రమంగా పరమేశ్వరసన్నిధికి అలవాటు పడుట.

**ప.వి. :** వాసరాణి కతిచిత్ కథంచన స్థాణునా పదమ్ అకార్యత ప్రియా ।
జ్ఞాత -మన్మథ-రసా శనైః శనైః సా ముమోచ రతి-దుఃఖ-శీలతామ్ ॥

**అన్వ :** స్థాణునా ప్రియా కతిచిద్ వాసరాణి కథఞ్చన పదమ్ అకార్యత. జ్ఞాతమన్మథరసా సా శనైః శనైః రతిదుఃఖశీలతాం ముమోచ.

**ప్ర :** స్థాణునా = పరమేశ్వరునిచే, ప్రియా = వల్లభ అయిన పార్వతి, కతిచిద్ = కొన్ని, వాసరాణి = దినాలకు, కథంచన = ఏదో విధంగా, పదమ్ = స్థానాన్ని (జ్ఞానాన్ని), అకార్యత = పొందింపబడింది. జ్ఞాత... రసా : జ్ఞాత = తెలుసుకొనబడిన, మన్మథ = మదనసంబంధమైన, రసా = (శృంగార) రసాసక్తి గలదై, సా = ఆ పార్వతి, శనైః శనైః = మెల్లమెల్లగా, రతి... శీలతామ్ : రతి = సంభోగమందు, దుఃఖ శీలతామ్ = దుష్కరస్వభావాన్ని, ముమోచ = వదిలిపెట్టింది.

**తా :** పరమేశ్వరుడు కొన్ని దినాలకు పార్వతిలో శృంగారరసపరిజ్ఞానాన్ని కలిగించ గలిగాడు. మన్మథరసానుభూతిలోని రుచిని గ్రహించిన ఆ పార్వతి మెల్లమెల్లగా సంభోగం లోని దుఃఖస్వభావాన్ని అధిగమించింది.

**విభక్తులు - క్రియలు** : 1. వాసరాణి : వాసరం - వాసరే - **వాసరాణి**; అకారాన్తః నపుంసకలింగః వాసరశబ్దః ప్రథమాబహువచనమ్; 2. కతిచిత్ - అవ్యయమ్; 3. కథంచన - అవ్యయమ్; 4. స్థాణునా : **స్థాణునా** - స్థాణుభ్యాం - స్థాణుభిః; స్థాణుశబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 5. పదమ్ : **పదం** - పదే - పదాని; అకారాన్తః నపుంసకలింగః పదశబ్దః ప్రథమైకవచనమ్; 6. అకార్యత : **అకార్యత** - అకార్యేతామ్ - అకార్యన్త; డు కృఞ్ కరణే ధాతోః కర్మణి లఙ్ ప్రథమపురుషైకవచనమ్; 7. ప్రియా : **ప్రియా** - ప్రియే - ప్రియాః; ఆకారాన్తః స్త్రీలింగః ప్రియాశబ్దః ప్రథమైకవచనమ్; 8. జ్ఞాతమన్మథరసా : **రసా** - రసే - రసాః; జ్ఞాతమన్మథరసా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. శనైః శనైః - అవ్యయమ్; 10. సా : **సా** - తే - తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 11. ముమోచ : **ముమోచ** - ముముచతుః -ముముచుః - ముచ్ఌ మోక్షణే ధాతోః లిట్ ప్రథమపురుషైకవచనమ్; 12. రతిదుఃఖశీలతామ్ : **శీలతాం** - శీలతే - శీలతాః; శీలతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్.

**సమాసాలు** : 1. జ్ఞాతమన్మథరసా - మన్మథవిషయే రసః - మన్మథరసః, జ్ఞాతః మన్మథరసః యయా సా; 2. రతిదుఃఖశీలతామ్ - రతౌ దుఃఖం శీలం యస్యాః సా, రతి దుఃఖశీలా, తస్యాః భావః, రతిదుఃఖశీలతా, తామ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటు ప్రమాణాలు :**

అసాకల్యార్థంలో (కొన్ని) కతిచిత్పదప్రయోగం. "అసాకల్యార్థే ప్రాయః కింవృత్తాత్ పరః ప్రయుజ్యతే (చిత్ ఇతి). యథా కశ్చిత్ - కాచిత్ - కించిత్ - కదాచిత్ - కుత్రచిత్ - కర్హిచిత్ - క్వచిత్ - కుతశ్చిత్ - **ఇత్యాది.**

**వ్యాకరణాన్తరేషు ప్రత్యయత్వేనాయం విహితః. - (అవ్యయకోశం - 173 పు)**

**కాబట్టి 'కతి' మీద చిత్ అవ్యయం. కొందరు వ్యాకర్తలు దాన్ని (చిత్) ప్రత్యయమన్నారు.**

**కథంచన :** కథమ్ అవ్యయం మీద చన అవ్యయం. రెండింటి కలయిక. అసాకల్యం, విస్మయం, ఉపమాన, అసమ్మత్యర్థాలలో దీని ప్రయోగం. వేదాలలో నిషేధ, సముచ్చయ, విధ్యర్థాలలో కూడా చన ప్రత్యయం కనిపిస్తుంది.

వేదాలవిషయంలో కొందరు చ, న లను భిన్నపదాలుగా కూడా భావిస్తారు. అందుకే 'చన' ద్వారా కొన్నిచోట్ల సముచ్చయార్థ, కొన్నిచోట్ల నిషేధార్థం స్ఫురిస్తాయని పెద్దలమాట. (అవ్యయకోశం - 172 పు)

**క్రియాపదౌచిత్యం :** స్థాణునా పదమ**కార్యత** ప్రియా - ప్రేరణా పురస్సరమైన కర్మణి ప్రయోగమిది. పార్వతి తిన్నగా పరమేశ్వరునివైపు మనశ్శరీరాలను మళ్ళిస్తోంది. అయితే కవి దానిలో పార్వతికి కర్తృత్వాన్ని ఆపాదించకుండా పరమేశ్వరునిచేత ఆమె ఆయా కర్మలలోనికి ప్రవేశపెట్టబడినదని చెప్తూ శృంగారాభిముఖంగా పార్వతిలో ఇంకా స్వతః ప్రవృత్తి కలుగలేదని ధ్వనింపజేస్తున్నాడు. ప్రేరణ కర్మణిలోని ఔచిత్యమిది.

**పరికరాంకురాలంకారం :** విశేష్యపదమైన 'స్థాణునా' కూడా సాభిప్రాయమే. '**సాభిప్రాయ-విశేష్యే తు భవేత్ పరికరాంకురః**' అని పరికరాంకురలక్షణం. తిష్ఠతీతి స్థాణుః. స్థిరంగా నిలిచేవాడు స్థాణువు. అటువంటి స్థాణువు తాను కదలటమే గాక పార్వతిని కదిలించగలగటం కూడా ఆ పదం ధ్వనింపజేస్తుంది. దీన్నే క్షేమేంద్రుడు కర్తృపదౌచిత్య-మన్నాడు.

**మధ్యానాయిక :** గత శ్లోకం వరకు కవి పార్వతిలోని ముగ్ధాత్వాన్ని నిరూపించాడు. ఇప్పుడు ఆమె జ్ఞాత మన్మథరస అయినది. ముగ్ధాత్వదశ నుండి మధ్యాదశలోనికి ప్రవేశించింది. '**లజ్జా మన్మథమధ్యస్థా మధ్యామోదితయౌవనా**' అని మధ్యాలక్షణం. సిగ్గు, మన్మథభావం - ఈ రెండింటికీ సమప్రాధాన్యంతో ప్రవర్తించే నాయిక మధ్య. అయితే ఇక్కడ మధ్యాప్రవృత్తిని కానీ చేష్టను కానీ ప్రదర్శింపక రతిదుఃఖశీలతను వదిలి పెట్టిందనటం ద్వారా సూచించాడు కాళిదాసు. *

## శివేశయోః రతిచేష్టావర్ణనమ్

**శ్లో॥ సస్వజే ప్రియమురోనిపీడనం ప్రార్థితం ముఖమనేన నాహరత్ ।**
**మేఖలాపనయలోలతాఙ్గతం హస్తమస్య శిథిలం రురోధ సా(చ) ॥ 14**

**ప.వి. :** సస్వజే ప్రియమ్ ఉరః+నిపీడితం ప్రార్థితమ్ ముఖమ్ అనేన న అహరత్ ।
మేఖలా+అపనయ-లోలతామ్ గతమ్ హస్తమ్ అస్య శిథిలం రురోధ చ ॥

**అన్వ :** (సా) ప్రియమ్ ఉరోనిపీడితం సస్వజే. అనేన ప్రార్థితం ముఖం న అహరత్. మేఖలా+అపనయలోలతాం గతమ్ అస్య హస్తం శిథిలం రురోధ చ.

**ప్ర :** సా = ఆ పార్వతి, ప్రియమ్ = భర్తను, ఉరః+నిపీడితమ్ : ఉరః = వక్షఃస్థలం, నిపీడితమ్ = ఒత్తిడికి గురి అగునట్లుగా, సస్వజే = కౌగిలించుకొనెను. అనేన = ఆ పరమేశ్వరునిచే, ప్రార్థితమ్ = కోరబడిన, ముఖమ్ = ముఖాన్ని, న అహరత్ = తప్పించ లేదు. మేఖలా... లోలతామ్ : మేఖలా = మొలనూలును, అపనయన = తొలగించుటలో, లోలతామ్ = చాంచల్యాన్ని, గతమ్ = పొందిన, అస్య = ఈ శివునియొక్క, హస్తమ్ = చేతిని, శిథిలమ్ = బిగువులేకుండానే, రురోధ చ = అడ్డగించింది కూడా.

**తా :** పార్వతి శంకరుని గుండె ఒత్తిడికి లోనయ్యేటట్లు కౌగిలించుకొన్నది. ఆ శివుడు ముఖచుంబనం చేయగోరగా తొలగిపోలేదు. కోకముడిని తొలగించాలని తడబడుతున్న ఆయన చేతిని నామమాత్రంగా అడ్డగించింది.

**విభక్తులు - క్రియలు :** 1. సస్వజే : **సస్వజే** - సస్వజాతే - సస్వజిరే; ష్వంజ్ పరిష్వంగే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 2. ప్రియమ్ : **ప్రియం** - ప్రియౌ - ప్రియాన్; ప్రియశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. ఉరోనిపీడితమ్ : **నిపీడితం** - నిపీడితౌ - నిపీడితాన్; ఉరోనిపీడితశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 4. ప్రార్థితమ్ : **ప్రార్థితం** - ప్రార్థితౌ - ప్రార్థితాన్; అకారాన్తః నపుంసకలింగః ప్రార్థితశబ్దః ద్వితీయైకవచనమ్; 5. అనేన : **అనేన**/ఏనేన - ఆభ్యామ్ - ఏభిః; మకారాన్తః పుంలింగః ఇదం శబ్దః తృతీయైకవచనమ్; 6. ముఖమ్ : ముఖం - ముఖే - ముఖాని; అకారాన్తః నపుంసకలింగః ముఖశబ్దః. ద్వితీయైకవచనమ్; 7. న - అవ్యయమ్; 8. అహరత్ : అహరత్ - అహరతామ్ - అహరన్; హృఞ్ హరణే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్; 9. మేఖలా+అపనయ-లోలతామ్ : **లోలతాం** - లోలతే - లోలతాః; ఆకారాన్తః స్త్రీలింగః మేఖలాపనయలోలతాశబ్దః ద్వితీయైకవచనమ్; 10. గతమ్ : **గతం** - గతౌ - గతాన్ - అకారాన్తః పుంలింగః గతశబ్దః ద్వితీయైకవచనమ్; 11. హస్తమ్ : **హస్తం** - హస్తౌ - హస్తాన్ - అకారాన్తః పుంలింగః హస్తశబ్దః ద్వితీయైకవచనమ్; 12. అస్య: **అస్య**/అనయోః - ఏనయోః - ఏషామ్; ఇదం శబ్దః మకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 13. శిథిలం (యథా తథా) - అవ్యయమ్; 14. రురోధ : రురోధ - రురుధతుః - రురుధుః; రుధిర్ ఆవరణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 15. చ - అవ్యయమ్.

**సంధులు :** 1. న+అహరత్ - నాహరత్ - సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. ఉరసా నిపీడితః, తమ్ = ఉరోనిపీడితమ్; 2. మేఖలాయాః అపనయః, తస్మిన్ లోలః, మేఖలాపనయలోలః, తస్య భావః, తామ్ = మేఖలాపనయలోలతామ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**ప్రియః : 'ధవః ప్రియః పతిర్భర్తా'** అని అమరకోశం. అల్లుడు (జామాత) అనే అర్థంలో కూడా ప్రియపద ప్రయోగం మనుస్మృతిలో కనిపిస్తుంది.

**శ్లో॥ రాజర్త్విక్స్నాతకగురూన్ ప్రియశ్వశురమాతులాన్ ।**
**అర్హయేన్మధుపర్కేణ పరిసంవత్సరాత్పునః ॥** - 3/119

అనంతరకాలంలో ప్రియశబ్దవినియోగం అర్థసంకోచవ్యాకోచాలతో కనిపిస్తుంది.

**శ్లో॥ కామం ప్రియా న సులభా మనస్తు తద్భావదర్శనాయాసి ।**
**అకృతార్థేఽపి మనసిజే రతి ముభయప్రార్థనా కురుతే ॥**

అప్పటికి శకుంతల దుష్యంతుని భార్య కాదు.

**శ్లో॥ గీతాన్తరేషు శ్రమవారిలేశైః – కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్ ।**
**పుష్పాసవాఘూర్ణిత నేత్రశోభం – ప్రియాముఖం కిమ్పురుషశ్చుచుమ్బ ॥**

– కుమారసంభవం – 3/38

ఇక్కడ ప్రియాపదాన్ని భార్యార్థంలో వాడాడు.

**ఉరస్ :** ఇయర్తి ఇతి ఉరః. 'అర్తేరుచ్చ' సూత్రంతో ఋధాతువుపై అసున్ ప్రత్యయం, ధాతువుకు ఉరాదేశం కూడా.

**అనుభావత్రైవిధ్యం :** వివరణ, ప్రకాశికా వ్యాఖ్యానాలు అందమైన భావాన్ని ఆవిష్కరించాయి.

కౌగిలించుకొనటం, అధరగ్రహణాన్ని నిరోధించకపోవటం, చేతిని మెల్లగా తొలగించటం ఈ మూడు ఇక్కడ పార్వతీమనోభావప్రదర్శకాలైన అనుభావాలు :

మొదటిది స్వతః ప్రవృత్తి. రెండవది అన్యప్రవృత్తిని అడ్డగించకపోవటం. మూడవది అన్యప్రవృత్తిని నిరోధించటం కానీ అర్ధమనస్కతతో. ఈ చేష్టావైవిధ్యం ఆమెలోని మధ్యానాయికాత్వాన్ని వ్యక్తం చేస్తోంది. భర్తృప్రవృత్తికి సహకారిత్వాన్ని ప్రదర్శిస్తోంది.

**'అత్రాలింగనే స్వయంప్రవృత్తిః, ముఖగ్రహణేఽప్రాతికూల్యమిత్యనుసన్ధేయమ్''** (ప్రకాశిక). వివరణకారుని మాటా ఇదే. చిన్న చిన్న మార్పులతో. *

**శ్లో॥ హావ(భావ)సూచితమదృష్టవిప్రియం చాటుమత్ క్షణవియోగకాతరమ్ ।**
**కైశ్చిదేవ దివసైస్తథా తయోః ప్రేమరూఢమితరేతరాశ్రయమ్ ॥ 15**

**ప.వి. :** హావ–సూచితమ్ అదృష్ట–విప్రియమ్ చాటుమత్ క్షణ–వియోగ–కాతరమ్।
కైః+చిత్ ఏవ దివసైః తయోః తథా ప్రేమ రూఢమ్ ఇతర+ఇతర+ఆశ్రయమ్॥

**అన్వ :** హావసూచితమ్ అదృష్టవిప్రియం చాటుమత్ క్షణవియోగకాతరమ్ ఇతరేతరాశ్రయం చ తయోః ప్రేమ తథా కైశ్చిద్ దివసైః ఏవ రూఢమ్ (అభూత్).

**ప్ర :** హావ–సూచితమ్ : హావ = హావంతో (ఆహ్వానంతో), సూచితమ్ = సూచింపబడినదీ, అదృష్ట–విప్రియమ్ : అదృష్ట = కనిపించని, విప్రియమ్ = అనిష్టం గలదీ, చాటుమత్ = ప్రేమానునయవచనాలతో కూడినదీ, క్షణ... కాతరమ్ : క్షణ = క్షణకాలమైన,

వియోగ = విరహంతో, కాతరమ్ = కలతపడేదీ, ఇతర+ఇతర+ఆశ్రయమ్ = పరస్పరం ఆశ్రయంగా కలదీ అయిన, తయోః = ఆ పార్వతీపరమేశ్వరులయొక్క, ప్రేమ = ప్రియభావన, తథా = ఆ రీతిగా, కైశ్చిత్ = కొన్ని, దివసైః ఏవ = దినాలలోనే, రూఢమ్ = గట్టిగా నాటినదిగా, అభూత్ = అయ్యెను.

**తా :** ఆ పార్వతీపరమేశ్వరుల ప్రేమ అన్యోన్యాశ్రయమై కొద్ది రోజులలోనే గట్టి పడింది. భ్రూనేత్రాది వికారాలతో ఇతరులపై ఉండే ప్రేమను సూచిస్తున్నారు వాళ్ళు. అనిష్టమే ఒక్కరిలోనూ కనిపించటం లేదు. ఒకరినొకరు అభినందిస్తూ, ప్రియవచనాలు పలుకుతున్నారు. ఇద్దరిలో ఏ ఒక్కరు క్షణమైనా ఇతరుల వియోగాన్ని భరించలేరు.

**విభక్తులు - క్రియలు :** 1. హావసూచితమ్ : **సూచితం** - సూచితే - సూచితాని; హావసూచితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. అదృష్టవిప్రియమ్ - క్రియావిశేషణత్వేన అవ్యయమ్. శబ్దరూపమైతే **విప్రియం** - విప్రియే - విప్రియాణి; విప్రియ శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 3. చాటుమత్ : **చాటుమత్** - చాటుమతీ - చాటుమన్తి; చాటుమచ్ఛబ్దః తకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 4. క్షణవియోగకాతరమ్ : **కాతరం** - కాతరే - కాతరాణి; ... కాతరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 5. కైశ్చిత్ - చిదన్తం అవ్యయమ్; 6. ఏవ - అవ్యయమ్; 7. దివసైః : దివసేన - దివసాభ్యాం - **దివసైః**; దివస శబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 8. తదా - అవ్యయమ్; 9. తయోః : తస్య - **తయోః** - తేషామ్; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః షష్ఠీద్వివచనమ్; 10. ప్రేమ : **ప్రేమ** - ప్రేమణీ - ప్రేమాణి; ప్రేమన్ శబ్దః నకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 11. రూఢమ్ : **రూఢం** - రూఢే - రూఢాణి; అకారాన్తః నపుంసకలింగః రూఢశబ్దః ప్రథమైకవచనమ్; 12. ఇతరేతరాశ్రయమ్ : **ఆశ్రయమ్** - ఆశ్రయే - ఆశ్రయాణి; ఇతరేతరాశ్రయశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్ - క్రియావిశేషణ-పక్షంలో అవ్యయం.

**సంధులు :** 1. కైశ్చిత్+ఏవ = కైశ్చిదేవ - జశ్త్వసంధి; 2. దివసైః+తదా = దివసైస్తదా - విసర్గసంధి.

**సమాసాలు :** 1. హావైః సూచితమ్ = హావసూచితమ్; 2. అదృష్టం విప్రియం యస్మిన్ తత్, తథా = అదృష్ట విప్రియమ్; 3. చాటుః అస్తి అస్మిన్నితి - చాటుమత్; 4. క్షణే వియోగః, వియోగః, తేన కాతరమ్ = క్షణవియోగకాతరమ్; 5. ఇతరేతరం పరస్పరమ్ ఆశ్రయః యస్య తత్, తథా = ఇతరేతరాశ్రయమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**చాటు (మత్) :** చటతి భినత్తి మనః తేషాం మోదవాక్యేన ఇతి చాటుః. "**దృసనిజ-నిచరిచటిభ్యో ఞుణ్**" అని ఞుణ్ ప్రత్యయమ్. ప్రియవాక్యమని శబ్దకల్పద్రుమం. ప్రియ-ప్రాయమైన వచనమని హేమచంద్రవచనం. మిథ్యాప్రియవాక్యమని మహాభారత వచనం. "**ప్రథమసమాగమలజ్జితయా పటుచాటుశతైరనుకూలమ్**" గీతగోవిందం-(శబ్దకల్పద్రుమః)

**హావం :** "**హేవాకస (త)స్తు శృంగారో హావోఽక్షి భ్రూవికారకృత్**" అని దశరూపకలక్షణం. అల్పాలాపస్తు అని పాఠాంతరం. తక్కువ మాటాడుతూ అక్షి భ్రూ వికారాలతో శృంగారభావ ప్రకటనం హావం. ఇది శరీరజాలైన యౌవనాలంకారాలలో ఒకటి.

**శ్లో॥ యువానోఽనేన హూయన్తే నారీభిర్మదనానలే ।**
**అతో నిరుచ్యతే హావః తే విలాసాదయో మతాః ॥**

హావాన్ని నిర్వచిస్తూ ఇలా వివరించింది **ఉజ్జ్వలనీలమణి-**

**శ్లో॥ గ్రీవారోచకసంయుక్తో భ్రూనేత్రాదివికాశకృత్ ।**
**భావాదీషత్ప్రకాశో యః స హావ ఇతి కథ్యతే ॥**

**క్షణవియోగకాతరమ్ :** క్షణవియోగాన్ని కూడా కాతరభావానికి కారణంగా భావించటం స్నేహాధిక్యం వలన. అది కాళిదాసుకున్న స్వాభావికభావన. అభిజ్ఞానశాకున్తలంలో కూడా ఇదే అభిప్రాయాన్ని ప్రకటిస్తాడు కాళిదాసు.

"**అతిస్నేహః పాపశంకీ**" అంటూ. విధికృతమైన వియోగమేదైనా కలుగుతుందేమో అని కాతరభావం.

**ప్రేమ :** మల్లినాథవ్యాఖ్య ప్రేమ పదాన్ని ఇలా వివరించింది. 'స ప్రేమ భేదరహితం యూనోర్యద్భావబన్ధనం భావో రతౌ రాగ ఏవ స్వసంవేద్యదశాప్రాప్తయావదాశ్రయవృత్తి-శ్చేదనురాగః"-

**ఇతరేతరాశ్రయత్వమ్ :** ఇతరేతరాశ్రయమైన ప్రేమ హృదయబంధంలో ఎక్కువ రాణిస్తుంది. సీతారాముల అనురాగాన్ని వాల్మీకి వర్ణించిన తీరు గమనించండి-

**శ్లో॥ తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే ।**
**అన్తర్జాతమపి వ్యక్తమాఖ్యాతి హృదయం హృదా ॥** - రామాయణం-బాలకాండ-77/30 *

**శ్లో॥ తం యథాఽఽత్మసదృశం వరం వధూరన్వరజ్యత వరస్తథైవ తామ్ ।**
**సాగరాదనపగా హి జాహ్నవీ సోఽపి తన్ముఖరసైకనిర్వృతిః ॥ 16**

**అవ :** పార్వతీపరమేశ్వరుల పరస్పరప్రేమ ప్రసక్తి వర్ణన.

**ప.వి.:**తమ్ యథా ఆత్మ-సదృశం వరం వధూః అను+అరజ్యత వరః తథా ఏవ తామ్।
సాగరాద్ అనపగా హి జాహ్నవీ సః అపి తత్+ముఖ-రస+ఏక-నిర్వృతిః ॥

**అన్వ :** వధూః తం వరమ్ అను యథా వరః తామ్ అను తథా ఏవ. అరజ్యత. హి జాహ్నవీ సాగరాత్ అనపగా సః అపి తన్ముఖ-రస-ఏక-నిర్వృతి.

**ప్ర :** వధూః = నవోఢ అయిన పార్వతి, ఆత్మ-సదృశమ్ = తనకు తగిన, తమ్ = ఆ, వరమ్ అను = వరుని విషయంలో, యథా = ఏ రీతిగా (అనురక్తయో), వరః = వరుడు, తామ్ అను = ఆ పార్వతి విషయంలో, తథా ఏవ = ఆ రీతిగానే, అరజ్యత = అనురక్తినందెను. హి = అది తగినదే. జాహ్నవీ = గంగానది, సాగరాత్ = సముద్రుని నుండీ, అనపగా = తొలగిపోనిది, సః+అపి = ఆ సముద్రుడూ, తన్మ... నిర్వృతిః : తత్ = ఆ గంగయొక్క, ముఖ = ముఖమునందలి, రస+ఏక = నీటిచేతనే, నిర్వృతిః = ఆనందించెడి వాడు.

**తా :** పార్వతి తనకు తగిన వరుడైన ఆ పరమేశ్వరునియందు అనురక్తిని పొందినట్లే పరమేశ్వరుడునూ తనకు తగిన వధువైన ఆ పార్వతియందు అనురక్తిని పొందాడు. అది సరియైనదే. గంగ సముద్రుని వీడి మనలేదు. సముద్రునకు గంగాజలమే ఆనంద-హేతువు.

**విభక్తులు - క్రియలు :** 1. తమ్ : **తం** - తౌ - తాన్ - తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 2. యథా - అవ్యయమ్; 3. ఆత్మసదృశమ్ : **సదృశం** - సదృశౌ - సదృశాన్ - ఆత్మసదృశ శబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 4. వరమ్ : **వరం** - వరౌ - వరాన్ - వరశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 5. వధూః : **వధూః** - వధ్వౌ - వధ్వః - వధూశబ్దః ఊకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 6. అను - అవ్యయమ్; 7. అరజ్యత : **అరజ్యత** - అరజ్యేతామ్ - అరజ్యన్త - రఞ్జ రాగే ధాతోః లజి ప్రథమపురుషైకవచనమ్; 8. వరః : **వరః** - వరౌ - వరాః - వరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 9. తథా - అవ్యయమ్; 10. ఏవ - అవ్యయమ్; 11. తామ్ : **తాం** - తే - తాః - తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 12. సాగరాత్ : **సాగరాత్** - సాగరాభ్యాం - సాగరేభ్యః - సాగరశబ్దః అకారాన్తః పుంలింగః పంచమ్యేకవచనమ్; 13. అనపగా : **అనపగా** - అనపగే - అనపగాః - అనపగా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 14. హి - అవ్యయమ్; 15. జాహ్నవీ : **జాహ్నవీ** - జాహ్నవ్యౌ - జాహ్నవ్యః - జాహ్నవీ శబ్దః ఈకారాన్తః

స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 16. సః : **సః** - తౌ - తేః - తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 17. అపి - అవ్యయమ్; 18. తన్ముఖరసైక నిర్వృతిః : **నిర్వృతిః** - నిర్వృతీ - నిర్వృతయః; తన్ముఖరసైకనిర్వృతి శబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. యథా+ఆత్మసదృశమ్ = యథాత్మసదృశమ్ = సవర్ణదీర్ఘసంధి; 2. వధూః+అను = వధూరను = విసర్గసంధి; 3. అను+అరజ్యత = అన్వరజ్యత = యణాదేశసంధి; 4. వరః+తథా = వరస్తథా = విసర్గసంధి; 5. తథా+ఏవ = తథైవ = వృద్ధిసంధి; 6. సాగరాత్+అనపగా = సాగరాదనపగా = జశ్త్వసంధి; 7. సః+అపి = సోఽపి - విసర్గసంధి; 8. తత్+ముఖ = తన్ముఖ = అనునాసిక సంధి.

**సమాసాలు :** 1. ఆత్మనః సదృశమ్ = ఆత్మసదృశమ్; 2. తస్యాః ముఖం, తస్మిన్ రసః, తేన ఏకేన ఏవ నిర్వృతిః యస్య సః = తన్ముఖరసైకనిర్వృతిః

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**అను :** అను పదానికి ఉపసర్గత్వం, కర్మ ప్రవచనీయత్వం, గతిత్వం కూడా ఉంది. ప్రాదులలో చేరినది కాబట్టి 'ప్రాదయః' అనే సూత్రంతో ఉపసర్గ సంజ్ఞ, 'గతిశ్చ' సూత్రంతో గతి సంజ్ఞ, 'అనుర్లక్షణే' మొదలగు సూత్రాలతో కర్మ ప్రవచనీయసంజ్ఞ కూడా వస్తుంది. విభిన్నార్థాలలో 'అను' పదోపయోగ ముంటుంది.

**శ్లో॥ అనుపశ్చాత్ కృపాజ్ఞానసాన్త్వనే సేవనేచ్ఛయోః ।**
**సాదృశ్యాచరణప్రశ్నా దేశాంగీకృతిమార్గణే ॥**

**శ్లో॥ ప్రోత్రాహనే చానుకూల్యే పశ్చాత్తాపానుపూర్వ్యయోః ।**
**ప్రసాధనే చోపకారే సాతత్యాలోచనాన్వయే ॥**

**అధీష్టసమ్బన్ధార్థయోరపి దృశ్యతే** - అవ్యయకోశః

**తుల్యగుణత :** బ్రహ్మ తగినవారిని జతచేయడని ఒక లౌకికాపవాదం. ఇది అనాదిగా ఉన్నదే. కాళిదాసు కూడా ఆ భావాన్ని ఆదరించినవాడే. క్వాచిత్కంగా అది కుదురుతుంది. పార్వతీపరమేశ్వరుల పరస్పరానురాగం అటువంటిది. అభిజ్ఞానశాకున్తలంలో కూడా ఇటువంటి అభిప్రాయాన్నే ప్రకటించాడు కాళిదాసు-

**శ్లో॥ త్వమర్హతాం ప్రాగ్రసరః స్మృతోసి నః శకున్తలా మూర్తిమతీవ సత్క్రియా ।**
**సమానయంస్తుల్యగుణం వధూవరం చిరాయ వాచ్యం న గతః ప్రజాపతిః ॥**

అనురాగతుల్యత కారణంగా రసాభాస నిరస్తమవుతోందని మల్లినాథుడు. ఇరువురిలోనూ ఆ కామన లేకపోతే రసాభాసమే ఎవరవునన్నా. కాదన్నా.

మల్లినాథుని మాటలలోనే - "ఇత్థం సమానానురాగకథనాద్రసాభాసత్వం నిరస్తమ్. తదుక్తమ్" యోషితో బహుసక్తిశ్చేద్రసాభాసః స ఉచ్యతే। కవినాప్యుక్తం మాలవికాయామ్ - 'అనాతురోక్తం ప్రతి విప్రసిద్ధ్యతా సమీపగేనాపి రతిర్న మాం ప్రతి. పరస్పరప్రాప్తి నిరాశయోర్వా శరీరనాశోపి సమానురాగయోః. ఇతి.

ఇక్కడ మల్లినాథవ్యాఖ్యలో 'యోషితో బహుసక్తిశ్చేత్' అని రసాభాస నిర్వచనశ్లోకం లోని ఆ భాగాన్ని నిర్దేశించటం సముచితంగా లేదు. దాన్ని ప్రదర్శించి లక్షణంగా సమానానురాగం కాబట్టి రసాభాసం కాదనటం అసమంజసం. "యోషిద్ బహుసక్తి" అన్న పదబంధాన్ని ఇక్కడ చూపటం దోషం. నిర్వచనశ్లోకంలోని 'ఏకత్రైవానురాగశ్చేత్' అన్న భాగాన్ని ఇక్కడ ప్రదర్శించి, నిరాకరించాలి. స్త్రీ పురుషులలో ఒకరికే అనురాగం ఉండటం రసాభాసమైతే అసమానస్థితిలో అనుపస్థితిగా పరిగణనం జరగవచ్చు. సూక్ష్మాంశమిది. దానిని భావించిన వ్యాఖ్యాత అసమంజసమైన తరువాతి వాక్యాన్ని ఎందుకు ప్రదర్శించాడో తెలియదు. పరిష్కర్తల ప్రమాదం కావచ్చు.

**అలంకారం :** 'అత్ర దృష్టాంతాలంకారః' అని మల్లినాథ వ్యాఖ్య దృష్టాంతాలంకారం అన్నదీ శ్లోకంలో. "వస్తుతః భిన్నయోరపి పరస్పరసాదృశ్యాదభిన్నయోః ఉపమానో-పమేయయోః పృథగుపాదానం **బిమ్బప్రతిబిమ్బభావః**' అని బింబ ప్రతిబింబభావం. ఆ బిమ్బప్రతిబిమ్బభావముంటే దృష్టాన్తాలంకారం. వివరణ వ్యాఖ్య 'వరానురాగస్య ప్రతి-వస్తూపమామాహ' అని శ్లోకంలో ప్రతివస్తూపమాలంకార మన్నది'. వాక్యయేరేకసామాన్యే ప్రతివస్తూపమా మతా' అన్నది ప్రతివస్తూపమ నిర్వచనం.

శ్లోకంలోని పూర్వోత్తరార్ధాలకు వస్తు ప్రతివస్తుభావం.

ఆ వధువు తనకు తగిన వరునిపై మరులు గొన్నట్లు, వరుడును ఆమెపై మరులుగొనెను. గంగ సాగరుని వదలదు. సాగరుడూ తన్ముఖరసంతో ఆనందించువాడు.

ఇక్కడ వాచ్యంగా ప్రతివస్తూపమాలంకారం, ధ్వని రూపంలో దృష్టాంతాలంకారం అనటం సముచితం. *

**శ్లో॥ శిష్యతాం నిధువనోపదేశినశ్శఙ్కరస్య రహసి ప్రపన్నయా ।**
**శిక్షితం యువతినైపుణం తయా యత్తదేవ గురుదక్షిణీకృతమ్ ॥ 17**

**అవ :** విషయపరిజ్ఞానప్రదర్శననే పార్వతి గురుదక్షిణగా చేయటం.

**ప.వి. :** శిష్యతామ్ నిధువన+ఉపదేశినః శంకరస్య రహసి ప్రపన్నయా ।
శిక్షితం యువతి-నైపుణం తయా యత్ తద్ ఏవ గురు-దక్షిణీకృతమ్ ॥

అన్వ : నిధువనోపదేశినః శంకరస్య శిష్యతాం ప్రపన్నయా తయా రహసి యత్ యువతి-నైపుణం శిక్షితం తద్ ఏవ గురుదక్షిణీకృతమ్.

**ప్ర :** నిధువన+ఉపదేశినః = మైథునవిషయాల నుపదేశించిన, శంకరస్య = శంకరునకు, శిష్యతామ్ = శిష్యత్వాన్ని, ప్రపన్నయా = పొందినట్టి, తయా = ఆ పార్వతిచే, రహసి = ఏకాంతంలో, యత్ = ఏ, యువతి-నైపుణమ్ = యువతికి తగిన నేర్పు, శిక్షితమ్ = నేర్పబడినదో, తద్ ఏవ = అదియే, గురుదక్షిణీకృతమ్ = గురుదక్షిణగా చేయబడినది.

**తా :** శంకరుడు పార్వతికి నిధువనశాస్త్రాన్ని నేర్పాడు. పార్వతి అభ్యసించింది. తాను అభ్యసించిన ఆ యువతి నైపుణ్యాన్నే ఆమె ఏకాంతంలో పరమేశ్వరునకు గురుదక్షిణగా సమర్పించింది.

**విభక్తులు - క్రియలు :** 1. శిష్యతామ్ : **శిష్యతాం** - శిష్యతే - శిష్యతాః; శిష్యతా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 2. నిధువనోపదేశినః : ... **దేశినః** - దేశినోః - దేశినామ్; నిధువనోపదేశిన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 3. శంకరస్య: **శంకరస్య** - శంకరయోః - శంకరాణామ్; శంకరశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 4. రహసి : **రహసి** - రహసోః - రహస్సు; రహశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 5. ప్రపన్నయా : **ప్రపన్నయా** - ప్రపన్నాభ్యాం - ప్రపన్నాభిః - ప్రపన్నాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 6. శిక్షితమ్ : **శిక్షితం** - శిక్షితే - శిక్షితాని; శిక్షితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. యువతినైపుణమ్ : **నైపుణం** - నైపుణే - నైపుణాని; నైపుణ శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 8. తయా : **తయా** - తాభ్యాం - తాభిః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 9. యత్ : **యత్** - యే - యాని; యచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 10. తత్ : **తత్** - తే - తాని; తచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 11. ఏవ - అవ్యయమ్; 12. గురుదక్షిణీకృతమ్ : **కృతం** - కృతే - కృతాని; కృతశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. తత్+ఏవ = తదేవ = జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. నిధువనమ్ ఉపదేష్టుం శీలమస్య ఇతి, తస్య, నిధువనోపదేశినః; 2. యువతీనాం నైపుణమః, యువతినైపుణమ్; 3. గురోః దక్షిణం గురుదక్షిణమ్, అగురు-దక్షిణా గురుదక్షిణం కృతమితి గురుదక్షిణీకృతమ్.

**పదవ్యుత్పత్తి కావ్యనిఘంటు ప్రమాణాలు :**

"**వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతమ్**" అని అమరకోశం. గ్రామ్యధర్మ మన్నది కూడా మైథున పర్యాయపదంగా ఉండటం గమనింపదగిన విశేషం.

**మాళవిక :** మాళవికాగ్నిమిత్రంలో కూడా కాళిదాసు మాళవికా నాట్యాభ్యాసవిషయంలో మాళవికా ప్రావీణ్యాన్ని ప్రకటిస్తాడు. గురువు బోధించిన దానిని ఆమె ప్రదర్శించటం ప్రత్యుపదేశంలాగా ఉందిట.

**శ్లో॥ యద్యత్ప్రయోగవిషయే భావికముపదిశ్యతే మయా తస్యై ।**
**తత్తద్విశేషకరణాత్ ప్రత్యుపదిశతీవ మే బాలా ॥** - మాళవికాగ్నిమిత్రమ్ -1/5✻

**శ్లో॥ దష్టముక్తమధరోష్ఠమమ్బికా వేదనావిధుత(పాణి)హస్తపల్లవా ।**
**శీతలేన నిరవాపయత్ క్షణం మౌలిచన్ద్రశకలేన శూలినః ॥** **18**

**అవ :** శివుని శిరశ్చన్ద్రకళ పార్వతి తాపాన్ని పోగొట్టటం.

**ప.వి. :** దష్ట-ముక్తమ్ అధర+ఓష్ఠమ్ అమ్బికా వేదనా-విధుత-హస్త-పల్లవా ।
శీతలేన నిరవాపయత్ క్షణం మౌళి-చంద్ర-శకలేన శూలినః ॥

**అన్వ :** అంబికా దష్టముక్తమ్ అధరోష్ఠం శీతలేన శూలినః మౌళిచంద్రశకలేన వేదనావిధుత హస్తపల్లవా (సతీ) క్షణం నిరవాపయత్.

**ప్ర :** అంబికా = పార్వతి, దష్ట-ముక్తమ్ = కొరకబడి విడువబడిన, అధర+ఓష్ఠమ్ = క్రింది పెదవిని, శీతలేన = చల్లనైన, శూలినః = శివునియొక్క, మౌళి... శకలేన : మౌళి = తలపైనున్న, చంద్ర-శకలేన = చంద్రుని ముక్కతో/ నెలవంకతో, వేదనా... పల్లవా : వేదనా = బాధచే, విధుత = విదల్పబడిన, హస్త-పల్లవా = చేతులు అనే చిగురుల గలదై, క్షణమ్ = కొద్దిసేపటిలో, నిరవాపయత్ = చల్లబరచుకొన్నది.

**తా :** పరమేశ్వరుడు పార్వతి అధరాన్ని చుంబించి వదిలాడు. ఆమె ఆ బాధను క్షణకాలంలో పరమేశ్వరుని తలపై నున్న చల్లని చంద్రశకలంతో పోగొట్టుకొన్నది.

**విభక్తులు - క్రియలు :** 1. దష్టముక్తమ్ : **ముక్తం** - ముక్తౌ - ముక్తాన్; దష్టముక్తశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 2. అధరోష్ఠమ్ : **అధరోష్ఠమ్** - అధరోష్ఠమౌ - అధరోష్ఠాన్; అధరోష్ఠశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. అమ్బికా : **అమ్బికా** - అమ్బికే - అమ్బికాః; అమ్బికాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. వేదనావిధుతహస్తపల్లవా : ... **పల్లవా** - పల్లవే - పల్లవాః; పల్లవాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 5. శీతలేన : **శీతలేన** - శీతలాభ్యాం - శీతలైః; అకారాన్తః

నపుంసకలింగః తృతీయైకవచనమ్; 6. నిరవాపయత్ : **నిరవాపయత్** – నిరవాపయతాం – నిరవాపయన్; ని పూర్వకాత్ వా గతావితి ధాతోః ప్రేరణార్థే ణిచి లఙ్ ప్రథమపురుషైకవచనమ్; 7. క్షణమ్ – అవ్యయమ్; 8. మౌళిచన్ద్రశకలేన : **శకలేన** – శకలాభ్యాం – శకలైః; శకలశబ్దః అకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 9. శూలినః : **శూలినః** – శూలినోః – శూలినామ్; శూలిన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్.

**సమాసాలు :** 1. దష్టశ్చ అసౌ ముక్తః, తమ్ = దష్టముక్తమ్; 2. అధరశ్చ అసౌ ఓష్ఠః, తమ్ – అధరోష్ఠమ్; 3. పల్లవావివ హస్తౌ – హస్తపల్లవా, వేదనయా విధుతౌ హస్తపల్లవౌ యయా సా – వేదనావిధుతహస్తపల్లవా; 4. మౌళౌ విద్యమానం చంద్రస్య శకలం, తేన, మౌళిచన్ద్రశకలేన.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**అధరోష్ఠమ్ : "ఉత్తరోష్ఠే దశనవ్యాపారస్య కామశాస్త్రే నిషిద్ధత్వాత్ అధరపదోపాదానమ్"** వివరణవ్యాఖ్య.

అందువలననే అమరుకుని ఒక శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ అప్పయ్యదీక్షితులు చేసిన వ్యాఖ్యను జగన్నాథుడు ఖండించాడు **రసగంగాధరం**లో – శ్లోకం –

**శ్లో॥ నిశ్శేషచ్యుతచన్దనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరః**
**నేత్రే దూరమనంజనే పులకితా తన్వీ తవేయం తనుః ।**
**మిథ్యావాదిని! దూతి! బాంధవజనస్యాజ్ఞాతపీడాగమే**
**వాపీం స్నాతుమితో గతాసి న పునస్తస్యాధమస్యాన్తికమ్ ॥**

**దష్టముక్తమ్ :** యన్ముఖగ్రహణమక్షతాధరమ్ (శ్లో–9) శ్లోకంలోని భావానికి ప్రకృత శ్లోక ప్రతిపాదనం విపర్యయం. అక్కడ అక్షతాధరత్వవర్ణనం, ఇక్కడ దష్టముక్తాధరత్వ ప్రతిపాదనం.

అందుకే ఇక్కడ పార్వతిలో కుట్టమిత వర్ణనం కనిపిస్తుంది. "**సానందాన్తః కుట్టమితం కుప్యేత్కేశాధరగ్రహే**" (దశరూపకమ్ – 2/40). కేశగ్రహణమో, అధరగ్రహణమో జరిగినపుడు లోన ఆనందిస్తూ కూడా పైకి కోప ప్రకటనం కుట్టమితం. అదే వేదనావిధుత హస్తపల్లవాత్వం.

శ్లో॥ నాందీపదాని రతినాటకవిభ్రమాణా–మాజ్ఞాక్షరాణి పరమాణ్యథవా స్మరస్య ।
దష్టేఽధరే ప్రణయినా విధుతాగ్రపాణేః–సీత్కారశుష్కరుదితాని జయన్తి నార్యాః॥ *

అవ : ప్రియానురాగవ్యఞ్జకచేష్టామాహ.

**శ్లో॥ చుమ్బనాదలకచూర్ణరూషితం శఙ్కరోఽపి నయనం లలాటజమ్ ।**
**ఉచ్ఛ్వసత్కమలగన్ధయే దదౌ పార్వతీవదనగన్ధవాహినే ॥ 19**

**అవ :** పార్వతీపరమేశ్వరుల పరస్పరసహకారం.

**ప.వి.:** చుమ్బనాద్ అలక-చూర్ణ-రూషితం శంకరః అపి నయనం లలాటజమ్ ।
ఉచ్ఛ్వసత్-కమల-గన్ధయే దదౌ పార్వతీ-వదన-గన్ధ-వాహినే ॥

**అన్వ :** శంకరః అపి చుమ్బనాత్ తిలకచూర్ణరూషితం లలాటజం నయనమ్ ఉచ్ఛ్వస-త్కమలగన్ధయే పార్వతీవదనగంధవాహినే ।

ప్ర : శంకరః+అపి = శివుడు కూడా, చుమ్బనాత్ = ముద్దిడుటవలన, అలక... రూషితమ్ : అలక = ముంగురుల నున్న, చూర్ణ = (గంధపు) పొడిచే, రూషితమ్ = కప్పబడినదైన, లలాటజమ్ = నుదుటబుట్టిన, నయనమ్ = కంటిని, ఉచ్ఛ్వ... గన్ధయే : ఉచ్ఛ్వసత్ = వికసిస్తున్న, కమల = తామరయొక్క, గన్ధయే = పరిమళంవంటి పరిమళం గల, పార్వతీ... వాహినే : పార్వతీ = పార్వతియొక్క, వదన = ముఖమునందున్న, గన్ధవాహినే = వాయువునకు, దదౌ = ఇచ్చెను.

**తా :** పరమేశ్వరుడు కూడా పార్వతివలె ఆమెను ముద్దాడుటలో ఆమె ముంగురులనంటి యున్న గంధపుపొడిచే తన నుందుటికన్ను కప్పబడగా ఆ కంటిని వికసించిన తామరల సౌరభంవంటి సౌరభం గల ఆమె ముఖంనుండి వెలువడుతున్న మారుతంతో చల్లబరచుకొన్నాడు.

**విభక్తులు - క్రియలు :** 1. చుమ్బనాత్ : **చుమ్బనాత్** - చుమ్బనాభ్యాం - చుమ్బనేభ్యః; చుమ్బనశబ్దః అకారాన్తః నపుంసకలింగః పంచమ్యేకవచనమ్; 2. అలకచూర్ణరూషితమ్ : **రూషితం** - రూషితే - రూషితాని; అకారాన్తః నపుంసకలింగః అలకచూర్ణరూషితశబ్దః ద్వితీయైకవచనమ్; 3. శంకరః : **శంకరః** - శంకరౌ - శంకరాః; శంకరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. అపి - అవ్యయమ్; 5. నయనమ్ : **నయనం** - నయనే - నయనాని; అకారాన్తః నపుంసకలింగః నయనశబ్దః ద్వితీయైకవచనమ్; 6. లలాటజమ్ : **లలాటజం** - లలాటజే - లలాటజాని; లలాటజ శబ్దః అకారాన్తః నపుంసకలింగః లలాటజశబ్దః ద్వితీయైకవచనమ్; 7. ఉచ్ఛ్వసత్కమలగన్ధయే : **గన్ధయే** - గన్ధిభ్యాం - గన్ధిభ్యః; ఉచ్ఛ్వసత్కమలగన్ధిశబ్దః ఇకారాన్తః పుంలింగః. చతుర్థైకవచనమ్; 8. పార్వతీ... వాహినే : **వాహినే** - వాహిభ్యాం - వాహిభ్యః; ...వాహిన్ శబ్దః నకారాన్తః పుంలింగః చతుర్థైకవచనమ్.

**సంధులు :** 1. చుమ్బనాత్+అలక = చుమ్బనాదలక = జశ్త్వసంధి; 2. శంకరః+అపి = శంకరోఽపి – విసర్గసంధి

**సమాసాలు :** 1. అలకే (విద్యమానం) చూర్ణం, తేన రూషితమ్ = అలకచూర్ణరూషితమ్; 2. లలాటే జాయత ఇతి = లలాటజమ్; 3. ఉచ్ఛ్వసతః కమలస్య గన్ధ ఇవ గన్ధః యస్య, తస్మై = ఉచ్ఛ్వసత్కమలగన్ధయే; 4. పార్వత్యాః వదనం, తస్మిన్ విద్యమానః గన్ధవాహీ, తస్మై పార్వతీవదనగన్ధవాహినే – గన్ధం వోఢుం శీలమ్ అస్య ఇతి గన్ధవాహీ.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటు ప్రమాణాలు :**

**కమలగన్ధయే :** కమలస్య ఇవ గన్ధః అస్య అని విగ్రహవాక్యం. కాబట్టి '**ఉపమానాచ్చ**' అనే సూత్రంతో సమాసాన్తవిధిగా ఉపమేయమైన గన్ధపదం చివర ఇకారం వస్తుంది. ఇది గన్ధశబ్దానికి మాత్రమే పరిమితమైన సమాసాన్తవిధాయకసూత్రం. పద్మపదం లాక్షణికం కాబట్టి పద్మస్య గన్ధ ఇవ గన్ధః యస్య అని విగ్రహవాక్యం.

**విశేషణౌచిత్యం :** నయనానికి 'లలాటజమ్' అన్నది విశేషణం. అలకరూషితత్వం ఏ కంటికైనా సంభవించవచ్చు. కానీ చుమ్బనహేతుకమైన అలకరూషితత్వం త్రినేత్రుని విషయంలో ఫాలనేత్రానికే విశిష్య సంభవం.

**శ్లో॥ విశేషణైః సముచితైః విశేషోఽర్థః ప్రకాశతే ।**
**గుణాధికైర్గుణోదారః సుహృద్భిరివ సజ్జనః ॥** – ఔచిత్యవిచారచర్చ – 23

"అధరచుమ్బనసమయే లలాటజస్యైవ లోచనస్య అలకసన్నికర్షసంభవాత్ లలాటజమితి విశేషణమ్ – వివరణవ్యాఖ్య.

అనురణనధ్వనిచే మరికొన్ని విశేషాలు ఈ లలాటజనేత్రపదప్రయోగం వల్ల స్ఫురిస్తాయి.

"రజో నిస్సరణార్థం తదాభిముఖ్యేన స్థాపితవానిత్యర్థః । ఏతేన దేవ్యాః ప్రియవశంవదత్వమ్ ఉక్తమ్। అత్ర హరచక్షుషి అలకచూర్ణకథనాత్ దేవ్యా ఉపరి భావః సూచితః" –

**అలంకారం :** 18వ శ్లోకంలోని ఉత్తరార్ధం, 19వ శ్లోకంలోని పూర్వార్ధం కలిసి పార్వతీపరమేశ్వరుల పరస్పరసహకారాన్ని ప్రకటిస్తున్నాయి. ఇది అన్యోన్యాలంకారం. "**అన్యోన్యం యత్ర స్యాదుపకారః పరస్పరమ్**" అని లక్షణం. ప్రకాశికావ్యాఖ్య ఈ విషయాన్ని సూచించింది." న కేవలం శూలినః మౌలిచంద్రశకలేన అధరం నిర్వాపితవతీ, సోఽపి తన్ముఖమరుతా లలాటాక్షీత్యర్థః" –

*

**శ్లో॥ ఏవమిన్ద్రియసుఖస్య వర్త్మనస్సేవనాదనుగృహీతమన్మథః ।**
**శైలరాజభవనే సహోమయా మాసమాత్రమవసద్వృషధ్వజః ॥ 20**

**అవ :** భౌతికసుఖానుభవకాలాన్ని - ఒక నెలను - శివుడు హిమవంతుని కడనుండుట.

**ప.వి. :** ఏవమ్ ఇన్ద్రియ-సుఖస్య వర్త్మనః - సేవనాత్ అనుగృహీత-మన్మథః ।
శైల-రాజ-భవనే సహ+ఉమయా - మాసమాత్రమ్ అవసత్ వృషధ్వజః ॥

**అన్వ :** ఇంద్రియసుఖస్య వర్త్మనః ఏవం సేవనాత్ అనుగృహీత మన్మథః వృషధ్వజః శైలరాజభవనే ఉమయా సహ మాసమాత్రమ్ అవసత్.

**ప్ర :** ఇన్ద్రియసుఖస్య : ఇన్ద్రియ = (జ్ఞాన, కర్మ) ఇంద్రియాల ద్వారా పొందబడే, సుఖస్య = సుఖంయొక్క, వర్త్మనః = మార్గం యొక్క, సేవనాత్ = కొలువు (ఆశ్రయం) చేత, అనుగృహీత-మన్మథః : అనుగృహీత = అనుగ్రహింపబడిన, మన్మథః = మదనుడు గల, వృషధ్వజః = పరమేశ్వరుడు, శైలరాజభవనే : శైల = కొండలకు, రాజ = రాజైన హిమవంతునియొక్క, భవనే = ప్రాసాదమందు, ఉమయా సహ = పార్వతితో పాటు, మాసమాత్రమ్ = నెలరోజులే, అవసత్ = నివసించాడు.

**తా :** పరమేశ్వరుడు ఇన్ద్రియసుఖమార్గంలో ఆ రీతిగా నడుస్తూ మన్మథుని అనుగ్రహించాడు. నెలరోజులు మాత్రమే హిమవంతుని ప్రాసాదంలో పార్వతితో కలిసి గడిపాడు.

**విభక్తులు - క్రియలు :** 1. ఏవమ్ - అవ్యయమ్; 2. ఇంద్రియసుఖస్య : **సుఖస్య** - సుఖయోః - సుఖానామ్; సుఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః. షష్ఠ్యేకవచనమ్; 3. వర్త్మనః : **వర్త్మనః** - వర్త్మనోః - వర్త్మనామ్; వర్త్మన్ శబ్దః నకారాన్తః నపుంసకలింగః షష్ఠ్యేకవచనమ్; 4. సేవనాత్ : **సేవనాత్** - సేవనాభ్యాం - సేవనేభ్యః; అకారాన్తః నపుంసకలింగః పంచమ్యేకవచనమ్; 5. అనుగృహీతమన్మథః : **మన్మథః** - మన్మథౌ - మన్మథాః; అనుగృహీతమన్మథశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 6. శైలరాజభవనే : **భవనే** - భవనయోః - భవనేషు; అకారాన్తః నపుంసకలింగః శైలరాజభవనశబ్దః. సప్తమ్యేకవచనమ్; 7. సహ - అవ్యయమ్; 8. ఉమయా : **ఉమయా** - ఉమాభ్యామ్ - ఉమాభిః; ఉమాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 9. మాసమాత్రమ్ - అవ్యయమ్; 10. అవసత్ : **అవసత్** - అవసతామ్ - అవసన్; వస నివాసే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్; 11. వృషధ్వజః : **వృషధ్వజః** - వృషధ్వజౌ - వృషధ్వజాః; వృషధ్వజ శబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. సేవనాత్+అను = సేవనాదను = జశ్త్వసంధి; 2. సహ+ఉమయా = సహోమయా = గుణసంధి; 3. అవసత్+వృష = అవసద్వృష = జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. ఇన్ద్రియాణామ్ ఇన్ద్రియేభ్యో వా సుఖమ్, తస్య, ఇన్ద్రియసుఖస్య; 2. అనుగృహీతః మన్మథః యేన సః – అనుగృహీతమన్మథః; 3. శైలానాం రాజా – శైలరాజః, తస్య భవనమ్, తస్మిన్, శైలరాజభవనే.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఇన్ద్రియమ్ :** "ఇన్ద్రస్య (ఆత్మనః) లింగ (మనుమాపకమ్), ఇన్ద్రేణ (ఈశ్వరేణ) సృష్టమ్, ఇన్ద్రేణ (ఆత్మనా చక్షుర్మమ శ్రోత్రమిత్యాది క్రమేణ) జ్ఞాతమ్, ఇన్ద్రేణ జుష్టమ్ వా ఇత్యాద్యర్థేషు ఇన్ద్రశబ్దాత్ నిపాతనాత్ ఘచ్ । జ్ఞానకర్మ సాధనమ్" శబ్దకల్పద్రుమం – కర్మేంద్రియాలు అయిదు; జ్ఞానేంద్రియాలు అయిదు; మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం – ఈ నాలుగూ అంతరింద్రియాలు. ఈ ఇంద్రియాలు పదునాలుగింటికీ అధిష్ఠానదేవతలు పదునలుగురు. వేదాంతుల పరిగణనమిది.

అహంకారానికి శంకరుడు అధిదేవత. శంకరుని అహంకారమైనా ఇన్ద్రియసుఖం చేతనే తృప్తి చెందవలసి వుంటుంది. ప్రస్తుతం పరమేశ్వరుడు ఆ మార్గంలో చరిస్తున్నాడనీ కవివచనం.

'సుఖాద్యుపలబ్ధిసాధనమింద్రియం మనః' అని తార్కికసమ్మతమైన మనోలక్షణం. మనోభవులలో ఒకరిని (మదనుని) దహించిన శివుడు మరొకరిని (చంద్రుని) నెత్తిన పెట్టుకున్నాడు. ఆ మనస్సు సాధనంగా గల సుఖాన్ని ప్రస్తుతం అనుభవిస్తున్నాడు. కాదన్నా, ఔనన్నా మనస్సంబంధం దేహికి అనివార్యమని ప్రబంధధ్వని ఇక్కడ వివరణ వ్యాఖ్య కూడా "యథా మన్మథస్య అయమస్మదనుకూల ఏవేదానీం సంజాతః ఇతి మతిరుత్పద్యేత తథా తదనుకూలోఽభూదిత్యర్థః" అని వ్యాఖ్యానించింది.

**మాసమాత్రమ్ :** '**ఏవం భుంజానో నవోఢాం మాసేన వశీకుర్యా**'దితి గోనర్దీయవచనా–న్మాసపదప్రయోగః'. నెలలో వధువును వరుడు అంకెకు తెచ్చుకోవాలని గోనర్దీయవచనం (కామశాస్త్రం). కాబట్టి నెలరోజులు మాత్రమే పరమేశ్వరుడు అక్కడ ఉన్నాడని కాళిదాస వచనం.

*

## హిమాలయాజ్ఞామాదాయ పర్వతే విహారః

**శ్లో॥ సోఽనుమాన్య హిమవన్తమాత్మభూరాత్మజావిరహదుఃఖపీడితమ్ ।**
**తత్ర తత్ర విజహార సమ్పతన్నప్రమేయగతినా కకుద్మతా ॥ 21**

**అవ :** పరమేశ్వరుడు పార్వతితో అత్తవారింటిని వీడి వెళ్ళటం.

**ప.వి. :** సః అనుమాన్య హిమవన్తమ్ ఆత్మభూః ఆత్మజా-విరహ-దుఃఖ-పీడితమ్ ।
తత్ర తత్ర విజహార సమ్పతన్ అప్రమేయ-గతినా కకుద్మతా ॥

**అన్వ :**సః ఆత్మభూః ఆత్మజా విరహ దుఃఖపీడితం హిమవన్తమ్ అనుమాన్య అప్రమేయ-గతినా కకుద్మతా సమ్పతన్ తత్ర తత్ర విజహార.

**ప్ర :** సః = ఆ దశలోనున్న, ఆత్మభూః = స్వయంభువు అయిన శివుడు, ఆత్మ... పీడితమ్ : ఆత్మ-జా = కూతురుయొక్క, విరహ = వియోగం చేత, దుఃఖ = వేదనచే, పీడితమ్ = పీడింపబడుతున్న, హిమవన్తమ్ = హిమాలయుని, అనుమాన్య = అంగీకరింపజేసి, అప్రమేయ - గతినా : అప్రమేయ = కొలతకలగని, గతినా = గమనంగల, కకుద్మతా = ఎద్దుతో, సంపతన్ = పయనిస్తూ, తత్ర తత్ర = ఆయా తావులలో, విజహార = విహరించాడు.

**తా :** కన్నకూతురుతో సంభవించబోయే విరహం కారణంగా హిమవంతుడు దుఃఖిస్తున్నాడు. అటువంటి హిమవంతుని అంగీకరింపజేసి ఆత్మభవుడైన శివుడు గణింపలేని గమనం గల తన ఎద్దునెక్కి ఆ యా తావులలో విహరించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 2. అనుమాన్య - అనుపూర్వకాత్ మాన్ పూజాయాం ధాతోః ల్యప్ ప్రత్యయః; 3. హిమవన్తమ్ : **హిమవన్తం** - హిమవన్తౌ - హిమవతః; హిమవచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 4. ఆత్మభూః : **ఆత్మభూః** - ఆత్మభువౌ - ఆత్మభువః; ఊకారాన్తః పుంలింగః ఆత్మభూశబ్దః ప్రథమైకవచనమ్; 5. ఆత్మజావిరహదుఃఖపీడితమ్ : **పీడితం** - పీడితౌ - పీడితాన్; పీడితశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 6. తత్ర; 7. తత్ర - అవ్యయమ్; 8.విజహార : **విజహార** - విజహ్రతుః - విజహ్రుః; విపూర్వకాత్ హృ ఞ్ హరణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 9. సమ్పతన్ : **సమ్పతన్** - సమ్పతన్తౌ - సమ్పతన్తః; సమ్పతత్ శబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 10. అప్రమేయ గతినా : **గతినా** - గతిభ్యాం - గతిభిః; అప్రమేయగతిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 11. కకుద్మతా : **కకుద్మతా** - కకుద్మద్భ్యాం - కకుద్మద్భిః; కకుద్మత్ శబ్దః తకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్.

**సంధులు :** 1. సః+అనుమాన్య = సోఽనుమాన్య = విసర్గసంధి; 2. ఆత్మభూః+ఆత్మజా = ఆత్మభూరాత్మజా = విసర్గసంధి

**సమాసాలు :** 1. హిమవాన్ = హిమః అస్య అస్తి ఇతి హిమవాన్. ఇది మతుప్ ప్రత్యయాన్తమే (తద్ధితాన్తం) కాని సమాసం కాదు; 2. ఆత్మని భవతి - ఆత్మభూః - ఇది కృదన్తమై ప్రాతిపదిక మవుతుంది. దానిపై సుబాదులు మరల ఇదీ సమాసం కాదు; 3. ఆత్మజయా విరహః, తేన దుఃఖం, తేన పీడితః, తమ్, ఆత్మజావిరహదుఃఖ-పీడితమ్ - ఆత్మనః జాతా = ఆత్మజా; 4. అప్రమేయా గతిః యస్య సః, తేన = అప్రమేయగతినా

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**కకుద్మాన్ - హిమవాన్ :** కకుద్ అస్య అస్తి అనే అర్థంలో "**తదస్యాస్త్యస్మిన్నితి మతుప్**" మతుప్ ప్రత్యయం. "**మాదుపధాయాశ్చ మతోర్వోఽ యవాదిభ్యః**" అనే సూత్రంతో యవాది గణంలో చేరిన వాటికే మకారానికి వకారం. ఆగణంలో లేనిది కాబట్టి కకుద్మాన్ దగ్గర 'మ' కారానికి వకారం లేదు. "అత్ర క్వచిదపవాద విషయేఽ ప్యుత్సర్గః అభినివిశతే ఇతి న్యాయాత్ వతు ప్రాప్తౌ మతు ప్రత్యయః" ఇతి ముగ్ధబోధమతమ్" అని శబ్దకల్పద్రుమ వచనం. సహజంగా వ్యాకరణంలో ఉత్సర్గవిధిని అపవాదవిధి బాధిస్తుంది. ఇక్కడ ఉత్సర్గవిధియే అపవాదప్రాప్తిని కాదని తానే ప్రవర్తించిందని ముగ్ధబోధవ్యాకరణకర్తృమతం. ముగ్ధబోధవ్యాకరణకర్త చోపదేవుడు హిమవత్పదం యవాదిభిన్నం కాబట్టి మకారానికి వకారం.

**ఆత్మభూః -** 'ఆత్మన్+భూ+క్విప్ బ్రహ్మ । కామదేవః ఇత్యమరః । విష్ణుః । శివః ఇతి శబ్దరత్నావళీ' - శబ్దకల్పద్రుమః.

**ఆత్మజావిరహదుఃఖపీడ :** ఇక్కడ నామమాత్రంగానే ఆత్మజావిరహదుఃఖాన్ని ప్రస్తావించాడు. అభిజ్ఞానశాకున్తలంలో పెంపుడుకూతురుయొక్క విరహంతో కలిగే దుఃఖాన్ని కణ్వునిలో ఆర్ద్రంగా వర్ణించాడు కాళిదాసు-

**శ్లో॥ యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా**
**కణ్ఠస్తమ్భితబాష్పవృత్తికలుషం చిన్తాజడం దర్శనమ్ ।**
**వైక్లవ్యం మమ తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః**
**పీడ్యన్తే గృహిణః కథం ను తనయావిశ్లేషదుఃఖైర్నవైః ॥**

ఇక్కడ కథాగమనాన్ని బట్టి ఇక్కడ విస్తృతపరచకపోవటం సముచితం. అక్కడ శాకున్తలంలో నాటకకథాక్రమాన్ని బట్టి ఆ భావాన్ని రసీకరించటం సముచితం. *

**శ్లో॥ మేరుమేత్య మరుదాశువాహనః పార్వతీస్తనపురస్కృతః(తాన్) కృతీ ।**
**హేమపల్లవవిభఙ్గసంస్తరామన్వభూత్సురతతత్పరః క్షపామ్ ॥ 22**

**అవ :** మేరుగిరిపై పార్వతీపరమేశ్వరవిహారం.

**ప.వి.:** మేరుమ్ ఏత్య మరుద్-ఆశు-వాహనః పార్వతీ-స్తన-పురస్కృతః కృతీ ।
హేమ-పల్లవ-విభంగ-సంస్తరామ్ అన్వభూత్ సురత-తత్పరః క్షపామ్ ॥

**అన్వ :** (సః) మరుద్+ఆశువాహనః పార్వతీ-స్తన-పురస్కృతః కృతీ సురత-తత్పరః (సః) మేరుమ్ ఏత్య హేమ-పల్లవ-విభంగ-సంస్తరామ్ క్షపామ్ అన్వభూత్.

**ప్ర :** మరుద్... వాహనః : మరుత్ = గాలివలె, ఆశు = వేగంగా వెళ్ళగల, వాహనః = వాహనం (వృషభం) గలవాడూ, పార్వతీ... పురస్కృతః : పార్వతీ = పార్వతియొక్క, స్తన = రొమ్ములచే/కు, పురస్కృతః = గౌరవింపబడినవాడు అభిముఖంగా ఉన్నవాడూ, కృతీ = ధన్యుడై, సురత-తత్పరః = సంభోగాసక్తుడూ అయిన, సః = ఆ శివుడు, హేమ... సంస్తరామ్ : హేమ = స్వర్ణమయమైన (క్రొత్తవైన), పల్లవ = చిగురుటాకుల యొక్క, విభంగ = తునకలు గల, సంస్తరామ్ = శయ్యలుగల, క్షపామ్ = రాత్రిని, అను+అభూత్ = అనుభవించెను.

**తా :** గాలివలె వేగంగా నడవగల వాహనం (వృషభం)గల ఆ శివుడు పార్వతిని ఆ వాహనంపై తన కభిముఖంగా ఆసీనను చేసి ధన్యుడై క్రొత్త చివురుటాకులు పరిచిన శయ్యపై ఆ రాత్రిని అనుభవించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. మేరుమ్ : మేరుం - మేరూ - మేరూన్ - మేరుశబ్దః ; 2. ఏత్య - అవ్యయం. ఆఙ్ పూర్వకాత్ ఇణ్ గతౌ ధాతోః ల్యప్ ప్రత్యయః; 3. మరుదాశు వాహనః : **వాహనః** - వాహనౌ - వాహనాః; మరుదాశవాహనశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 4. పార్వతీస్తనపురస్కృతః : **పురస్కృతః** - పురస్కృతౌ - పురస్కృతాః; ...పురస్కృత శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 5. హేమ...సంస్తరామ్ : **సంస్తరాం** - సంస్తరే - సంస్తరాః; సంస్తరాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 6. అన్వభూత్ : **అన్వభూత్** - అన్వభూతామ్ - అన్వభూవమ్; అనుపూర్వకాత్ భూ సత్తాయామితి ధాతోః లుఙి ప్రథమపురుషైకవచనమ్; 7. సురతతత్పరః : **తత్పరః** - తత్పరౌ - తత్పరాః; తత్పర శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 8. క్షపామ్ : **క్షపామ్** - క్షపే - క్షపాః; క్షపాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్.

**సమాసాలు :** 1. మరుత్ ఇవ ఆశు (గతి) వాహనం యస్య సః, మరుదాశువాహనః; 2. పార్వత్యాః స్తనౌ, తాభ్యాం పురస్కృతః = పార్వతీస్తనపురస్కృతః; 3. హేమమయాః పల్లవాః, తేషాం విభంగాః, తైః సంస్తరా, తామ్ = హేమపల్లవవిభంగ సంస్తరామ్; 4. తస్మిన్ పరః తత్పరః, సురతే తత్పరః = సురతతత్పరః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**మేరుః :** మినోతి ఉచ్చత్వాత్ జ్యోతీంషి ఇతి మేరుః । డుమిఞ్ ప్రక్షేపణే । 'మిపీభ్యాం రుః" (ఉ 4/101) 'మానోరురిచ్చ' ఇతి మకుటః । తన్న । ఉజ్జ్వలదత్తాదావస్య సూత్రస్య అనుపలబ్ధేః" (అమరకోశః – వ్యాఖ్యా సుధా)

**అలంకారం :** క్షపయతి (వారయతి చేష్టామ్ ఇన్ద్రియాణామ్) ఇతి క్షపా–తామ్ = క్షపామ్.

క్షప ఇన్ద్రియచేష్టలను నివారిస్తుంది. – ఆపుదల చేస్తుంది – కాబట్టి క్షప. మహాభారత ప్రయోగం–

శ్లో॥ రాజానన్తు కురుశ్రేష్ఠం తే హంసమధురస్వరాః ।
ఆశ్వాసయన్తో విప్రాగ్ర్యాః **క్షపాం సర్వాం వ్యనోదయన్ ॥**

సురతతత్పరుడై క్షపను అనుభవించాడనటం విలక్షణం. సురతతత్పరత్వం ఇన్ద్రియ–చేష్టారాహిత్యమూ. పరస్పరవిరుద్ధాలుగా కనిపిస్తాయి. ఆనందైక ఘనమైన సర్వేంద్రియ–స్తంభము ఇక్కడ సంభావించాలి. ఆ సంభావనలో ఆ వైరుధ్యం కనిపించదు. పరికరాంకు–రాలంకారమిది.

**పార్వతీస్తనపురస్కృతః కృతీ :** ఈ కృతిత్వాన్ని సమర్థిస్తూ వల్లభదేవకృతమైన పంజికావ్యాఖ్య ఇలా అంటుంది–

నిజకాన్తాకుచకలశక్షేపణాద్యాధారశృంగారరసమనుభవతి । తదుక్తమ్–

**శ్లో॥ శుకైశ్చంచూత్కీర్ణం ఛవిఫలయుగం యౌవనతరో**
**రయః శంకుక్షుణ్ణం మదనకరిణః కుమ్భయుగలమ్ ।**
**సముద్రం సమ్భోగామృతకలశయుగ్మం సుకృతినః**
**స్తనద్వంద్వం తస్యాః నవనఖముఖాంగం విజయతే ॥** *

**శ్లో॥ పద్మనాభవలయాఙ్కితాశ్మసు ప్రాప్తవత్స్వమృతవిప్రుషో నవాః ।**
**మన్దరస్య కటకేషు చాభవత్స ప్రియావదనపద్మషట్పదః ॥ 23**

**అవ :** మందరగిరిపై పార్వతీపరమేశ్వరవిహారం.

**ప.వి.:** పద్మ–నాభ–వలయ+అఙ్కిత+అశ్మసు ప్రాప్తవత్సు అమృత–విప్రుషః నవాః ।
మన్దరస్య కటేషు చ అభవత్ సః ప్రియా–వదన–పద్మ–షట్పదః ॥

**అన్వ :** పద్మనాభ–వలయాఙ్కిత–అశ్మసు నవాః అమృతవిప్రుషః ప్రాప్తవత్సు మన్దరస్య కటకేషు సః ప్రియా–వదన–పద్మ–షట్పదః చ అభవత్ ।

**ప్ర :** పద్మనాభ... శ్వసు : పద్మనాభ = నారాయణునియొక్క, వలయ = కడియాల యొక్క, అంకిత = గుర్తులు గల, అశ్మసు = రాళ్ళుగలవీ, నవాః = క్రొత్తవైన, అమృత-విప్రుషః = అమృతపు చుక్కలు, ప్రాప్తవత్సు = పొందినవీ అయిన, మన్దరస్య = మందరపర్వతంయొక్క, కటకేషు = చరియలలో, సః = ఆ శివుడు, ప్రియా... షట్పదః : ప్రియా = ఇష్టురాలైన పార్వతియొక్క, వదన = ముఖమనెడి, పద్మ = తామరమీది, షట్పదః = తుమ్మెదగా, అభవత్ చ = అయ్యాడుకూడా.

**తా :** మందరగిరి చరియలలో శివుడు పార్వతీవదనపద్మమధుకర మయ్యాడు. ఆ మందరగిరి కటకాలలోని రాళ్ళపై నారాయణుని కడియాల ముద్రలు కనిపిస్తున్నాయి. అవి క్రొత్తవైన అమృతబిందువల తాకిడిని పొందినవి కూడా.

**విభక్తులు - క్రియలు :** 1. పద్మనాభ-వలయాంకిత+అశ్వసు : అశ్మని - అశ్మనోః - **అశ్మసు**; అశ్మన్ శబ్దః నకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 2. ప్రాప్తవత్సు : ప్రాప్తవతి - ప్రాప్తవతోః - **ప్రాప్తవత్సు**; ప్రాప్తవత్ శబ్దః తకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 3. అమృతవిప్రుషః : విప్రుట్ - విప్రుషౌ - **విప్రుషః**; షకారాన్తః స్త్రీలింగః విప్రుట్ శబ్దః. ప్రథమాబహువచనమ్; 4. నవాః : **నవా** - నవే - నవాః; నవాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమాబహువచనమ్; 5. మందరస్య : **మందరస్య** - మందరయోః - మందరాణామ్; మందరశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 6. కటకేషు : కటకే - కటకయోః - **కటకేషు**; కటకశబ్దః అకారాన్తః పుంలింగః. సప్తమీ బహువచనమ్; 7. చ - అవ్యయమ్; 8. అభవత్ : **అభవత్** - అభవతామ్ - అభవన్; భూ సత్తాయామ్ ఇతి ధాతోః లఙ్ ప్రథమపురుషైకవచనమ్; 9. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 10. ప్రియావదనపద్మషట్పదః : **షట్పదః** - షట్పదౌ - షట్పదాః; షట్పదశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. ప్రాప్తవత్సు+అమిత = ప్రాప్తవత్స్వమిత - యణాదేశసంధి; 2. విప్రుషః+నవాః = విప్రుషో నవాః - విసర్గసంధి; 3. చ+అభవత్ = చాభవత్ = సవర్ణదీర్ఘసంధి; 4. సః+ప్రియా = సప్రియా = విసర్గలోపసంధి.

**సమాసాలు :** 1. పద్మం నాభౌ యస్య సః, పద్మనాభః, తస్య వలయైః అంకితాః అశ్మానః యేషు, తేషు = పద్మనాభవలయాంకితాశ్మసు; 2. అమృతస్య విప్రుషః, తాన్, అమృత-విప్రుషః; 3. ప్రియాయాః వదనమ్ ఏవ పద్మం, తస్మిన్ షట్పదః, ప్రియావదనపద్మషట్పదః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**మన్దరః :** మన్ద్ ధాతోః బాహుళకాత్ అర ప్రత్యయః. 'కుశద్వీపస్థపర్వతవిశేషః. యథా మాత్స్యే -

**శ్లో॥ మన్దరః సైవ విజ్ఞేయః సర్వధాతుమయః శుభః ।**
**మన్ద ఇత్యేష యో ధాతుః అపామర్థే ప్రకాశకః ।**
**అపాం విదారణాచ్చైవ మన్దరః స నిగద్యతే ॥** – శబ్దకల్పద్రుమః.

మందరపర్వతంయొక్క ఉదాత్తతను పూర్వార్ధంలోని రెండు విశేషణాలు వివరిస్తు–న్నాయి, ఒక్కొక్క పాదంలో ఒక్కొక్కటి. అది పరమేశ్వరగతమైన రాగభావానికి ఉద్దీపక విభావాలు, అవీ తటస్థాలు.

"మన్దరకటకానామఖిలేన్ద్రియప్రీతికరత్వప్రతిపాదనముఖేన ఉద్దీపనత్వం విశేషణ–ద్వయేన ప్రదర్శ్యతే – పద్మనాభవలయాంకితాశ్మసు ... పురా కిల జలనిధిమథనే విషణ్ణేషు సురాసురవృందేషు నారాయణః స్వయమేవ కరాభ్యాం మన్దరాచలం గృహీత్వామమన్థేతి పురాణేషు దృశ్యతే. తదా తత్కరగతానాం హేమవలయానాం శిలాభిస్సహ సంఘర్షవశాత్ సంప్రాప్తహేమలేఖసకలశిలాతలేషు" – వివరణవ్యాఖ్య.

ఈ విశేషణం చక్షురింద్రియ ప్రీతికరం. ద్వితీయపాదగత విశేషణం ఇతరేన్ద్రియ ప్రీతికరం.

**ఉదాత్తాలంకారం : 'ఉదాత్తమృద్ధిశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణ'**మ్మని ఉదాత్తాలంకార లక్షణం. మన్దరపర్వతమహత్త్వం నిరూపణకై మహత్తరమైన శ్రీమన్నారాయణచరితం ఇక్కడ అంగభావాన్ని పొంది సహకరిస్తోంది. కాబట్టి అన్యోపలక్షణమైన ఋద్ధిచరితవర్ణన మిది. కాబట్టి ఉదాత్తాలంకారం.

వదనపద్మ మన్నచోట సమస్తవిషయరూపకాలంకారం. సః షట్పదః అన్నప్పుడు వ్యస్తమైన రూపకాలంకారం. *

**శ్లో॥ రావణధ్వనితభీతయా తయా కణ్ఠసక్తమృదుబాహుబన్ధనః ।**
**ఏకపిఙ్గళగిరౌ జగద్గురుర్నిర్వివేశ విశదాశ్శశిప్రభాః ॥** **24**

**అవ :** కైలాసగిరిపై జగద్గురు విహారం.

**ప.వి.:** రావణ–ధ్వనిత–భీతయా – తయా కణ్ఠ–సక్త–మృదు–బాహు–బన్ధనః ।
ఏక–పింగల–గిరౌ జగద్–గురుః నిర్వివేశ విశదాః శశిప్రభాః ॥

**అన్వ :** ఏకపింగలగిరౌ రావణ–ధ్వనిత–భీతయా తయా కణ్ఠసక్తమృదుబాహుబన్ధనః (సః) జగద్గురుః విశదాః శశిప్రభాః నిర్వివేశ.

**ప్ర :** ఏకపింగల–గిరౌ = కైలాసపర్వతంపై, రావణ... భీతయా : రావణ = దశకంఠుని యొక్క, ధ్వనిత = అరుపుచేత, భీతయా = బెదిరిన, తయా = ఆ పార్వతిచేత, కణ్ఠ...

బన్ధనః : కణ్ఠ = మెడకు, సక్త = తగుల్కొన్న, మృదు = సున్నితమైన, బాహు = చేతులతోడి, బన్ధనః = బిగింపు కలవాడై, సః = ఆ, జగద్-గురుః = విశ్వరూపుడైన శివుడు, విశదాః = స్వచ్ఛమైన, శశి-ప్రభాః = చంద్రకాంతులను (వెన్నెలలను), నిర్వివేశ = అనుభవించెను.

**తా :** (కైలాసగిరి నెత్తబోయి భంగపడిన) రావణుడు భీషణంగా అరిచాడు. దానితో బెదిరిన పార్వతి పరమేశ్వరుని కంఠాన్ని దృఢంగా కౌగిలించింది. ఆ స్థితిలో పరమేశ్వరుడు, నిర్మలమైన చంద్రికలను ఆస్వాదించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. రావణధ్వనితభీతయా : **భీతయా** - భీతాభ్యాం - భీతాభిః; భీతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 2. తయా : **తయా** - తాభ్యాం - తాభిః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః, తృతీయైకవచనమ్; 3. కణ్ఠసక్తమృదుబాహుబన్ధనః : **బన్ధనః** - బన్ధనౌ - బన్ధనాః; బన్ధన శబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 4. ఏకపింగలగిరౌ : **గిరౌ** - గిర్యోః - గిరిషు; గిరిశబ్దః అకారాన్తః పుంలింగః. సప్తమ్యేకవచనమ్; 5. జగద్గురుః : **గురుః** - గురూ - గురవః; జగద్గురు శబ్దః ఉకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 6. నిర్వివేశ : **నిర్వివేశ** - నిర్వివిశతుః - నిర్వివిశుః; నిర్ పూర్వకాత్ విశ ప్రవేశనే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 7. విశదాః : విశదః - విశదే - **విశదాః**; విశద శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమా-బహువచనమ్; 8. శశిప్రభాః : **ప్రభా** - ప్రభే - ప్రభాః - శశిప్రభా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమాబహువచనమ్.

**సంధులు :** 1. జగద్గురుః+నిర్వివేశ = జగద్గురుర్నిర్వివేశ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. రావణస్య ధ్వనితం, తేన భీతా, తయా, రావణధ్వనితభీతయా; 2. కణ్ఠే సక్తయోః మృద్వోః బాహ్వోః బన్ధనం యస్య సః, కణ్ఠసక్తమృదుబాహుబన్ధనః; 3. ఏకపింగలస్య గిరిః, తస్మిన్, ఏకపింగలగిరౌ; 4. జగతాం గురుః, జగద్గురుః; 5. శశినః ప్రభాః, శశిప్రభాః

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఏకపింగళ :** ఏకపింగళుడంటే కుబేరుడు.

**శ్లో॥ కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః ।**
**యక్షైకపింగళబిలః శ్రీదః పుణ్యజనేశ్వరః ॥** అని అమరకోశం. ఏకపింగళుడంటే ఒక కన్ను పింగళవర్ణంతో ఉన్నవాడు. దానికి కారణం పార్వతి శాపం. ఆ కథ కాశీఖండంలో కనిపిస్తుంది.

శ్లో॥ ప్రసార్య నయనే పూర్వ ముమామేవ వ్యలోకయత్ ।
శమ్భోః సమీపే కా యోషిదేషా సర్వాంగసుందరీ ॥ ... ...

అథ దేవ్యబ్రవీద్దేవం కిమసౌ దుష్టతాపసః ।
అసకృద్దక్షిణేనాక్ష్ణా పునర్మామేష పశ్యతి ॥ ... ...

ఇతి దేవీ గిరం శ్రుత్వా ప్రహస్య ప్రాహతాం ప్రభుః । ... ...

ప్రసాదం కురు దేవేశి! తపస్విన్యంగజే తవ ।

దేవ్యువాచ–

వత్స తే నిర్మలభక్తిర్భవే భవతు సర్వదా ।
**భవైకపింగో నేత్రేణ** వామేన స్ఫుటితేన చ ॥

**రావణధ్వనితభీతయా :** రావణుడు కైలాసగిరినే పైకెత్తి విసరాలని ప్రయత్నించి, విఫలుడై, శివునకు ప్రీతిపాత్రుడై వరాన్ని పొందాడు. ఆ సందర్భంలో రావణుడు చేసిన ఆక్రోశానికి భయపడిన పార్వతిని పరమేశ్వరుని కౌగిలించి ఆయనకు ఆనందాన్ని కలిగించింది. మాఘుడు ఆ సందర్భాన్ని వర్ణించిన శ్లోకం–

**శ్లో॥ సముత్క్షిపన్యః పృథివీభృతాం వరం వరప్రదానస్య చకార శూలినః ।**
**త్రసత్తుషారాద్రిసుతా ససంభ్రమ స్వయం గ్రహాశ్లేషసుఖేన నిష్క్రియమ్ ॥**

– శిశుపాలవధ – 1/50

**కంఠసక్తమృదుబాహుబన్ధనం :** "కామినీనాం సభయాలింగనస్య కాముకానాం శ్లాఘ్యత్వ–ప్రసిద్ధేరేవ ముక్తత్వాత్ । యథాహుః –

"**శ్లో॥ కోపప్రశమనే భీతౌ వియోగే పునరాగమే ।**
**సమ్భోగే చ సమాశ్లేషో విశేషేణ సుఖావహః ॥** " – వివరణవ్యాఖ్య.

కోపం చల్లారినప్పుడు, బెదరినపుడు, వియోగం ముగిసి తిరిగి కలిసినపుడు, సంభోగ వేళలో కౌగిలింత విశేషసుఖహేతువు.

*

**శ్లో॥ తస్య జాతు మలయస్థలీరతేర్ధూతచన్దనలతః ప్రియాక్లమమ్ ।**
**ఆచచామ సలవఙ్గకేసరశ్చాటుకార ఇవ దక్షిణానిలః ॥** **25**

**అవ :** పరమేశ్వరునకు దక్షిణానిల స్పర్శ

**ప.వి.:** తస్య జాతు మలయ–స్థలీ–రతేః ధూత–చన్దన–లతః ప్రియా–క్లమమ్ ।
ఆచచామ స లవంగ–కేసరః చాటు–కారః ఇవ దక్షిణ+అనిలః ॥

**అన్వ :** జాతు ధూత–చన్దన–లతః స–లవంగ–కేసరః దక్షిణ+అనిలః మలయ–స్థలీ–రతేః తస్య ప్రియా–క్లమం చాటు–కారః ఇవ ఆచచామ.

**ప్ర :** జాతు = ఒకప్పుడు, ధూత... లతః : ధూత = కంపింపజేయబడిన, చందన–లతః = చందనపు తీగెలుగలదియూ, స–లవంగ–కేసరః = లవంగపు పూల కేసరములతో కూడినదియూ, దక్షిణ+అనిలః = దక్షిణపుగాలి –మలయమారుతం, మలయ... రతేః : మలయ–స్థలీ = మలయపర్వతప్రాంతమందు, రతేః = ఆసక్తి గల, తస్య = ఆ శివుని యొక్క, ప్రియా – క్లమమ్ = ప్రియురాలి శ్రమను, చాటుకారః ఇవ = ప్రియోక్తులు పలికెడి వానివలె, ఆచచామ = ఆచమించెను.

**తా :** ఒకసారి దక్షిణానిలం చందనతరువులను కదిలిస్తూ, లవంగకేసరాలతో కలిసి ప్రసరిస్తూ మలయపర్వతప్రాంతంపై ఇష్టం గల శివుని ప్రియురాలు (పార్వతి) యొక్క అలసటను ప్రియోక్తులు పలికే చాటుకారునివలె తొలిగిపోయేటట్లు చేసింది.

**విభక్తులు - క్రియలు :** 1. తస్య : **తస్య** – తయోః – తేషామ్; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. షష్ఠ్యేకవచనమ్; 2. జాతు – అవ్యయమ్; 3. మలయస్థలీరతేః : **రతేః** – రత్యోః – రతీనామ్; మలయస్థలీరతిశబ్దః ఇకారాన్తః పుంలింగః. షష్ఠ్యేకవచనమ్; 4. ధూతచన్దనలతః : **లతః** – లతౌ – లతాః; ధూతచన్దనలతశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 5. ప్రియాక్లమమ్ : **క్లమం** – క్లమౌ – క్లమాన్; ప్రియాక్లమశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 6. ఆచచామ : **ఆచచామ** – ఆచేమతుః – ఆచేముః; ఆఙ్ పూర్వకాత్ చమ్ భక్షణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 7. సలవంగకేసరః : **కేసరః** – కేసరౌ – కేసరాః; స లవంగకేసరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 8. చాటుకారః : **చాటుకారః** – చాటుకారౌ – చాటుకారాః; చాటుకారశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 9. ఇవ – అవ్యయమ్; 10. దక్షిణానిలః : **అనిలః** – అనిలౌ – అనిలాః; దక్షిణానిలశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. రతేః+ధూత = రతేర్ధూత = విసర్గసంధి; 2. కేసరః+చాటుకారః = కేసరశ్చాటుకారః = విసర్గసంధి.

**సమాసాలు :** 1. మలయస్య స్థలీ, తస్యాం రతిః యస్య తస్య, మలయస్థలీరతేః; 2. ధూతాః చన్దనలతాః యేన సః, ధూతచన్దనలతః (చన్దనస్య చన్దన ఇతి వా లతా = చన్దనలతా); 3. ప్రియాయాః క్లమః, తమ్, ప్రియాక్లమమ్; 4. లవంగానాం కేసరాః, తైః సహితః, సలవంగకేసరః; 5. చాటుం కరోతి ఇతి చాటుకారః (కృదన్తం); 6. దక్షిణశ్చాసౌ అనిలః, దక్షిణానిలః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**జాతు :** ఖేదామర్షసంభావనానిశ్చయ**కదాచి**దర్థేషు దృశ్యతే. ఖేదే – 'న జాత్వహం భుంజే'; అమర్షే – న జాత్వస్య సుకృతమస్తి। సమ్భావనాయామ్ – శూద్రం కో జాతు యాజయేత్ । నిశ్చయే – కో జాతు యుధ్యతేఽర్జునేన । కదాచిదర్థే – 'న జాతు కామః కామానా-ముపభోగేన శ్రామ్యతి' (మను – 2/94) – అవ్యయకోశః.

**విశేషణద్వయమ్ :** ధూతచన్దనలతః, సలవంగకేసరః ఇతి విశేషణాభ్యాం శైత్యసౌరభ్యే దర్శితే – మల్లినాథవ్యాఖ్య.

**దక్షిణానిలః :** దక్షిణశ్చాసౌ అనిలః. దక్షిణశబ్దం బహ్వర్థాలలో ఉంటుంది.

**శ్లో॥ దక్షిణః సరళావామపరచ్ఛన్దానువర్తిషు ।**
**వాచ్యవద్దక్షిణావాటీయజ్ఞదానప్రతిష్ఠయోః ॥**

అని విశ్వకోశం. వీటిలో పరచ్ఛన్దానువర్తిత్వం విశిష్టం. అందుకే ఆ దక్షిణానిలం ఆహ్లాదకరం. అయితే కవి ఆ యా ప్రకరణ విశేషాలను బట్టి దక్షిణానిలాన్ని విభిన్నంగా ఉత్ప్రేక్షిస్తారు. కాళిదాసు కుమారసంభంవంలోనే తృతీయసర్గలో నిట్టూర్పుగా దాన్ని సంభావించాడు.

**శ్లో॥ కుబేరనాథాం దిశముష్ణరశ్మౌ – గన్తుం ప్రవృత్తే సమయం విలంఘ్య ।**
**దిగ్దక్షిణా గన్ధవహం ముఖేన – వ్యలీకనిశ్వాసమివోత్ససర్జ ॥** – 3/25

దక్షిణదిశను ఈ శ్లోకంలో ఖండితనాయికగా సంభావించాడు కవి.

దక్షిణానిలాన్ని నిఃశ్వాసాగ్నిపాణింధమంగా భావించి రమణీయప్రౌఢశ్లోకాన్ని రచించాడు శ్రీహర్షుడు–

**శ్లో॥ విషమో మలయాహిమణ్డలీ – విషఫూత్కారమయో మయోషితః ।**
**బత కాలకళత్రదిగ్భవః – పవనస్తద్విరహానలైధసా ॥**

దీనికి శ్రీనాథుని అనువాదం –

**శ్లో॥ కాలాంతః పురకామినీకుచతటీ కస్తూరికాసౌరభ**
**శ్రీలుంటాకము చందనాచలతటశ్రీఖండసంవేష్టితృ**
**వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్వాసాగ్నిపాణింధమం**
**బేలా? నాపయి దక్షిణానిలము పక్షీ! సేయుదాక్షిణ్యమున్.**

– శృంగారనైషధం – 2/32

**ఉపమాలంకారం :** 'చాటుకారః ఇవ' అని దక్షిణానిలాన్ని చాటుకారునితో పోల్చటం వలన ఇది ఉపమాలంకారం. చాటుకారుడు ప్రియోక్తులతో మనసును ఉప్పొంగి చేసినట్లు దక్షిణానిలం కూడా మనస్సును ఉల్లాసపరుస్తుందని భావం. "యథా ప్రభాతసమయే వన్దీస్తుతివచనైః పరిశ్రమమపాకరోతి తథా దర్దురానిలోఽపీత్యర్థః" (వివరణవ్యాఖ్య) విశేషణాలు రెండూ చాటుకారునికీ, దక్షిణానిలానికీ కూడా వర్తిస్తాయి. *

**శ్లో॥ హేమతామరసతాడితప్రియా తత్కరామ్బువినిమీలితేక్షణా ।**
**ఖే వ్యగాహత తరఙ్గిణీముమా మీనపఙ్క్తిపునరుక్తమేఖలా ॥ 26**

**అవ :** ఆదిదంపతులు మందాకినిలో విహరించటం.

**ప.వి.:** హేమ-తామరస-తాడిత-ప్రియా తత్-కర+అమ్బు-వినిమీలిత+ఈక్షణా।
ఖే వి+అగాహత తరంగిణీమ్ ఉమా మీన-పంక్తి-పునః+ఉక్త-మేఖలా ॥

**అన్వ :** హేమతామరసతాడితప్రియా తత్ కరామ్బువినిమీలితేక్షణా మీనపంక్తిపునరుక్త-మేఖలా ఉమా ఖే తరంగిణీమ్ వ్యగాహత.

**ప్ర :** హేమ... ప్రియా : హేమ = సువర్ణమయమైన, తామరస = పద్మం చేత, తాడిత = కొట్టబడిన, ప్రియా = ప్రియు(శివు)డు గలదీ, తత్... క్షణా : తత్ = ఆయనయొక్క, కర = చేతిలోని, అమ్బు = నీటిచే, వినిమీలిత = మూయబడిన, ఈక్షణా = కన్నులుగలదీ అయిన, మీన... మేఖలా : మీన = చేపలయొక్క, పంక్తి = వరుసలచే, పునరుక్త = రెట్టింపు జేయబడిన, మేఖలా = మొలనూలు గలదీ అయిన, ఉమా = పార్వతి, ఖే = గగనమందలి, తరంగిణీమ్ = నదిలో (ఆకాశగంగలో) వి+అగాహత = మునిగింది.

**తా :** పార్వతీపరమేశ్వరులు ఆకాశగంగలో జలకమాడుతున్నారు. నడుములోతు నీటిలో నిలిచి యున్నందున నీటిపై తిరుగుతున్న చేపలు పార్వతి మొలనూటిని రెట్టింపు చేసినట్టుంది. పార్వతి బంగారు తామరతో పరమేశ్వరుని కొట్టింది. పరమశివుడు చేతి నీటితో పార్వతి కన్నులు మూశాడు.

**విభక్తులు - క్రియలు :** 1. మేరుతామరసతాడితప్రియా : **ప్రియా** - ప్రియే - ప్రియాః; ప్రియా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 2. తత్కరాంబువినిమీలితేక్షణా : **ఈక్షణా** - ఈక్షణే - ఈక్షణాః; ... ఈక్షణాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 3. ఖే : **ఖే** - ఖయోః - ఖేషు; ఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః. సప్తమ్యేకవచనమ్; 4.వ్యగాహత : **వ్యగాహత** - వ్యగాహేతామ్ - వ్యగాహన్త; విపూర్వకాత్ గాహూ విలోడనే ధాతోః లజి ప్రథమపురుషైకవచనమ్; 5. తరంగిణీమ్ : **తరంగిణీమ్** - తరంగిణ్యౌ -

తరంగిణీః; తరంగిణీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 6. ఉమా : **ఉమా** – ఉమే – ఉమాః; ఉమాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 7. మీనపంక్తిపునరుక్తమేఖలా : **మేఖలా** – మేఖలే – మేఖలాః; మేఖలాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. హేమమయం చ తత్ తామరసమ్, తేన తాడితః ప్రియః యయా సా, హేమతామరసతాడితప్రియా; 2. తస్య కరః, తస్మిన్ (విద్యమానమ్) అమ్బు, తేన వినిమీలితే ఈక్షణే యస్యాః సా, తత్కరాంబు వినిమీలితేక్షణా; 3. మీనానాం పంక్తిః తయా పునరుక్తా మేఖలా యస్యాః సా, మీనపంక్తిపునరుక్తమేఖలా.

**పదవ్యుత్పత్తి–కావ్యనిఘంటుప్రమాణాలు :**

**తామరసమ్ :** "తామరే జలే సస్తి ఇతి । సస్+డ । యద్వా కాంక్షార్థాత్తమేర్ఘఙ్, రస ఆస్వాదనే, ణ్యన్తాదేరచ్, తామంచ తద్రసమ్' – పద్మమ్" ఇతి హలాయుధకోశః. కానీ హలాయుధకోశంలో జలార్థకంగా తామర పదం లేదు. శబ్దకల్పద్రుమంలో తామరపదముంది.

"తామరం – క్లీ (తామం మ్లానిం రాతీతి । రా+కః) జలమ్ । ఘృతమ్ ఇతి భరతధృతరుద్రః" –

**జల(సలిల)క్రీడ : మహాకావ్యలక్షణాలు**గా పేర్కొనబడిన అష్టాదశవర్ణనలలో సలిలక్రీడ ఒకటి.

శ్లో॥ నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్ ।
ఉద్యాన**సలిలక్రీడా** మధుపానరతోత్సవాః ॥
శ్లో॥ విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్ ।
మన్త్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి ॥
శ్లో॥ ఏతాని యత్ర వర్ణ్యన్తే తన్మహాకావ్యముచ్యతే ॥

ఈ శ్లోకంలోని జలక్రీడలో తామరసతాడనం, జలతాడనం – ఈ రెండు చేష్టలున్నాయి.

తామరసతాడనంలో కర్త్రి పార్వతి. తొలిచేష్ట తనదే. దానికి ప్రతిక్రియగా పరమేశ్వరుడు స్వరూపాలలో ఒకటైన జలాన్నే ఉపకరణంగా చేసి, పార్వతిని ప్రహరించాడు. అయితే దానిని గుప్తంగానే ఉంచి కవి దానికి ప్రతిక్రియగా పార్వతి కన్నులు మూయటాన్ని చూపాడు. అంటే చేష్టాద్వయం పార్వతీకృతంగానే కనిపిస్తుంది. మధ్యలోని పరమేశ్వరచేష్ట

గుంభనంగా ఉంటుంది. ఉన్నతోత్తమప్రకృతిలో అది ఒక భాగం. ఈ శ్లోకంలో శివచేష్టావాచకమైన పదమే లేకపోవటం విశేషం. *

**శ్లో॥ తాం పులోమతనయాలకోచితైః పారిజాతకుసుమైః ప్రసాధయన్ ।**
**నన్దనే చిరమయుగ్మలోచనస్సస్పృహం సురవధూభిరీక్షితః ॥ 27**

**అవ :** నందనవనంలో పరమేశ్వరుడు పారిజాతసుమాలతో పార్వతిని అలంకరించటం.

**ప.వి.:** తామ్ పులోమ-తనయా+అలక+ఉచితైః పారిజాత-కుసుమైః ప్రసాధయన్ ।
నన్దనే చిరమ్ అయుగ్మ-లోచనః సస్పృహమ్ సుర-వధూభిః ఐక్ష్యత ॥

**అన్వ :** నన్దనే పులోమతనయా+అలకోచితైః పారిజాతకుసుమైః తాం ప్రసాధయన్ అయుగ్మలోచనః చిరం సుర-వధూభిః సస్పృహమ్ ఐక్ష్యత.

**ప్ర :** నన్దనే = ఇంద్రుని ఉద్యానవనమందు, పులోమ... చితైః : పులోమ-తనయా = శచీదేవియొక్క, అలక = కురులకు, ఉచితైః = తగినట్టి, పారిజాత-కుసుమైః = పారిజాత పుష్పాలతో, తామ్ = ఆ పార్వతిని, ప్రసాధయన్ = అలంకరిస్తూ, అయుగ్మ - లోచనః = ముక్కంటి, చిరమ్ = చాలాసేపు, సుర-వధూభిః = దేవకాంతలచే, సస్పృహమ్ = కోరికతో, ఐక్ష్యత = చూడబడెను.

**తా :** (పార్వతీపరమేశ్వరులు నందనోద్యానంలో విహరిస్తుండగా) శచీదేవి అలంకరించు కొనదగిన పారిజాతకుసుమాలను పరమేశ్వరుడు పార్వతికురులలో అలంకరించాడు. దానిని దేవతాస్త్రీలు సాకాంక్షంగా అలా చూస్తూ ఉండిపోయారు.

**విభక్తులు - క్రియలు :** 1. తామ్ : **తామ్** - తే - తాః; తచ్ఛబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 2. పులోమతనయాలకోచితైః : ఉచితేన - ఉచితేన - **ఉచితైః**; ఉచితశబ్దః అకారాన్తః నపుంసకలింగః. తృతీయాబహువచనమ్; 3. పారిజాతకుసుమైః : కుసుమేన - కుసుమాభ్యాం - **కుసుమైః**; కుసుమ శబ్దః తృతీయాబహువచనమ్; 4. ప్రసాధయన్ : **ప్రసాధయన్** - ప్రసాధయన్తౌ - ప్రసాధయన్తః; తకారాన్తః పుంలింగః ప్రసాధయచ్ఛబ్దః. ప్రథమైకవచనమ్; 5. నన్దనే : **నన్దనే** - నన్దనయోః - నన్దనేషు; నన్దన శబ్దః అకారాన్తః నపుంసకలింగః. సప్తమ్యేకవచనమ్; 6. చిరమ్ - అవ్యయమ్; 7. అయుగ్మలోచనః : **లోచనః** - లోచనౌ - లోచనాః; అయుగ్మలోచనశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 8. సస్పృహమ్ - అవ్యయమ్; 9. సుర-వధూభిః : వధ్వా - వధూభ్యాం - **వధూభిః**; సురవధూశబ్దః ఊకారాన్తః స్త్రీలింగః. తృతీయా-బహువచనమ్; 10. ఐక్ష్యత : **ఐక్ష్యత** - ఐక్ష్యేతామ్ - ఐక్ష్యన్త; ఈక్ష దర్శనే ధాతోః కర్మణి లఙ ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. కుసుమైః+ప్రసాధయన్ = కుసుమైర్ప్ ప్రసాధయన్ = ఉపధ్మానీయ సంధి; 2. వధూభిః+ఐక్ష్యత = వధూభిరైక్ష్యత = విసర్గసంధి

**సమాసాలు :** 1. పులోమ్నః తనయయా, తస్యాః అలకానామ్ ఉచితాః, తైః, పులోమతనయాలకోచితైః; 2. పారిజాతస్య కుసుమాని, తైః, పారిజాతకుసుమైః; 3. అయుగ్మాని లోచనాని యస్య సః, అయుగ్మలోచనః; 4. సురాణాం వధ్వః, తాభిః, సురవధూభిః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**చిరమ్ :** చిరమ్ అన్నది అవ్యయం. అయితే సుబన్తంగా కూడా **చిర** పద ప్రయోగం పాణిని, కాత్యాయన, వరరుచుల ప్రయోగాల్లో ఉంది. "**తన్త్రాదచిరాపహృతే**" (5–2–70)(పాణిని), "**చిర పరుత్పరారిభ్యః త్నో వక్తవ్యః**" –(4–3–23) (కాత్యాయన) "**అథ సాయచిరయోః కిం నిపాత్యతే**" 4–3–23, (పతంజలి). అందుకే పాణిని సూత్రాలలో చిరం, చిరేణ, చిరాయ, చిరాత్, చిరస్య, చిరే అని సర్వవిభక్తులలోనూ చిరపదం కనిపిస్తుంది. ఆపిశలి చిరపదాన్ని నపుంసకలింగంగా చెప్పాడు.

**పులోమతనయ :** పులోమతనయ శచి. పులోముడొక రాక్షసుడు. ఇంద్రుడే ఆ అసురుని సంహరించాడు.

శ్లో॥ కృత్వా సంబంధకం చాపి విశ్వసేచ్ఛాత్రుణా నహి ।
**పులోమానం** జఘానాజౌ జామాతా సన్ శతక్రతుః ॥ – హరివంశం 20/134

**నన్దనే :** నందనవనవిహారాదికం శచీంద్రులకు నిత్యకృత్యం. ఉపేంద్రునకు ఇంద్ర సంబంధంతో క్వాచిత్కంగా సంపన్నం. పరమశివునకు నందనవనవిహారం విశిష్య అన్యత్ర కనిపించదు. ప్రకృతం కాళిదాసు పరమేశ్వరుని సర్వేశ్వరత్వాన్ని స్ఫురింప జేయటానికై ఈ వర్ణనను చేసినట్లు భావించాలి.

**సస్పృహమ్ :** పారిజాతకుసుమాలతో పార్వతిని అలంకరిస్తున్న పరమేశ్వరుని సురవధువులు సస్పృంగా చూశారట. "**కేన వా పుణ్యేన అయం లభ్యతే ఇతి సాభిలాషం దృష్ట ఇత్యర్థః**" – అని మల్లినాథుని వ్యాఖ్య. "అపి నామానేన కదాచిదప్యస్మాకమ్ ఏవమవస్థానం భవేదితి సాభిలాషం ముహుర్ముహురవలోకితోఽభూదితి భావః" అని వివరణవ్యాఖ్య.

"**పుణ్యవత్యేషా యస్యాః సర్వేశ్వరోఽపి చాటుకృదితి**" అని పంజికావ్యాఖ్య.

వాస్తవానికి ఇక్కడ అభిలాష "సస్పృహం" పదంతో వాచ్యంగానే కనిపిస్తుంది. వాచ్యమైన

అభిలాష మరల ధ్వన్యమాన మవుతుందనటం సముచితం కాదు. "కామినీకుచకలశవద్ గూఢం చమత్కరోతి, అగూఢం తు స్ఫుటతయా వాచ్యాయమానమితి గుణీభూతమేవ" (కావ్యప్రకాశః పంచమోల్లాసః). కాబట్టి ఇక్కడ వ్యంగ్యం వాచ్యమై గుణీభూతవ్యంగ్య కావ్యమవుతోంది. కాబట్టి అభిలాషకు ఇక్కడ ధ్వనిత్వం లేదు. అది వాచ్యమే.

ఈ శ్లోకంలో వర్ణింపబడిన పరమేశ్వరుడు శృంగారనాయకులలో అనుకూలుడు. "**ఏకాయత్తోఽనుకూలః**" (ఒకే నాయికపై అనురక్తి గలవాడు) అని లక్షణం. పార్వతి స్వాధీనపతిక. భర్త తన అదుపుఆజ్ఞలలో ఉన్న కాంత స్వాధీనపతిక. *

## గన్ధమాదనప్రాన్తవిహారః

**శ్లో॥ ఇత్యభౌమమనుభూయ శఙ్కరః పార్థివం చ వనితాసఖస్సుఖమ్ ।**
**లోహితాయతి కదాచిదాతపే గన్ధమాదనగిరిం న్యవర్తత(వ్యగాహత) ॥28**

**ప.వి. :** ఇతి అభౌమమ్ అనుభూయ శంకరః పార్థివం చ వనితా-సఖః సుఖమ్ ।
లోహితాయతి కదాచిద్ ఆతపే గన్ధ-మాదన-గిరిం న్యవర్తత ॥

**అన్వ :** ఇతి వనితా-సఖః శంకరః అభౌమమ్ పార్థివం చ సుఖమ్ అనుభూయ కదాచిత్ ఆతపే లోహితాయతి గన్ధ-మాదన-గిరిం న్యవర్తత.

**ప్ర :** ఇతి = ఈ రీతిగా, వనితా-సఖః : వనితా = అనురాగవతియైన పార్వతికి, సఖః = చెలికాడై, శంకరః = పరమశివుడు, అభౌమమ్ = భూమిపై దుర్లభమైన, సుఖమ్ = సుఖాన్ని, పార్థివమ్ = పృథివీభవమైన, సుఖమ్ = సుఖాన్ని, చ = కూడా, అనుభూయ = అనుభవించి, కదాచిత్ = ఒకప్పుడు, ఆతపే = ఎండ, లోహితాయతి = ఎఱ్ఱబడుచుండగా, గన్ధమాదన-గిరిమ్ = గన్ధమాదనవనానికి, న్యవర్తత = మరలెను.

**తా :** ఈ రీతిగా శంకరుడు పార్వతితో కలిసి అభౌమ (మేరుపర్వతం, ఆకాశగంగ మొ॥) సుఖాన్నీ, పార్థివ (మలయాచలాదులకు చెందినది) సుఖాన్నీ, కూడా అనుభవించి ఒకసారి సంధ్యవేళలో గన్ధమాదనపర్వతంనుండి మరలివెళ్ళాడు.

**విభక్తులు - క్రియలు :** 1. ఇతి - అవ్యయమ్; 2. అభౌమమ్ : **అభౌమమ్** - అభౌమే - అభౌమాని; అభౌమశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 3. అనుభూయ - అవ్యయం. అను పూర్వకాత్ భూధాతోః ల్యప్ ప్రత్యయః; 4. శంకరః : **శంకరః** - శంకరౌ - శంకరాః; శంకరశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 5. పార్థివమ్ : **పార్థివం** - పార్థివే - పార్థివాని; పార్థివశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 6. చ - అవ్యయమ్; 7. వనితాసఖః : **వనితాసఖః** - వనతిసఖౌ

- వనితాసఖాః; వనితాసఖశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 8. సుఖమ్ : **సుఖం** - సుఖే - సుఖాని; అకారాన్తః నపుంసకలింగః సుఖశబ్దః ద్వితీయైకవచనమ్; 9. లోహితాయతి : **లోహితాయతి** - లోహితాయతోః - లోహితాయత్సు; లోహితాయతశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 10. కదాచిత్ - అవ్యయమ్; 11. ఆతపే : **ఆతపే** - ఆతపయోః - ఆతపేషు; ఆతపశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 12. గన్ధమాదనగిరిమ్ : **గిరిం** - గిరీ - గిరీన్; గిరిశబ్దః ఇకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 13. న్యవర్తత : **న్యవర్తత** - న్యవర్తేతాం - న్యవర్తన్త; నిపూర్వకాత్ వృతు వర్తనే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. ఇతి+అభౌమ = ఇత్యభౌమ - యణాదేశసంధి; 2. కదాచిత్+ఆతపే = కదాచిదాతపే - జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. శం కరోతీతి, శంకరః; 2. వనితా సఖా యస్య సః, వనితా సఖః, వనితాయాః సఖా ఇతి వా; 3. గన్ధమాదన ఇతి గిరిః, తమ్, గన్ధమాదనగిరిమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**అభౌమమ్ - పార్థివమ్ :** భూమిభవం న భవతి ఇత్యభౌమమ్. పృథివీ భవం పార్థివమ్. ఇక్కడ అభౌమపార్థివసుఖాలకు ఆధారం అభౌమ ప్రదేశాలూ, పృథివీ. గత శ్లోకాలలో మేరుమందరపర్వతవిహారాన్నీ, మందాకినీవిహారాన్నీ వర్ణించాడు కవి. అది అభౌమసుఖం. మలయాచలాదులకు సంబంధించిన సుఖం పార్థివమ్ - అని వ్యాఖ్యాతలు.

**వనితాసఖః :** వనితాయాః సఖా వనితాసఖః. వనితా శబ్దాన్ని '**వనితా జనితాత్యర్థానురాగాయాం యోషితి**' అని అమరకోశం నిర్వచించింది. వనితా పదం కాళిదాసు కిష్టమైనది. 'వనే చరాణాం వనితా సఖానాం' అని హిమగిరివర్ణన సందర్భంలో ప్రథమసర్గలో వనితాసఖత్వాన్ని ఆదరించాడు (1/10). రఘువంశంలో వనితా పదాన్ని అమరకోశ నిర్వచనానికి వ్యాఖ్యాన మన్నట్టు ప్రయోగించి చూపాడు.

శ్లో॥ వసిష్ఠధేనోరనుయాయినం తమ్ - ఆవర్తమానం **వనితా** వనాన్తాత్ ।
**పపే నిమేషాలసపక్ష్మపంక్తి - రుపోషితాభ్యామివ లోచనాభ్యామ్ ॥**

- రఘువంశం 2-19

గన్ధమాదనసమీపగమనకారణాన్ని వ్యాఖ్యాతలు భిన్నంగా వివరించారు. "గన్ధమాదనస్య **ఓషధిప్రస్థప్రత్యాసన్నత్వాద్ న్యవర్తతేత్యుక్తమ్"** - (ప్రకాశిక) వివరణవ్యాఖ్య. 'గన్ధమాదనస్య **ఓషధిప్రస్థోద్యానభూతత్వాత్** న్యవర్తత" ఆరవసర్గలో -

శ్లో॥ సన్తానకతరుచ్ఛాయా సుప్తవిద్యాధరాధ్వగమ్ ।
**యస్య చోపవనం బాహ్యం** సుగన్ధిర్గన్ధమాదనః ॥ - 6/46

అన్ని శ్లోకవ్యాఖ్యలో కూడా ప్రకాశిక ఈ రీతిగానే వ్యాఖ్యానించింది. *

**శ్లో॥ తత్ర కాఞ్చనశిలాతలాశ్రయీ నేత్రగమ్యమవలోక్య భాస్కరమ్ ।**
**దక్షిణేతరభుజవ్యపాశ్రయాం వ్యాజహార సహధర్మచారిణీమ్ ॥ 29**

**అవ :** పరమేశ్వరుడు పార్వతితో సంభాషించుట.

**ప.వి. :** తత్ర కాంచన-శిలా-తల+ఆశ్రయీ నేత్ర-గమ్యమ్ అవలోక్య భాస్కరమ్ ।
దక్షిణ+ఇతర-భుజ-వ్యపాశ్రయాం వ్యాజహార సహధర్మ-చారిణీమ్ ॥

**అన్వ :** (సః) తత్ర కాంచన శిలాతలాశ్రయీ నేత్రగమ్యం భాస్కరమ్. అవలోక్య దక్షిణేతర భుజవ్యపాశ్రయాం సహధర్మచారిణీం వ్యాజహార.

**ప్ర :** సః = ఆ పరమేశ్వరుడు, తత్ర = ఆ గన్ధమాదనగిరిపై, కాంచన... శ్రయీ : కాంచన = సువర్ణమయమైన, శిలాతల = రాతిని, ఆశ్రయీ = ఆశ్రయించినవాడై, నేత్ర-గమ్యమ్ = కంటికి కనిపిస్తున్న, భాస్కరమ్ = సూర్యుని, అవలోక్య = చూసి, దక్షి... శ్రయామ్ : దక్షిణ+ఇతర = ఎడమ, భుజ = భుజాన్ని, వ్యపాశ్రయామ్ = ఆశ్రయించిన (ఆని తలవాల్చిన), సహధర్మ-చారిణీమ్ = అర్ధాంగి అయిన పార్వతితో, వ్యాజహార = పలికెను.

**తా :** ఆ గన్ధమాదనపర్వతంపై సువర్ణమయమైన శిలాతలాన్ని ఆశ్రయించారు పార్వతీ పరమేశ్వరులు. అక్కడ సూర్యుడు కంటికి ఆనుతున్నాడు. పార్వతి పరమేశ్వరుని ఎడమ భుజంపై వాలింది. అప్పుడు తన సహధర్మచారిణితో శివుడిలా అన్నాడు.

**విభక్తులు - క్రియలు :** 1.తత్ర = అవ్యయమ్; 2. కాంచనశిలాతలాశ్రయీ : **ఆశ్రయీ** - ఆశ్రయినౌ - ఆశ్రయినః; ఆశ్రయిన్ శబ్దః నకారాన్తః పుంలిం: ప్రథమైకవచనమ్; 3. నేత్రగమ్యమ్ : **గమ్యం** - గమ్యౌ - గమ్యాన్; నేత్రగమ్య శబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 4. అవలోక్య - అవ్యయమ్. అవపూర్వకాత్ లోకృధాతోః ల్యప్ ప్రత్యయః; 5. భాస్కరమ్ : **భాస్కరం** - భాస్కరౌ - భాస్కరాన్; భాస్కరశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 6. దక్షిణేతరభుజవ్యపాశ్రయామ్ : **వ్యపాశ్రయాం** - వ్యపాశ్రయే - వ్యపాశ్రయాః; వ్యపాశ్రయా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 7. వ్యాజహార : **వ్యాజహార** - వ్యాజహ్రతుః -వ్యాజహ్రుః; వి+ఆ ఉపసర్గ పూర్వకాత్ హృఞ్ హరణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 8. సహధర్మచారిణీమ్ : **చారిణీం** - చారిణ్యౌ - చారిణీః; సహధర్మచారిణీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్.

**సమాసాలు :** 1. కాంచనశిలాతలాశ్రయా - కాంచనాత్ ఆగతం కాంచనమయమ్, తత్ శిలాతలమ్ ఆశ్రయితుం శీలమ్ అస్య - కాంచనశిలాతలాశ్రయా; 2. దక్షిణాత్ ఇతరః, సః చ అసౌ భుజః వ్యపాశ్రయః యస్యాః, తామ్, దక్షిణేతరభుజవ్యపాశ్రయాం; 3. సహ ధర్మం చరితుం శీలమ్ అస్యా ఇతి, సహధర్మచారిణీ.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**భాస్కరమ్ :** '**భాః కరోతి**' ఇతి (భాస్కరః) విగ్రహే 'అతః కృ కమీ'త్యత్రాఽ తః తపరకరణాత్ సత్వస్య అప్రాప్తేః" కుప్వో" రితి జిహ్వామూలీయవిసర్గా వా శంక్యాహ - కస్కాదిత్వాదితి" (బాలమనోరమా)

భాస్కర పదంలోని స కారానికి జిహ్వామూలీయం లేదా విసర్గ రావలసి ఉండగా, '**కస్కాదిషు చ**' సూత్రం ద్వారా కస్కాది గణంలో భాస్కర పదాన్ని పరిగణించటంవలన సకారమే ఉంటుంది.

**ప్రోద్వీక్షణమ్ :** దక్షిణేతరభుజవ్యపాశ్రయ అంటే ఎడమవైపునున్నదని అర్థం. భార్యను ఎడమవైపున నిలుపుకొని చంద్రాది సందర్శనాన్ని ప్రోద్వీక్షణమని వ్యవహరిస్తారని వివరణ వ్యాఖ్య- "... అనేన సముచిత ప్రదేశవర్తిత్వముక్తమ్ । ప్రోద్వీక్షణాఖ్యో భావశ్చ దర్శితః । **ప్రోద్వీక్షణం** నామ వామపార్శ్వే స్త్రియం స్థాపయిత్వా చన్ద్రాదిదర్శనమితి భోజః -"

**వ్యాజహార :** హృఞ్ హరణే ధాతువు. హరణార్థ హృ ధాతువునకు ముందు ఆఙ్ (ఉపసర్గ) చేర్చితే ఆజహార, తీసి కొనివచ్చాడు అని అర్థం. దానికి ముందు వి, ఆఙ్ రెండింటినీ చేర్చితే వ్యాజహార - పలికెను అని అర్థం. మేఘధూతంలో కూడా ఇదే ప్రయోగం కనిపిస్తుంది.

శ్లో॥ ప్రత్యసన్నే నభసి దయితా జీవితాలమ్బనార్థీ
జీమూతేన స్వకులమయీం హారయిష్యన్ప్రవృత్తిమ్ ।
సప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతి ప్రముఖవచనం స్వాగతం **వ్యాజహార** ॥ - మేఘదూతమ్ - 1/5

హృఞ్ ధాతువు హరణార్థకమే అయినా హరణపదం ప్రాపణ, స్వీకార, స్తైన్య, నాశనార్థాలలో ప్రయోగింపబడుతుంది. అందుకే ఈ శ్లోకంలోనే హృ ఞ్ ధాతువును ప్రేరణార్థంలో భవిష్యదర్థంలో శతృప్రత్యయాంతంగా వాడాడు కాళిదాసు, పంపుతూ అనే అర్థంలో అయితే హృ ధాతువునకే ప్రాపణమనే అర్థమున్నపుడు హారయిష్యన్ అని ప్రేరణార్థంలో ప్రయోగం అవసరం లేదు. ప్రేరణంమీద ప్రేరణను వాడినట్లవుతోంది. కాబట్టి హృ ధాతువును ప్రేరణార్థంలోనే ప్రాపణార్థాన్ని ఇస్తుందనటం సముచితం కావచ్చు.

**ఉదాత్తాలంకారధ్వని :** కాంచనశిలాతలాలు కలిగి వుండటంతో ఆ గిరి సంపన్నత, భాస్కరుడు నేత్రగమ్యుడై ఉండటంతో ఆ గిరియొక్క ఔన్నత్యం ధ్వనిస్తాయి. అది ఉదాత్తాలంకారధ్వని. అది అన్యోపలక్షణమైతే అలంకారం. *

**శ్లో॥ పద్మకాన్తిమరుణత్రిభాగయోస్సంక్రమయ్య తవ నేత్రయోరివ ।**
**సంక్షయే జగదివ ప్రజేశ్వరస్సంహరత్యహరసావహర్పతిః ॥ 30**

**ప.వి. :** పద్మ-కాన్తిమ్ అరుణ-త్రి-భాగయోః సంక్రమయ్య తవ నేత్రయోః ఇవ ।
సంక్షయే జగద్ ఇవ ప్రజా+ఈశ్వరః సంహరతి అహః అసౌ అహర్పతిః ॥

**అన్వ :** అరుణత్రిభాగయోః తవ నేత్రయోః పద్మకాన్తిమ్ సంక్రమయ్య ఇవ, ప్రజేశ్వరః సంక్షయే జగద్ ఇవ అసౌ అహర్పతిః అహః సంహరతి.

**ప్ర :** అరుణ-త్రిభాగయోః : అరుణ = ఎఱ్ఱనైన, త్రిభాగయోః = కొనలుగల, తవ = నీయొక్క, నేత్రయోః = కన్నులయందు, పద్మ-కాన్తిమ్ = తామరల శోభను, సంక్రమయ్య ఇవ = సంక్రమింపజేసియో యన్నట్లు, ప్రజా+ఈశ్వరః = ప్రజాపతి (రుద్రుడు), సంక్షయే = కల్పాంతమందు, జగద్-ఇవ = జగత్తునువలె, అసౌ = ఈ, అహః-పతిః = సూర్యుడు, అహః = పగటిని, సంహరతి = ఉపసంహరిస్తున్నాడు.

**తా :** పార్వతి! సూర్యుడు తన కాంతిని ఎఱ్ఱని కొనలు గల నీ కన్నులలో సంక్రమింపజేసి పగటిని ఉపసంహరిస్తున్నాడు. అది కల్పాంతవేళలో ప్రజాపతి జగత్తును ఉపసంహరించి నట్లున్నది.

**విభక్తులు - క్రియలు :** 1. పద్మకాన్తిమ్ : **కాన్తిం** - కాన్తీ - కాన్తీః; కాన్తి శబ్దః ఇకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 2. అరుణత్రిభాగయోః : భాగే - **భాగయోః** - భాగేషు; భాగశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమీద్వివచనమ్; 3. సంక్రమయ్య - అవ్యయమ్. సమ్ పూర్వకాత్ క్రము పాదవిక్షేపే ధాతోః ణిజన్తాత్ (ప్రేరణే) ల్యప్ ప్రత్యయః; 4. తవ : **తవ**/తే - యువయోః/వామ్ - యుష్మాకం/వః; యుష్మచ్ఛబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్; 5. ఇవ - అవ్యయమ్; 6. సంక్షయే : **సంక్షయే** - సంక్షయయోః - సంక్షయేషు; సంక్షయశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 7. జగత్ : **జగత్** - జగతీ - జగన్తి; జగచ్ఛబ్దః తకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 8. ప్రజేశ్వరః : **ఈశ్వరః** - ఈశ్వరౌ - ఈశ్వరాః; ఈశ్వరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 9. సంహరతి : **సంహరతి** - సంహరతః - సంహరన్తి; సమ్ పూర్వకాత్ హృఞ్ హరణే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 10. అహః : **అహః** - అహ్నీ/అహనీ - అహాని; నకారాన్తః నపుంసకలింగః అహన్ శబ్దః. ప్రథమైకవచనమ్; 11. అసౌ : **అసౌ** -

అమూ - అమీ; సకారాన్తః పుంలింగః అదస్ శబ్దః ప్రథమైకవచనమ్; 12. అహర్పతిః : **అహర్పతిః** - అహర్పతీ - అహర్పతయః; ఇకారాన్తః పుంలింగః అహర్పతి శబ్దః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. నేత్రయోః+ఇవ - నేత్రయోరివ - విసర్గసంధి; 2. జగత్+ఇవ = జగదివ - జశ్త్వసంధి; 3. సంహరతి+అహః = సంహరత్యహః - యణాదేశసంధి; 4. అహః+అసౌ = అహరసౌ - విసర్గసంధి; 5. అసౌ ః అహర్పతిః = అసావహర్పతిః = అయవాయావాదేశసంధి.

**సమాసాలు :** 1. పద్మానాం కాంతిః, తామ్, పద్మకాన్తిమ్; 2. అరుణః తృతీయః భాగః యయోః, తయోః అరుణత్రిభాగయోః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

త్రిపదం మీద **సంఖ్యాయాః అవయవే తయప్** సూత్రంతో తయప్ ప్రత్యయం వచ్చి 'తృతీయ' అని రూపమేర్పడవలసి వస్తుంది. 'త్రి భాగ' ఎలా కుదురుతుంది అని విచికిత్సకు సమాధానం - '**వృత్తివిషయే పూరణార్థత్వం సంఖ్యాయాః ఇత్యుక్తమ్**' మల్లినాథవ్యాఖ్య.

"అంశవాచినా శబ్దేన సహ సమస్యమానః సంఖ్యా శబ్దః పూరణప్రత్యయేన వినాపి పూరణప్రత్యయోపేతపదవాచ్యమర్థమేవ బ్రవీతీత్యవగన్తవ్యమ్" - నారాయణవ్యాఖ్య కుమారసంభవం - 5/57 శ్లోకం.

**అలంకారసంసృష్టి :** తిలతండుల న్యాయంతో ఒకటికి మించిన అలంకారాలు ఒకే శ్లోకంలో కలిస్తే అక్కడ అలంకారసంసృష్టి. అనన్యాశ్రితంగా ఆ అలంకారాలు ప్రధానాభావాన్ని అలంకరించటం అలంకారసంసృష్టి.

ఇక్కడ 'అహర్పతిః అహః సంహరతి' అన్నచోట అహర్పతి పదం సాభిప్రాయ విశేష్యం. "**సాభిప్రాయే విశేష్యే చేత్ భవేత్పరికరాంకురః**" అని సాభిప్రాయవిశేష్యప్రయోగం వలన ఇది పరికరాంకురం. అహస్సును తాను అధిపతి దానిని ఉపసంహరించటంలో తనకు స్వాతంత్ర్యముంటుందని భావం.

దీనికి ఉపబలకంగా ఉపమానప్రయోగం 'సంక్షయే జగదివ ప్రజేశ్వరః' అని ప్రజేశ్వర పదం. ప్రజాపతి ప్రళయవేళలో జగత్తును ఉపసంహరించినట్లుగా సూర్యుడు పగటిని ఉపసంహరిస్తున్నాడని ఉపమాలంకారం. "అనేన ప్రజాసంహారే ప్రజేశ్వరస్య అహ్నః సంహారే అహర్పతేః స్వాతంత్ర్యం ధ్వన్యతే" అని వివరణ వ్యాఖ్య.

ఈ ధ్వని అలంకారశాస్త్రం మేర సమంజసమే కానీ కుమారసంభవంలోనే ద్వితీయసర్గలో కాళిదాసు-

**శ్లో॥ ఇతస్సదైత్యః ప్రాప్తశ్రీర్నేత ఏవార్హతి క్షయమ్ ।**
**విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయంఛేత్తుమసాంప్రతమ్ ॥** – 2/54

'నా వలన సంపత్తిని పొందిన దైత్యుడు నా ద్వారా నశించకూడదు. మనమే పెంచిన విషవృక్షాన్ని అయినా మనం చంపకూడదు' – అని నిజాభిప్రాయాన్ని ప్రకటిస్తాడు బ్రహ్మముఖంగా. కాబట్టి అలంకారశాస్త్రప్రకారం స్వాతంత్ర్యం ధ్వనించినా మానవీయ దృక్పథంతో చూస్తే అది కాళిదాసుకు అనిష్టమైన ధ్వని. పరికరాంకురాలంకారం వాచ్య–వాచకచమత్కృతి పరం మాత్రమే అని భావించాలి.

'పద్మకాంతిం నేత్రయోః సంక్రమయ్య ఇవ' అనటంలో వస్తూత్ప్రేక్షాలంకారం. పద్మ కాంతిని పార్వతి కనులలోనికి సంక్రమింపజేసి రవి అస్తమించినట్లున్నదని ఉత్ప్రేక్ష. "తదానీం పద్మానామ్ అవికాసాన్నేత్రయోస్తు వికాసాచ్చేయముత్ప్రేక్షా" అని మల్లినాథ వచనం. కన్నులకు పద్మాలతో వాచ్యంగానో, వ్యంగ్యంగానో పోలిక ఉంటే తప్ప ఈ కారణాభ్యూహ కుదరదు. కాబట్టి అనురణనధ్వని ద్వారా పద్మనేత్రాలకు ఔపమ్యాన్ని గ్రహించాలి. "అత్ర దేవీనేత్రయోః సంభోగప్రత్యాసత్త్యా పరివర్ధమానకాన్తిత్వం పద్మకాన్తి సంక్రమణోత్ప్రేక్షాయాం హేతుః" అని వివరణ వ్యాఖ్య. పురాతనభవనాలను నవీకరించేటప్పుడు దానిలోని విలువైన కలపను తీసి పునర్వినియోగానికై దాచినట్లు సూర్యుడు పద్మకాంతిని పార్వతి కన్నులలో దాచాడని వివరణవ్యాఖ్యా వివరణ. *

**శ్లో॥ శీకరవ్యతికరం మరీచిభిర్దూరయత్యవనతే వివస్వతి ।**
**ఇన్ద్రచాపపరివేషశూన్యతాం నిర్ఝరాః ప్రసవితుర్వ్రజన్తి తే ॥ 31**

**ప.వి. :** శీకర–వ్యతికరం మరీచిభిః దూరయతి అవనతే వివస్వతి ।
ఇన్ద్రచాప – పరివేష–శూన్యతాం నిర్ఝరాః ప్రసవితుః వ్రజన్తి తే ॥

**అన్వ :** అవనతే వివస్వతి మరీచిభిః శీకరవ్యతికరం దూరయతి తే ప్రసవితుః నిర్ఝరాః ఇన్ద్రచాపపరివేషశూన్యతాం వ్రజన్తి.

**ప్ర :** అవనతే = వ్రాలిన, వివస్వతి = సూర్యుడు, మరీచిభిః = కాంతులతో, శీకర–వ్యతికరమ్ : శీకర = తుంపరలతోడి, వ్యతికరమ్ = సంపర్కాన్ని (తగులిమిని), దూరయతి (సతి) = దూరం చేస్తుండగా, తే = నీ యొక్క, ప్రసవితుః = తండ్రియొక్క, నిర్ఝరాః = సెలయేళ్ళు, ఇన్ద్ర... శూన్యతామ్ : ఇన్ద్రచాప = ఇన్ద్రధనుస్సుయొక్క, పరివేష = చుట్టుచుట్టడంతో (వరదగుడితో), శూన్యతామ్ = లేకపోవుటను, వ్రజన్తి = పొందుచున్నవి.

**తా :** సూర్యుడు పడమట వ్రాలిపోయాడు. తన కిరణాలు నీటి తుంపరలకు

దూరమయ్యాయి. దానితో నీ తండ్రి – హిమవంతుని నుండి జారిపడు సెలయేళ్ళచుట్టూ ఇన్ద్రచాపాలు లేక పోయాయి.

**విభక్తులు – క్రియలు :** 1. శీతలవ్యతికరమ్ : **వ్యతికరం** – వ్యతికరౌ – వ్యతికరాన్; వ్యతికరశబ్దః – అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 2. మరీచిభిః : మరీచినా/ మరీచ్యా – మరీచిభ్యాం – **మరీచిభిః**; మరీచిశబ్దః పుం – స్త్రీలింగః ఇకారాన్తః. తృతీయాబహువచనమ్; 3. దూరయతి : **దూరయతి** – దూరయతోః – దూరయత్సు; దూరయత్ శబ్దః తకారాన్తః పుంలింగః. సప్తమ్యేకవచనమ్; 4. అవనతే : **అవనతే** – అవనతయోః – అవనతేషు; అవనతశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 5. వివస్వతి : **వివస్వతి** – వివస్వతోః – వివస్వత్సు; వివస్వత్ శబ్దః తకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 6. ఇన్ద్రచాపపరివేషశూన్యతామ్ : **శూన్యతాం** – శూన్యతే – శూన్యతాః; ... శూన్యతా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 7. నిర్ఝరాః : నిర్ఝరః – నిర్ఝరౌ – **నిర్ఝరాః**; నిర్ఝర శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్; 8. ప్రసవితుః : **ప్రసవితుః** – ప్రసవిత్రోః – ప్రసవితౄణామ్; ప్రసవితృ శబ్దః ఋకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 9. వ్రజతి : **వ్రజతి** – వ్రజతః – వ్రజన్తి; వ్రజ గతౌ ధాతోః లటి ప్రథమపురుషబహువచనమ్; 10. తే : తవ/**తే** – యువయోః/వామ్ – యుష్మాకం/ వః; యుష్మత్ శబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్.

**సంధులు :** 1. మరీచిభిః+దూరయతి = మరీచిభిర్దూరయతి = విసర్గసంధి; 2. దూరయతి+అవనతే = దూరయత్యవనతే = యణాదేశసంధి; 3. ప్రసవితుః+వ్రజన్తి = ప్రసవితుర్వ్రజన్తి = విసర్గసంధి

**సమాసాలు :** 1. శీకరైః వ్యతికరః, తమ్, శీకరవ్యతికరమ్; 2. ఇన్ద్రస్య చాపః, తస్య పరివేషః, తేన శూన్యః, తస్య భావః, ఇన్ద్రచాపపరివేషశూన్యతా.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**దూరయతి :** 'దూరయతి' పద ప్రయోగాన్ని ఆశంకించి సాధుత్వాన్ని సమర్థించి చూపాడు వామనుడు కావ్యాలంకారసూత్రగ్రంథంలో...

"సూ॥ **దూరయతీతి బహుళగ్రహణాత్** "

'దూరయత్యవనతే వివస్వతి' ఇత్యత్ర దూరయతీతి కథమ్ । ణావిష్ఠవద్భావే "స్థూలదూర"... ఇత్యాదినా గుణలోపయోః కృతయోః దవయతీతి భవితవ్యమ్. ఆహ – బహుళగ్రహణాత్। "ప్రాతిపదికాత్ ధాత్వర్థే బహుళమిష్ఠవచ్చ" ఇత్యత్ర బహుళగ్రహణాత్ "స్థూలదూర..." ఆదిసూత్రేణ యద్విహితం తన్న భవిష్యతీతి।" – కావ్యాలంకారసూత్ర 6/79

"**స్థూలదూరయువహ్రస్వక్షిప్రక్షుద్రాణాం యణాదిపరం పూర్వస్య చ గుణః**" - ఇది స్థూలాదిసూత్రం పూర్తిగా-

**హిమవదౌన్నత్యం :** పరమేశ్వరుడు పార్వతితో సంభాషిస్తున్నాడు. పార్వతి తండ్రి ఔన్నత్యాన్ని ప్రశంసించటం ద్వారా ఆమెలో ఆనందాన్ని పెంచే ప్రయత్నం చేయటం సముచితమే. అందుకే సూర్యాస్తమయవర్ణనతో హిమవదౌన్నత్యాన్ని మేళవించి వర్ణిస్తున్నాడు కవి. సూర్యకిరణాలకన్న హిమవన్నగశిఖరాలు సమున్నతాలని ధ్వనింపజేస్తున్నాడు-

'సూర్యమణ్డలస్య అధో ముఖత్వాత్ సమున్నతేభ్యో హిమవచ్ఛిఖరేభ్యో నిపతతాం జలప్రవాహశీకరాణాం రవికరసంపర్కాభవాత్ నానాప్రభామణ్డలాన్యపి నివృత్తానీత్యర్థః" - (వివరణవ్యాఖ్య)

హిమవచ్ఛిఖరౌన్నత్యాన్ని వర్ణించటం కాళిదాసుకు అభీష్టవిషయాలలో ఒకటి. కుమారసంభవంలోనూ-

శ్లో॥ **ఆమేఖలం** సంచరతాం **ఘనానాం** - ఛాయామధస్సానుగతాం నిషేవ్య ।
ఉద్వేజితా వృష్టిభిరాశ్రయన్తే - శృంగాణి యస్యాతపవన్తి సిద్ధాః ॥ - 1/6

మేఘాలు హిమవంతుని మధ్యసానుప్రదేశాలలో సంచరిస్తూ కురియగానే క్రిందనున్న సిద్ధులు పైకి ఎండలోనికి వెళ్ళి తడవకుండా ఉన్నారట. *

**శ్లో॥ దష్టతామరసకేసరత్యజోః క్రన్దతోర్విపరివృత్తకణ్ఠయోః ।**
**నిఘ్నయోస్సరసి చక్రవాకయోరల్పమన్తరమనల్పతాం గతమ్ ॥ 32**

**ప.వి. :** దష్ట-తామరస-కేసర-త్యజోః - క్రందతోః విపరివృత్త-కణ్ఠయోః ।
నిఘ్నతోః సరసి చక్రవాకయోః - అల్పమ్ అన్తరమ్ అనల్పతాం గతమ్॥

**అన్వ :** సరసి దష్టతామరసకేసరత్యజోః విపరివృత్త-కణ్ఠయోః క్రన్దతోః నిఘ్నయోః చక్రవాకయోః అల్పమ్ అన్తరమ్ అనల్పతాం గతమ్.

**ప్ర :** సరసి = కొలనులో, దష్ట... త్యజోః : దష్ట = కొరకబడిన, తామరస = తామరయొక్క, కేసర = కింజల్కములను, త్యజోః = విడుచుచున్నవియు, విపరివృత్త-కణ్ఠయోః : విపరివృత్త = వెనుకకు మరల్చబడిన, కణ్ఠయోః = మెడలుగలవియు, క్రన్దతోః = ఆక్రోశిస్తున్నవియు, నిఘ్నయోః = విధిపరాధీనాలైన, చక్రవాకయోః = చక్రవాకముల జంటకు, అల్పమ్ = కొలదియైన, అన్తరమ్ = ఎడబాటు, అనల్పతామ్ = దీర్ఘతను, గతమ్ = పొందినది.

**తా :** కొలనులో చక్రవాకాల మిథునముంది. అవి సగం కొరికిన తామరల కింజల్కాలను విడుస్తున్నాయి. మెడలు త్రిప్పి ఆక్రోశిస్తున్నాయి. విధిపరాధీనాలైన ఆ జంట ఎడబాటు స్వల్పకాలమే అయినా దీర్ఘంగా తోచింది.

**విభక్తులు – క్రియలు :** 1. దష్టతామరసకేసరత్యజోః : త్యజః – **త్యజోః** – త్యజామ్; త్యక్ శబ్దః చకారాన్తః పుంలింగః షష్ఠీద్వివచనమ్; 2. క్రన్దతోః : క్రన్దతః – **క్రన్దతోః** – క్రన్దతామ్; క్రన్దత్ శబ్దః తకారాన్తః పుంలింగః. షష్ఠీద్వివచనమ్; 3. విపరివృత్తకణ్ఠయోః : కణ్ఠస్య – **కణ్ఠయోః** – కణ్ఠానామ్; విపరివృత్తకణ్ఠశబ్దః అకారాన్తః పుంలింగః. షష్ఠీద్వివచనమ్; 4. నిఘ్నయోః : నిఘ్నస్య – **నిఘ్నయోః** – నిఘ్నానామ్; నిఘ్నశబ్దః అకారాన్తః పుంలింగః. షష్ఠీద్వివచనమ్; 5. సరసి : **సరసి** – సరసోః – సరస్సు; సరస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 6. అల్పమ్ : **అల్పమ్** – అల్పే – అల్పాని; అల్పశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. అన్తరమ్ : **అన్తరమ్** – అన్తరే – అన్తరాణి; అన్తర శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 8. అనల్పతామ్ : **అనల్పతామ్** – అనల్పతే – అనల్పతాః; అనల్పతా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 9. గతమ్ : **గతం** – గతే – గతాని; గతశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. క్రన్దతోః+విపరి = క్రన్దతోర్విపరి = విసర్గసంధి; 2. చక్రవాకయోః+అల్పమ్ = చక్రవాకయోరల్పమ్ = విసర్గసంధి.

**సమాసాలు :** 1. దష్టం తామరసస్య కేసరం త్యజతః ఇతి దష్టతామరసకేసరత్యజౌ, తయోః, దష్టతామరసకేసరత్యజోః; 2. విపరివృత్తౌ కణ్ఠౌ యయోః తయోః, విపరివృత్తకణ్ఠయోః

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**చక్రవాకః :** 'చక్ర ఇత్యాఖ్యయా ఉచ్యతేఽసౌ । వచ్+కర్మణి ఘఞ్, తతో 'న్యంక్వాదీనాం చ' ఇతి కుత్వమ్. పక్షివిశేషః ....'చక్రవాకాస్తథాన్యే చ ఖగాః సన్త్యంబుచారిణః" ఇతి చరకః" – హలాయుధకోశః

ప్రకృతి వర్ణనలలో కాళిదాసకవితలో చక్రవాకవర్ణన అనివార్యమన్నట్లు కనిపిస్తుంది. కుమారసంభవంలోనే తృతీయసర్గలో...

శ్లో॥ దదౌ సరః పంకజరేణుగన్ధి – గజాయ గండూషజలం కరేణుః ।
**అర్ధోపభుక్తేన బిసేన జాయాం – సమ్భావయామాస రథాంగనామా** ॥–3/37

వసంతవిజృంభణను వర్ణిస్తూ చక్రవాకాలకూ స్థానమిచ్చాడు.

శ్లో॥ పరస్పరాక్రందిని చక్రవాకయోః – పురో వియుక్తే మిథునే కృపావతీ ।
– కుమారసంభవమ్ – శబ్దకల్పద్రుమః

అష్టమసర్గలోనే (51) పరమేశ్వరునకు ఉపమానంగా చక్రవాకాన్నే స్వీకరించాడు.

"కిం న వేత్సి సహధర్మచారిణం, చక్రవాకసమవృత్తిమాత్మనః".

**రసమా? రసాభాసమా?**

**శ్లో॥ ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపి వా ।**
**యోషితో బహుసక్తిశ్చేద్రసాభాసస్త్రిధా మతః ॥**

అని ఆలంకారికులు తిర్యగ్గతమైన రతిని రసాభాసమన్నారు. ఇది ప్రాచీనశ్లోకం. దీనిపై విభిన్నస్థాయులలో చర్చలు జరిగాయి. ఏకావళీకారుడైన విద్యాధరుడు విభావాదిరససామగ్రి ఉన్నందువల్ల "దదౌ సరః పంకజ.." ఇత్యాది శ్లోకాలలోని రతి రసమే అన్నాడు. సింగభూపాలుడు రసార్ణవసుధాకరంలో విభావాదిస్థితి అక్కడ వున్నా విభావాది జ్ఞానం అక్కడ ఉండదు కాబట్టి అది రసాభాసమే అన్నాడు.

"అపరే తు రసాభాసం తిర్యక్షు ప్రచక్షతే । తత్ న పరీక్షా క్షమమ్ । తేష్వపి విభావాది సమ్భవాత్ । విభావాది జ్ఞానశూన్యాః తిర్యంచః న భాజనం. భవితుమర్హన్తి రసస్య ఇతి చేత్ । న । మనుష్యేష్వపి కేషుచిత్ తథాభూతేషు రసవిషయాభాసప్రసంగాత్ । అత్ర విభావాది సమ్భవోఽపి రసం ప్రతిప్రయోజకః । న విభావాదిజ్ఞానమ్. తతశ్చ తిరశ్చామస్త్యేవ రసః " – సింగభూపాలుని మాటలలో విద్యాధరమతం.

సింగభూపాలుని ఖండనం –

"న తావత్ తిరశ్చాం విభావత్వముపపద్యతే । శృంగారే హి సముజ్జ్వలస్య శుచినో దర్శనీయస్యైవ వస్తునో మునినా విభావత్వే నామ్నానాత్. .... తర్హి విభావాది జ్ఞానరహితేషు మనుష్యేషు రసాభాసప్రసంగ ఇతి చేత్ । నైష దోషః । కించ విభావాది సంభవోఽపి రసం ప్రతి ప్రయోజకః న హి విభావాదిజ్ఞానమిత్యేతద్ న యుజ్యతే ॥ –రసార్ణవసుధాకరః ద్వితీయోల్లాసం.

ఇది సాంకేతిక చర్చ మాత్రమే. సాంప్రదాయికంగా వస్తున్న రసాభాస (శృంగారాభాస) కు సంబంధించి కవులు మాత్రం తిర్యక్కులలో వివిధ రస వర్ణనలను మానలేదు. ఆలంకారికులూ అది ఆస్వాదనకు తగదనీ చెప్పలేదు. కాకపోతే ఏ రూపంలో ఆస్వాదిస్తున్నామన్నదే చర్చ. అందువల్లనే ఆనందవర్ధనుడు

**శ్లో॥ రస భావ తదాభాస భావశాన్త్యాదిరక్రమః ।**
**ధ్వనేరాత్మాంగిభావేన భాసమానో వ్యవస్థితః ॥** అని రసాభాస, భావాభాసాలను కూడా అలక్ష్యక్రమధ్వనులుగానే పరిగణించాడు.

*

**శ్లో॥ స్థానమాహ్నికమపాస్య దన్తినస్సల్లకీవిటపభఙ్గవాసితమ్ ।**
**ఆవిభాతచరణాయ గృహ్ణతే వారి వారిరుహరుద్ధషట్పదమ్ ॥ 33**

**అవ :** జలపానానికి వచ్చిన గజయూథవర్ణన.

**ప.వి. :** స్థానమ్ ఆహ్నికమ్ అపాస్య దన్తినః సల్లకీ-విటప-భంగ-వాసితమ్ ।
ఆ విభాత-చరణాయ గృహ్ణతే వారి వారిరుహ-రుద్ధ-షట్పదమ్ ॥

**అన్వ :** దన్తినః ఆహ్నికం స్థానమ్ అపాస్య ఆవిభాతచరణాయ సల్లకీవిటపభంగవాసితం వారిరుహరుద్ధషట్పదం వారి గృహ్ణతే.

**ప్ర :** దన్తినః = ఏనుగులు, ఆహ్నికమ్ = పగటికి తగిన, స్థానమ్ = స్థానాన్ని, అపాస్య = వీడి, ఆవిభాత-చరణాయ : ఆవిభాత = ఉదయం వరకూ, చరణాయ = సంచరించ-టానికి, సల్లకీ... వాసితమ్ : సల్లకీ-విటప = సల్లకీలతయొక్క, భంగ = తునకలచే, వాసితమ్ = పరిమళితమై, వారి... షట్పదమ్ : వారిరుహ = తామరలచే, రుద్ధ = ఆపబడిన, షట్పదమ్ = తుమ్మెదలుగల, వారి = నీటిని, గృహ్ణతే = గ్రహిస్తున్నాయి.

**తా :** ఏనుగులు (సంధ్యాకాలమైంది కాబట్టి) పగలు సంచరించటానికి తగిన ప్రదేశాన్ని వదలి తెలవారే వరకు చర్వణ చేయటానికి సరిపడా నీటిని గ్రహించి వెళ్తున్నాయి. ఆ నీరు సల్లకీలతా తునకల పరిమళం గలది. తామరలను తుమ్మెదలను తమలో బంధించినందువల్ల ఆ ప్రతిబంధకం లేనిది కూడా.

**విభక్తులు - క్రియలు :** 1. స్థానమ్ : **స్థానం** - స్థానే - స్థానాని; స్థానశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 2. ఆహ్నికమ్ : **ఆహ్నికమ్** - ఆహ్నికే - ఆహ్నికాని; ఆహ్నికశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 3. అపాస్య - అవ్యయమ్ అపపూర్వకాత్ అస్ ధాతోః ల్యప్ ప్రత్యయః; 4. దన్తినః : దన్తీ - దన్తినౌ - **దన్తినః**; దన్తిన్‌శబ్దః నకారాన్తః పులింగః ప్రథమా బహువచనమ్; 5. వాసితమ్ : **వాసితం** - వాసితే - వాసితాని; వాసిత శబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 6. ఆవిభాతచరణాయ : **చరణాయ** - చరణాభ్యాం - చరణేభ్యః; చరణశబ్దః అకారాన్తః నపుంసకలింగః. చతుర్థ్యేకవచనమ్; 7. గృహ్ణతే : గృహ్ణీతే - గృహ్ణాతే - **గృహ్ణతే**; గ్రహ ఉపాదానే ధాతోః ఆత్మనేపది లటి ప్రథమపురుషబహువచనమ్; 8. వారి : **వారి** - వారిణీ - వారీణి; వారిశబ్దః ఇకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 9. వారిరుహరుద్ధషట్పదమ్ : **షట్పదం** - షట్పదే - షట్పదాని; వారిరుహరుద్ధషట్పద శబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్.

**సమాసాలు :** 1. సల్లక్యాః విటపాః, తేషాం భంగాః, తైః వాసితమ్ - సల్లకీవిటపభంగ-వాసితమ్; 2. విభాతాదారభ్య ఆవిభాతం, తచ్చ తత్ చరణం, తస్మై - ఆవిభాతచరణాయ; 3. వారిణి రోహతి ఇతి వారిరుహమ్, తేన, రుద్ధాః షట్పదాః యస్మిన్ తత్ = వారిరుహరుద్ధ షట్పదమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఆహ్నికమ్ :** "అహ్నా నిర్వృత్తమ్ (ఆహ్నికమ్). అహన్+ఠఞ్।" - దినసాధ్యమనీ, భోజనమనీ కూడా అర్థం. ఆహ్నికస్థానాన్ని వీడి ఏనుగులు జలాశయాల దగ్గరకు వచ్చి జలాన్ని గ్రహిస్తున్నాయి. వివరణవ్యాఖ్య ఇలా అన్నది - "దివసావసానేషు తు సరోవరమవగాహ్య భక్షితానురూపం జలం పిబన్తి. యథోక్తం పాలకాప్యే -

**శ్లో॥ ఆతపభీతా నాగా వనభువి తరుషండమండితే కుహచిత్ ।**
**అతివాహయన్తి దివసాన్ సలిలం గృహ్ణన్తి సన్ధ్యాసు ॥**

**సల్లకీ :** ఏనుగులు ఆహారంగా ఇష్టపడే తీగ.

"సత్కృత్య లక్ష్యతే స్వాద్యతే గజైరితి । సత్+లక+క్వున్ । గౌరాదిత్వాత్ ఙీష్ । స్వనామవృక్ష విశేషః...

శల్యతే శ్లాఘ్యతే గజైరితి శల్లకీ । ... 'శ్వాదిద్రుభేదౌ శల్లక్యౌ శంకా త్రాస వితర్కయో' రితి తాలవ్యాదౌ రభసః । సలతి గచ్ఛతి. సలగతౌ దన్త్యాదిః ణకః భౌవాదిః **నిపాతనాత్ లస్య ద్విత్వమ్.** ... ... సల్లకీ సిల్లకీ హ్లాదేతి రుద్రః ఇతి స్వామీ ఇత్యమరటీకాయాం భరతః" - శబ్దకల్పద్రుమః.

**శ్లో॥ గన్ధినీ గజభక్ష్యా తు సువహా సురభీ రసా ।**
**మహేరణా కున్దురుకీ సల్లకీ హ్లాదినీతి చ ॥** - ఇత్యమరకోశః.

**స్వభావోక్తి - రసానుగుణత :** ఈ శ్లోకంలో దన్తిస్వభావవర్ణనముంది. "**స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్**" అని స్వభావోక్తి లక్షణం. ఇది జాతిగతస్వభావ వర్ణణం. అయితే ఇది ప్రకృతశృంగారరసానికి ఎంతవరకు సహకరిస్తుందని ఆలోచించవలసి యుంది.

'వారిరుహరుద్ధషట్పదమ్' అని నీటికి విశేషణం. దానివలన "వారిరుహరుద్ధషట్పద మిత్యనేన భ్రమరబాధారాహిత్యముక్తమ్" అని ప్రకాశికా వ్యాఖ్య. దానితో భ్రమరబాధ తొలగినా ఏనుగులకు, భ్రమరాలు స్వేచ్ఛను కోల్పోవటం ధ్వనిస్తుంది. శృంగార ప్రవృత్తుడైన పరమేశ్వరునిలోనూ స్వేచ్ఛారాహిత్యం అనురణన రూపంలో ధ్వనిస్తుంది. అది రసప్రవృత్తికీ, పోషణకు అంతగా అనుకూలించదు.

అభిజ్ఞానశాకున్తలంలో భ్రమరస్వభావాన్ని వర్ణించిన కాళిదాసు అత్యద్భుతంగా అక్కడ రసానుగుణత్వాన్ని సాధించాడు. ఒక తుమ్మెద శకుంతల దగ్గరగా ఎగురుతున్న దృశ్యాన్ని దుష్యంత భావనలో ఇలా వర్ణిస్తాడు కాళిదాసు-

**శ్లో॥ చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం**
**రహస్యాఖ్యాయీవ స్వనసి మృదుకర్ణాంతికచరః ।**
**కరౌ వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం**
**వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాస్త్వం ఖలు కృతీ ॥** - ప్రథమాంకం - 20

ఇక్కడ భ్రమరస్వభావోక్తి వర్ణన తద్వారా ధ్వనిస్తున్న వ్యతిరేకాలంకారం దుష్యంతుని లోని పూర్వరాగవిప్రలంభానికి పోషకాలవుతాయి. *

**శ్లో॥ పశ్య పశ్చిమదిగన్తలమ్బినా నిర్మితం మితకథే! వివస్వతా ।**
**దీర్ఘయా ప్రతిమయా సరోమ్భసాం తాపనీయమివ సేతుబన్ధనమ్ ॥ 34**

**అవ :** సూర్యుడు పడమటివైపు వాలుటను వర్ణించటం.

**ప.వి. :** పశ్య పశ్చిమ-దిగ్-అన్త-లమ్బినా నిర్మితం మిత-కథే! వివస్వతా ।
దీర్ఘయా ప్రతిమయా సరః+అమ్భసాం తాపనీయమ్ ఇవ సేతు-బన్ధనమ్॥

**అన్వ :** మితకథే! పశ్చిమదిగన్తలమ్బినా వివస్వతా దీర్ఘయా ప్రతిమయా సరోమ్భసాం తాపనీయం సేతుబన్ధనం నిర్మిత మివ. పశ్య!

**ప్ర :** మిత-కథే! = మితభాషిణి!, పశ్చిమ... లమ్బినా : పశ్చిమదిక్ = పడమటి దెసయొక్క, అన్త = చివరను, లమ్బినా = ఆశ్రయించియున్న, వివస్వతా = సూర్యునిచేత, దీర్ఘయా = పొడవైన, ప్రతిమయా = నీడతో, సరః+అమ్భసామ్ = కొలనులోని నీటికి, తాపనీయమ్ = సువర్ణమయమైన, సేతు-బన్ధనమ్ = వంతెనను కట్టుటను, నిర్మితమ్ ఇవ = పూర్తిచేసి నట్టుంది. పశ్య = చూడు.

**తా :** (పార్వతి!) మితభాషిణి! చూడు. సూర్యుడు పడమటిదెస కొసన వ్రేలాడుతూ పొడవైన తన నీడతో కొలనులోని నీటిపై బంగారు వంతెన కట్టినట్టుంది.

**విభక్తులు - క్రియలు :** 1. పశ్య : **పశ్య**/పశ్యతాత్ - పశ్యతం - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 2. పశ్చిమదిగన్తలమ్బినా : **లమ్బినా** - లమ్బిభ్యాం - లమ్బిభిః; లమ్బిన్ శబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 3. నిర్మితమ్ : **నిర్మితం** - నిర్మితే - నిర్మితాని; నిర్మితశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 4. మితకథే! : **మితకథే!** - మితకథే - మితకథాః; మితకథా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః.

సంబోధన ప్రథమైకవచనమ్; 5. వివస్వతా : **వివస్వతా** - వివస్వద్భ్యాం - వివస్వద్భిః ; వివస్వత్ శబ్దః తకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 6. దీర్ఘయా : **దీర్ఘయా** - దీర్ఘాభ్యాం - దీర్ఘాభిః; దీర్ఘాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 7. ప్రతిమయా; **ప్రతిమయా** - ప్రతిమాభ్యాం - ప్రతిమాభిః; ప్రతిమాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 8. సరోమ్బుసామ్ : అమ్బుసః - అమ్బుసోః - **అమ్బుసామ్** - అమ్బుస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః. షష్ఠీబహువచనమ్; 9. తాపనీయమ్ : **తాపనీయం** - తాపనీయే - తాపనీయాని; తాపనీయశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. సేతుబన్ధనమ్ : **బన్ధనం** - బన్ధనే - బన్ధనాని; సేతుబన్ధనశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. పశ్చిమా చ సా దిక్, తస్యాః అన్తే లమ్బితుం శీలమ్ అస్య, పశ్చిమదిశావలమ్బీ, తేన; 2. మితా కథా యస్యాః, తస్యాః సంబుద్ధౌ, మితకథే!; 3. సరసామ్ అమ్బుః, తేషామ్, సరోమ్బుసామ్; 4. సేతోః బన్ధనమ్, సేతుబన్ధనమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**పశ్చిమమ్ :** పశ్చాద్భవం "అగ్రాది పశ్చాద్ డిమచ్" ఇతి డిమచ్. పశ్చాద్భవమ్ "తదాత్మసమ్భవం రాజ్యే మన్త్రివృద్ధాః సమాదధుః । స్మరన్తః **పశ్చిమా**మాజ్ఞాం భర్తుః సంగ్రామయాయినః"॥ ఇతి రఘౌ - 17/8 హలాయుధకోశః.

**తాపనీయమ్ :** "ఉపనిషద్భేదే । ఉపనిషచ్ఛబ్దే 1222 పృదృశ్యమ్. గోపాలతాపనీయః, నృసింహతాపనీయః । తపనీయస్య స్వర్ణస్య వికారః అణ్. స్వర్ణమయే త్రి. "**తాపనీయే తథా ఘణ్టే కక్షోపరివిలమ్బితే -** " హరివంశ 37 అధ్యాయః. జాతరూపేభ్యః పరిమాణే అణ్. స్వర్ణనిష్కపరిమాణే సువర్ణే న" - వాచస్పత్యమ్.

**ఉత్ప్రేక్షాలంకారం : 'సంభావనా స్యాదుత్ప్రేక్షా'** అని ఉత్ప్రేక్షాలంకారలక్షణం. పడమటి-నుండి తూర్పువరకు వ్యాపించిన ప్రతిబింబాన్ని తాపనీయసేతుబన్ధనంగా భావించటం చేత ఇది ఉత్ప్రేక్షా. ఉత్ప్రేక్షాహేతువైన ప్రతిమను కూడా ప్రతిపాదించినందువలన ఉక్త విషయస్వరూపోత్ప్రేక్షాలంకార మిక్కడ. *

**శ్లో॥ ఉత్తరన్తి వినికీర్య పల్వలం గాఢపఙ్కమతివాహితాతపాః ।**
**దంష్ట్రిణో వనవరాహయూథపా దష్టభఙ్గురబిసాఙ్కురా ఇవ ॥ 35**

**అవ :** వనవరాహ వర్ణన.

**ప.వి. :** ఉత్తరన్తి వినికీర్య పల్వలం - గాఢ-పంకమ్ అతివాహిత+ఆతపాః ।
దంష్ట్రిణః వన-వరాహ-యూథపాః - దష్ట-భంగుర-బిస+అంకురాః ఇవ ॥

**అన్వ :** వన...యూథపా అతి....తపాః (సన్తః) గాఢ.. పల్వలం వినికీర్యదష్ట.. విషాంకురాః దంష్ట్రిణః ఇవ ఉత్తరన్తి.

**ప్ర :** వన... యూథపాః : వన–వరాహ = అడవిపందులయొక్క, యూథ–పాః = గుంపుల కధిపతులు, అతివాహిత+ఆతపాః : అతివాహిత = గడిపివేయబడిన, ఆతపాః (సన్తః) = ఎండగలవై, గాఢ–పంకమ్ = నిండా బురదగల, పల్వలమ్ = గుంటలను, వినికీర్య = కలతబెట్టి, దష్ట... కురాః : దష్ట = కొరకబడి, భంగుర = తునిగిపోయిన, బిస = తామరతూళ్ళయొక్క, అంకురాః = మొలకలు గలవై, దంష్ట్రిణ ఇవ = కోరలుగలవన్నట్లుగా, ఉత్తరన్తి = పైకి వస్తున్నాయి.

**తా :** అడవిపందులకు రాజులు పగలంతా నిండైన బురదగుంటలలోని బురదలో గడిపి ఆ గుంటలను కల్లోలపరచి పైకి లేస్తున్నాయి. ఆ గుంటలలోని తామరతూళ్ళను కొరికి ఆ తామరతూళ్ళ ముక్కలు వాటి ముఖాన కోరలవలె కనిపిస్తున్నాయి.

**విభక్తులు – క్రియలు :** 1. ఉత్తరన్తి : ఉత్తరతి – ఉత్తరతః – **ఉత్తరన్తి**; ఉత్ పూర్వకాత్ తౄ ప్లవనతరణయోః ఇతి ధాతోః లటి ప్రథమపురుషబహువచనమ్; 2. వినికీర్య : వి, ని ఉపసర్గ ద్వయపూర్వక కౄ విక్షేపే ధాతోః ల్యప్ ప్రత్యయః; 3. పల్వలమ్ : **పల్వలం** – పల్వలే – పల్వలాని; పల్వల శబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 4. గాఢపంకమ్ : **పంకం** – పంకే – పంకాని; పంకశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 5.అతివాహితాతపాః : ఆతపః – ఆతపౌ – **ఆతపాః**; ఆతపశబ్దః అకారాన్తః పుంలింః. ప్రథమాబహువచనమ్; 6. దంష్ట్రిణః : దంష్ట్రీ – దంష్ట్రిణౌ – **దంష్ట్రిణః**; దంష్ట్రిన్ శబ్దః నకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 7. వనవరాహయూథపాః : యూథపః – యూథపౌ – **యూథపాః**; యూథపశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 8. దష్టభంగురబిసాంకురాః : అంకురః – అంకురౌ – **అంకురాః**; అంకురశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్; 9. ఇవ – అవ్యయమ్.

**సంధులు :** 1. దంష్ట్రిణః+వన = దంష్ట్రిణోవన = విసర్గసంధి; 2. అంకురాః+ఇవ = అంకురా ఇవ = విసర్గలోపసంధి; 3. యూథాపాః+దష్ట = యూథపా దష్ట = విసర్గసంధి.

**సమాసాలు :** 1. అతివాహితః ఆతపః యై స్తే, అతివాహితాతపాః; 2. వనే (విద్యమానాః) వరాహాః, తేషాం యూథమ్, తాని పాన్తి ఇతి, వనవరాహయూథపాః; 3. దష్టాః చ తే భంగురాః దష్టభంగురాః, బిసానామ్ అంకురాః యై తే, దష్టభంగుర బిసాంకురాః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**పల్వలమ్ :** పలతి గచ్ఛతి పిబత్యస్మిన్ వా పల గతౌ పా పానే వా। "సానసి వర్ణసి పర్ణసి తండులాంకుశచషాలేల్వలపల్వలధిష్ణ్యశల్యాః" (ఉణాది 4/107) ఇతి నిపాతనాత్ వలచ్ ప్రత్యయేన సిద్ధమ్. అల్పసరః ఇత్యమరః... తస్య లక్షణం యథా -

**శ్లో॥ అల్పం సరః పల్వలం స్యాద్యత్ర చంద్రర్షగే రవౌ ।**
**న తిష్ఠతి జలం కించిత్తత్రత్యం వారి పల్వలమ్ ॥**

తజ్జలగుణాః - 'పాల్వలం వార్యభిష్యన్ది గురు స్వాదు త్రిదోషకృత్.' ఇతి భావప్రకాశః । "పాల్వలం గుర్వభిష్యన్ది విష్టమ్భిదోషలం పరమ్" ఇతి రాజవల్లభః - శబ్దకల్పద్రుమః

**వరాహస్వభావం :** "అత్ర యూథపానాముత్తరణవచనేన యూథానామప్యుత్తరణమర్థాదుక్తం భవతి । ఆతపభీతాః వరాహాః పల్వలేషు ఆతపసమయమతివాహ్య దినావసానే పల్వలా-దుద్గచ్ఛన్తీత్యర్థః । అయం చ వరాహాణాం స్వభావః । ఉక్తం చ రఘువంశే... 'స పల్వలోత్తీర్ణవరాహయూథాని' ఇతి " - వివరణవ్యాఖ్య.

**రఘువంశం -**

శ్లో॥ **సపల్వలోత్తీర్ణవరాహయూథా -** న్యావాసవృక్షోన్ముఖబర్హిణాని ।
యయౌ మృగాధ్యాసితశాద్వలాని - శ్యామాయమానాని వనాని పశ్యన్॥2/16

అభిజ్ఞానశాకున్తలంలో కూడా దుష్యంతవచనాల్లో వరాహయూథాల **ముస్తాక్షతి** వర్ణన కనిపిస్తుంది-

శ్లో॥ గాహన్తాం మహిషా నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం రోమన్థమభ్యస్యతు ।
**విస్రబ్ధం క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే**
విశ్రామం లభతామిదం చ శిథిలజ్యాబన్ధమస్మద్ధనుః ॥ -ద్వితీయాంకం - 6

**ఉత్ప్రేక్షాలంకారం :** వరాహాలు కోరలు కలిగివున్నట్లుగా కనిపిస్తున్నాయట. అలా ఉత్ప్రేక్షించటానికి కారణం తామరతూళ్ళు వాటి నోళ్ళకు అటూ ఇటూ వ్రేలాడటం అవి తెల్లగా ఉండటం. "**బిసాంకురాణాం ధావళ్యం నిశితాగ్రత్వం చ ఉత్ప్రేక్షాబీజమ్.**" (వివరణవ్యాఖ్య). కాబట్టి ఆ పందులకు కోరలు వచ్చినట్లున్నాయనటం **స్వరూపోత్ప్రేక్షా-లంకారం.**

*

**శ్లో॥ ఏష వృక్షశిఖరే కృతాస్పదో జాతరూపరసగౌరమణ్డలమ్ ।**
**హీయమానమహరత్యయాతపం పీవరోరు! పిబతీవ బర్హిణః ॥ 36**

**అవ :** చెట్లపై వ్రాలియున్న మయూరవర్ణన.

**ప.వి. :** ఏషః వృక్ష-శిఖరే కృత+ఆస్పదః జాతరూప-రస-గౌర-మణ్డలమ్ ।
హీయమానమ్ అహః+అత్యయ+ఆతపమ్ పీవర+ఉరు! పిబతి+ఇవ బర్హిణః॥

**అన్వ :** పీవరోరు! ఏషః బర్హిణః వృక్షశిఖరే కృతాస్పదః (సన్) హీయమానం జాత-రూపరసగౌరమణ్డలమ్ అహరత్యయాతపం పిబతి ఇవ.

**ప్ర :** పీవర+ఊరు! = బలిసిన తొడలు గలదానా!, ఏషః = ఈ, బర్హిణః = నెమలి, వృక్ష-శిఖరే = చెట్టు కొనన, కృత+ఆస్పదః (సన్) = నెలవు చేసికొని, హీయమానమ్ = క్షీణిస్తున్న, జాత... మండలమ్ : జాతరూప = బంగారంయొక్క, రస = ద్రవంచేత, గౌర = పసుపుపచ్చనైన, మండలమ్ = వర్తులం గల, అహ... తపమ్ : అహః = పగటియొక్క, అత్యయ = ముగిసిపోవుటయందలి, ఆతపమ్ = ఎండను, పిబతి ఇవ = త్రాగుతున్నట్టుంది.

**తా :** పీవరోరు! నెమలి చెట్టుచివరన తావు చేసికొని నిలిచి, బంగారు రసంతో గీచిన మండలం గలిగి క్షీణిస్తున్న పగటి ఎండను త్రాగుతున్నట్లుంది.

**విభక్తులు - క్రియలు :** 1. ఏషః : **ఏషః** - ఏతౌ - ఏతే; ఏతచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 2. వృక్షశిఖరే : **శిఖరే** - శిఖరయోః - శిఖరేషు; శిఖరశబ్దః అకారాన్తః పుం/నపుంసకలింగః. సప్తమ్యేకవచనమ్; 3. కృతాస్పదః : **ఆస్పదః** - ఆస్పదౌ - ఆస్పదాః; కృతాస్పదశబ్ద - అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 4. జాతరూపరసగౌరమండలః : **మండలః** - మండలౌ - మండలాః; ... గౌరమండలశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 5. హీయమానమ్ : **హీయమానం** - హీయమానౌ - హీయమానాన్; హీయమానశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైక-వచనమ్; 6. అహరత్యయాతపమ్ : **ఆతపమ్** - ఆతపౌ - ఆతపాన్; ఆతపశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 7. పీవరోరు : **పీవరోరు** - పీవరోరూ - పీవరోరవః; పీవరోరుశబ్దః ఉకారాన్తః స్త్రీలింగః సంబోధన ప్రథమైకవచనమ్; 8. పిబతి : **పిబతి** - పిబతః - పిబన్తి - పా పానే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 9. ఇవ - అవ్యయమ్; 10. బర్హిణః : **బర్హిణః** - బర్హిణౌ - బర్హిణాః; బర్హిణశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. కృతాస్పదః+జాత = కృతాస్పదో జాత = విసర్గసంధి; 2. పిబతి+ఇవ = పిబతీవ = సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. వృక్షస్య శిఖరః, తస్మిన్, వృక్షశిఖరే; 2. కృతమ్ ఆస్పదం యేన సః, కృతాస్పదః; 3. జాతరూపస్య రసః, తద్వత్ గౌరం మండలం యస్య సః, జాతరూపరస-గౌరమణ్డలః; 4. అహ్నః అత్యయః, తస్మిన్ ఆతపః, తమ్, అహరత్యయాతపమ్; 5. పీవరౌ ఊరూ యస్యాః, తస్యాః సంబుద్ధౌ, పీవరోరు.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**జాతరూపమ్ :** జాతం ప్రశస్తం రూపం యస్య - **స్వర్ణమ్.** యథా భాగవతే 1/17/38 "పునశ్చ యాచమానాయ జాతరూపమదాత్ ప్రభుః"। దుస్తూరః ఇత్యమరః, ఉత్పన్నరూపే త్రి । యథా నైషధే - 'న **జాతరూపచ్ఛదజాతరూపతా** ద్విజస్య దృష్టేయమితి స్తువన్ ముహుః' - శబ్దకల్పద్రుమః.

**పీవరోరుః :** పీవరౌ ఊరూ యస్యాః సా పీవరోరుః.

పార్యతే వర్ధతే ఇతి పీవరః. ప్యైఙ్+"ఛిత్వరఛత్వరధీవరపీవరమీవరచీవరతీవర నీవరగహ్వరకన్దరసంయద్వరాః" ఉణా-3-1-ష్వరచ్, సమ్ప్రసారణం దీర్ఘశ్చ. ఉపచితావయవః

శ్లో॥ భయపిహితం బాలాయాం పీవరమూరుద్వయం స్మరోన్నిద్రః ।
నిద్రాయాం ప్రేమార్ద్రః పశ్యతి నిఃశ్వస్య నిఃశ్వస్య ॥ - ఆర్యా సప్తశతీ - 420

పీవరశబ్దం విశేషణమై మూడు లింగాలలోనూ ఉంటుంది. పుంలింగమాత్రంలోని పీవరపదం నామవాచన. తామసమన్వన్తరంలోని సప్తర్షులలో ఒకరు.

శ్లో॥ జ్యోతిర్ధామా పృథుః కావ్యశ్చైత్రోఽగ్నిర్వలకస్తథా ।
**పీవరశ్చ** తథా బ్రహ్మన్ సప్తసప్తర్షయోఽభవన్ ॥ - మార్కండేయపురాణం-74/59

**సుయోధనుడు పీవరోరువు :**

సాధారణంగా కవులు స్త్రీలనే పీవరోరువులుగా వర్ణిస్తుంటారు. వ్యాసమహర్షి మహాభారతంలో సుయోధనుని పీవరోరువుగా వర్ణించాడు.

శ్లో॥ ఏవముక్త్వా తు కౌంతేయమపోహ్య వసనం స్వకమ్ ।
స్మయన్నవేక్ష్య పాంచాలీమ్ ఐశ్వర్యమదమోహితః ॥

శ్లో॥ **కదలీస్తంభసదృశం** సర్వలక్షణసంయుతమ్ ।
గజహస్తప్రతీకాశం వజ్రప్రతిమగౌరవమ్ ॥

శ్లో॥ అభ్యుత్స్మయిత్వా రాధేయం భీమమాధర్షయన్నివ ।
ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః **సవ్యమూరు**మదర్శయత్ ॥ - సభాపర్వ 71/10-12

ఈ మూలాన్ని గమనించనందువలన ఆ సందర్భంలో భీముని ప్రతిజ్ఞను

ధారుణి రాజ్యసంపదమదంబునఁగోమలిఁగృష్ణఁజూచి రం-
భోరునిజోరుదేశమున నుండగఁబిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తితచండగదాభిఘాత భ-
గ్నోరుతరోరుఁజేయుదు సుయోధనునుగ్రరణాంతరంబునన్.

– భారతం – సభా – 2/249

నన్నయ పై రీతిగా అనువదించగా (రంభా+ఉరు-నిజ+ఊరుదేశమున) రంభోరు – పదద్వయాన్ని విడగొట్టి దానిని 'కృష్ణ' (ద్రౌపది) పదానికి విశేషణం చేసి చెప్పటం అలవాటయ్యింది. వ్యాఖ్యాతలు కూడా ఆ పొరపాటునకు అవకాశమిచ్చారు తమ వ్యాఖ్యానంలో. "కృష్ణన్ = ద్రౌపదిని, చూచి; రంభా+ఊరున్ = అరటి (బోదెల) వంటి తొడలుగల ఆమెను" ఇది తి.తి.దే. వారి ప్రచురణ. సభా-పుట-2/251. వ్యాఖ్యాత డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య.

*

**శ్లో॥ పూర్వభాగతిమిరప్రవృత్తిభిర్వ్యక్తపఙ్కమివ జాతమేకతః ।**
**ఖం హృతాతపజలం వివస్వతా భాతి కిఞ్చిదివ శేషవత్సరః ॥ 37**

**అవ :** సూర్యాస్తమయ వర్ణన.

**ప.వి. :** పూర్వ-భాగ-తిమిర-ప్రవృత్తిభిః వ్యక్త-పంకమ్ ఇవ జాతమ్ ఏకతః ।
ఖం హృత+ఆతప-జలం వివస్వతా భాతి కించిద్ ఇవ శేషవత్ సరః ॥

**అన్వ :** ఖం పూర్వభాగతిమిరప్రవృత్తిభిః ఏకతః వ్యక్తపంకమ్ జాతమ్. వివస్వతా హృతా-తపజలం కించిదివ శేషవత్ భాతి.

**ప్ర :** ఖమ్ = ఆకాశం, పూర్వ... ప్రవృత్తిభిః : పూర్వభాగ = తూరుపున, తిమిర = చీకట్లయొక్క, ప్రవృత్తిభిః = ప్రవర్తనలచేత, ఏకతః = ఒకప్రక్క, వ్యక్త-పంకమ్ = బురద కనిపిస్తున్న, సరః ఇవ = కొలనులా, జాతమ్ = అయింది. వివస్వతా = సూర్యునిచే, హృత+ఆతప-జలమ్ : హృత = అపహరింపబడిన, ఆతపజలమ్ = ఎండ అనే నీరుగలదై, కించిత్ = కొంచెం, శేషవత్ ఇవ = మిగిలినదన్నట్లు, భాతి = ప్రకాశిస్తోంది.

**తా :** సూర్యుడస్తమిస్తున్న ఆ సమయంలో తూరుపున చీకట్లు వ్యాపించినందువల్ల ఒక వైపు బురద కనిపిస్తున్నా నీటిగుంటలా కనిపిస్తోంది. మరోవైపు సూర్యుడు తన ఎండను ఉపసంహరించినందువల్ల ఎండ అనే నీరు కొంచెం మిగిలియున్నట్లుగా కనిపిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. పూర్వభాగ తిమిరప్రవృత్తిభిః : ప్రవృత్త్యా - ప్రవృత్తిభ్యాం - **ప్రవృత్తిభిః**; ప్రవృత్తి శబ్దః ఇకారాన్తః స్త్రీలింగః. తృతీయాబహువచనమ్; 2. వ్యక్త పంకమ్ : **పంకం** - పంకే - పంకాని; వ్యక్తపంకశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైక-వచనమ్; 3. ఇవ - అవ్యయమ్; 4. జాతమ్ : **జాతం** - జాతే - జాతాని; జాతశబ్దః. అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 5. ఖమ్ : **ఖం** - ఖే - ఖని; ఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 6. హృతాతపజలమ్ : **జలం** - జలే - జలాని; జలశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 7. వివస్వతా : **వివస్వతా** - వివస్వద్భ్యామ్ - వివస్వద్భిః; వివస్వత్ శబ్దః తకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 8. భాతి : **భాతి** - భాతః - భాన్తి; భా దీప్తౌ ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 9. కించిత్ - అవ్యయమ్; 10. సరః : **సరః** - సరసీ - సరాంసి; సరస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. ప్రవృత్తిభిః+వ్యక్తమ్ = ప్రవృత్తిభిర్వ్యక్తమ్, విసర్గసంధి; 2. కించిత్+ఇవ = కించిదివ, జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. పూర్వస్మిన్ భాగే (విద్యమానానం) తిమిరాణాం ప్రవృత్తయః తాభిః పూర్వభాగతిమిరప్రవృత్తిభిః; 2. వ్యక్తం పంకం యస్య తత్ వ్యక్తపంకమ్; 3. జలమివ ఆతపః, హృతం చ తత్ ఆతపజలం యస్య తత్ హృతాతపజలం.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**తిమిరమ్ :** తిమ్యతీతి (తిమిరమ్) । తిమ+'ఇషిమదిముదిఖిదిఛిదిభిదిమన్దిచన్ది **తిమి** మిహి ముహిముచిరుచిరుధిబన్ధిశుషిభ్యః కిరచ్" (ఉణా 1/51) అన్ధకార ఇత్యమరః ।

శ్లో॥ అతీతవాత**స్తిమిరం** బుభుక్షా చాస్తి నిత్యశః ।
భయాని చ మహాన్త్యత్ర అతో దుఃఖతరం వనమ్ ॥ - రామాయణం అయోధ్యా - 28/18

నేత్రరోగవిశేషః అపి - శబ్దకల్పద్రుమః -

**పంకమ్ :** పచ్యతే వ్యాప్యతే క్లిద్యతే వా అనేన ఇతి పంకమ్. పచ్+ఘఞ్ కుత్వం చ. కర్దమః ఇతి.

పాపార్థే పునః పచ్యతే వ్యక్తీక్రియతే దుఃఖమనేన ఇతి విగ్రహే పచి (విస్తారే వ్యక్తీకరణే చ) ఇతి ధాతోః 'హలశ్చ' ఇతి ఘఞ్ ప్రత్యయే కుత్వే చ పంకమితి. యథా **అమ్బాష్టకే**...

శ్లో॥ న్యంకాకరే వపుషి కంకాదిరక్తపుషి కంకాదిపక్షివిషయే ।
త్వం కామనామయసి కిం కారణం హృదయ **పంకారి** మే హి గిరిజామ్ ॥

**ఇవ శబ్దప్రయోగస్థలపరామర్శ :** ఉపమాలంకారమయితే సరః ఇవ అని సరః పదం ప్రక్కన ఇవ పదాన్ని ప్రయోగించాలి కానీ కించిదివ అని దాన్ని కించిత్ ప్రక్కన ప్రయోగించటం క్రమభేదమనే దోషం - దాన్ని విస్తరిస్తూ ప్రకాశిక-

"ఇవ శబ్దస్త్వత్ర కించిన్నిరూప్యతే । తస్య హ్యుపమావాచిత్వే సర ఇవేత్యుపమా నికట ఏవ ప్రయోగో ముఖ్యః । చాదీనాం నిపాతానాం సముచ్చేతవ్యాది నికటే ప్రయోగో నియతః । తథా చోపపాదితమాచార్యేణ మహిమ్నా (వ్యక్తివివేకే క్రమభేదప్రసంగే 2/36 కారికయా)। ఇహ తు సరో విశేషణస్య శోషవదిత్యస్య యద్విశేషణమీషదర్థవాచి కించిదితి, తన్నికటే ప్రయోగః । సః క్రమభేదదుష్ట ఏవ. అథ కించిదిత్యస్య కిమపీత్యర్థః. సరో విశేషణత్వం చ, తర్హి తదేవానుపాదేయమ్ । ఉపమాయానుపయోగిత్వాత్ । తస్మాదివ శబ్దస్య వాక్యాలంకారార్థత్వం యుక్తమ్ । యథా

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యామ్" (కు. 3/54) ఇతి । యథా వా మధ్యం వయః కించిదివ స్పృశన్తీతి।"

ప్రకాశికాకారుని అభిప్రాయంలో ఇవ అన్నది ఈ శ్లోకంలో వాక్యాలంకారం మాత్రమే.

*

**శ్లో॥ ఆవసద్భిరుటజాఙ్గణం మృగైర్మూలసేకసరసైశ్చ వృక్షకైః ।**
**ఆశ్రమాః ప్రవిశదగ్నిధేనవో బిభ్రతి శ్రియముదీరితాగ్నయః ॥ 38**

**అవ :** సంధ్యాకాలంలోని ఆశ్రమాలను వర్ణించటం.

**ప.వి. :** ఆవసద్భిః ఉజట+అంగణం మృగైః మూల-సేక-సరసైః చ వృక్షకైః ।
ఆశ్రమాః ప్రవిశద్-అగ్ని-ధేనవః బిభ్రతి శ్రియమ్ ఉదీరిత+అగ్నయః ॥

**అన్వ :** ప్రవిశదగ్నిధేనవః ఉదీరితాగ్నయశ్చ ఆశ్రమాః ఉటజాంగణమ్ ఆవసద్భిః మృగైః మూలసేకసరసైః వృక్షకైశ్చ శ్రియం బిభ్రతి.

**ప్ర :** ప్రవిశ... ధేనవః : ప్రవిశత్ = ప్రవేశిస్తున్న, అగ్ని-ధేనవః = హోమార్థమై సహకరించు ఆవులు (నవసూతికలు) గలవీ, ఉదీరితాగ్నయః : ఉదీరిత = ప్రణీత (మంత్రములచే సంస్కరింపబడిన), అగ్నయః = అగ్నులు గలవీ అయిన, ఆశ్రమాః = ఆశ్రమాలు, ఉటజ+అంగణమ్ : ఉటజ = పర్ణశాలలయొక్క, అంగణమ్ = మొగసాలలను, ఆవసద్భిః = ఆశ్రయించియున్న, మృగైః = జింకలచేత, మూల... సరసైః : మూల = పాదులయందు, సేక = తడుపుటచేత, సరసైః = ఆర్ద్రమైన నీడలు గలవి అయిన, వృక్షకైః చ = మొక్కలతోనూ, శ్రియమ్ = శోభను, బిభ్రతి = ధరిస్తోంది.

**తా :** ఆశ్రమాలలోని ముంగిళ్ళలో జింకలు ఒకటొకటిగా వచ్చి చేరుతున్నాయి. సాయం సమయంలో పాదులలో పోసిన నీళ్ళవలన ఆ నీడలు రసార్ద్రాలై మొక్కలు శోభిస్తున్నాయి. ఆ రెండింటితో ఆశ్రమాలు అందగిస్తున్నాయి. సాయం సమయహోమనిర్వహణకై అగ్ని ప్రణయనం జరిగింది. హోమధేనువులు ఆశ్రమాలకు మరలుతున్నాయి.

**విభక్తులు - క్రియలు :** 1. ఆవసద్భిః : ఆవసతా - ఆవసద్భ్యామ్ - **ఆవసద్భిః**; ఆవసత్ శబ్దః తకారాన్తః పుంలింగః. తృతీయా బహువచనమ్; 2. ఉటజాంగణమ్ : **అంగణమ్** - అంగణే - అంగణాని; ఉటజాంగణశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైక- వచనమ్; 3. మృగైః : మృగేన - మృగాభ్యాం - **మృగైః**; మృగశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయా బహువచనమ్; 4. మూలసేకసరసైః : సరసేణ - సరసాభ్యాం - **సరసైః**; సరసశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 5. చ - అవ్యయమ్; 6. వృక్షకైః : వృక్షకేణ - వృక్షకాభ్యాం - **వృక్షకైః**; వృక్షకశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 7. ఆశ్రమాః : ఆశ్రమః - ఆశ్రమౌ - **ఆశ్రమాః**; ఆశ్రమశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 8. ప్రవిశదగ్నిధేనవః : ధేనుః - ధేనూ - **ధేనవః**; అగ్నిధేనుశబ్దః ఉకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 9. బిభర్తి : బిభ్రతః - బిభ్రతి - **బిభర్తి**; భృఞ్ భరణే ధాతో లటి ప్రథమపురుషబహువచనమ్; 10. శ్రియమ్ : **శ్రియం** - శ్రియౌ - శ్రియః; శ్రీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయా- బహువచనమ్; 11. ఉదీరితాగ్నయః : అగ్నిః - అగ్నీ - **అగ్నయః**; ఉదీరితాగ్నిశబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్.

**సంధులు :** 1. మృగైః + మూల = మృగైర్మూల - విసర్గసంధి; 2. సరసైః+చ = సరసైశ్చ - విసర్గసంధి; 3. ధేనవః+బిభ్రతి = ధేనవో బిభ్రతి - విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఉటజానామ్ అంగణమ్, ఉటజాంగణమ్; 2. మూలే సేకః, తేన సరసాః తైః, మూలసేకసరసైః; 3. ప్రవిశన్త్యః అగ్నయే ధేనవః యేషు తే, ప్రవిశదగ్నిధేనవః; 4. ఉదీరితాః అగ్నయః యేషు తే, ఉదీరితాగ్నయః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఉటజః :** ఉటాః తృణపర్ణాదయః తేభ్యః జాయతే ఇతి ఉట+జన్+డ - మునీనాం పత్రరచితగృహమ్. తత్పర్యాయః । **పర్ణశాలా** ఇత్యమరః । పర్ణోటజః ఇతి శబ్దరత్నావళీ । యథా రఘుః "ఆకీర్ణమృషిపత్నీనాముటజద్వారరోధిభిః" । **గృహమాత్రమ్** ఇత్యమరమాలా - శబ్దకల్పద్రుమః.

**ధేనుః :** ధయతి లేఢి సుతాన్ ధీయతే వత్సైరితి వా - ధేట్ పానే+"ధేట ఇచ్చ" । ఉణా 3/341 ఇతి నుః ఇశ్చాన్తాదేశః । నవప్రసూతా గౌః । తత్పర్యాయః । నవసూతికా ఇత్యమరః । నవప్రసూతికా ఇతి శబ్దరత్నావళీ ।

దాసీయ దశ ధేనవో యథా-

శ్లో॥ యాస్తు పాపవినాశిభ్యః పఠ్యన్తే దశ ధేనవః ।
తాసాం స్వరూపం వక్ష్యామి నామాని చ ధనాధిప ॥

శ్లో॥ ప్రథమా గుడధేనుః స్యాత్ ఘృతధేనురథాపి వా ।
తిలధేనుస్తృతీయా స్యాత్ చతుర్థీ జలసంజ్ఞికా ॥

శ్లో॥ క్షీరధేనుశ్చ విఖ్యాతా మధుధేనురథాపి వా ।
సప్తమీ శర్కరాధేనుః దధిధేనురథాష్టమీ ॥
రసధేనుశ్చ నవమీ దశమీ స్యాత్స్వరూపతః ॥ - **వరాహపురాణమ్.**

**అగ్నిః :** అంగయన్తి అగ్ర్యం జన్మ ప్రాపయన్తి ఇతి వ్యుత్పత్త్యా హవిః ప్రక్షేపాధికరణేషు గార్హపత్యాహవనీయ, దక్షిణాగ్ని సభ్యావసథ్యౌపాసనాఖ్యేషు షడగ్నిషు । యద్వా అంగతి ఊర్ధ్వం గచ్ఛతి ఇతి । అగి గతౌ । అంగేర్నలోపశ్చేతి నిః, నలోపశ్చ ॥ శబ్దకల్పద్రుమః.

ప్రధానంగా త్రేతాగ్నుల పరిగణనం జరుగుతుంటుంది. "ఉదీరితాః ప్రణీతాః గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నయః... అగ్నిహోమాత్ పూర్వకాలీనమగ్నిహోత్ర-ప్రణయనం నామ వైదికం కర్మ అనేనోచ్యతే । అనేన తత్తత్కాలే తత్తదనుష్ఠానప్రతిపాదనేన మునీనాం ధన్యత్వం ధ్వన్యతే (వివరణవ్యాఖ్య).

**శోభాహేతుచతుష్టయం :** ఆశ్రమాలు శోభను పొందటానికి శ్లోకంలో నాలుగు కారణాలు ఉన్నాయి. మొగసాలలోని జింకలు, తేమగల మొక్కల పాదులు, ప్రవేశిస్తున్న హోమధేనువులు, ప్రణీతాగ్నులు.

మొదటి రెండింటినీ తృతీయావిభక్తితో (మృగైః, వృక్షకైః) కరణాలుగా (క్రియాసిద్ధియందు ప్రకృష్టోపకారకంబు కరణంబు) ప్రదర్శించి మిగిలిన రెండింటి విషయంలో ఆశ్రమాలతో వాటికి సామానాధికరణ్యాన్ని కల్పించి విశేషణాలుగా ప్రదర్శించారు మహాకవి. మొదటి రెండింటికీ శాబ్దికంగా కరణత్వం సిద్ధిస్తే మిగిలినవి ఆర్థికాలు అయ్యాయి. ఇది క్రమభంగమని ప్రకాశికా వ్యాఖ్యాకారుడు

"అత్ర శ్రీభరణహేతవశ్చత్వారః । తత్ర శాబ్దత్వేన ద్వావుపాదాయ కిమిత్యార్థత్వేన అన్యౌ ఉపాత్తవానితి న జ్ఞాయతే । ప్రప్రకమాభేదస్తు సుభగః "

అయితే వివరణవ్యాఖ్యాత ఆ శాబ్దికార్థికభేదంతో ప్రతిపాదించటాన్ని సహేతుకంగా సమర్థించాడు.

"అత్ర ఆశ్రమాణాం శ్రీభరణే చత్వారః చత్వారః హేతవః। తత్రాద్యం హేతుద్వయం దృష్టోపయోగి. ద్వితీయం చ అదృష్టోపయోగి ఇతి విభాగం దర్శయితుం ఆద్య హేతుద్వయం మృగవృక్షైశ్చ శోభన్తే ఇతి శబ్దత ఏవ నిర్దిష్టమ్. అన్యత్ పునరాశ్రమ-విశేషణత్వేన అర్థాదితి న ప్రక్రమభేదదోషమావహతి । న హి **వైదికోఽయ మగ్నిహోత్రహోమః మృగాగమన, వృక్షసేచనతుల్యకక్ష్యః** । యే మృగైర్వృక్షైః ధేనుభిరగ్నిభిశ్చ శ్రియం బిభ్రతీత్యేకవాక్యతా స్యాదిత్యలమతి - విస్తరేణ"-

మరికొంత ఆలోచిద్దాం.

**"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సమ్భూతః । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోఽన్నమ్ । అన్నాత్పురుషః"** అని ఉపనిషద్వచనం. ఆ ఓషధుల సహకారంతోనే అగ్నిహోత్ర నిర్వహణం. హోమంలో మంత్రాలు అమూర్తోపకరణాలైతే ఓషధులు (వృక్షసంబంధులు) మూర్తోపకరణాలు. వాటికి అగ్నిహోత్రహోమంతో తుల్యకక్ష్యత్వం లేదనటం భావ్యం కాదు. పైగా కాళిదాసు **సిక్తవృక్షాలకు** కరణత్వాన్ని ప్రకటిస్తే వివరణ వ్యాఖ్యాత **వృక్షసేచనాన్ని** కరణంగా ప్రదర్శించటం స్వభావానుకూల పరివర్తనమే.

వాస్తవానికి - పడుకొన్న మృగాలు, సిక్తవృక్షాలు బహిరంగకరణాలు. అవి ఆశ్రమాలకు విశిష్టశోభను కల్పించేవే కానీ నియతంగా ఉండి తీరవలసినవి కావు. నిమిత్తకారణాలు మాత్రమే. అగ్నులు, అగ్నిహోత్రధేనువులు అంతరంగకారణాలూ, అవశ్యం భావ్యాలూ. సమవాయాసమవాయ కారణాల వంటివి. అవి లేకపోతే ఆశ్రమాలకు ఆశ్రమత్వమే లేదు. కాబట్టి ఆ అవిభాజ్యతను ధ్వనింపజేస్తూ అగ్నిహోత్ర, ధేనువులకు ఆశ్రమాలతో సామానాధికరణ్యం. నిమిత్తాకారణాలుగా మృగ, వృక్షాలకు కరణత్వాన్ని తెలుపుతూ తృతీయావిభక్తి ప్రయోగం. *

**శ్లో॥ బద్ధకోశమపి తిష్ఠతి క్షణం సావశేషవివరం కుశేశయమ్ ।**
**షట్పదాయ వసతిం గ్రహీష్యతే ప్రీతిపూర్వమివ దాతురుత్తరమ్ ॥ 39**

**అవ :** ముకుళిస్తున్న తామరల వర్ణన.

**ప.వి. :** బద్ధ-కోశమ్ అపి తిష్ఠతి క్షణం స+అవశేష-వివరం కుశేశయమ్ ।
షట్పదాయ వసతిం గ్రహీష్యతే ప్రీతిపూర్వమ్ ఇవ దాతుః ఉత్తరమ్॥

**అన్వ :** కుశేశయం బద్ధకోశమపి క్షణం వసతిం గ్రహృష్యతే షట్పదాయ ప్రీతిపూర్వమ్ ఉత్తరం దాతుః ఇవ సావశేషవివరం తిష్ఠతి.

**ప్ర :** కుశేశయమ్ = శతపత్రపద్మం, బద్ధ-కోశమ్ అపి = ముడుచుకొని కూడా, క్షణమ్ = క్షణకాలం (కొద్దిసేపు), వసతిమ్ = నివాసస్థానాన్ని, గ్రహీష్యతే = స్వీకరింపబోతున్న, షట్పదాయ = తుమ్మెదకు, ప్రీతి-పూర్వమ్ = ప్రేమపూర్వకంగా, ఉత్తరమ్ = సమాధానాన్ని, దాతు ఇవ = ఇవ్వడానికన్నట్లు, స+అవశేష-వివరమ్ : సావశేష = ఇంకా మిగిలిన, వివరమ్ = ఖాళీ కలదిగా, తిష్ఠతి = నిలిచివుంది.

**తా :** సంధ్యాకాలంలో పద్మం ముడుచుకుంటోంది. దానితో తామరలో అప్పటికే ఉన్న తుమ్మెద అతిథిగా ఆ రాత్రి అక్కడే వసతి పొందవలసి వస్తుంది. ఆ తుమ్మెదకు ప్రీతిపూర్వకంగా సమాధానమివ్వడానికన్నట్లు పద్మం పూర్తిగా ముడుచుకోకుండా మరికొంత మిగిలి ఉంది.

**విభక్తులు - క్రియలు :** 1. బద్ధకోశమ్ : **బద్ధకోశం** - బద్ధకోశే - బద్ధకోశాని; బద్ధకోశశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 2. అపి - అవ్యయమ్; 3. తిష్ఠతి : **తిష్ఠతి** - తిష్ఠతః - తిష్ఠన్తి; ష్ఠా గతి నివృత్తౌ ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 4. క్షణమ్ : **క్షణమ్** - క్షణౌ - క్షణాన్; క్షణశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 5. సావశేష వివరమ్ : **వివరమ్** - వివరే - వివరాణి; సావశేషవివరశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 6. కుశేశయమ్ : **కుశేశయం** - కుశేశయే - కుశేశయాని; కుశేశయశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 7. షట్పదాయ : **షట్పదాయ** - షట్పదాభ్యాం - షట్పదేభ్యః; షట్పదశబ్దః - అకారాన్తః పుంలింగః. చతుర్థ్యేకవచనమ్; 8. గ్రహీష్యతే : **గ్రహీష్యతే** - గ్రహీష్యేతే - గ్రహీష్యన్తే; గ్రహ ఉపాదానే ధాతోః లృటి ప్రథమపురుషైకవచనమ్; 9. ప్రీతిపూర్వకమ్ - క్రియావిశేషణమ్ - అవ్యయమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. దాతుః : **దాతుః** - దాత్రోః - దాతౄణామ్; దాతృశబ్దః ఋకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 12. ఉత్తరమ్ : **ఉత్తరమ్** - ఉత్తరౌ - ఉత్తరాన్; ఉత్తరశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్.

**సంధులు :** 1. దాతుః+ఉత్తరమ్ - దాతురుత్తరమ్ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. బద్ధః కోశః యేన, బద్ధకోశమ్; 2. అవశేష సహితం వివరం యస్య తత్, సావశేషవివరం; 3. ప్రీతిః పూర్వం యథా భవతి తథా, ప్రీతిపూర్వమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**కుశేశయమ్ :** 'సహస్రపత్రం కమలం శతపత్రం కుశేశయ' మితి అమరకోశః ।

నపుంసకలింగంలో కుశేశయం పద్మార్థకం. పుంలింగమైతే కర్ణికారవృక్షమని శబ్దచంద్రిక. కుశద్వీపస్థపర్వత విశేషమని విష్ణుపురాణం.

**శ్లో॥ విద్రుమో హేమశైలశ్చ ద్యుతిమాన్ పుష్పవాంస్తథా ।**
**కుశేశయో హరిశ్చైవ సప్తమో మన్దరాచలః ॥** - 2-4-41

**హేతూత్ప్రేక్ష :** వస్తు, హేతు, ఫలసంభావనమే ఉత్ప్రేక్షాలంకారం. ప్రకృతశ్లోకంలో హేతూత్ప్రేక్ష.

సంధ్యాకాలంలో తామరలు ముడుచుకొనిపోతూ కొంచెం ఖాళీని వదిలినట్లు ఆగి వున్నాయి. తుమ్మెదలు అప్పటికే తామరలో వున్నవి ఆ రేయి ఆ పద్మంలోనే గడపబోతున్నాయి. దానిని మూలంగా స్వీకరించి తదాధారంగా తామరల సంకోచానికి కారణాన్ని ఊహిస్తున్నాడు కవి.

తనలో అతిథిగా ఆ రాత్రి గడపటానికి వచ్చిన తుమ్మెదకు ప్రతివచనాన్ని ఇవ్వటానికై నోరు తెరుచుకొని నిలిచినట్లున్నదట - దానినిలా వ్యాఖ్యానిస్తున్నాడు వివరణ-వ్యాఖ్యాకారుడు - "సన్తో హి గృహాగతేభ్యః పాన్థేభ్యః తదభ్యర్థనాత్పూర్వమేవ తద్వివక్షితస్య వాక్యస్య ప్రతివచనం దాతుం కిమపి వికసితముఖామ్బుజాస్తిష్ఠన్తి । ... వివృతకుహరేషు సరసిజేషు షట్పదప్రవేశః ఉత్ప్రేక్షామూలమ్"-

ఈ శ్లోకంలో కాళిదాసు తుమ్మెదను పద్మానికి అతిథిగా సంభావించటం విశిష్టం. సాధారణంగా రేయి తామరలో తుమ్మెద గడపటాన్ని బందిఖానాగా సంభావించి వర్ణిస్తుంటారు కవులు-

శ్లో॥ **రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం - భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః।**
**ఇత్థం విచిన్తయతి కోశగతే ద్విరేఫే - హా హన్త హన్త నళినీం గజ ఉజ్జహార॥**

కానీ కాళిదాసు దానిని అతిథి - ఆతిధేయబంధంగా సంభావించటం ప్రకృతాంశం. *

**శ్లో॥ దూరమగ్నపరిమేయరశ్మినా వారుణీ దిగరుణేన భానునా ।**
**భాతి కేసరవతేవ మణ్డితా బన్ధుజీవకుసుమేన(తిలకేన) కన్యకా ॥ 40**

**అవ :** పశ్చిమదిక్కు తిలకాంచితయైన కన్యతో పోల్చుట.

**ప.వి. :** దూర-మగ్న-పరిమేయ-రశ్మినా వారుణీ దిక్ అరుణేన భానునా ।
భాతి కేసరవతా ఇవ మణ్డితా బన్ధు-జీవ-తిలకేన కన్యకా ॥

**అన్వ :** దూరమగ్నపరిమేయరశ్మినా అరుణేన భానునా వారుణీ దిక్ కేసరతా బన్ధుజీవ-తిలకేన మణ్డితా కన్యకా ఇవ భాతి.

**ప్ర :** దూర... రశ్మినా : దూర = దీర్ఘంగా (ఎంతో లోతుగా), మగ్న = మునిగి, పరిమేయ = లెక్కింపగల, రశ్మినా = కిరణాలు గల, అరుణేన = ఎఱ్ఱనైన, భానునా = సూర్యునిచేత, వారుణీ దిక్ = పడమటి దెస, కేసరవతా = కింజల్కాలు గల, బన్ధుజీవ–తిలకేన : బన్ధుజీవ = మంకెనపూవే, తిలకేన = తిలకం (బొట్టు)గా, మణ్డితా = అలంకరించుకొన్న, కన్యకా ఇవ = కన్నియవలె, భాతి = ప్రకాశిస్తోంది.

**తా :** ఎఱ్ఱటి సూర్యుడు పశ్చిమ దిక్కున బాగా లోతుగా వ్రాలిపోయాడు. పైకి ప్రసరించి కిరణాలు లెక్కింపదగినంత పరిమిత సంఖ్యలోనే ఉన్నాయి. ఆ స్థితిలో పడమటి దిక్కు మంకెనపూవును తిలకంగా ధరించిన కన్యకలా ప్రకాశిస్తోంది.

**విభక్తులు – క్రియలు :** 1. దూరమగ్నపరిమేయరశ్మినా : **రశ్మినా** – రశ్మిభ్యాం – రశ్మిభిః; రశ్మిశబ్దః ఇకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 2. వారుణీ : **వారుణీ** – వారుణ్యౌ – వారుణ్యః; వారుణీశబ్దః ఈకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 3. దిక్ : **దిక్** – దిశౌ – దిశః; దిక్‌శబ్దః శకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 4. అరుణేన: **అరుణేన** – అరుణాభ్యామ్ – అరుణైః; అరుణశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయైక–వచనమ్; 5. భానునా : **భానునా** – భానుభ్యాం – భానుభిః; భానుశబ్దః ఉకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 6. భాతి : **భాతి** – భాతః – భాన్తి; భా దీప్తౌ ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 7. కేసరవతా : **కేసరవతా** – కేసరవద్భ్యాం – కేసరవద్భిః; కేసరవచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 8. ఇవ – అవ్యయమ్; 9. మణ్డితా : **మణ్డితా** – మణ్డితే – మణ్డితాః; మణ్డితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 10. బన్ధుజీవతిలకేన : **తిలకేన** – తిలకాభ్యాం – తిలకైః; బన్ధుజీవ–తిలకశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 11. కన్యకా : **కన్యకా** – కన్యకే – కన్యకాః; కన్యకాశబ్దః అకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. దిక్+అరుణేన = దిగరుణేన – జశ్త్వసంధి; 2. కేసరవతా+ఇవ = కేసరవతేవ – గుణసంధి.

**సమాసాలు :** 1. దూరం మగ్నేన పరిమేయాః రశ్మయః యస్య, తేన – దూరమగ్న–పరిమేయరశ్మినా; 2. కేసరాః అస్య సన్తి ఇతి కేసరవాన్, తేన, కేసరవతా; 3. బన్ధుజీవమయః తిలకః, తేన, బన్ధుజీవతిలకేన.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**పరిమేయమ్ :** పరిమీయత ఇతి । పరి+మా+"**అచో యత్**" (3–1–97) ఇతి యత్. '**ఈద్యతి**' ఇతి ఈత్, తతో గుణః । పరిమాణవిశిష్టమ్ । పరిమాతవ్యమ్ (తవ్య ప్రత్యయే) । పరిమాణీయమ్ (అనీయర్ ప్రత్యయే). యథా రఘుః –

**శ్లో॥ మాభూదాశ్రమపీడేతి పరిమేయపురస్సరౌ ।**
**అనుభావవిశేషాత్తు సేనాపరిగతావివ ॥** – శబ్దకల్పద్రుమః.

సూర్యుని పరిమేయరశ్మిత్వానికి కారణం దూరమగ్నత్వం. అధోగతిని పొందేకొద్దీ ఇతరులు వ్రేలెత్తిచూపుతూ లెక్కించే అవకాశాన్ని ఇస్తామని ధ్వని.

**వారుణీ దిక్ :** పశ్చిమదిక్ । వరుణస్య ఇయమిత్యర్థే । వారుణీశబ్దం. సుర, మదిరాధిష్ఠాత్రి అయిన దేవి । వరుణపత్నిం, నదీ విశేషం, ఆత్మవిద్య అర్థాలలో కూడా ఉంటుంది. "సైషా భార్గవీ వారుణీవిద్యా" – తైత్తిరీయోపనిషత్తులో ఆత్మవిద్యార్థంలో వారుణీ ప్రయోగం, వారుణి సంబంధినీ విద్యా వారుణీవిద్యా. వారుణి అంటే భృగువు. వరుణతనయుడు. అందువల్ల అది భార్గవీవిద్య కూడా.

**బన్ధుజీవః :** బన్ధువత్ జీవయతి రసాదినా ఇతి । బన్ధు+జీవ+ణ్వుల్ – యద్వా బన్ధుజీవః ఏవ. స్వార్థే కన్ బన్ధూకవృక్షః ఇత్యమరః – శబ్దకల్పద్రుమః.

**ఉత్ప్రేక్ష :** ఎఱ్ఱని రంగుతో కనిపిస్తున్న సూర్యుని స్థితివలన వారుణీదిక్కు బన్ధుజీవతిలకంతో కూడిన కన్యక అన్నట్లు ప్రకాశిస్తున్నదట. ఆ రీతిగా సంభావించినందువలన ఇది ఉత్ప్రేక్ష. (వివరణవ్యాఖ్య). అయితే ఈ శ్లోకంలో ఉపమాలంకారం కాదనటానికి కారణం కనిపించదు. ఉపమానోపమేయాలు ఉపమావాచకం స్పష్టంగా కనిపిస్తున్నాయి కాబట్టి ఉపమాలంకారం వాచోవిధేయంగానే ఉంది.

కేసరవతా అన్న విశేషణం కారణంగా తిలకధారణలో కేసరవత్వానికి సంబంధ ముండదు కాబట్టి ఇది ఉత్ప్రేక్ష అనలేము. అది అసంగతి అయితే ఉపమోత్ప్రేక్షలకు రెండింటికీ అది సమానమే.

*

**శ్లో॥ సామభిస్సహచరాస్సహస్రశస్స్యన్దనాశ్వహృదయఙ్గమస్వరై(నై)ః ।**
**భానుమగ్నిపరికీర్ణతేజసం సంస్తువన్తి కిరణోష్మపాయినః ॥ 41**

**అవ :** కిరణోష్మపాయినః సహస్రశః సహచరాః స్యందనాశ్వహృదయంగమైః స్వనైః సామభిః అగ్నిపరికీర్ణతైజసం భానుంస్తువన్తి.

**ప్ర :** కిరణో... పాయినః : కిరణ = సూర్యకిరణాలయొక్క, ఊష్మ = వేడిని, పాయినః = త్రాగే అలవాటుగల, సహస్రశః = వేలకొలదిగా వున్న, సహచరాః = వాలఖిల్యాది మునులు (కలిసి సంచరించేవారు), స్యంద... గమైః : స్యందన = రథాలకు పూన్చిన, హృదయంగమైః = మనస్సులకుచేరే (నచ్చెడి), స్వనైః = ధ్వనులుగల, సామభిః = సామవేదభాగాలతో, అగ్ని... తైజసమ్ : అగ్ని = వహ్నియందు, పరికీర్ణ = నిక్షిప్తమైన, తైజసమ్ = తేజస్సుగల, భానుమ్ = సూర్యుని, స్తువన్తి = నుతిస్తున్నారు.

**తా :** నియతసహచరులూ, సూర్యుని కిరణాలలోని వెచ్చదనాన్ని ఆస్వాదించే వారు వాలఖిల్యాది మునులు. వాళ్ళు సామగానం చేస్తూ అగ్ని నిక్షిప్తతేజస్కుడైన సూర్యుని స్తుతిస్తున్నారు. ఆ సామగానస్వనాలు సూర్యాశ్వాల హృదయాలను కూడా ఆకర్షిస్తున్నాయి.

**విభక్తులు - క్రియలు :** 1. సామభిః : సామ్నా - సామభ్యాం - **సామభిః**; సామన్ శబ్దః నకారాన్తః నపుంసకలింగః. తృతీయాబహువచనమ్; 2. సహచరః : **సహచరః** - సహచరౌ - సహచరాః; సహచరశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 3. సహస్రశః – అవ్యయమ్; 4. స్యన్దనాశ్వహృదయంగమస్వనైః : స్వనేన – స్వనాభ్యాం - **స్వనైః**; స్వనశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 5. భానుమ్ : **భానుం** - భానూ - భానూన్; భానుశబ్దః ఉకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 6. అగ్నిపరికీర్ణతేజసమ్ : **తేజసం** - తేజసౌ - తేజసః; తేజశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 7. సంస్తువన్తి : స్తౌతి/స్తవీతి - స్తుతః/స్తువీతః - **స్తువన్తి**; సమ్ పూర్వకాత్ ష్టుఞ్ ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 8. కిరణోష్మపాయినః : పాయీ - పాయినౌ - **పాయినః**; పాయిన్శబ్దః నకారాన్తః పుంలింగః. ప్రథమా-బహువచనమ్.

**సమాసాలు :** 1. సహ ఏవ చరన్తి ఇతి - సహచరాః; 2. స్యన్దనే అశ్వాః తేషాం హృదయంగమాశ్చతే స్వనాః, తైః స్యన్దనాశ్వహృదయంగమస్వనైః; 3. అగ్నినా పరికీర్ణం తేజః యస్య, తమ్, అగ్ని పరికీర్ణతేజసమ్; 4. కిరణానాం ఊష్మా, తం పాతుం శీలం యేషాం తే, కిరణోష్మపాయినః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**సామ :** స్యతి ఛినత్తి దుఃఖం గేయత్వాత్, స్యతి దుఃఖయతి దురధ్యేయత్వాత్ ఇతి వా। సో+'సాతిభ్యాం మనిన్మణినౌ" (ఉణా 4/152) ఇతి మనిన్. వేదవిశేష ఇత్యమరః।

స్యతి పాపం సామ షోయ నాశే త్రాసురితి మన్ ఇతి భరతః । తల్లక్షణమాహ జైమినిః । గీతేషు సమాఖ్యా ఇతి । గీయమానేషు మన్త్రేషు సామసంజ్ఞేత్యర్థః । - శబ్దకల్పద్రుమః.

'వాగ్దేవత్యం సామ, వాచో మనో దేవతా, మనసః పశవః । పశూనామోషధయః, ఓషధీనామాపః । తదేతదద్భ్యో జాతం సామాప్సు ప్రతిష్ఠితమితి" - అని జైమినీ-యోపనిషద్బ్రాహ్మణం సామప్రాధాన్యాన్ని చెప్తుంది. (1-59-14).

**హృదయంగమస్వన :** వేదాంగాలయిన ఆరింటిలో శిక్షా గ్రంథాలు వేదోచ్చారణను నియంత్రిస్తాయి. శిక్షా గ్రంథావసరాన్ని పాణిని ఇలా వివరిస్తాడు -

**శ్లో॥ ప్రసిద్ధమపి శబ్దార్థమవిజ్ఞాతమబుద్ధిభిః ।**
**పునర్వ్యక్తీకరిష్యామి వాచ ఉచ్చారణే విధిమ్ ॥** - పాణినీయశిక్ష - 2

తైత్తిరీయోపనిషత్తు శిక్షాగ్రంథప్రతిపాద్యవిషయాన్ని వివరిస్తుందిలా-

"శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః । మాత్రా బలం । **సామ** సన్తానః । ఇత్యుక్తశ్శీక్షాధ్యాయః ॥" - తైత్తిరీయోపనిషత్తు - 1/2

**అగ్నిపరికీర్ణతేజస్సు : 'తస్మాదగ్నయే సాయం హూయతే సూర్యాయ ప్రాతః**" (తైత్తిరీయ బ్రాహ్మణం - 2/1/2/6). సంధ్యాకాలంలో సూర్యుడు అగ్నిలో తన తేజస్సును నిక్షేపించి అస్తమిస్తాడు. కాబట్టి ఆప్రభాతం తేజస్స్వరూపంగా అగ్న్యారాధనం. "దినాన్తే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః" అని రఘువంశంలో కాళిదాసవచనం. (రఘువంశం 4-1)*

**శ్లో॥ సోఽయమానతశిరోధరైర్హయైః కర్ణచామరవిఘట్టితేక్షణైః ।**
**అస్తమేతి యుగభుగ్నకేశరైః సన్నిధాయ దివసం మహోదధౌ ॥ 42**

**అవ :** సూర్యుడు తలవాల్చిన తురగాలతో అస్తమించటం.

**ప.వి. :** సః అయమ్ ఆనత-శిరః-ధరైః హయైః కర్ణ-చామర-విఘట్టిత+ఈక్షణైః ।
అస్తమ్ ఏతి యుగ-భుగ్న-కేశరైః సన్నిధాయ దివసం మహా+ఉదధౌ ॥

**అన్వ :** సః అయమ్ ఆనతశిరోధరైః కర్ణచామరవిఘట్టితేక్షణైః యుగభుగ్నకేశరైః హయైః దివసం మహోదధౌ సన్నిధాయ అస్తమ్ ఏతి.

**ప్ర :** సః = అటువంటి, అయమ్ = ఈ సూర్యుడు, దివసమ్ = పగటిని, మహా+ఉదధౌ = పెనుకడలిలో, సన్నిధాయ = నిలిపి, ఆనత... ధరైః : ఆనత = వ్రాలిన, శిరః+ధరైః = మెడలు గలవియు, కర్ణ... విఘట్టితైః : కర్ణ = చెవులకున్న, చామర = చామరాలచేత, విఘట్టిత = దెబ్బతీయబడిన, ఈక్షణైః = కనులు గలవీ, యుగ... కేసరైః : యుగ = కాడె చేత, భగ్న = అణచబడిన, కేశరైః = మూపురాలు గలవీ అయిన హయైః = గుఱ్ఱాలతో, అస్తమ్ ఏతి = అస్తమిస్తున్నాడు.

**తా :** సూర్యుడు పగటిని మహాసముద్రంలో పడవేసి తాను గుఱ్ఱాలతో అస్తమిస్తున్నాడు. ఆ గుఱ్ఱాలు మెడలు వ్రాలి ఉన్నాయి. చెవులకున్న చామరాలు కళ్ళను కప్పివేస్తున్నాయి. వాటి మూపురాల కాడెచే అణచిబడివున్నాయి.

**విభక్తులు - క్రియలు :** 1. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 2. అయమ్ : **అయమ్** - ఇమౌ - ఇమే; ఇదం శబ్దః మకారాన్తః

పుంలింగః. ప్రథమైకవచనమ్; 3. ఆనతశిరోధరైః : ధరేణ - ధరాభ్యాం - **ధరైః**; ఆనతశిరోధరశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 4. హయైః : హయేన - హయాభ్యాం - **హయైః**; హయశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 5. కర్ణచామరవిఘట్టితేక్షణైః : ఈక్షణేన - ఈక్షణాభ్యామ్ - **ఈక్షణైః**; ఈక్షణశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహువచనమ్; 6. అస్తమ్ : **అస్తమ్** - అస్తౌ - అస్తాన్; అస్తశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 7. ఏతి : **ఏతి** - ఇతః - యాన్తి; ఇణ్ గతౌ ఇతి ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 8. యుగభుగ్నకేశరైః : కేశరేణ - కేశరాభ్యాం - **కేశరైః**; యుగభుగ్నకేసరశబ్దః అకారాన్తః పుంలింగః. తృతీయాబహు-వచనమ్; 9. సన్నిధాయ - సమ్ ని పూర్వకాత్ డు దాఞ్ ధారణపోషణయోః ఇతి ధాతోః ల్యప్ ప్రత్యయః; 10. దివసమ్ : **దివసం** - దివసౌ - దివసాన్; దివస శబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 11. మహోదధౌ : **ఉదధౌ** - ఉదధ్యోః - ఉదధీనామ్; మహోదధిశబ్దః ఇకారాన్తః పుంలింగః. సప్తమ్యేకవచనమ్.

**సంధులు :** 1. సః+అయమ్ = సోఽయమ్ - విసర్గసంధి; 2. ధరైః+హయైః = ధరైర్హయైః - విసర్గసంధి.

**సమాసాలు :** 1. శిరః ధరతి ఇతి శిరోధరః. ఆనతః శిరోధరః యేషాం తైః, ఆనతశిరోధరైః; 2. కర్ణయోః చామరే, తాభ్యాం విఘట్టితమ్ ఈక్షణం యేషాం తైః, కర్ణచామరవిఘట్టితేక్షణైః; 3. యుగేన భుగ్నాః కేశరాః యేషాం తైః, యుగభుగ్నకేశరైః; 4. మహాంశ్చ అసౌ ఉదధి, మహోదధిః, తస్మిన్ - మహోదధౌ.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**హయైః : అత్యో వాజీ హయః సప్తిరర్వోచ్చైః శ్రవసోఽరుషః ।**
**దధిక్రావా దధిక్రాశ్చ దౌర్గహబ్రధ్నవహ్నయః ॥**

**తార్క్ష్యో మాంశ్చత్వ ఆశుశ్చ పైద్వ ఏతగ్వ ఏతశః ।**
**అశ్వాః సుపర్ణా హంసాసః శ్యేనాసోఽవ్యథయో నరః ।**
**హ్వార్యాః పతంగా ఇత్యేతే సామాన్యేనాశ్వవాచినః ॥** - వైదికకోషః-1/10

**కేశ(స)రః :** కే జలే శిరసి వా శీర్యతి శృ+అచ్- సరతి సృ-అచ్. అలుక్సమాసః. కేశః కేశాకారో వాస్త్యస్య ఇతి రః వా । ... దన్త్యమధ్యోఽపి వా పాఠః । దన్త్యమధ్యస్తు తురగస్కంధస్థలోమపుంజరూపజటాయాం - హేమచన్ద్రః. - **వాచస్పత్యమ్.**

**ఉత్ప్రేక్షాధ్వని :** 'మహోదధౌ దివసం సన్నిధాయ' అనటంలో సన్నిధాయ ఇవ అని

ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది. "దివసం మహోదధౌ సన్నిధాయ ఇత్యుత్ప్రేక్షా గర్భ-మభిధానమ్" అని వివరణవ్యాఖ్య.

**స్వభావోక్తి :** 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణన'మని **స్వభావోక్తి**లక్షణం. జాతి, గుణ, క్రియా యదృచ్ఛాసంబద్ధమైన స్వభావవర్ణన స్వభావోక్తి. ప్రకృతశ్లోకంలో ప్రథమార్ధంలో జాతిగతమైన హయస్వభావవర్ణన. ఆనతశిరోధరత్వమై, కర్ణచామర విఘట్టితేక్షణత్వమూ వర్ణింపబడినందువలన స్వభావోక్త్యలంకారం. *

**శ్లో॥ ఖం ప్రసుప్తమివ సంస్థితే రవౌ తేజసో మహత ఈదృశీ గతిః ।**
**తత్ప్రకాశయతి యావదుత్థితం మీలనాయ ఖలు తావతశ్చ్యుతమ్ ॥43**

**అవ :** సూర్యాస్తమయఫలవర్ణన.

**ప.వి. :** ఖమ్ ప్రసుప్తమ్ ఇవ సంస్థితే రవౌ తేజసః మహతః ఈదృశీ గతిః ।
తత్ ప్రకాశయతి యావద్ ఉత్థితమ్ మీలనాయ ఖలు తావతః చ్యుతమ్ ॥

**అన్వ :** రవౌ సంస్థితే ఖం ప్రసుప్తమివ (అస్తి). మహతః తేజసః గతిః ఈదృశీ. తత్ ఉత్థితం (సత్) యావత్ ప్రకాశయతి తావతః చ్యుతం మీలనాయ (భవతి) ఖలు.

**ప్ర :** రవౌ = సూర్యుడు, సంస్థితే = అస్తమించగా, ఖమ్ = ఆకాశం, ప్రసుప్తమ్ ఇవ = నిదురించినట్లు, (అస్తి ) = ఉన్నది. మహతః = గొప్పదైన, తేజసః = తేజస్సుయొక్క, గతిః = గమనం, ఈదృశీ = ఇటువంటిది. తత్ = ఆ మహాతేజస్సు, ఉత్థితమ్ (సత్) = ఉదయించినపుడు, యావత్ = ఎంతమేర, ప్రకాశయతి = వెలుగొందజేయునో, తావతః = అంతమేర, చ్యుతం (సత్) = అస్తమించినపుడు, మీలనాయ = వెలుగులేకుండా చేయుటకు, (భవతి) ఖలు = సమర్థమగును గదా!

**తా :** సూర్యుడు అస్తమించగానే ఆకాశం నిదురిస్తున్నట్లుంది. అంత గొప్ప తేజస్సుకు ఇంత గతి పట్టింది. మహాతేజస్సులంతే. ఉదయించినప్పుడు ఎంతమేర ప్రకాశింప జేయగలవో, అస్తమించినప్పుడు అంతమేర నిశ్చైతన్యం చేయగలవు.

**విభక్తులు – క్రియలు :** 1. ఖమ్ : **ఖం** – ఖే – ఖాని; ఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 2. ప్రసుప్తమ్ : **ప్రసుప్తం** – ప్రసుప్తే – ప్రసుప్తాని; ప్రసుప్తశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 3. ఇవ – అవ్యయమ్; 4. సంస్థితే : **సంస్థితే** – సంస్థితయోః – సంస్థితేషు; సంస్థితశబ్దః అకారాన్తః పుంలింగః. సప్తమ్యేక-వచనమ్; 5. రవౌ : **రవౌ** – రవ్యోః – రవిషు; రవిశబ్దః ఇకారాన్తః పుంలింగః. సప్తమ్యేకవచనమ్; 6. తేజసః : **తేజసః** – తేజసో – తేజసామ్; తేజశ్శబ్దః సకారాన్తః

నపుంసకలింగః. షష్ఠ్యేకవచనమ్; 7. మహతః : **మహతః** – మహతోః – మహతామ్; మహత్ శబ్దః తకారాన్తః నపుంసకలింగః. షష్ఠ్యేకవచనమ్; 8. ఈదృశీ : **ఈదృశీ** – ఈదృశ్యౌ – ఈదృశ్యః; ఈదృశ్ శబ్దః శకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 9. గతిః : **గతిః** – గతీ – గతయః; గతిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 10. తత్ : **తత్** – తే – తాని; తచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 11. ప్రకాశయతి : **ప్రకాశయతి** – ప్రకాశయతః – ప్రకాశయన్తి; ప్రపూర్వకాత్ కాశృ దీప్తౌ ఇతి ధాతోః ప్రేరణే లటి ప్రథమపురుషైకవచనమ్; 12. యావత్ : **యావత్** – యావతీ – యావన్తి; యావచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 13. ఉత్థితమ్ : **ఉత్థితమ్** – ఉత్థితే – ఉత్థితాని; ఉత్థితశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 14. మీలనాయ : **మీలనాయ** – మీలనాభ్యాం – మీలనేభ్యః; మీలనశబ్దః అకారాన్తః నపుంసకలింగః. చతుర్థ్యేకవచనమ్; 15. ఖలు – అవ్యయమ్; 16. తావతః : **తావతః** – తావతోః – తావతామ్; తావత్ శబ్దః దకారాన్తః నపుంసకలింగః. షష్ఠ్యేకవచనమ్; 17. చ్యుతమ్ : **చ్యుతం** – చ్యుతే – చ్యుతాని; చ్యుతశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. తేజసః+మహతః = తేజసో మహతః – విసర్గసంధి; 2. మహతః+ఈదృశీ = మహత ఈదృశీ – విసర్గలోపసంధి; 3. యావత్+ఉత్థితమ్ = యావదుత్థితమ్ – జశ్త్వసంధి; 4. తావతస్+చ్యుతమ్ = తావతశ్చ్యుతమ్ – శ్చుత్వసంధి.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**యావత్ :** సాకల్యావధిమానాపవారణకాలహేతుసీమాదిష్వర్థేషు ప్రసిద్ధోయమ్ । **అవ్యుత్పన్న మిదమితి బహవః** । యచ్ఛబ్దాత్ యత్తదేతేభ్యః పరిమాణే వతుప్" ఇతి వతుప్ ప్రత్యయే "ఆ సర్వనామ్నః" ఇతి ఆకారే సముదాయస్య చాదిషు పాఠాదవ్యయత్వమితి **కేచిత్** । యావాన్, యావతీ, యావత్ ఇతి పరిమాణవాచకాః శబ్దాః వ్యుత్పన్నాః త్రిలింగకా ఏతత్సమానార్థా ఇతోభిన్నాః" (అవ్యయకోశః – 311)

కాబట్టి యావత్ అవ్యయమూ కావచ్చు. సుబన్తశబ్దమూ కావచ్చు. 'తావత్' విషయమూ ఇటువంటిదే.

శ్లో॥ **తావత్** తత్పరిమాణే త్రిరవ్యయం త్వవధారణే ।
సమ్భ్రమే చ పరిచ్ఛేదే తథా కార్త్స్న్యాధికారయోః ॥ ఇతి వాఙ్మయార్ణవః.

**ఖమ్ :** (ఖర్వతి మనః అస్మిన్, ఖన్యతే క్షుభ్యతే మనః అనేన వా । ఖర్వ గతౌ ఖన దారణే వా అన్యేభ్యోపీతి డః) ఇంద్రియమ్... ఆకాశమ్...

శబ్దతన్మాత్రమ్ । యథా మాండూకోపనిషది-

"శ్లో॥ ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథ్వీ సర్వస్య ధారిణీ ॥ "

చిదానన్దమయబ్రహ్మాకాశమ్ । యథా ఛాన్దోగ్యోపనిషది -

కం బ్రహ్మ ఖం బ్రహ్మ యదేవ కం తదేవ ఖంగంగాకారో వై పురుషో ఘకారో ఘోషయంస్తథా ।

**సంస్థితః :** సం+స్థా-క్తః । **మృతః** ఇత్యమరః । యథా మనుః-

**శ్లో॥ సంస్థితస్యానపత్యస్య సగోత్రాత్ పుత్త్రమాహరేత్ ।
యత్ర యదృక్థజాతం స్యాత్ తత్తస్మిన్ ప్రతిపాదయేత్ ॥**

**సమ్యక్ స్థితివిశేషశ్చ** । యథా కౌర్మే -

**శ్లో॥ ఇదన్తు పంచదశమం పురాణం కౌర్మముత్తమమ్ ।
చతుర్ధా సంస్థితం పుణ్యం సంహితానాం ప్రభేదతః ॥** - శబ్దకల్పద్రుమః. *

## పార్వతీప్రృతి శివేన సన్ధ్యానురాగవర్ణనమ్

**శ్లో॥ సన్ధ్యయాప్యనుపదం రవేః పదం ధర్మ్యమస్తశిఖరే సమర్పితమ్ ।
ప్రాక్ తథేయముదయే పురస్కృతా నానుయాస్యతి కథం తమాపది ॥44**

**అవ :** సూర్యునితోపాటు సంధ్యకూడా అస్తాద్రిపై కాలుమోపుట.

**ప.వి.:**సన్ధ్యయా అపి అనుపదం రవేః పదం ధర్మ్యమ్ అస్త-శిఖరే సమర్పితమ్ ।
ప్రాక్ తథా ఇయమ్ ఉదయే పురస్కృతా న అనుయాస్యతి కథం తమ్ ఆపది ॥

**అన్వ :** సన్ధ్యయా అపి రవేః అనుపదం ధర్మ్యం పదమ్ అస్తశిఖరే సమర్పితమ్ । ఉదయే ప్రాక్ తథా ఇయం పురస్కృతా (సతీ). ఆపది తం కథం న అనుయాస్యతి.

**ప్ర :** సన్ధ్యయా అపి = సంజ చేత గూడా, రవేః = సూర్యునికి, అనుపదమ్ = వెన్వెంటనే, ధర్మ్యమ్ = ధర్మం తప్పని, పదమ్ = అడుగు, అస్త-శిఖరే = అస్తపర్వత శిఖరంపై, సమర్పితమ్ = సమర్పింపబడింది. ప్రాక్ = ఇంతకుముందు / ఎల్లప్పుడూ, ఉదయే = ఉదయించినప్పుడు/ అభ్యుదయవేళలో, తథా = ఆ రీతిగా, ఇయమ్ = ఉదయసంధ్య/ ఈమె, పురస్కృతా (సతీ) = మన్నింపబడినదై, ఆపది = అస్తమయవేళలో/ కష్టకాలంలో, తమ్ = ఆయనను, కథమ్ = ఏ రీతిగా, న అనుయాస్యతి = అనుసరించదు?

**తా :** సంధ్యకూడా సూర్యుని వెనుకే ధర్మబద్ధమైన రీతిగా అనుసరించి వెళ్ళింది.

అస్తశిఖరంపై అడుగుపెట్టింది. యుక్తమే. ఉదయం అభ్యుదయ వేళలో సూర్యుని మన్ననలందిన ఆ సంధ్య సూర్యుని ఆపదవేళలో అనుసరించకుండా ఎలా ఉండగలుగు తుంది?

**విభక్తులు - క్రియలు :** 1. సన్ధ్యయా : **సంధ్యయా** - సంధ్యాభ్యాం - సంధ్యాభిః; సంధ్యాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 2. అపి - అవ్యయమ్; 3. అనుపదమ్ - అవ్యయమ్; 4. రవేః : **రవేః** - రవ్యోః - రవీనామ్; రవిశబ్దః ఇకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 5. పదమ్ : **పదం** - పదే - పదాని; పదశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. ధర్మ్యమ్ : **ధర్మ్యం** - ధర్మ్యే - ధర్మ్యాణి; ధర్మ్యశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 7. అస్తశిఖరే : **శిఖరే** - శిఖరయోః - శిఖరేషు; అస్తశిఖరశబ్దః అకారాన్తః పుంలింగః/ నపుంసకలింగః. సప్తమ్యేకవచనమ్; 8. సమర్పితమ్ : **సమర్పితం** - సమర్పితే - సమర్పితాని; సమర్పితశబ్దః అకారాన్తః నపుసంకలింగః. ప్రథమైకవచనమ్; 9. ప్రాక్ - అవ్యయమ్; 10. తథా - అవ్యయమ్; 11. ఇయమ్ : **ఇయమ్** - ఇమే - ఇమాః; ఇదం శబ్దః మకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 12. ఉదయే : **ఉదయే** - ఉదయయోః - ఉదయేషు; ఉదయశబ్దః అకారాన్తః పుంలింగః. సప్తమ్యేకవచనమ్; 13. పురస్కృతా : **పురస్కృతా** - పురస్కృతే - పురస్కృతాః; పురస్కృతా ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 14. న - అవ్యయమ్; 15. అనుయాస్యతి : **అనుయాస్యతి** - అనుయాస్యతః -అనుయాస్యన్తి; అను పూర్వకాత్ యా ప్రాపణే ధాతోః లృటి ప్రథమపురుషైకవచనమ్; 16. కథమ్ - అవ్యయమ్; 17. తమ్ : **తం** - తౌ - తాన్; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 18. ఆపది : **ఆపది** - ఆపదోః - ఆపత్సు; ఆపత్ శబ్దః దకారాన్తః స్త్రీలింగః. సప్తమ్యేకవచనమ్.

**సంధులు :** 1. సంధ్యయా+అపి = సన్ధ్యయాఽపి - సవర్ణదీర్ఘసంధి; 2. తథా+ఇయమ్ = తథేయమ్ - గుణసంధి; 3. న+అనుయాస్యతి = నానుయాస్యతి - సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. అను పద్యతే ఇతి అనుపదమ్; 2. ధర్మాత్ అనపేతమ్, ధర్మ్యమ్; 3. అస్తస్య శిఖరః, తస్మిన్, అస్తశిఖరే.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ప్రాక్ - ప్రాచీ :** ప్రకర్షేణ అంచతీత్యర్థే "దిక్ శబ్దేభ్యః సప్తమీ పంచమీ ప్రథమాభ్యో దిగ్దేశకాలేష్వస్తాతిః" ఇతి అస్తాతి ప్రత్యయః. తస్య "అంచేర్లుక్" ఇతి లుక్. 'లుక్ తద్ధితలుకి' ఇతి స్త్రీ ప్రత్యయస్యాపి లుక్. ... అత్ర అస్తాతి ప్రత్యయస్య లుకా లుప్తత్వేపి ప్రాగ్దిశీయత్వేన విభక్తి సంజ్ఞాయామ్, అసర్వవిభక్తి తద్ధితాన్తత్వప్రయుక్తాఽవ్యయసంజ్ఞేతి బోద్ధవ్యమ్"

(అవ్యయకోశః). 'తద్ధితశ్చాసర్వవిభక్తిః' రితి సూత్రేణ అసర్వవిభక్తికస్య తద్ధితప్రత్యయాన్తస్య అవ్యయత్వమ్.

**ధర్మ్యః :** ధర్మాదనపేతం ధర్మ్యమ్. ధర్మపదాత్ 'ధర్మపథ్యర్థన్యాయాదనపేతే' ఇతి యత్ । యథా భగవద్గీతాయామ్ - ధర్మ్యాద్ధి యుద్ధాత్ శ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే । న్యూనాధికవిభక్తానాం ధర్మ్యః పితృకృతః స్మృతః ।' ఇతి దాయభాగః । "నౌ వయోధర్మ విషమూలమూలసీతాతులాభ్యస్తార్యతుల్యప్రాప్యవధ్యనామ్యసమసమితసమ్మితేషు" ఇతి యత్ । ధర్మ్యలభ్యః - శబ్దకల్పద్రుమః.

**సమాసోక్త్యలంకారం :** ప్రకృతమైన సంధ్యాసూర్యవృత్తాంతవర్ణనం ద్వారా అప్రకృతమైన నాయికానాయకవృత్తాంతం గమ్యమానమవుతుంది కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం.

**శ్లో॥ విశేషణానాం సామ్యేన యత్ర ప్రస్తుతవర్తినామ్ ।**
**అప్రస్తుతస్య గమ్యత్వం సా సమాసోక్తిరిష్యతే ॥** - అని సమాసోక్తిలక్షణం.

**రసాభాసమూ :** భోజుని అభిమతం మేరకు ఇక్కడ రసం ఆభాసమైందని కానీ దానిని తాను అంగీకరించనని తమ అభిమతం మేరకు అనౌచిత్యప్రవృత్తియే రసాభాసమూల మని ప్రకాశికా వ్యాఖ్య.

"శృంగారాభాసవ్యవహారస్త్వత్ర భోజదృశా । అస్మాభిస్త్వనౌచిత్య ప్రవృత్తానాం రసాదీనా మాభసత్వమిష్యతే"

భోజుడు సరస్వతీకంఠాభరణంలో ఇటువంటి ప్రకృతివర్ణననే ఉభయాభాస (నాయికా నాయకాభాస)కు ఉదాహరణంగా ప్రదర్శిస్తాడు.

శ్లో॥ అవగూహితపూర్వదిశే సమకం జ్యోత్స్నయా సేవితప్రదోషముఖే ।
మాతర్న క్షీయతే రజనీ అపరదిశాభిముఖప్రస్థితే మృగాంకే ॥ 5/357 *

**శ్లో॥ రక్తపీతకపిశాః పయోముచాం కోటయః కుటిలకేశి! భాన్త్యమూః ।**
**ద్రక్ష్యసి త్వమితి వేలయానయా వర్తికాభిరివ సాధు వర్తితాః ॥ 45**

**అవ :** సంధ్యారాగవర్ణనం.

**ప.వి. :** రక్త-పీత-కపిశాః పయః-ముచాం కోటయః కుటిల-కేశి! భాన్తి అమూః ।
ద్రక్ష్యసి త్వమ్ ఇతి వేలయా అనయా వర్తికాభిః ఇవ సాధు వర్తితాః ॥

**అన్వ :** కుటిల-కేశి! పయోముచాం కోటయః అమూః రక్తపీతకపిశాః (సన్తః) త్వం ద్రక్ష్యసి ఇతి అనయా వేలయా వర్తికాభిః సాధు వర్తితా ఇవ భాన్తి.

**ప్ర :** కుటిల–కేశి! = ఉంగరాల జుట్టుగలదానా!, పయోముచామ్ = మేఘాలయొక్క కోటయః = వరుసలు, అమూః = ఇవిగో! ఇవి, రక్త–పీత–కపిశాః (సన్తః) = ఎఱుపు, పసుపు, కావి వన్నె గలవై, త్వమ్ = నీవు, ద్రక్ష్యసి ఇతి = చూడబోతున్నావని, అనయా = ఈ, వేలయా = వేలచేత - సంధ్యచేత, వర్తికాభిః = వత్తులతో, సాధు = చక్కగా, వర్తితా ఇతి = ప్రవర్తింపజేయబడినట్లుగా, భాన్తి = ప్రకాశిస్తున్నాయి.

**తా :** కుటిలకేశి! పార్వతి! ఈ మేఘాల పంక్తులు రక్తపీతధూమ్ర వర్ణాలతో కనిపిస్తున్నాయి. అవి నువ్వు చూడబోతున్నావని సంధ్యావేళ చక్కగా వత్తులతో వెలిగింపబడిన (దీపాలవలె) వన్నట్లు ప్రకాశిస్తున్నాయి.

**విభక్తులు – క్రియలు :** 1. రక్తపీతకపిశాః : కపిశా – కపిశే – **కపిశాః**; రక్తపీతకపిశాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమాబహువచనమ్; 2. పయోముచామ్ : పయోముచః – పయోముచోః – **పయోముచామ్**; పయోముక్ శబ్దః చకారాన్తః పుంలింగః. షష్ఠీబహు–వచనమ్; 3. కోటయః : కోటిః – కోటీ – **కోటయః**; ఇకారాన్తః స్త్రీలింగః కోటిశబ్దః. ప్రథమాబహువచనమ్; 4. కుటిలకేశి : **కేశి** – కేశ్యౌ – కేశయః; కుటిలకేశీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. సంబోధన ప్రథమైకవచనమ్; 5. భాన్తి : భాతిః – భాతః – భాన్తి; భాదీప్తౌ ఇతి ధాతోః లటి ప్రథమపురుషబహువచనమ్; 6. అమూః : అసౌ – అమూ – అమూః; సకారాన్తః స్త్రీలింగః అదస్ శబ్దః. ప్రథమాబహువచనమ్; 7. ద్రక్ష్యసి : ద్రక్ష్యసి – ద్రక్ష్యథః – ద్రక్ష్యథ; దృశిర్ ప్రేక్షణే ఇతి ధాతోః లృటి ప్రథమపురుషైకవచనమ్; 8. త్వమ్ : **త్వం** – యువాం – యూయమ్; యుష్మచ్ఛబ్దః దకారాన్తః ప్రథమైకవచనమ్; 9. ఇతి – అవ్యయమ్; 10. వేలయా : **వేలయా** – వేలాభ్యాం – వేలాభిః; వేలాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 11. అనయా : అనయా – ఆభ్యామ్ – ఆభిః; ఇదం శబ్దః మకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 12. వర్తికాభిః : వర్తికయా – వర్తికాభ్యాం – **వర్తికాభిః**; వర్తికాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయాబహువచనమ్; 13. ఇవ – అవ్యయమ్; 14. సాధు – అవ్యయమ్; 15. వర్తితాః : వర్తితా – వర్తితే – **వర్తితాః**; వర్తితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమాబహువచనమ్.

**సంధులు :** 1. భాన్తి+అమూః = భాన్త్యమూః – యణాదేశసంధి; 2. వేలయా+అనయా = వేలయానయా – సవర్ణదీర్ఘసంధి; 3. వర్తికాభిః+ఇవ = వర్తికాభిరివ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. రక్తాః పీతాః హరితాశ్చ తే, రక్తపీతహరిశాః; 2. పయః ముంచన్తి ఇతి, తేషామ్, పయోముచామ్; 3. కుటిలాః కేశాః యస్యాః, తస్యాః సంబుద్ధౌ, కుటిలకేశి.

**పదవ్యుత్పత్తి – కావ్య నిఘంటుప్రమాణాలు :**

**సాధు : సాధు క్రియావిశేషణమైతే అవ్యయం**. కాకపోతే సుబన్తం మూడు లింగాలలోనూ ప్రయోగార్హ్యం. **సాధుః (పుం), సాధ్వీ (స్త్రీ)**, సాధు (నపుంసక).

సాధు లక్షణాన్ని పద్యోత్తరఖండమిలా వివరిస్తుంది.

శ్లో॥ నిర్వేదస్సదయశ్శాన్తో దమ్భాహంకారవర్జితః ।
నిరపేక్షో మునిర్వీతరాగః సాధురిహోచ్యతే ॥

శ్లో॥ న ప్రహృష్యతి సమ్మానే నావమానేన కుప్యతి ।
న క్రుద్ధః పరుషం బ్రూయాదేత**త్సాధోస్తు** లక్షణమ్ ॥ – గరుడపురాణమ్.

**సాధ్వీ వివృతి :**

శ్లో॥ ఆర్తార్తే ముదితా హృష్టే ప్రోషితా మలినా కృశా ।
మృతే మ్రియేత యా పత్యౌ సాధ్వీ జ్ఞేయా పతివ్రతా ॥

**పయః :** పయ్యతే పీయతే వా పయ గతౌ పీఙ్ పానే వా– "**సర్వధాతుభ్యోఽసున్**" ఇతి అసున్ ఉణా/4/188 – జలమ్. "పయః పూర్వైః స నిశ్వాసైః కవోష్ణముపభుజ్యతే" (రఘు) । దుగ్ధమితి మేదినీ । యథా మనుః 3–821 "కుర్యాదహరహః శ్రాద్ధమన్నాద్యేనోదకేన వా । పయోమూలఫలైర్వాపి పితృభ్యః' ప్రీతిమావహన్ ॥ –

**కోటిః :** కోట్యతే ఛిద్యతేఽనయా । కుట ఛేదే । "సర్వధాతుభ్య ఇన్" । ఉణా 4–117 ఇతి ఇన్ । బాహులకాత్ గుణః । అస్త్రాదేః కోణః... ఉత్కర్షః... శతలక్షసంఖ్యా... ధనురగ్రమ్... రేఖా... వాదవిచారః । సంశయనిర్ణయాయ పూర్వపక్షః... – శబ్దకల్పద్రుమః.

కోటి పదాన్ని పంక్తి, సమూహం, బృందం వంటి సమూహార్థాలలో విరివిగా వాడుతుంటాం. కానీ ప్రసిద్ధ నిఘంటువులు ఏవీ ఆ అర్థాన్ని ఇవ్వలేదు. మనుష్యకోటి, ప్రాణికోటి మొదలుగా గల పదాలు ఒక ప్రత్యేకమైన తరగతిని తెలియజేసే ప్రయోగాలు. విశిష్టజాతి బృందార్థంలోని ఆ పదం తరువాత అర్థవ్యాకోచంతో సాధారణ బృందార్థకంగానే వినియోగంలోనికి వచ్చి యుండవచ్చు.

**ఉత్ప్రేక్ష :** మేఘాల పంక్తులు రక్తపీతకపిశవర్ణాలతో ప్రకాశించటాన్ని కవి ఉత్ప్రేక్షిస్తూ పార్వతీ సందర్శనకు వస్తున్నాయి కాబట్టి చక్కగా అలంకరించుకొని వచ్చినట్లున్నాయని హేతువును ప్రతిపాదించాడు. "ఉత్కృష్టస్త్రీనికటగమనే హి స్త్రీభిరలంకృతాభిః భవితవ్య–మితి హేతోరివేత్యర్థః" అని వివరణవ్యాఖ్య. "సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు–ఫలాత్మనా" అని ఉత్ప్రేక్షాలక్షణం, భేదనిర్దేశనం కూడా. *

**శ్లో॥ సింహకేసరసటాసు భూభృతాం పల్లవప్రసవిషు ద్రుమేషు చ ।**
**పశ్య ధాతుశిఖరేషు భానునా సంవిభక్తమివ సాన్ధ్యమాతపమ్ ॥ 46**

**అవ :** సంధ్యాకాలమందలి ఆతపం క్షీణించటం.

**ప.వి.:** సింహ-కేసర-సటాసు భూ-భృతాం పల్లవ-ప్రసవిషు ద్రుమేషు చ ।
పశ్య ధాతు-శిఖరేషు భానునా సంవిభక్తమ్ ఇవ సాన్ధ్యమ్ ఆతపమ్ ॥

**అన్వ :** భూభృతాం సింహకేసరసటాసు పల్లవప్రసవిషు ద్రుమేషు ధాతుశిఖరేషు చ భానునా సాన్ధ్యమ్ ఆతపం సంవిభక్తమివ (భాతి). పశ్య.

**ప్ర :** భూభృతామ్ = కొండలలో గల, సింహ.. సటాసు : సింహ = సింహాలయొక్క, కేసర = జూలు గట్టిన, సటాసు = జడలయందు, పల్లవ - ప్రసవిషు = చివురులు, పూలుగల, ద్రుమేషు = చెట్లయందు, ధాతు-శిఖరేషు : ధాతు = (గైరికాది) ధాతువులతో కూడిన, శిఖరేషు = శిఖరాలయందు, చ = కూడా, భానునా = సూర్యునిచేత, సాన్ధ్యమ్ = సంధ్యాకాలానికి సంబంధించిన, ఆతపమ్ = ఎండ, సంవిభక్తమ్ ఇవ = విభజించి ఇచ్చినట్లు, (భాతి) = ప్రకాశిస్తోంది, పశ్య = చూడు.

**తా :** (సంధ్యాకాలంలో ఆ సూర్యకిరణాలు విభిన్నప్రదేశాలలో ప్రసరిస్తున్న తీరు ఇలా ఉంది). పార్వతి! కొండల మీది సంచరిస్తున్న సింహాల జూలుమీద, చివుళ్ళు, పూలు గల చెట్లమీద, ధాతువులతో కూడిన శిఖరాల మీద సూర్యుడు సాయంకాలపు టెండను విభజించి పంచిపెట్టినట్లున్నది. చూడు.

**విభక్తులు - క్రియలు :** 1. సటాసు : సటాయాం - సటయోః - **సటాసు**; సటాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. సప్తమీబహువచనమ్; 2. భూభృతామ్ : భూభృతః - భూభృతోః - **భూభృతామ్**; భూభృత్ శబ్దః తకారాన్తః పుంలింగః. షష్ఠీబహువచనమ్; 3. పల్లవ ప్రసవిషు : ప్రసవిని - ప్రసవినోః - **ప్రసవిషు**; ప్రసవిన్ శబ్దః నకారాన్తః పుంలింగః. సప్తమీబహువచనమ్; 4. ద్రుమేషు : ద్రుమే - ద్రుమయోః - **ద్రుమేషు**; ద్రుమశబ్దః అకారాన్తః పుంలింగః. సప్తమీ బహువచనమ్; 5. చ - అవ్యయమ్; 6. పశ్య : **పశ్య**/ పశ్యతాత్ - పశ్యతం - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ఇతి ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 7. ధాతుశిఖరేషు : శిఖరే - శిఖరయోః - **శిఖరేషు**; ధాతుశిఖరశబ్దః అకారాన్తః నపుంసక/పుంలింగః సప్తమీబహువచనమ్; 8. భానునా : **భానునా** - భానుభ్యాం - భానుభిః; భానుశబ్దః ఉకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 9. సంవిభక్తమ్ : **సంవిభక్తం** - సంవిభక్తే - సంవిభక్తాని; సంవిభక్త శబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. సాన్ధ్యమ్ : **సాంధ్యం** - సాంధ్యౌ - సాంధ్యాన్; సాంధ్యశబ్దః అకరాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 12. ఆతపమ్ : **ఆతపమ్** - ఆతపే - ఆతపాన్; ఆతపశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్.

**సమాసాలు :** 1. సింహానాం కేసరాః, తేషాం సటాః, తాసు, సింహకేసరసటాసు; 2. భువం బిభర్తి ఇతి భూభృత్, తేషాం, భూభృతామ్; 3. పల్లవాః ప్రసవాశ్చ, తే సక్తి యేషాం తేషు, పల్లవప్రసవిషు; 4. ధాతూనాం శిఖరాః, తేషు, ధాతుశిఖరేషు; 5. సన్ధ్యాయాం భవః = సాన్ధ్యః (తద్ధితాన్తపదం), తమ్ సాన్ధ్యమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**సటా :** సట - అచ్ పృషోదరాదిత్వాత్ ఠస్య టః 1. 'వ్రతినాం కేశసంఘాతే 2. జటాయాం శబ్దరత్నావళీ 3. విశిఖాయాం 4. సింహాధేః కేశరే చ - మేదినీకోశః । 'సటచ్ఛటాభిన్నఘనేఏ'తి మాఘః । వాచస్పత్యమ్.

**ధాతుః :** ధీయతే సర్వమస్మిన్నితి । ధా+'**సితనిగమ**' ఉణా 1-70 ఇతి తున్... అశ్మ వికృతిః సా తు గైరికమనశ్శిలాది । - శబ్దకల్పద్రమః.

పర్వతవర్ణన సందర్భంలో ధాతు ప్రస్తావన దాదాపు అవశ్యం భావ్యం. కుమార సంభవంలో ప్రథమసర్గలో కూడా హిమవద్వర్ణన రూపమైన కావ్యాదిలో "వలాహకచ్ఛేద-విభక్తరాగామకాలసన్ధ్యామివ **ధాతుమత్తామ్" (1-4) "న్యస్తాక్షరాధాతురసేన** యత్ర భూర్జత్వచః కుంజరబిందుశోణాః" వంటి వర్ణనలు కనిపిస్తాయి. ప్రకృతశ్లోకంలోనూ ధాతువిశిష్టాలైన శిఖరాలపై భానుకిరణప్రసారాన్ని వర్ణించాడు కవి.

పర్వతాలపై సంచరిస్తున్న సింహాల కేసరసటలపై, పల్లవప్రసవులయిన చెట్లపై, ధాతుశిఖరాలపై సమంగా భానుకిరణప్రసారవర్ణన మనోహరం.

**ఉత్ప్రేక్ష :** శ్లోకంలో 'సంవిభక్తమివ' అని ఇవ పదోపయోగంతో ఉత్ప్రేక్షను వ్యంజింపజేశాడు కవి. సంధ్యాతపాన్ని సూర్యుడు మూడుతావులకూ విభజించి పంచిపెట్టినట్లున్నదని సంభావన. అలా విభజింకి ముగ్గురికి ఇవ్వటంతో అది తగ్గిపోయిందని ధ్వని. "**ఏకేన హి బహుభ్యః దీయమానం వస్తుపరిక్షీయమాణం భవతీతి భావః**" అని వివరణవ్యాఖ్యా కర్త. ఒకరి పనిని పదిమందీ పంచుకొంటే పని తేలిక అవుతుంది. ఒకరి ఫలితాన్ని పదిమందీ పంచుకుంటే ఫలం పలచబడిపోతుంది. శ్రమకు తగ్గ ఫలితాన్ని కర్త పొందలేక పోతాడు.

*

**శ్లో॥ పార్ష్ణిముక్తవసుధాస్తపస్వినః పావనామ్బురచితాఞ్జలిక్రియాః ।**
**బ్రహ్మ గూఢమభిసన్ధ్యమాదృతాశ్శుద్ధయే విధివిదో గృణన్త్యమీ ॥ 47**

**అవ :** ద్విజుల సంధ్యావందనం సాయం సమయంలో-

**ప.వి. :** పార్ష్ణిముక్త వసుధాః తపస్వినః పావన+అమ్బు-రచిత+అంజలి-క్రియాః ।
బ్రహ్మ గూఢమ్ అభిసన్ధ్యమ్ ఆదృతాః శుద్ధయే విధివిదః గృణన్తి అమీ ॥

**అన్వ :** పార్ష్ణిముక్తవసుధాః పావనామ్బురచితాంజలిక్రియాః విధివిదః అమీ తపస్వినః శుద్ధయే అభిసన్ధ్యం గూఢం బ్రహ్మ గృణన్తి.

**ప్ర :** పార్ష్ణి... వసుధా : పార్ష్ణి = మడమలచేత, ముక్త = విడువబడిన, వసుధాః = భూమిగలవారునూ, పావ... క్రియాః : పావన = పవిత్రమైన, అమ్బు = నీటిచేత, రచిత = చేయబడిన, అంజలి = దోసిళ్ళతో అర్ఘ్యమిచ్చుట అను, క్రియాః = కర్మ గల వారునూ, విధి-విదః = శాస్త్రమెరిగిన వారును, అయిన, అమీ = ఈ, తపస్వినః = మునులు, శుద్ధయే = శుద్ధికొరకు, అభిసన్ధ్యమ్ = సంధ్యను ఉద్దేశించి, గూఢమ్ = ఉపాంశువుగా, బ్రహ్మ = వేదాన్ని (గాయత్రీ మంత్రాన్ని), గృణన్తి = ఉచ్చరిస్తున్నారు.

**తా :** శాస్త్రవిధుల నెరిగిన మునిజనులు సంధ్యకు అభిముఖంగా నిలిచి సావిత్రిని ఉపాంశువుగా జపిస్తున్నారు. వారు ముంగాళ్ళపై నిలిచి పవిత్రజలాలతో అర్ఘ్యప్రదానం చేస్తున్నారు ఆత్మశుద్ధికోసం.

**విభక్తులు - క్రియలు :** 1. పార్ష్ణిముక్తవసుధాః : వసుధః - వసుధౌ - **వసుధాః**; పార్ష్ణిముక్తవసుధశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 2. తపస్వినః : తపస్వీ - తపస్వినౌ - **తపస్వినః**; తపస్విన్ శబ్దః న కారాన్తః పుంలింగః. ప్రథమాబహు-వచనమ్; 3. పావనాంబురచితాంజలిక్రియాః : క్రియః - క్రియౌ - **క్రియాః**; క్రియశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 4. బ్రహ్మ : **బ్రహ్మ** - బ్రహ్మణీ - బ్రహ్మాణి; బ్రహ్మన్ శబ్దః నకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 5. గూఢమ్ : **గూఢం** - గూఢే - గూఢాని; గూఢశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ద్వితీయైకవచనమ్; 6. అభిసన్ధ్యమ్ - అవ్యయమ్; 7. ఆదృతాః : ఆదృతః - ఆదృతౌ - **ఆదృతాః**; ఆదృతశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమాబహువచనమ్; 8. శుద్ధయే : **శుద్ధయే** - శుద్ధిభ్యాం - శుద్ధిభ్యః; శుద్ధిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః చతుర్థ్యేకవచనమ్; 9. విధివిదః : విధివిత్ - విధివిదౌ - **విధివిదః**; విధివిత్ శబ్దః దకారాన్తః పుంలింగః. ప్రథమాబహు-వచనమ్; 10. గృణన్తి : గృణాతి - గృణీతః - **గృణన్తి**; గౄ శబ్దే ఇతి ధాతోః లటి ప్రథమపురుష బహువచనమ్; 11. అమీ : అసౌ - అమూ - **అమీ**; అదస్ శబ్దః సకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్.

**సంధులు :** 1. వసుధాః+తపస్వినః = వసుధాస్తపస్వినః - విసర్గసంధి; 2. విధివిదః+ గృణన్తి = విధివిదోగృణన్తి-విసర్గసంధి; 3. గృణన్తి+అమీ = గృణన్త్యమీ - యణాదేశసంధి.

**సమాసాలు :** 1. పార్ష్ణిభ్యాం ముక్తా వసుధా యైః తే, పార్ష్ణిముక్తవసుధాః; 2. పావనైః అమ్బుభిః రచితా అంజలిక్రియా యైః తే, పావనాంబురచితాంజలిక్రియాః; 3. సన్ధ్యా ముద్దిశ్య, అభిసన్ధ్యమ్; 4. విధిం విదన్తి ఇతి విధివిదః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**బ్రహ్మే - బ్రహ్మ :** బ్రహ్మ (బ్రహ్మే) శబ్దం చతుర్ముఖ బ్రహ్మ వాచకం. బ్రహ్మము (బ్రహ్మ) పదం తత్త్వతపోవేదవాచకం. "వేదస్తత్త్వం తపో బ్రహ్మ బ్రహ్మ విప్రః ప్రజాపతిః" (అమరకోశం - నానార్థ - 114) బ్రహ్మవైశిష్ట్యం - బ్రహ్మ చతుర్విధం యథా । విరాట్, హిరణ్యగర్భః, ఈశ్వరః, తురీయః. అస్య లక్షణం యథా ఆత్మబోధే-

**శ్లో॥ యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥**

**శ్లో॥ యద్దృష్ట్వా నాపరం దృశ్యం యద్ భూత్వా న పునర్భవః ।**
**యద్జ్ఞాత్వా నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥**

**పార్ష్ణి :** పృష్యతే భూమ్యాదికమ్ అనేన ఇతి । పృష్+"ఘృణిపృశ్నిపార్ష్ణిచూర్ణిభూర్ణి" (ఉణాది 4/52) ఇతి ని ప్రత్యయేన నిపాతనాత్ సాధుః । గుల్ఫస్యాధోభాగః । పాదగ్రన్థ్యధరః ఇత్యమరః । సతు గర్భస్థస్య మాసద్వయేన భవతి ఇతి సుఖబోధః । ...సైన్యపృష్ఠమితి మేదినీ । పృష్ఠమితి హలాయుధః । - శబ్దకల్పద్రుమః.

**అంజలి : 'తౌ యతావంజలిః పుమాన్'** ఇతి అమరకోశః । తౌ పాణీ ఇతి -

"(అఞ్జ+అలి శ్రవణాంజలి పుటపేయమితి వేణీసంహారనాటకే) హస్తసంపుటః । కుడ్వపరిమాణమితి మేదినీ । యథా రామాయణే -

శ్లో॥ న ప్రభాతం త్వయేచ్ఛామి నిశే నక్షత్రభూషితే ।
క్రియతాం మేదయా భద్రే మయాయం రచితోంజలిః ॥

**క్రియాస్వభావవర్ణనం :** పాదాగ్రమాత్రస్థితిత్వం, పావనాంబు రచితాంజలిత్వం, గూఢమంత్రపఠనం ఇవన్నీ **సన్ధ్యావన్దనక్రియాస్వభావవర్ణన**కు సంబంధించిన అంశాలు. కాబట్టి క్రియాస్వభావవర్ణనాత్మకైమన **స్వభావోక్త్యలంకార**మిది. ఈ వర్ణన తరువాత వర్ణించబోయే పరమేశ్వర సన్ధ్యావందనవిధికి ప్రస్తావనా ప్రాయం "**ఇదం చ ప్రస్తావకం వక్ష్యమాణస్య దేవకర్తృకస్య సన్ధ్యావన్దనస్య**".

*

**శ్లో॥ తన్ముహూర్తమనుమన్తుమర్హసి ప్రస్తుతాయ నియమాయ మామపి ।**
**త్వాం వినోదనిపుణస్సఖీజనో వల్గువాదిని! వినోదయిష్యతి ॥ 48**

**ప.వి.:** తత్ ముహూర్తమ్ అనుమన్తుమ్ అర్హసి ప్రస్తుతాయ నియమాయ మామ్ అపి ।
త్వాం వినోద-నిపుణః సఖీ-జనః వల్గు-వాదిని! వినోదయిష్యతి ॥

**అన్వ :** తత్ (త్వం) ప్రస్తుతాయ నియమాయ మామ్ అపి ముహూర్తమ్ అనుమన్తుమ్ అర్హసి. వల్గువాదిని! వినోదనిపుణః సఖీజనః త్వాం వినోదయిష్యతి.

**ప్ర :** తత్ = అందువలన, త్వమ్ = నీవు, ప్రస్తుతాయ = వేళకు సంబంధించిన, నియమాయ = విధిని ఆచరించుటకు, మామ్ అపి = నన్ను గూడ, అనుమన్తుమ్ = అనుమతించటానికి, అర్హసి = తగినదానవు. వల్గువాదిని! = చక్కగా మాటాడుదానా!, వినోద–నిపుణః : వినోద = వేడుకను కల్గించుటలో, నిపుణః = నేర్పుగల, సఖీజనః = చెలికత్తెల బృందం, త్వామ్ = నిన్ను, వినోదయిష్యతి = మాటలతో ప్రొద్దుపుచ్చగలదు.

**తా :** వల్గువాదిని! ఇది సంధ్యాకాలం. కాబట్టి నువ్వు ముహూర్తకాలం శాస్త్రనియమాలను ఆచరించటానికి నన్ను అనుమతించాలి. వినోదాన్ని కల్పించటంలో నేర్పుగల నీ చెలులు నీకు వినోదంగా ప్రొద్దు గడవనిస్తారు.

**విభక్తులు – క్రియలు :** 1. తత్ – అవ్యయమ్; 2. ముహూర్తమ్ : **ముహూర్తం** – ముహూర్తౌ – ముహూర్తాన్; ముహూర్తశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 3. అనుమన్తుమ్ – అను పూర్వకాత్ మన్ ధాతోః తుమున్ ప్రత్యయః – అవ్యయమ్; 4. అర్హసి : **అర్హసి** – అర్హథః – అర్హథ; అర్హ పూజాయామితి ధాతోః లటి మధ్యమపురుషైకవచనమ్; 5. ప్రస్తుతాయ : **ప్రస్తుతాయ** – ప్రస్తుతాభ్యాం – ప్రస్తుతేభ్య; ప్రస్తుతశబ్దః అకారాన్తః పుంలింగః. చతుర్థ్యేకవచనమ్; 6. నియమాయ : **నియమాయ** – నియమాభ్యాం – నియమేభ్యః; నియమశబ్దః అకారాన్తః పుంలింగః. చతుర్థ్యేకవచనమ్; 7. మామ్ : **మామ్**/మా – అవామ్/నౌ – అస్మాన్/నః; అస్మత్ శబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్; 8. అపి – అవ్యయమ్; 9. త్వామ్ : **త్వామ్**/త్వా – యువామ్/వామ్ – యుష్మాన్/వః; యుష్మత్ శబ్దః దకారాన్తః ద్వితీయైకవచనమ్; 10. వినోదనిపుణః : **నిపుణః** – నిపుణౌ – నిపుణాః; నిపుణశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 11. సఖీజనః : **జనః** – జనౌ – జనాః; జనశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 12. వల్గువాదిని : **వాదిని** – వాదిన్యౌ – వాదిన్యః; వల్గువాదినీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. సంబోధనప్రథమైకవచనమ్; 13. వినోదయిష్యతి : **వినోదయిష్యతి** – వినోదయిష్యతః – వినోదయిష్యన్తి; విపూర్వకాత్ ణుద ప్రేరణే ఇతి ధాతోః ప్రేరణే లటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. తత్+ముహూర్తమ్ = తన్ముహూర్తమ్ – అనునాసికసంధి; 2. నిపుణః+సఖీ = నిపుణస్సఖీ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. వినోదే నిపుణః వినోదనిపుణః; 2. సఖ్యః ఏవ జనః, సఖీ జనః; 3. వల్గు యథా తథా వదితుం శీలమ్ అస్యాః, తస్మాత్ సంబుద్ధౌ, వల్గువాదిని.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**తత్ :** "సర్వనామసంజ్ఞకతచ్ఛబ్దసమానార్థకోఽయమ్. సుబన్తప్రతిరూపకమవ్యయమ్. '**తత్తాదృశాః**' ఇత్యాదిషు అనేనైవావ్యయేన తాదృశ ఇత్యస్య సమాసః ...

తద్ ఇతి దకారాన్తమపి హేత్వర్థకం పఠన్తి. 'యదర్థమధీతే తజ్జానాతి' ఇత్యుదాహరన్తి చ. ఉభయధాఽపి రూపే న భేదః. యత్తత్ ఇత్యేతౌ శబ్దశక్తిస్వాభావ్యాత్ మిళితావేవ హేత్వర్థబోధకౌ" - అవ్యయకోశః 185

**ప్రస్తుతాయ నియమాయ :** సమయం సన్ధ్యాకాలం. "యథా తపస్విభిః అయం నియమః అనుష్ఠీయతే తథా మయాపి కర్తవ్యోఽయం విధిరిత్యర్థః" వివరణవ్యాఖ్య. సంధ్యాకాలంలో తపస్వులు పాటించే విధిని తానూ పాటించాలి కాబట్టి ప్రస్తుతనియమమది.

అయితే సాధారణ తపస్వులకో, విహితతత్త్ద్విధులకో వర్తించే నియమాలు 'అహరహస్సన్ధ్యాముపాసీత' వంటివి పరమేశ్వరునకు కూడా వర్తిస్తాయా? అని శంకించవచ్చు. ఎందుకంటే పరమేశ్వరుడు స్తూయమానుడే కాక స్తోత కాదు. వన్దనీయుడే కానీ వన్ది కాడు.

**శ్లో॥ అస్తోతుః స్తూయమానస్య వన్ద్యస్యానన్య వన్దినః ।**
**సుతాసంబంధవిధినా భవ విశ్వగురోర్గురుః ॥** - కు.సం. - 6/75.

అని కాళిదాసే ప్రశంసించి యున్నాడు. పైపెచ్చు సన్ధ్యావిధి సూర్యసంబంధి. కాల ప్రవర్తకులు సూర్యచంద్రులు. ఆ సూర్యచంద్రులే పరమేశ్వరుని అష్టమూర్తులలో చేరినవారు. అదీ ప్రకటించాడు కవి అభిజ్ఞానశాకున్తలంలో నాందీశ్లోకంలో. ఇక శివుడు ఏ నియమం మేరకు ఎవరికి నమస్కరించవలసి వస్తుంది?

లోకనియతిని పరమేశ్వరుడు ఇక్కడ మన్నిస్తున్నాడు.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః ।
స యత్ప్రమాణం కురుతే **లోకస్తదనువర్తతే** ॥

శ్లో॥ నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం **వర్త ఏవ హి కర్మణి** ॥ - భగవద్గీత 3/21,22

అని వ్యాసమహర్షి భగవద్గీతలో ప్రకటించిన భావాలను ఇక్కడ అనుసంధానించు కోవాలి. లోకదర్శనం కోసం పరమేశ్వరుడు ఆ సమయానికి తగిన అనుష్ఠానాన్ని ఆచరించి చూపిస్తున్నాడు.

**అష్టమసర్గ విషయంలో** పార్వతీపరమేశ్వరపరంగా శృంగారప్రసక్తి తగదని శంకించిన వారికి ఇక్కడ పరమేశ్వరుడు సంధ్యానుష్ఠానం చేయటం కూడా అనుచితమే కావాలి. రెండింటి మధ్య కార్యభేదమే కానీ ప్రవృత్తిభేదం లేదు గదా!, గృహస్థునకు రెండూ విహితధర్మాలే. '**ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః**' అన్నది ఉపనిషద్బోధయే, సంధ్యావందనాది విహితకర్మలవలె. అందుకే వివరణవ్యాఖ్యాత "ప్రసిద్ధలౌకికోత్తమనాయకవ్యవహార-మనుకుర్వతోః అనయోర్మహానటయోః లీలామాత్రాత్మికాసు ప్రవృత్తిషు పరమార్థబుద్ధి-ర్యస్యాస్తి తస్యైవాయం దోషః । యస్య తు నాస్తి తస్య తద్వివేచనమపి శివయోః స్తుతౌ పర్యవస్యతి" - అని శృంగారవర్ణననూ సమర్థించాడు. అదీ, ఇదీ రెండూ లీలలే. **ప్రవృత్తిప్రియులనివృత్తి నటన మాత్రమైనప్పుడు, నివృత్తినిష్ఠులప్రవృత్తి లీలామాత్రమే. ***

**శ్లో॥ నిర్విభుజ్య దశనచ్ఛదం తతో వాచి భర్తురవధీరణాపరా ।**
**శైలరాజతనయా సమీపగామాలలాప విజయామహేతుకమ్ ॥ 49**

**అవ :** పార్వతి పరమేశ్వరవచనంపై అనాదరాన్ని ప్రకటించటం.

**ప.వి. :** నిర్విభుజ్య దశన+ఛదం తతః వాచి భర్తుః అవధీరణా-పరా ।
శైల-రాజ-తనయా సమీపగామ్ ఆలలాప విజయామ్ అహేతుకమ్ ॥

**అన్వ :** తతః శైల-రాజ-తనయా భర్తుః వాచి అవధీరణా పరా సతీ దశనచ్ఛదం నిర్విభుజ్య సమీపగాం విజయామ్ అహేతుకమ్ ఆలలాప.

**ప్ర :** తతః = ఆ తరువాత, శైల-రాజ-తనయా : శైలరాజ = కొండలఱేనియొక్క, తనయా = కూతురు, భర్తుః = భర్తయొక్క, వాచి = మాటపై, అవధీరణా పరా (సతీ) : అవధీరణా = తిరస్కృతియందు, పరా (సతీ) = ఆసక్తి గలదై, దశన-చ్ఛదమ్ = పెదవిని, నిర్విభుజ్య = విరిచి, సమీపగామ్ = చెంతనున్న, విజయామ్ = విజయనుద్దేశించి, అహేతుకమ్ = నిష్కారణంగా, ఆలలాప = పలికింది.

**తా :** పరమశివుని మాట విన్న తరువాత పార్వతి బదులివ్వకుండా ఆ మాటను పట్టించుకోనట్టు పెదవి విరిచి తనకు దగ్గరనే ఉన్న విజయతో నిష్కారణంగా ఇలా అన్నది.

**విభక్తులు - క్రియలు :** 1. నిర్విభుజ్య - అవ్యయం. నిర్ వి పూర్వకాత్ భుజ అభ్యవహారే ఇతి ధాతోః ల్యప్ ప్రత్యయః; 2. దశనచ్ఛదమ్ : **ఛదం** - ఛదౌ - ఛదన్; దశనచ్ఛద శబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 3. తతః - అవ్యయమ్; 4. వాచి : **వాచి** - వాచోః - వాక్షు; చకారాన్తః స్త్రీలింగః వాక్ శబ్దః. సప్తమ్యేకవచనమ్; 5. భర్తుః

: **భర్తుః** - భర్త్రోః - భర్తౄణామ్; భర్తృశబ్దః ఋకారాన్తః పుంలింగః. షష్ఠ్యేకవచనమ్; 6. అవధీరణాపరా : **పరా** - పరే - పరాః; అవధీరణాపరా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 7. శైలరాజతనయా : **తనయా** - తనయే - తనయాః; శైలరాజతనయాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 8. సమీపగామ్ : **సమీపగాం** - సమీపగే - సమీపగాః; సమీపగా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 9. ఆలలాప : **ఆలలాప** - ఆలేపతుః - ఆలేపుః; ఆఙ్ పూర్వక లప వ్యక్తాయాం వాచి ఇతి ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 10. విజయామ్ : **విజయాం** - విజయే - విజయాః; విజయాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్.

**సంధులు :** 1. తతః+వాచి = తతోవాచి - విసర్గసంధి; 2. భర్తుః+అవధీరణా = భర్తురవధీరణా - విసర్గసంధి.

**సమాసాలు :** 1. దశనానాం ఛదః తమ్, దశనచ్ఛదమ్; 2. అవధీరణాయాం పరా, అవధీరణాపరా; 3. శైలానాం రాజా, తస్య తనయా, శైలరాజతనయా; 4. సమీపం గచ్ఛతి ఇతి, తామ్, సమీపగామ్; 5. న భవతి యస్మిన్ హేతుః, తత్ యథా తథా, అహేతుకమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఛదః :** ఛదః ఆచ్ఛాదయతి । ఛద్+అచ్ । పత్రమ్ 'పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ' ఇతి ఘప్రత్యయః వా ।

శ్లో॥ తతో న్యగ్రోధమాసాద్య మహాన్తం హరితచ్ఛదమ్ । - రామాయణమ్ 2/55/6

పక్షః । గ్రన్థిపర్ణవృక్షః । తమాలవృక్షః। ఇతి **మేదినీ** ।

ప్రాచీన నిఘంటువులు ఛద పదాన్ని ప్రధానంగా పర్ణార్థంలోనే ఇచ్చాయి. ఆధునికులు మాత్రం సాధారణంగా మూత అనే అర్థంలో ఇచ్చాయి. ఛదనం పదానికి మేదినీకోశం పిధానమనే అర్థాన్ని ఇచ్చింది. ఆధునిక నిఘంటువులు ఛదః -ఛదనమే ఈ రెండింటినీ పర్యాయాలుగానే ప్రదర్శించారు.

**అవధీరాణా :** అవధీర - భావే యుచ్ । అవజ్ఞాయాం 2 తిరస్కారే చ "**కృతవత్యసి నావధీరణామపరాద్ధేఽపి యదా చిరం మయి**" రఘుః । "అయం స యస్మాత్ ప్రణయావధీరణామశంకనీయాం కరభోరు! మన్యసే। - శాకున్తలమ్ । భావే ల్యుట్ । తత్రార్థే నపుంసకమ్ - వాచస్పత్యమ్.

**బిబ్బోకం :** ఇష్టమైన విషయంలో కూడా అనాదరాన్ని ప్రకటించటం, ప్రదర్శించటం

బిబ్బోకం. ఇక్కడ పార్వతికి పరమేశ్వరునితో ప్రసంగించటమైనా తనను వీడి సన్ధ్యోపాసనకై ఉపక్రమిస్తున్నందువలన ప్రణయమాత్రకోపంతో భర్తను తిరస్కరిస్తూ ప్రక్కనున్న విజయతోనే నిష్కారణంగా ఏదో పలికింది.

ఇక్కడ విజయతో మాటాడటం నిష్కారణమే కానీ పరమేశ్వరుని మాటపై అనాదృతి సకారణమే. తాత్కాలికవియోగాన్ని సహించలేని ప్రణయకోపం. సన్ధ్యోపాసన ఈషత్కాలికమే అని తెలిసినా ఆ పాటి ఎడబాటును కూడా భరించలేని ఆమె మానసిక స్థితి అవధీరణనూ అందంగానే పరిణమింపజేస్తుంది. "**గర్వాభిమానాదిష్టేఽపి బిబ్బోకోఽనాదరక్రియా**" అని **బిబ్బోక** నిర్వచనం. (దశరూపకం 3/41) *

**శ్లో॥ ఈశ్వరోఽపి దివసాత్యయోచితం మన్త్రపూర్వమనుతస్థివాన్ విధిమ్ ।**
**పార్వతీమవనతామసూయయా ప్రత్యుపేత్య పునరాహ సస్మితమ్ ॥50**

**అవ :** పరమేశ్వరుడు సంధ్యావిధి ననుష్ఠించి తిరిగి పార్వతిని చేరుట.

**ప.వి.:** ఈశ్వరః అపి దివస+అత్యయ+ఉచితం మన్త్ర–పూర్వమ్ అనుతస్థివాన్ విధిమ్ ।
పార్వతీమ్ అవనతామ్ అసూయయా ప్రతి+ఉపేత్య పునః ఆహ సస్మితమ్ ॥

**అన్వ :** ఈశ్వరః అపి దివసాత్యయోచితం విధిం మన్త్రపూర్వమ్ అనుతస్థితవాన్. అసూయయా అవనతాం పార్వతీం ప్రత్యుపేత్య పునః సస్మితమ్ ఆహ.

**ప్ర :** ఈశ్వరః అపి = ఈశ్వరుడు కూడా, దివస+అత్యయ+ఉచితమ్ : దివస = పగటి యొక్క, అత్యయ = ముగింపువేళకు, ఉచితమ్ = తగినట్టి, విధిమ్ = శాస్త్రచోదితకర్మను, మన్త్రపూర్వకమ్ = తత్తన్మన్త్రపురస్సరంగా, అనుతస్థివాన్ = అనుష్టించాడు. అసూయయా = (పరమేశ్వరుని) తప్పుపడుతూ, అవనతామ్ = తలవాల్చియున్న, పార్వతీమ్ = పార్వతిని గూర్చి, ప్రత్యుపేత్య = ఎదుటనిలిచి, పునః = మరల, సస్మితమ్ = చిఱునవ్వుతో, ఆహ = పలుకుతున్నాడు.

**తా :** పరమేశ్వరుడు సంధ్యాకాలానికి తగిన శాస్త్రవిధిని మన్త్రపూర్వకంగా అనుష్ఠించాడు. ఆపై తనవైపు దోషదృష్టితో తలవాల్చియున్న పార్వతి దగ్గరకు వెళ్ళి చిఱునవ్వుతో ఇలా అంటున్నాడు.

**విభక్తులు – క్రియలు :** 1. ఈశ్వరః : **ఈశ్వరః** – ఈశ్వరౌ – ఈశ్వరాః; ఈశ్వరశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 2. అపి – అవ్యయమ్; 3. దివసాత్యయోచితమ్ : **ఉచితమ్** – ఉచితౌ – ఉచితాన్; ... ఉచితశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 4. మంత్రపూర్వమ్ : **మన్త్రపూర్వం** – మన్త్రపూర్వౌ – మన్త్రపూర్వాన్;

మన్త్రపూర్వశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 5. అనుతస్థివాన్ : **తస్థివాన్** – తస్థివన్తౌ – తస్థివన్తః; అనుతస్థివత్ శబ్దః తకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 6. విధిమ్ : **విధిం** – విధీ – విధీన్; విధి శబ్దః ఇకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 7. పార్వతీమ్ : **పార్వతీమ్** – పార్వత్యౌ – పార్వతీః; పార్వతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 8. అవనతామ్ : **అవనతామ్** – అవనతే – అవనతాః; అవనతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 9. అసూయయా : **అసూయయా** – అసూయాభ్యామ్ – అసూయాభిః; అసూయాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 10. ప్రత్యుపేత్య – అవ్యయం ప్రతి+ఆ+ఉపపూర్వకాత్ ఇణ్ గతావితి ధాతోః ల్యప్ ప్రత్యయః; 11. పునః – అవ్యయమ:; 12. ఆహ : **ఆహ** – ఆహతుః – ఆహుః; బ్రూఞ్ వ్యక్తాయాం వాచి ఇతి ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్. 13. సస్మితమ్ – **క్రియావిశేషణమ్** – అవ్యయమ్.

| | | | |
|---|---|---|---|
| **ఆహ :** | బ్రవీతి/**ఆహ** | బ్రూతః/ఆహతుః | బ్రువన్తి/ఆహుః |
| | బ్రవీషి/ఆత్థ | బ్రూథ/ఆహథుః | బ్రూథ |
| | బ్రవీమి | బ్రూవః | బ్రూమః |

బ్రూ ధాతువుపై లట్‌లో '**బ్రువః పంచానామాదిత ఆహో బ్రువః**' అనే సూత్రంతో ప్రథమపురుషవచనత్రయంలోనూ, మధ్యమపురుష ఏకద్వివచనాలలోనూ తిపాదులకు లిట్ లో "పరస్మైపదానాం ణలతుసుస్థలథుసణల్వమాః" అనే సూత్రంతో ణల్, అతుస్, ఉస్, థల్, అథుస్, థ యథాక్రమంగా ఆదేశంగా వస్తాయి. ధాతువు ఆహాదేశం కూడా వస్తుంది.

**సంధులు :** 1. ఈశ్వరః+అపి = ఈశ్వరోఽపి – విసర్గసంధి; 2. ప్రతి+ఉపేత్య = ప్రత్యుపేత్య – యణాదేశసంధి; 3. పునః+ఆహ = పునరాహ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. దివసస్య అత్యయః, తస్మిన్ ఉచితం, దివసాత్యయోచితమ్; 2. మన్త్రాః పూర్వస్మిన్ (కాలే) యస్య భవతి యథా తథా – మన్త్రపూర్వమ్; 3. సస్మితమ్ – స్మితేన సహితం యథా భవతి తథా.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఆహ :** బ్రూఞ్ ధాతువు మీద లట్ రూపంగా ఇంతకు ముందే వివరింపబడింది. అయితే కాలసామాన్యవాచకంగా ఆహ అన్న అవ్యయం కూడా ఉంది. లట్ – మాత్రంగా అయితే అది. కాలసామాన్యవాచకంగా అయితే **అవ్యయం**.

“**అస్త్యాహ కాలసామాన్యే తిఙన్తప్రతిరూపకమ్**” ఇతి త్రికాండశేషః । “**అథాహ వర్ణీ విదితో మహేశ్వరః**” - (కుమారసమ్భవే 5-65)। ‘ఆహ క్షేపనియోగయోః ‘ఇతి మేదినీ । దృఢసమ్భావనమస్యార్థ ఇతి శబ్దరత్నావళీ । ‘బ్రువః పంచానామాదిత ఆహో బ్రువః’ ఇత్యనేన బ్రూఞ్ ధాతోర్లటి యద్యపి ఆహ ఇతి పాక్షికం రూపం సమ్పద్యతే; తథాపి తస్య వర్తమానకాలికత్వాత్, అస్య చ కాలసామాన్యవాచిత్వాచ్చ కాలభేదార్థం తిఙన్త-ప్రతిరూపకత్వేన అవ్యయత్వమాశ్రితమితి జ్ఞేయమ్ । స్పష్టమిదం ‘వర్తమానే లట్’ (3-2-123) ఇత్యత్ర దుర్ఘటవృత్తౌ ।

**నిపాతాలకు అర్థవ్యంజకత్వం :** ఈశ్వరః **అపి** అన్నచోట అపి అనే నిపాతం అర్థవ్యంజకమవుతోంది. “ఈశ్వరోఽపీతి త్రైలోక్యాధిపతిత్వాత్ తదుపాస్యాయాః దేవతాయా అభావేఽపీత్యర్థః” అని వివరణవ్యాఖ్య. ‘స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చచార’ అని గతంలో ఈశ్వరతపస్సమయంలోనే కాళిదాసు ఈశ్వరునకు ఉపాస్యదేవత ఉండదని ధ్వనింపజేశాడు. “అనేనాచరితేన రాఈ వీతరాగో వా నాచారం లంఘయే’దితి లోకసంశిక్షణమాచరతి దేవః” అని ప్రకాశికా వ్యాఖ్య. ఈ ధ్వనులకు మూలం ‘అపి’ పదం. అందుకే ఆనందవర్ధనుడు -

**శ్లో॥ సుప్తిఙ్ వచనసంబంధైస్తథా కారకశక్తిభిః ।**
**కృత్తద్ధితసమాసైశ్చ జ్ఞేయోఽలక్ష్యక్రమో ధ్వనిః ॥** - ధ్వన్యాలోకం 3/16 *

**శ్లో॥ ముఞ్చ కోపమనిమిత్తకోపనే! సన్ధ్యయా ప్రణమితోఽస్మి నాన్యథా ।**
**కిం న వేత్సి? సహధర్మచారిణం చక్రవాకసమవృత్తిమాత్మనః ॥ 51**

**అవ :** పరమేశ్వరుడు పార్వతిని అనునయించుట.

**ప.వి. :** ముంచ కోపమ్ అనిమిత్తకోపనే! సన్ధ్యయా ప్రణమితః అస్మి న అన్యథా ।
కిం న వేత్సి సహధర్మచారిణం చక్రవాక-సమ-వృత్తిమ్ ఆత్మనః ॥

**అన్వ :** అనిమిత్తకోపనే! త్వం కోపం ముంచ । సన్ధ్యయా ప్రణమితః అస్మి. అన్యథా న. చక్రవాకసమవృత్తిమ్ ఆత్మనః సహధర్మచారిణం న వేత్సి కిమ్?

**ప్ర :** అనిమిత్త-కోపనే! : అనిమిత్త = నిష్కారణంగా, కోపనే = కోపం తెచ్చుకొనే దానా!, త్వమ్ = నీవు, కోపమ్ = కోపాన్ని, ముంచ = వదులు, సన్ధ్యయా = సంధ్య కాబట్టి, ప్రణమితః అస్మి = ఒంగి (లొంగి) పోయాను. అన్యథా = మరొకరీతిగా, న = లేదు (కాదు), చక్ర... వృత్తిమ్ : చక్రవాక = చక్రవాకంతో, సమ = సమానమైన, వృత్తిమ్ = ప్రవర్తన గల, ఆత్మనః = నీయొక్క, సహధర్మచారిణమ్ = సహధర్మచారిని, న వేత్సి కిమ్? = తెలుసుకోలేవా?

**తా :** నిష్కారణంగా కోపం తెచ్చుకొనేదానా! కోపాన్ని విడిచిపెట్టు. సంధ్యకాబట్టి ధర్మదృష్టితో ఒంగిపోయాను. మరొకరీతిగా (కామదృష్టితో) కాదు. నేను నీకు సహధర్మచారిని చక్రవాకం వంటి ప్రవర్తన గలవాడిని.

**విభక్తులు - క్రియలు :** 1. ముంచ : **ముంచ**/ముంచతాత్ - ముంచతమ్ - ముంచత; ముచ్ల్ - మోక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 2. కోపమ్ : **కోపం** - కోపౌ - కోపాన్; కోపశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 3. అనిమిత్తకోపనే! : ...**కోపనే!** - కోపనే! - కోపనాః; అనిమిత్తకోపనాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. సంబోధనప్రథమైకవచనమ్; 4. సన్ధ్యయా : **సన్ధ్యయా** - సన్ధ్యాభ్యాం - సన్ధ్యాభిః; సన్ధ్యాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 5. ప్రణమితః : **ప్రణమితః** - ప్రణమితౌ - ప్రణమితాన్; ప్రణమితశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 6. అస్మి : **అస్మి** - స్వః -స్మః; అస భువి ధాతోః లటి ఉత్తమపురుషైకవచనమ్; 7. న - అవ్యయమ్; 8. అన్యథా - అవ్యయమ్; 9. కిమ్ - అవ్యయమ్; 10. న - అవ్యయమ్; 11. వేత్సి : వేత్సి - విత్థః - విత్థ; విద జ్ఞానే ధాతోః లటి మధ్యమపురుషైకవచనమ్; 12. సహధర్మచారిణమ్ : **చారిణం** - చారిణౌ - చారిణః; సహధర్మచారిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 13. చక్రవాకసమవృత్తిమ్ : ...**వృత్తిం** - వృత్తీ - వృత్తీన్; చక్రవాకసమవృత్తిశబ్దః ఇకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 14. ఆత్మనః : **ఆత్మనః** - ఆత్మనోః - ఆత్మనామ్; ఆత్మన్‌శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్.

**సంధులు :** 1. ప్రణమితః+అస్మి = ప్రణమితోఽస్మి - విసర్గసంధి; 2. న+అన్యథా = నాన్యథా - సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. అనిమిత్తం యథా తథా కోపం కర్తుం శీలమ్ అస్యాః ఇతి అనిమిత్తకోపనా, తస్యాః సంబుద్ధౌ అనిమిత్తకోపనా; 2. సహ ధర్మం చరితుం శీలమస్య ఇతి సహధర్మచారీ, తం సహధర్మచారిణమ్; 3. చక్రవాకేణ సమా వృత్తిః యస్య, తమ్, చక్రవాకసమవృత్తిమ్. *

**శ్లో॥ నిర్మితేషు పితృషు స్వయమ్భువా యా తనుస్సుతను! పూర్వముజ్ఝితా ।**
**సేయమస్తముదయం చ సేవ్యతే తేన మానిని! మమాత్ర గౌరవమ్॥52**

**అవ :** పరమేశ్వరుడు సన్ధ్యావందనమాచరించుట.

**ప.వి. :** నిర్మితేషు పితృషు స్వయమ్భువా యా తనుః సుతను! పూర్వమ్ ఉజ్ఝితా ।
సా ఇయమ్ అస్తమ్ ఉదయం చ సేవతే తేన మానిని మమ అత్ర గౌరవమ్॥

**అన్వ :** సుతను! స్వయమ్భువా పితృషు నిర్మితేషు యా తనుః పూర్వమ్ ఉజ్ఝితా సా ఇయమ్ ఉదయమ్ అస్తమ్ చ సేవతే. మానిని! తేన మమ అత్ర గౌరవమ్.

**ప్ర :** సుతను = చక్కని శరీరం గలదానా!, స్వయమ్భువా = బ్రహ్మచే, పితృషు = పితరులు (పితృదేవతలు), నిర్మితేషు = సృష్టింపబడగా, యా తనుః = ఏ శరీరం, పూర్వమ్ = గతంలో, ఉజ్ఝితా = విడువబడినదో, సా ఇయమ్ = ఆ ఈ శరీరమే, ఉదయమ్ = ప్రాతఃకాలాన్ని, అస్తమ్ చ = సంధ్యాకాలాన్ని కూడా, సేవతే = ఆశ్రయిస్తుంది. మానిని! = అభిమానశీలా!, తేన = ఆ కారణంచేత, మమ = నాకు, అత్ర = సంధ్యపై, గౌరవమ్ = మన్నన.

**తా :** అభిమానవతి! బ్రహ్మ పితరులను సృష్టించిన తరువాత ఆ శరీరాన్నే విడిచిపెట్టాడట. ఆ శరీరం ఉదయాస్తమయసంధ్యలను ఆశ్రయిస్తుంది. (సంధ్యారూపంలో ఆ శరీరమే కనిపిస్తుంది) కాబట్టి దానిపై నాకు గౌరవం.

**విభక్తులు - క్రియలు :** 1. నిర్మితేషు : నిర్మితే - నిర్మితయోః - **నిర్మితేషు**; నిర్మితశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 2. పితృషు : పితరి - పిత్రోః - **పితృషు**; పితృశబ్దః ఋకారాన్తః పుంలింగః. సప్తమీబహువచనమ్; 3. స్వయమ్భువా : **స్వయమ్భువా** - స్వయంభూభ్యాం - స్వయంభూభిః; స్వయమ్భూశబ్దః ఊకారాన్తః పుంలింగః. తృతీయైకవచనమ్; 4. యా : **యా** - యే - యాః; యచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 5. తనుః : **తనుః** - తనూ - తనవః; తనుశబ్దః ఉకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 6. సుతను! : **సుతను!** - సుతనూ! - సుతనువః!; సుతనుశబ్దః ఉకారాన్తః స్త్రీలింగః. సంబోధన ప్రథమైకవచనమ్; 7. ఉజ్ఝితా : **ఉజ్ఝితా** - ఉజ్ఝితే - ఉజ్ఝితాః; ఉజ్ఝితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 8. సా : **సా** - తే - తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. ఇయమ్ : **ఇయమ్** - ఇమే - ఇమాః; ఇదం శబ్దః మకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 10. అస్తమ్ - అవ్యయమ్; 11. చ - అవ్యయమ్; 12. సేవతే : **సేవతే** - సేవేతే - సేవన్తే; షేవృ సేవనే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 13. తేన : **తేన** - తాభ్యాం - తైః; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 14. మానిని : **మానిని!** - మానిన్యౌ - మానిన్యః - మానినీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. సంబుద్ధిః ప్రథమైకవచనమ్; 15. మమ : **మమ**/ మే - ఆవయోః/ నౌ - అస్మాన్/ నః; అస్మచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 16. అత్ర - అవ్యయమ్; 17. గౌరవమ్ : **గౌరవం** - గౌరవే - గౌరవాణి - గౌరవశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. సా+ఇయమ్ = సేయమ్ - గుణసంధి; 2. మమ+అత్ర = మమాత్ర - సవర్ణదీర్ఘసంధి.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**స్వయమ్భూః :** (స్వయం భవతి ఇతి । భూ+క్విప్) బ్రహ్మా ఇత్యమరః । జినచక్రవర్తివిశేషః । తత్పర్యాయః । రుద్రతనయః । ఇతి హేమచన్ద్రః । కాలః ఇతి శబ్దరత్నావళీ । కామదేవః । విష్ణుః । శివః ఇతి కేచిత్ । మాషపర్ణీ । లింగినీ । ఇతి రాజనిఘంటుః । స్వయ-ముత్పన్నే అపౌరుషేయే చ త్రి ॥ యథా మనుః -

శ్లో॥ త్వమేకోऽహ్యస్య సర్వస్య విధనస్య స్వయమ్భువః ।
అచిన్త్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవిత్ ప్రభో ॥

**బ్రహ్మతనువే సంధ్య :** భవిష్యత్పురాణకథనం మేరకు బ్రహ్మయొక్క పితృసర్గపూర్వశరీరమే సంధ్య. పితృసృష్టి జరిపిన తర్వాత బ్రహ్మ ఆ శరీరాన్ని వదిలిపెట్టాడట. ఆ శరీరమే సన్ధ్యగా ఉభయవేళలలో నమస్సులనూ, సన్నుతులనూ అందుకొంటోందట-

**శ్లో॥ ప్రజాపతిః పితౄన్ సృష్ట్వా మూర్తిం తాముత్ససర్జ హ ।**
**సా ప్రాతస్సాయమాగత్య సన్ధ్యారూపేణ పూజ్యతే ॥**

**శ్లో॥ ఏనాం సన్ధ్యాం యాతాత్మానో యే తు దీర్ఘముపాసతే ।**
**దీర్ఘాయుషో భవిష్యన్తి నీరుజాః పాండునందన! ॥**

ఆసక్తికరమైన అంశమిది. ప్రజాపతి పితృసృష్టి చేసిన తరువాత శరీరాన్ని పరిత్యజించవలసిన అవసరమేమిటి? పితృసృష్టి అపవిత్రకార్యక్రమమా? శ్రాద్ధాదులలో ధరించిన పవిత్రాన్ని తీసి విప్పి వేయటం వంటిదా? అదే అయితే అది సంధ్యారూపంగా పరిణమించి మరల ప్రాతస్సాయం కాలాలలో ఉపాసింపబడటమేమిటి?...

ఆ సన్ధ్యను ఉపాసించటానికే ప్రకృతంలో పరమేశ్వరుడు పార్వతిని వీడి వెళ్ళాడు. సప్తమసర్గలో కూడా కాళిదాసు పార్వతీపరమేశ్వరులకు పితామహునిపై గల ఆదరాన్ని ప్రకటించాడు-

శ్లో॥ ఇత్థం విధిజ్ఞేన పురోహితేన - ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ ।
ప్రణేమ తుస్తౌ పితరౌ ప్రజానాం - పద్మాసనస్థాయ పితామహాయః ॥(7/85) *

**శ్లో॥ తామిమాం తిమిరవృద్ధిపీడితాం భూమిలగ్నమివ సంప్రతి స్థితామ్ ।**
**ఏకతస్తటతమాలమాలినీం పశ్య ధాతురసనిమ్నగామివ ॥ 53**

**అవ :** సంధ్యాదర్శనం చేయిస్తూ పరమేశ్వరుడు పార్వతితో పలుకుట.

**ప.వి. :** తామ్ ఇమామ్ తిమిర-వృద్ధి-పీడితాం భూమి-లగ్నమ్ ఇవ సంప్రతి స్థితామ్।
ఏకతః తట-తమాల-మాలినీం పశ్య ధాతు-రస-నిమ్నగామ్ ఇవ ॥

**అన్వ :** సమ్ప్రతి తిమిరవృద్ధిపీడితాం భూమి లగ్నమివ స్థితాం తామ్ ఇమామ్ (సన్ధ్యామ్) ఏకతః తటతమాలమాలినీం ధాతురసనిమ్నగామివ పశ్య.

**ప్ర :** సంప్రతి = ఇప్పుడు, తిమిర... పీడితామ్ : తిమిర = చీకట్లయొక్క, వృద్ధి = పెరుగదలచేత, పీడితామ్ = ఒత్తిడికి గురిజేయబడినదై, భూమి-లగ్నమ్ ఇవ = భూమిలో కూరుకొని పోయినట్లు, స్థితామ్ = ఉన్నట్టి, ఇమామ్ = దీనిని (సంధ్యను), ఏకతః = ఒకవైపు, తట... మాలినీమ్ : తట = తీరమందలి, తమాల-మాలినీమ్ = చీకటిచెట్ల వరుసలు గల దానినిగా, ధాతు... నిమ్నగామ్ ఇవ : ధాతు = ధాతువులతో కూడిన, రస = నీరుగల నిమ్నగామ్ ఇవ = నదిని వలె, పశ్య = చూడు.

**తా :** పార్వతి! చూడు. చీకట్లు పెరగడంతో సంధ్య నెట్టివేయబడి భూమిలో కూరుకు పోయినట్లుంది. ఒకవైపు తీరంలోని తమాల తరువుల వరుసలు కప్పివేయగా ధాతురసజలాలతో ప్రవహిస్తున్న నదిలా కనిపిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. తామ్ : **తామ్** - తే - తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 2. ఇమామ్ : **ఇమామ్** - ఇమే - ఇమాః; ఇదం శబ్దః మకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 3. ...పీడితామ్ : **పీడితాం** - పీడితే - పీడితాః; ...పీడితాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 4. భూమిలంబమ్ - అవ్యయమ్; 5. ఇవ - అవ్యయమ్; 6. సంప్రతి - అవ్యయమ్; 7. స్థితామ్ : **స్థితాం** - స్థితే - స్థితాః; ఆకారాన్తః స్త్రీలింగః స్థితా శబ్దః ద్వితీయైకవచనమ్; 8. ఏకతః - అవ్యయమ్; 9. తటతమాలమాలినీమ్ : **మాలినీం** - మాలిన్యౌ - మాలినీః; ... మాలినీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 10. పశ్య : **పశ్య**/పశ్యతాత్, పశ్యతమ్ - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 11. ధాతురసనిమ్నగామ్ : **నిమ్నగాం** - నిమ్నగే - నిమ్నగాః; నిమ్నగా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ద్వితీయైకవచనమ్; 12. ఇవ - అవ్యయమ్.

**సంధులు :** 1. ఏకతః+తమాల = ఏకతస్తమాల - విసర్గసంధి;

**సమాసాలు :** 1. తిమిరస్య వృద్ధిః తయా పీడితా, తామ్, తిమిరవృద్ధిపీడితామ్; 2. భూమేః లంబమ్, భూమిలంబమ్; 3. తటే వర్తమానాః తమాలాః, తేషాం మాలినీ,

తామ్, తటతమాలమాలినీమ్; 4. ధాతు ప్రచురః రసః, తన్మయీా నిమ్నగా తామ్, ధాతురసమయనిమ్నగామ్ । నిమ్నం గచ్ఛతి ఇతి, నిమ్నగా.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**భూమిలంబమ్ :** "లబి అవస్రంసనే ఇతి ధాతోః సప్తమ్యన్తే ఉపపదే '**సమసాత్తౌ**' ఇతి ణముల్ । భూమౌ లమ్బిత్వా ఇత్యర్థః ।"

ణముల్ ప్రత్యయాంతం కాబట్టి ఇది అవ్యయ మవుతుంది. "**కృన్మేజన్తః**" (అష్టాధ్యాయి 1-1-39) అని సూత్రం

**సమ్ప్రతి :** ఇదానీమిత్యర్థోఽస్య । "సమ్ప్రత్యసాంప్రతం వక్తుముక్తే ముసలపాణినా" (మాఘే 2-70)। **సమ్+ప్రతి** ఇత్యుపసర్గద్వయసముదాయోఽయం స్వభావాదధునేత్యర్థే వర్తతే । నఞ్ సంపర్కాత్ అసంప్రతి ఇత్యపి.

'**సమ్యక్**' ఇత్యర్థోఽపి వేదే దృష్టః। యథా - ఆత్మానమేవైనం వైశ్వానరం సంప్రత్యధ్యేషి - (ఛాన్దోగ్యే 5-11-6)। ఆర్జవార్థకోఽపి క్వచిత్ । - అవ్యయకోశః 361)

**ఉత్ప్రేక్ష : 'ధాతురసనిమ్నగామ్ ఇవ'** అన్నచోట ప్రకాశికావ్యాఖ్య ఉపమాలంకారమని నిర్దేశించింది. అయితే వివరణవ్యాఖ్య దాన్ని ఉత్ప్రేక్షాలంకారంగా ప్రకటించింది. అంతేగాక ఉపమాలంకార మనటాన్ని వ్యతిరేకించింది. "అరుణాచలనాథస్తు మహతా ప్రయాసేన అత్రత్యమివశబ్దమ్ ఉపమాద్యోతకపక్షే నిక్షిప్తవాన్. బాలప్రబోధార్థినః వయం తు ప్రతీతిబలాదుత్ప్రేక్షాపక్షే నిక్షిపామః"

వాస్తవానికి ఇక్కడ ఉత్ప్రేక్షాలంకార మనటమే యుక్తియుక్తం. ధాతురసనిమ్నగ అన్నది అప్రసిద్ధమైన ఉపమానం. సంభావితోపమాన మవుతుంది. "స్వతసిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః। సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా" అన్న విద్యానాథ లక్షణానికి విరుద్ధమవుతుంది. అప్పయ్యదీక్షితులు చిత్రమీమాంసలో పై విద్యానాథలక్షణాన్ని నిరాకరిస్తూ చెప్పినట్లు "ఉత్ప్రేక్షాయామివకారస్య విషయవిషయిణోః - తాదాత్మ్యాది సంభావనావాచకత్వేన తత్ర సామ్యస్య అవాచ్యతయా తత ఏవ తద్వ్యావృత్తేః" - శ్లోకంలో ఇవ పదం సామ్యాన్ని చెప్పటం లేదు. సామ్య సంభావనను మాత్రమే చెప్తోంది. 'పశ్య' అన్న లోట్ ప్రయోగం ఆదేశరూపమై పార్వతితో పాటు పాఠకుణ్ణి కూడా ఉపమగా భావించమని ఒత్తిడి చేసినట్లవుతుంది. మహాకవి అటువంటి ప్రయత్నం చేయడు. ఉత్ప్రేక్షాపక్షంలో **పశ్య**పదం స్వీయసంభావనా ప్రదర్శనాత్మకంగా కనిపిస్తుంది. కవిగతమైన ఉత్సుకతకు వ్యంజకం. కాబట్టి ఉత్ప్రేక్ష అనటమే సముచితం.

ఇక్కడ ఉపమాలంకారమని నిర్దేశించే ప్రయత్నం చేసిన ప్రకాశికా వ్యాఖ్య ఈ శ్లోకసందర్భంలో కాకుండా తర్వాతి (54) శ్లోకం దగ్గర దీనిని గురించి చర్చించటం విశేషం. అందునా 54వశ్లోక వ్యాఖ్యలో ఒక పంక్తి తప్ప మిగిలినదంతా ఈ శ్లోకంలో ఉపమాలంకారాన్ని నిరూపించే ప్రయత్నమే. పరిష్కర్తల పొరపాటనే అవకాశమూ లేదిక్కడ. "ముందు శ్లోకంలో కూడా" అంటూ ప్రారంభించినందువల్ల. ఆ పాఠం యథాతథంగా-

"నన్వత్రేవ పూర్వత్రాప్యుపమానస్య క్రియాన్వయేన భవితవ్యమ్ । న చాసౌ సిద్ధ్యతి । ధాతురసనిమ్నగాయాః దేవీదర్శనవిషయస్య అసిద్ధత్వాత్ । ఉచ్యతే । న హ్యుపమానస్య సర్వత్ర క్రియాన్వయః । తర్హ్యుపమానవాచి పదం కేనాన్వయముపేయాత్? ఉపమీయ వాచినా । నను కస్తయోస్సంబంధః? విశేషణవిశేష్యభావః । తత్రోపమానం విశేషణం, శుక్లాదివదవ్యావర్తత్వాత్ । అన్యద్ విశేష్యం పటాదివద్ వ్యావృత్తప్రత్యయవిషయత్వాత్ । అత ఏవ వాగర్థావిత్యాదౌ ద్వితీయాదివిభక్తియోగః । నను తథాపి క్రియాన్వయేన భవితవ్యమ్ । సర్వేషామేవ విశేషణపదానాం విశేష్యపదవత్ క్రియాపదాన్వయస్య వాక్యే వాక్యవిదామిష్టత్వాత్ । ఉచ్యతే । న హ్యన్వయః ప్రథమం సక్త్యా ప్రతీతిపథమవతరతి । న తు విశ్రాన్తి పదం భవతి । విశ్రాన్తిపదం తు పార్ష్ణికో విశేషణ విశేష్యయోరన్వయః । స ఏవ చ వ్యవహారాంగం వాస్తవశ్చ । అత ఏవ శ్రౌత్యాముపమాయాం తయోః సమానవిభక్తికత్వమ్"-

*

**శ్లో॥ సాన్ధ్యమస్తమితశేషమాతపం రక్తలేఖమపరా బిభర్తి దిక్ ।**
**సామ్పరాయవసుధా సశోణితం మణ్డలాగ్రమివ తిర్యగుజ్ఝితమ్ ॥ 54**

**అవ :** సంధ్యారాగవర్ణనం.

**ప.వి. :** సాన్ధ్యమ్ అస్తమిత-శేషమ్ ఆతపం రక్త-రేఖమ్ అపరా బిభర్తి దిక్ ।
సామ్పరాయ-వసుధా సశోణితం మణ్డల+అగ్రమ్ ఇవ తిర్యక్ ఉజ్ఝితమ్॥

**అన్వ :** అపరా దిక్ అస్తమితశేషం రక్తలేఖమ్ సాన్ధ్యమ్ ఆతపం సామ్పరాయవసుధా తిర్యక్ ఉజ్ఝితమ్ సశోణితం మణ్డలాగ్రమివ బిభర్తి.

**ప్ర :** అపరా దిక్ = పశ్చిమాశ (పడమటి దిశ), అస్తమిత-శేషమ్ = అదృశ్యంకాగా మిగిలినదీ, రక్త-లేఖమ్ = ఎఱ్ఱటిరేఖ వంటిదీ, సాన్ధ్యమ్ = సంధ్యాకాలానికి చెందినదీ, అయిన, ఆతపమ్ = ఎండను, సాంపరాయ-వసుధా = యుద్ధభూమి, తిర్యక్ = అడ్డంగా, ఉజ్ఝితమ్ = విడువబడినదీ, సశోణితమ్ = నెత్తుటితో కూడినదీ అయిన, మండలాగ్రమ్ ఇవ = కత్తిలా, బిభర్తి = ధరిస్తోంది.

**తా :** సంధ్యాకాలంలో ఎండ కొంత అణిగిపోయి కొంత మిగిలి ఉంది. అది రక్తరేఖలా కనిపిస్తోంది. పడమటి దెస దాన్ని భరిస్తోంది. ఆ స్థితి అడ్డంగ వదలబడి నెత్తుటితో కూడివున్న కత్తిని యుద్ధభూమి భరించినట్లుంది.

**విభక్తులు - క్రియలు :** 1. సాన్ధ్యమ్ : **సాన్ధ్యం** - సాన్ధ్యౌ - సాన్ధ్యాన్; సాన్ధ్యశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 2. అస్తమితశేషమ్ : **శేషం** - శేషౌ - శేషాన్; అస్తమితశేషశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. ఆతపమ్ : **ఆతపమ్** - ఆతపౌ - ఆతపాన్; ఆతపశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 4. రక్తరేఖమ్ : **రేఖం** - రేఖౌ - రేఖాన్; రక్తరేఖశబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 5. అపరా : **అపరా** - అపరే - అపరాః; అపరాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనాన్తః; 6. దిక్ : **దిక్** - దిశౌ - దిశః; శకారాన్తః స్త్రీలింగః దిక్ శబ్దః ప్రథమైకవచనమ్; 7. సామ్పరాయవసుధా : **వసుధా** - వసుధే - వసుధాః; వసుధాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 8. సశోణితమ్ : **సశోణితం** - సశోణితౌ - సశోణితాన్; సశోణితశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 9. మండలాగ్రమ్ : **మండలాగ్రం** - మండలాగ్రౌ - మండలాగ్రాన్; మండలాగ్రశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. తిర్యక్ - అవ్యయమ్; 12. ఉజ్ఝితమ్ : **ఉజ్ఝితమ్** - ఉజ్ఝితౌ -ఉజ్ఝితాన్; ఉజ్ఝిత శబ్దః అకారాన్తః పుంలింగః. ద్వితీయైకవచనమ్; 13. బిభర్తి : **బిభర్తి** - బిభృతః - బిభ్రతి; డుభృఞ్ ధారణే ఇతి ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. తిర్యక్+ఉజ్ఝితమ్ - తిర్యగుజ్ఝితమ్ - జశ్త్వసంధి

**సమాసాలు :** 1. అస్తమితస్య శేషః తమ్, అస్తమితశేషమ్; 2. రక్తా రేఖా యస్య సః, తమ్, రక్తరేఖమ్; 3. సామ్పరాయాయ వసుధా, సాంపరాయవసుధా; 4. శోణితేన సహితః, తమ్, సశోణితమ్; 5. తిర్యక్ యథా భవతి తథా ఉజ్ఝితమ్, తిర్యగుజ్ఝితమ్

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**సామ్పరాయః : 'యుద్ధాత్యయోః సామ్పరాయః'** ఇత్యమరః. ఇతి వివరణవ్యాఖ్య. కానీ ఈ పాఠం అమరకోశంలోని చాలా ప్రతులలో కనిపించదు. "సాంపరాయస్తు సంగ్రామే" అని వైజయన్తీకోశం. సంపరాయ పదమే నిఘంటువులలో ఎక్కువగా కనిపిస్తుంది. 'సమ్యక్ పరే కాలే ఈయతే ఇతి సమ్+పర+ఇణ్+ఘఞ్' అని హలాయుధకోశం. 'సమ్+పరా+ఇణ్+అచ్' అని శబ్దకల్పద్రుమం. సంపరాయ పదమే స్వార్థతద్ధిత-ప్రత్యయంతో (అణ్) సాంపరాయమైందని భావించాలి.

శ్లో॥ సంగ్రామః సమితిః సమిచ్చ సమరం సంఖ్యం సమీకం రణం
యుద్ధం యుత్ప్రధనం మృధం సముదయః సంయత్కలిః సంయుగమ్ ।
ద్వంద్వాయోధనసంప్రహారకలహాక్రందాహవాభ్యాగమాః
సంస్ఫోటప్రవిదారణప్రహరణానీకా జయస్సంగరః ॥

శ్లో॥ **సంపరాయః** సమాఘాతః ప్రఘాతశ్చ సమాహ్వయః ।
జన్యం స్యాదభిసమ్పాతః సమ్మర్దో విగ్రహస్తథా ॥ అని హలాయుధకోశం.

సాంపరాయ పదాన్ని కఠోపనిషత్తు మరో అర్థంలో ప్రయోగించింది.

**శ్లో॥ న సాంపరాయః ప్రతిభాతి బాలం – ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్ ।**
**అయం లోకో నాస్తి పర ఇతి మానీ – పునః పునర్వశమాపద్యతే మే ॥**

– కఠోపనిషత్తు – 2/6

సాంపరాయః = పరలోకసాధనవిశేషః "సమ్పర ఈయతే ఇతి సమ్పరాయః పరలోకః, తత్ప్రాప్తిప్రయోజనః సాధనవిశేషః శాస్త్రీయః సమ్పరాయః" ఇతి **శాంకరభాష్యమ్.**

**అలంకారం – ఉపమ :** శ్లోకంలో ఉపమాలంకారముంది. పశ్చిమదిక్కునకు యుద్ధభూమితో పోలిక. పశ్చిమదిక్కు సంధ్యాకాలీనమై రక్తరేఖారూపమైన ఎండను భరిస్తోంది. అది యుద్ధభూమి అది అడ్డంగా విడువబడి ఎఱ్ఱగా ఉన్న కత్తిని భరించినట్లుంది. ఇది పూర్ణోపమ. శ్రౌతి.

**రసస్థితి :** కావ్యంలో పార్వతీపరమేశ్వరపరమైన విహారంలో భాగంగా సంధ్యారాగవర్ణనం ప్రకృతాంశం. ఆ సంధ్యారాగవర్ణనం శృంగారానికి పరిపోషకం కావాలి. శ్లోక పూర్వార్ధంలో సాంధ్యాతపవర్ణన సమాసోక్తిరూపంలో నాయికానాయికపరమైన శృంగారాన్నే ధ్వనింపజేస్తూ ప్రకృతరసపరిపోషక మవుతుంది. ఉత్తరార్ధంలో యుద్ధభూమిలోని యుద్ధోపకరణమైన కరవాల వర్ణన. అది రౌద్రరసాభివ్యంజకం. శృంగారరౌద్రరసాలు పరస్పరవిరుద్ధాలు. విరుద్ధరసపోషణ దోషాన్ని – అది స్థితి విరోధం కాబట్టి – భిన్నాధికరణాల్లో వర్ణిస్తే దోషపరిహారమని ఆలంకారిక వచనం.

కాబట్టి ప్రకృతశ్లోకంలో భిన్నాధికరణంగా తదుభయరసపోషణ ముంది. ఉపమేయకక్ష్యలో శృంగారరసం, ఉపమానకక్ష్యలో రౌద్రరసం కాబట్టి అధికరణభేదం కనిపిస్తోంది దోషం లేదు.

**శ్లో॥ సురాంగనాభిరాశ్లిష్టా వ్యోమ్ని వీరా విమానగాః ।**
**విలోకన్తే నిజాన్ దేహాన్ ఫేరు నారీభిరావృతాన్ ॥**

– రసగంగాధరః ప్రథమాననమ్. *

**శ్లో॥ యామినీదివససన్ధిసమ్భవే తేజసి వ్యవహితే సుమేరుణా ।**
**ఏతదన్ధతమసం నిరఙ్కుశం దిక్షు దీర్ఘనయనే! విజృమ్భతే ॥ 55**

**అవ :** తమోభివ్యాప్తిని వర్ణించటం.

**ప.వి. :** యామినీ-దివస-సన్ధి-సమ్భవే తేజసి వ్యవహితే సుమేరుణా ।
ఏతద్ అన్ధతమసం నిరఙ్కుశం దిక్షు దీర్ఘ-నయనే! విజృమ్భతే ॥

**అన్వ :** దీర్ఘనయనే! యామినీదివససన్ధిసమ్భవే తేజసి సుమేరుణా వ్యవహితే ఏతద్ అంధతమసమ్ నిరఙ్కుశం దిక్షు విజృమ్భతే.

**ప్ర :** దీర్ఘ-నయనే! = నిడుదకనులదానా!, యామి... సంభవే : యామినీ = రేయి, దివస = పగలు - వీటియొక్క, సన్ధి = కలయికవలన, సమ్భవే = పుట్టినట్టి, తేజసి = (సాంధ్య) తేజస్సు, సుమేరుణా = బంగారుకొండచేత, వ్యవహితే సతి = నిరోధింపబడగా, ఏతత్ = ఈ, అన్ధతమసమ్ = కారుచీకటి, నిరంకుశమ్ = అనియంత్రితంగా, దిక్షు = దిక్కులలో, విజృమ్భతే = అలముకొంటోంది.

**తా :** నిడుదకనులదానా! రేబవళ్ళ సంధివలన పుట్టిన తేజస్సును మేరుపర్వతం అడ్డగించింది. దానితో పెనుచీకటి నిరంకుశంగా చెలరేగుతోంది.

**విభక్తులు - క్రియలు :** 1. యామినీదివససన్ధిసమ్భవే : ...**సంభవే** - సంభవయోః - సంభవేషు; ...సమ్భవశబ్దః అకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 2. తేజసి : **తేజసి** - తేజసోః - తేజస్సు; తేజశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 3. వ్యవహితే : **వ్యవహితే** - వ్యవహితయోః - వ్యవహితేషు; వ్యవహితశబ్దః అకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 4. సుమేరుణా : **సుమేరుణా** - సుమేరుభ్యాం - సుమేరుభిః; సుమేరుశబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 5. ఏతత్ : **ఏతత్** - ఏతే - ఏతాని; ఏతచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 6. అన్ధతమసమ్ : **అన్ధతమసమ్** - అన్ధతమసే - అన్ధతమసాని; అన్ధతమసశబ్దః అన్ధతమసశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. నిరంకుశమ్ - క్రియావిశేషణమ్ - అవ్యయమ్; 8. దిక్షు : దిశి - దిశోః - **దిక్షు**; దిక్ శబ్దః శకారాన్తః స్త్రీలింగః సప్తమీబహువచనమ్; 9. దీర్ఘనయనే : ...**నయనే** - నయనే - నయనాః; దీర్ఘనయనాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః సంబోధన ప్రథమైకవచనమ్; 10. విజృమ్భతే : **విజృమ్భతే** - విజృమ్భతే - విజృమ్భన్తే; వి+జృభి గాత్రవితానే లటి ప్రథమపురుషైక-వచనమ్.

**సంధులు :** 1. ఏతత్+అన్ధతమసమ్ - ఏతదన్ధతమసమ్ - జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. యామినీ చ దివసశ్చ, తయోః సన్ధిః, తేన సమ్భవం, తస్మిన్, యామినీదివససన్ధిసమ్భవే; 2. నిరంకుశమ్ : న భవతి అంకుశః యస్మిన్ (విషయ సప్తమీ) యథా తథా; 3. దీర్ఘే నయనే యస్యాః, తస్యాః సంబుద్ధౌ దీర్ఘనయనే.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**అన్ధతమసమ్ :** అన్ధయతీతి అన్ధమ్ । అన్ధం చ తత్తమః - అన్ధతమసమ్, "**అవసమన్ధేభ్యస్తమసః**" అని సమాసాన్తవిధి. అచ్ ప్రత్యయం. అన్ధతమస్ - అన్ధతమసమ్ అవుతుంది. "ధ్వాన్తే గాఢేఽన్ధతమసమ్" అని అమరకోశం.

**నిరంకుశః :** (నిః నాస్తి అంకుశ ఇవ ప్రతిబన్ధకః యస్య సః, అనివార్యః, బాధాశూన్యః ఇతి జటాధరః । యథా భాగవతే-

**శ్లో॥ అనాగః స్విహ భూతేషు య ఆగస్కృన్నిరంకుశః ।**
**ఆహర్తాస్మి భుజం సాక్షాదమర్త్యస్యాపి సాంగదమ్ ॥** - 1-17-15

'**నిరంకుశ**' పదప్రయోగాంతర్యాన్ని వివరణ వ్యాఖ్య ఇలా వివరించింది. "అత్ర మత్తగజస్వైరసంచారప్రతిబన్ధకవాచినాంకుశశబ్దేన ప్రతిబన్ధమాత్రం లక్ష్యతే । సాధ్యసాధన-భావశ్చ సంబన్ధః । అన్ధతమసస్య గజవదనివారణీయత్వ ప్రతీతిః ఫలమ్."

కానీ కొంచెం భేదముంది గమగమన, తమోవ్యాప్తి విషయంలో. గజస్వైరగమనాన్ని ప్రయాసపడి నివారించే అవకాశముంటుంది కానీ తమోవ్యాప్తిని అరికట్టలేము. అది తేజోఽభావరూపం కాబట్టి దానికి ప్రతిగా తేజోవ్యాప్తిని కలిగించగలిగితే తప్ప.

**దీర్ఘనయనే :** దీర్ఘనయనే అని సంబోధించటం సాభిప్రాయం. కళ్ళు ఎంత పెద్దవైనా, నిడుదలైనా ఆలోకసహకారం లేకపోతే చాక్షుషప్రత్యక్ష జ్ఞానం కలుగదు. కాబట్టి మన సాహచర్యం ఎవ్వరికంటాపడే అవకాశం లేదని ధ్వనింపజేయటం. కన్నుపొడుచుకొన్నా కనరాని చీకటది.

*

**శ్లో॥ నోర్ధ్వమీక్షణగతిర్న చాప్యధో నాభితో న పురతో న పృష్ఠతః ।**
**లోక ఏష తిమిరోల్బవేష్టితో గర్భవాస ఇవ వర్తతే నిశి ॥** **56**

**అవ :** తమోవ్యాప్తియొక్క ఫలస్వరూపాన్ని వర్ణించటం.

**ప.వి. :** న ఊర్ధ్వమ్ ఈక్షణ-గతిః న చ అపి అధః న అభితః న పురతః న పృష్ఠతః। లోకః ఏషః తిమిర+ఉల్బ-వేష్టితః గర్భ-వాసః ఇవ వర్తతే నిశి ॥

**అన్వ :** ఈక్షణగతిః ఊర్ధ్వమ్ న. అధః అపి న. అభితః న. పురతః న. పృష్ఠతః న. నిశి తిమిరోల్బవేష్టితః ఏషః లోకః గర్భవాస ఇవ వర్తతే.

**ప్ర :** ఈక్షణ-గతిః = నేత్రప్రసారం, ఊర్ధ్వమ్ = పైకి, న = లేదు, అధః అపి = క్రిందికి కూడా, న = లేదు, అభితః = ఎదురుగా, న = లేదు, పురతః = ముందుగా, న = లేదు, పృష్ఠతః = వెనుక, న = లేదు, నిశి = రాత్రి, తిమిర+ఉల్బ-వేష్టితః : తిమిర = చీకటి అనే, ఉల్బ = మావిచేత, వేష్టితః = కప్పబడిన, ఏషః = ఈ, లోకః = లోకం, గర్భవాసః = గర్భవాసమందు, వర్తతే ఇవ = ఉన్నట్లున్నది.

**తా :** పైకిగానీ, క్రిందకు గానీ, ఎదురుగా గానీ, ముందుకు గానీ, వెనుకకు గానీ కంటిచూపు ప్రసరించటం లేదు. చీకటి అనే మావి కప్పిన ఈ లోకం గర్భవాసంవలె ఉంది.

**విభక్తులు - క్రియలు :** 1. న - అవ్యయమ్; 2. ఊర్ధ్వమ్ - అవ్యయమ్; 3. ఈక్షణగతిః : **గతిః** - గతీ - గతయః; ఇకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. న, చ, అపి అధః - అన్నీ అవ్యయాలే; 5. న, అభితః, న, చ, పృష్ఠతః - అన్నీ అవ్యయాలే; 6. లోకః : **లోకః** - లోకౌ - లోకాః; లోకశబ్దః అకారాన్తః పుంలింగః. ప్రథమైకవచనమ్; 7. ఏషః : **ఏషః** - ఏతౌ - ఏతే; ఏతచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 8. తిమిరోల్బవేష్టితః : **వేష్టితః** - వేష్టితౌ - వేష్టితాః; వేష్టితశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 9. గర్భవాసః : **గర్భవాసః** - గర్భవాసౌ - గర్భవాసాః; గర్భవాసశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. వర్తతే : **వర్తతే** - వర్తేతే - వర్తన్తే; వృతు వర్తనే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 12. నిశి : **నిశి** - నిశోః - నిట్సు; నిట్ శబ్దః శకారాన్తః స్త్రీలింగః సప్తమ్యేకవచనమ్.

**సంధులు :** 1. న+ఊర్ధ్వమ్ - నోర్ధ్వమ్ - గుణసంధి; 2. గతిః+న = గతిర్న - విసర్గసంధి; 3. చ+అపి = చాపి - సవర్ణదీర్ఘసంధి; 4. అపి+అధః = అప్యధః - యణాదేశసంధి; 5. అధః+న = అధోన - విసర్గసంధి; 6. న+అభితః = నాభితః - సవర్ణదీర్ఘసంధి; 7. అభితః+న = అభితోన - విసర్గసంధి; 8. పురః+న = పురోన - విసర్గసంధి; 9. లోకః+ఏషః = లోక ఏషః - విసర్గసంధి; 10. వేష్టితః+గర్భ = వేష్టితోగర్భ - విసర్గసంధి; 11. వాసే+ఇవ = వాస ఇవ - అయవాయా వాదేశసంధి (యకారలోపం).

**సమాసాలు :** 1. ఈక్షణానాం గతిః - ఈక్షణగతిః; 2. తిమిరస్య ఉల్బం, తేన వేష్టితః - తిమిరోల్బవేష్టితః; 3. గర్భే వాసః, గర్భః ఏవ వాసో వా - గర్భవాసః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఊర్ధ్వమ్ :** "ఊర్ధ్వదేశరూపార్థేఽధికరణశక్తిప్రధానకమవ్యయమ్ । యద్యపి ఊర్ధ్వథా, ఊర్ధ్వశోషమ్ । ఊర్ధ్వదేశః ఇత్యాదిషు స్థలేషు శబ్దోఽనవ్యయోఽపి అకారాన్తః పఠ్యతే 'ఊర్ధ్వ' ఇతి, తథాపి మకారాన్తమప్యవ్యయమ్ "ఊర్ధ్వం ప్రాణాః హ్యుత్క్రామన్తి" (మనుస్మృతిః) ఇత్యాది ప్రయోగబలాదధ్యవసీయతే । క్వచిత్ భావికాలపరతాఽప్యస్య ప్రకరణాదినా గమ్యతే । యథా - 'ఇత ఊర్ధ్వమహం భక్త్యా రమాకాన్తపదార్చనమ్" ఇత్యాదిషు । - అవ్యయకోశః - 133

ఊర్ధ్వమ్ అన్నది అవ్యయమూ, ఊర్ధ్వపదం యొక్క ద్వితీయైకవచనరూపమూ కూడా అవుతుంది ప్రకరణాన్ని బట్టి.

**అధః - పురః :** అధశ్శబ్దం అధోభాగార్థంలో అవ్యయం. "**పూర్వాధరావరాణామసి పురధశ్చైషామ్**" అష్టాధ్యాయి (5-3-39) సూత్రంతో అధరశబ్దానికి ప్రథమా పంచమీ సప్తమీ విభక్త్యర్థాలలో అసి ప్రత్యయం, అధర పదానికి 'అధ్' అనే ఆదేశం వచ్చి అధః అని రూపం ఏర్పడింది. ఇది అసర్వవిభక్తికమైన తద్ధితప్రత్యయాన్తం కాబట్టి "తద్ధితశ్చాసర్వవిభక్తిః" (1-1-37) సూత్రంతో అవ్యయత్వం. పురః కూడా ఈ విధానం లోనే పూర్వశబ్దం మీద అసి ప్రత్యయమూ, ప్రకృతికి 'పుర్' ఆదేశమూ -

**అభితః - పృష్ఠతః :** అభి (ఉపసర్గ), పృష్ఠ (అకారాన్తప్రాతిపదిక - కృదన్తం) ఈ పదాలపై 'పంచమ్యాస్తసిల్' సూత్రంతో పంచమ్యర్థంలో తసిల్ ప్రత్యయం. అందువల్ల అవ్యయత్వం, "తద్ధితశ్చాసర్వవిభక్తిః' సూత్రంతో.

**రచనాచమత్కృతి : శ్లోకంలోని పూర్వార్ధమంతా అవ్యయాలతోనే (ఈక్షణగతి పదంతప్ప) నడిచింది। అదీ చతుర్దశ (14) పదాలతో. దానితో శ్లోకంలోని మొత్తం పదాల సంఖ్య 22 అయింది. ఒక ఉపజాతిలో ఇన్ని పదాలను నిబంధించటం విశేషమే.**

**ఉత్ప్రేక్ష : "తిమిరోల్బవేష్టితః లోకః గర్భవాసే వర్తత ఇవ"** అని ఉత్ప్రేక్ష. చీకట్లు దట్టంగా వ్యాపించటంచేత లోకం గర్భవాసంలో ఉన్నట్లుంది. గర్భవాసంలో దశా భేదాలుంటాయి. చక్షురాదీంద్రియసిద్ధికి పూర్వస్థితి. ఇంద్రియనిర్మాణం జరిగిన తర్వాత స్థితి. చీకటిని గ్రహించాలంటే అంతకు ముందు చీకటి వెలుగులను రెండింటినీ అనుభవించి వుంటే అప్పుడు మాత్రమే తేజోభావరూపమైన చీకటి స్ఫురణలో మెదులుతుంది. ఆ బుద్ధి స్మృతి మాత్రమే కానీ అనుభవం కాదు. గర్భస్థశిశువుకు చీకటి వెలుగుల పరస్పరభేద పరిజ్ఞానం అప్పటివరకు లేదు గాబట్టి చీకటిలో ఉన్నట్లు ఆ శిశువుకు తెలిసే అవకాశం లేదు కాబట్టి చీకటి వ్యాపించిన ప్రస్తుతలోకస్థితి కూడా అగమ్యగోచరంగా ఉన్నదని భావం.

'ఉపమా కాళిదాసస్య' అన్న లోకసిద్ధికి నిరూపకమిది. ఉక్తివైచిత్రిని బట్టి ఉత్ప్రేక్ష అయినా అది సాదృశ్యమూలకమే గదా! *

**శ్లో॥ శుద్ధమావిలమవస్థితం చలం వక్రమార్జవగుణాన్వితం చ యత్ ।
సర్వమేవ తమసా సమీకృతం దిఙ్మహత్త్వమసతాం హతాన్తరమ్ ॥ 57**

**అవ :** చీకటిని సమస్తవిశ్వాన్నీ సమంగా చుట్టుకొనటం.

**ప.వి. :** శుద్ధమ్ ఆవిలమ్ అవస్థితం చలం వక్రమ్ ఆర్జవ-గుణ+అన్వితం చ యత్।
సర్వమ్ ఏవ తమసా సమీకృతం ధిక్-మహత్త్వమ్ అసతాం హత+అన్తరమ్॥

**అన్వ :** శుద్ధమ్ ఆవిలమ్ అవస్థితం చలం వక్రమ్ ఆర్జవగుణాన్వితం చ యత్ (తత్) సర్వమ్ ఏవ తమసా సమీకృతమ్. అసతాం హతాన్తరం మహత్త్వం ధిక్.

**ప్ర :** శుద్ధమ్ = శుభ్రమైనదీ, ఆవిలమ్ = కలుషితమైనదీ, అవస్థితమ్ = నిలకడగలదీ, చలమ్ = చంచలమైనదీ, వక్రమ్ = వంకరగలదీ, ఆర్జవ... న్వితమ్ : ఆర్జవ-గుణ = ఋజుత్వంతో, అన్వితమ్ = కూడినదీ, చ = ఇంకా, యత్ = ఏది గలదో, (తత్) = అది, సర్వమ్ ఏవ = పూర్తిగా, తమసా = చీకటిచే, సమీకృతమ్ = ఏకం చేయబడినది. అసతామ్ = చెడ్డవారియొక్క, హత+అన్తరమ్ = తేడాలు తెలియని, మహత్త్వమ్ = గొప్పతనం, ధిక్ = నిందింపదగినది.

**తా :** స్వచ్ఛమైనదైనా, కలుషితమైనదైనా; స్థిరమైనా, చంచలమైనా; వక్రమైనా ఋజువుగా ఉన్నా... అన్నింటినీ చీకటి ఏకం చేసేసింది. చెడ్డవాళ్ళ సమభావన కూడా మంచి చెడుల తేడా గమనించలేనిది. అందుకే నిందార్హం.

**విభక్తులు - క్రియలు :** 1. శుద్ధమ్ : **శుద్ధం** - శుద్ధే - శుద్ధాని; శుద్ధశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 2. ఆవిలమ్ : **ఆవిలమ్** - ఆవిలే - ఆవిలాని; ఆవిలశబ్దః లకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 3. అవస్థితమ్ : **అవస్థితమ్** - అవస్థితే - అవస్థితాని; అవస్థితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 4. చలమ్ : **చలం** - చలే - చలాని; చలశబ్దదః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 5. వక్రమ్ : **వక్రం** - వక్రే - వక్రాణి; వక్రశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. ఆర్జవగుణ+అన్వితమ్ : **అన్వితమ్** - అన్వితే - అన్వితాని; ఆర్జవగుణాన్వితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. చ - అవ్యయమ్; 8. యత్ : **యత్** - యే - యాని; యచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 9. సర్వమ్ : **సర్వం** - సర్వే - సర్వాణి; సర్వశబ్దః అకారాన్తః

నపుంసకలింగస ప్రథమైకవచనమ్; 10. ఏవ – అవ్యయమ్; 11. తమసా : **తమసా** – తమోభ్యాం – తమోభిః; తమశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 12. సమీకృతమ్ : **సమీకృతం** – సమీకృతే – సమీకృతాని; సమీకృతశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 13. ధిక్ – అవ్యయమ్; 14. మహత్త్వమ్ : **మహత్త్వం** – మహత్త్వే – మహత్త్వాని, మహత్త్వ శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 15. అసతామ్ – అసతః – అసతోః – అసతామ్ – 'అసత్' శబ్దః తకారాన్తః పుంలింగః షష్ఠీబహువచనమ్; 16. హతాన్తరమ్ : **అన్తరమ్** – అన్తరే – అన్తరాణి – హతాన్తరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. ధిక్+మహత్త్వమ్ = ధిఙ్మహత్త్వమ్ – అనునాసికసంధి.

**సమాసాలు :** 1. ఆర్జవశ్చాసౌ గుణః, తేన అన్వితమ్ – ఆర్జవగుణాన్వితమ్; 2. హతమ్ అన్తరం యేన తత్, హతాన్తరమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ధిక్ :** 'ధిక్ నిర్భత్సన నిందయోః' అని అమరకోశం. అసతాం 'మహత్త్వం' అని ద్వితీయా విభక్తి రావటానికి

"శ్లో॥ ఉభసర్వతసోః కార్యా ధిగుపర్యాదిషు త్రిషు ।
ద్వితీయామ్రేడితాన్తేషు తతోఽన్యత్రాపి దృశ్యతే ॥ – శ్లోకవార్తికమ్ 2-3-2

హతాన్తరమైన మహత్త్వం సజ్జనులయందు వందనీయమూ, అభినందనీయమూ కూడా. అదే స్థితి దుర్జనులయందు దోషమవుతోంది. వారు చిన్న, పెద్ద తేడా తెలియకుండా ప్రవర్తించే స్థితి ఏర్పడుతుంది. "యద్యసతాం క్వచిన్మహత్త్వముత్పద్యేత, తర్హి కిమ్? న(తే)జనానాం జాతికర్మాదికృతం విశేషమీక్షన్తే" అని వివరణవ్యాఖ్య.

**ఆవిలమ్/ఆబిలమ్ :** ఆ విలతి దృష్టింస్తృణాతి. విల్ – స్తృతౌ క (ప్రత్యయః)। కలుషే – అయ బిలభేదనే । బిల ప్రకృతికత్వాత్ వర్గ్య **బ** మధ్య ఇతి రాయముం । "సమలక్ష్యత బిభ్రదావిలామ్" తస్యాబి(వి)లామ్భః పరిశుద్ధిహేతోః" – వాచస్పత్యమ్.

**అసతామ్ :** శ్లిష్ట పదమిది. సజ్జనులు కాని వారు అని ఒక అర్థం. అసత్పదార్థమని మరొక అర్థం. పదార్థవిభాగంలో ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయాలు భావపదార్థాలు. తద్భిన్నమైనది ఏడవది అభావపదార్థం. అసలు ఉనికి లేదు కాబట్టి దానికి అంతరాల ప్రసక్తి లేదు. అసత్పురుషులు అంతరాలు ఉన్న గుణ నిహ్నవదృష్టితో గుణాన్ని గుర్తించినట్లు కనిపించకుండా అణిచివేస్తారు. అసత్పదార్థానికి అసలు ఉనికి

లేదు. కాబట్టి అది హతాంతరం. అయితే దానిని నిందించవలసిన అవసరమేముంది? వెలుగే కాదు. చీకటి అయినా అందరికీ సమానంగా ఉండటాన్ని అంగీకరించలేని మానవ బలహీనత. అందుకే జీవన్యాయతీర్థ దరిద్రదుర్దైవప్రహసనంలో ఇలా అంటాడు-

**శ్లో॥ అన్ధః కుష్ఠీ దరిద్రో వా ప్రతివేశీ వరం నరః ।**
**సమానధనగర్వేణ స్పర్ధమానో హి దుస్సహః ॥**

**అర్థాంతరన్యాసం :** '**ధిఙ్ మహత్త్వమసతాం హతాన్తరమ్**' అన్నది సామాన్యవిషయమై మొదటి మూడు పాదాలలోని విశేషాంశాన్ని సమర్థిస్తోంది. కాబట్టి ఇది అర్థాంతర న్యాసాలంకారం. "**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**". దీనికి అసత్పదగతమైన అభంగశ్లేష సహకరిస్తుంది. అయితే శ్లేషానుప్రాణితత్వం అర్థాంతర న్యాసానికి లేదు. కాబట్టి శ్లేష ఉపబలకమే కానీ అనివార్యం కాదు. శ్లేషలోని తర్కశాస్త్రగత చమత్కారం ఆస్వాదనీయం. *

**శ్లో॥ నూనమున్నమతి యజ్వనాం పతిః శార్వరస్య తమసో నిషిద్ధయే ।**
**పుణ్డరీకముఖి! పూర్వదిఙ్ముఖం కైతకైరివ రజోభిరాహతమ్ ॥ 58**

**అవ :** పరమశివుడు చంద్రోదయవర్ణన కుపక్రమించుట.

**ప.వి. :** నూనమ్ ఉత్+నమతి యజ్వనాం పతిః శార్వరస్య తమసః నిషిద్ధయే ।
పుణ్డరీక-ముఖి! పూర్వధిక్-ముఖం యథా కైతకైః ఇవ రజోభిః ఆహతమ్ ॥

**అన్వ :** పుణ్డరీక-ముఖి! యజ్వనాం పతిః శార్వరస్య తమసః నిషిద్ధయే ఉన్నమతి. నూనమ్. యథా పూర్వధిక్-ముఖం కైతకైః రజోభిః ఆహతమ్ ఇవ (అస్తి).

**ప్ర :** పుణ్డరీక-ముఖి ! = కమలవదనా!, యజ్వానాం పతిః = చంద్రుడు, శార్వరస్య = రేయి పొడమిన, తమసః = చీకటియొక్క, నిషిద్ధయే = ఆపుదలకై, ఉన్నమతి = పైకి వస్తున్నాడు, నూనమ్ = నిశ్చితం, యథా = ఎందుకంటే, పూర్వదిక్-ముఖమ్ = (ప్రాచీ) దిక్కు యొక్క ముఖం, కైతకైః = మొగిలిపూలకు చెందిన, రజోభిః = పుప్పొడులతో, ఆహతమ్ ఇవ = కొట్టబడినట్లు, అస్తి = ఉన్నది.

**తా :** కమలవదనా! రేయి పొడమిన చీకటిని ఆపటానికి చంద్రుడు పైకి వస్తున్నాడు. ప్రాచీదిఙ్ముఖం మొగలిపూల పుప్పొళ్ళతో కప్పివేయబడినట్టు కనిపిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. నూనమ్ - అవ్యయమ్; 2. ఉత్+నమతి : **ఉన్నమతి** - ఉన్నమతః - ఉన్నమన్తి; ఉత్ పూర్వకాత్ నమ (ప్రహ్వత్వే శబ్దే చ) ధాతోః ప్రథమపురుషైక-వచనమ్; 3. యజ్వనామ్ : యజ్వనః - యజ్వనోః - **యజ్వనామ్**; యజ్వన్ శబ్దః

నకారాన్తః పుంలింగః షష్ఠీబహువచనమ్; 4. పతిః : **పతిః** – పతీ – పతయః; ఇకారాన్తః పుంలింగః పతిశబ్దః ప్రథమైకవచనమ్; 5. శార్వరస్య : **శార్వరస్య** – శార్వరయోః – శార్వరాణామ్; శార్వరశబ్దః అకారాన్తః నపుంసకలింగః షష్ఠ్యేకవచనమ్; 6. తమసః : **తమసః** – తమసోః – తమసామ్; తమశ్శబ్దః – సకారాన్తః నపుంసకలింగః షష్ఠ్యేకవచనమ్; 7. నిషిద్ధయే : **నిషిద్ధయే** – నిషిద్ధిభ్యామ్ – నిషిద్ధిభ్యః; నిషిద్ధిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః చతుర్థ్యేకవచనమ్; 8. పుణ్డరీకముఖి! : **ముఖి** – ముఖ్యౌ –ముఖ్యః; పుణ్డరీకముఖీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధనప్రథమావిభక్తిః; 9. పూర్వదిఙ్ముఖమ్ : **ముఖం** – ముఖే – ముఖాని; దిఙ్ ముఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 10. యథా – అవ్యయమ్; 11. కైతకైః : కైతకేన – కైతకాభ్యాం – **కైతకైః**; కైతకశబ్దః అకారాన్తః నపుంసకలింగః. తృతీయా బహువచనమ్; 12. ఇవ – అవ్యయమ్; 13. రజోభిః : రజసా – రజోభ్యాం – **రజోభిః** – రజస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 14. ఆహతమ్ : **ఆహతమ్** – ఆహతే – ఆహతాని; ఆహతశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. తమసః+నిషిద్ధయే – తమసో నిషిద్ధయే – విసర్గసంధి; 2. కైతకైః+ఇవ = కైతకైరివ – విసర్గసంధి; 3. రజోభిః+ఆహతమ్ = రజోభిరాహతమ్ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. శర్వరీ భవం శార్వరం (**తద్ధితాన్తం**). తస్య, శార్వరస్య; 2. పుణ్డరీకస్య ముఖ మివ ముఖం యస్యాః, తస్మాత్ సంబుద్ధౌ, పుణ్డరీకముఖి!; 3. కేతక్యాః ఇదమ్ = కైతకమ్, తైః కైతకై (**తద్ధితాన్తం**).

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**నూనమ్ :** "**తర్కనిశ్చయోత్ప్రేక్షాదయోఽ_స్యార్థాః**"। (అవ్యయకోశః). ఇక్కడ నిశ్చయార్థంలో ప్రయోగం. ఉత్ప్రేక్షార్థంలో నూనం పదం ఉత్ప్రేక్షావ్యంజకమవుతుంది. స్మరణార్థంలో, వాక్యపూరణార్థంలో కూడా నూనం కనిపిస్తుంది. 'అద్య' అనే అర్థంలోనూ ఋక్కులలో నూనం ప్రయోగముంటుంది – 'నమః **పురా** తే వరణోత **నూనమ్**" పురా (గతంలో) పదానికి వ్యతిరేకార్థకంగా నూనమ్ (ఇప్పుడు) కనిపిస్తుందీ ప్రయోగంలో.

**యజ్వానాం పతిః :** "**ద్విజో దాక్షాయణీ తుంగీ రోహిణీ యజ్వనాం పతిః**" అని త్రికాండశేషం. ద్విజపతిః, దాక్షాయణీపతిః, తుంగీపతిః, రోహిణీపతిః, యజ్వనాం పతిః – ఇవన్నీ చంద్రుడి పేర్లు. "**గౌరాంగీవదనోపమా సుకృతమాదత్తే పతిర్యజ్వనామ్**" (మురారి – అనర్ఘరాఘవంలో).

**పుణ్డరీకముఖి :** పార్వతిని సంబోధిస్తూ వాడిన ఈ పదం విశిష్టంగా విలక్షణంగా భాసిస్తోంది. పుణ్డరీకమంటే... "పుణ్డతి అన్యపుష్పాణాం గర్వం చూర్ణీకరోతి" ఇతి పుండరీకం, అటువంటి మొగం కలది పుణ్డరీకముఖి.

ఇతర పుష్పాల గర్వాన్ని అణచివేయగల శక్తిగలది పుణ్డరీకం. ప్రస్తుతం కేతకీ సుమరజం ప్రాచీముఖాన్ని కబళిస్తోంది. ఆ కైతక రజో విజృంభణను అణిచివేయాలంటే పుణ్డరీకమే అవసరం. అందుకే పార్వతిని పుణ్డరీకముఖి అనటం.

మరో విశేషం. పరమశివునితో అబద్ధం చెప్పిన బ్రహ్మకు సాక్షిగా మొగలిపువ్వు సాక్ష్యం చెప్పింది. దానితో బ్రహ్మకు ఒక తలా, మొగలికి శివ పూజార్హతా రెండూ పోయాయి. అందువలన ఆ సన్నిధిలో శివుడు కైతకరజస్సునకు ప్రతిగా పుణ్డరీకాన్ని ప్రతిపాదించాడు.

అయితే సంధ్యాకాలంలో చంద్రోదయాన్ని వర్ణించే సందర్భంలో ఆమెను పుణ్డరీకముఖి అనటం సమంజసమా? ఆమె మోము కాంతిని కోల్పోయిందా? పగలంతా విశ్రాంతి లేకుండా విహరణశీలతతోనే కాలం గడిపారు కాబట్టి ఆ సమయానికి పుండరీకంలాగా ఆమె ముఖమూ వడలి వుండవచ్చు. అందుకే ఆ సాభిప్రాయమైన పోలిక.

'పుండరీకముఖి' సంబోధనతో ముడుచు కొంటున్న పుండరీకాన్ని ధ్వనింపజేస్తూ సూర్యాస్తమయకాలంలో లోకంలో సంభవించే దశాభేదాన్ని ధ్వనింపజేశాడు కవి. దీనినే అభిజ్ఞానశాకున్తలంలో వాచా విశదీకరించాడు సూర్యోదయవర్ణనతో-

శ్లో॥ యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనా-
మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః ।
తేజోద్వయస్య యుగద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇహాత్మదశాన్తరేషు ॥ 4-2

*

## చన్ద్రోదయవర్ణనమ్

**శ్లో॥ మన్దరాన్తరితమూర్తినా నిశా లక్ష్యతే శశభృతా సతారకా ।**
**త్వం మయా ప్రియసఖీసమాగతా శ్రోష్యతేవ వచనాని పృష్ఠతః ॥ 59**

**అవ :** చంద్రోదయవర్ణనం

**ప.వి. :** మన్దర+అన్తరిత-మూర్తినా నిశా లక్ష్యతే శశ-భృతా సతారకా ।
త్వం మయా ప్రియ-సఖీ-సమాగతా శ్రోష్యతా ఇవ వచనాని పృష్ఠతః ॥

**అన్వ :** పృష్ఠతః వచనాని శ్రోష్యతా మయా ప్రియసఖీ సమాగతా త్వమివ మన్దరాన్తరిత–మూర్తినా శశభృతా సతారకా నిశా లక్ష్యతే.

**ప్ర :** పృష్ఠతః = వెనుకనుండీ, వచనాని = మాటలను, శ్రోష్యతా = వింటున్న, మయా = నాచేత, ప్రియ... గతా : ప్రియసఖీ = నెచ్చెలులతో, సమాగతా = కూడియున్న, త్వమ్ ఇవ = నీవలె, మన్ద... మూర్తినా : మన్దర+అన్తరిత = మందరపర్వతం చాటున వున్న, మూర్తిమతా = శరీరం గల, శశభృతా = చంద్రునిచే, సతారకా = నక్షత్రాలతో గూడిన, నిశా = రేయి, లక్ష్యతే = చూడబడుతోంది.

**తా :** నీ చెలికత్తెలతో కలిసి నీవు మాటాడేటప్పుడు నేను చాటునుండి ఆ మాటలను విన్నట్లు తారలతో కూడిన నిశను మందరపర్వతం మాటునుండీ చంద్రుడు చూస్తున్నాడు.

**విభక్తులు – క్రియలు :** 1. మందరాన్తరితమూర్తినా : **మూర్తినా** – మూర్తిభ్యాం – మూర్తిభిః; మందరాన్తరితమూర్తిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 2. నిశా : **నిశా** – నిశే – నిశాః; నిశా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 3. లక్ష్యతే : **లక్ష్యతే** – లక్ష్యేతే – లక్ష్యన్తే; లక్ష దర్శనాంకనయోః ధాతోః కర్మణి లటి ప్రథమపురుషైక–వచనమ్; 4. శశభృతా : **శశభృతా** – శశభృద్భ్యాం – శశభృద్భిః; శశభృత్ శబ్దః తకారాన్తః పుంలింగః తృతీయైకవచననమ్; 5. సతారకా : **సతారకా** – సతారకే – సతారకాః; సతారకా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః. ప్రథమైకవచనమ్; 6. త్వమ్ : **త్వం** – యువాం – యూయమ్; యుష్మచ్ఛబ్దః దకారాన్తః ప్రథమైకవచనమ్; 7. మయా : **మయా** – ఆవాభ్యామ్ – అస్మాభిః; అస్మచ్ఛబ్దః దకారాన్తః తృతీయైకవచనమ్; 8. ప్రియసఖీసమాగతా : **సమాగతా** – సమాగతే – సమాగతాః; ప్రియసఖీ సమాగతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. శ్రోష్యతా : **శ్రోష్యతా** – శ్రోష్యద్భ్యాం – శ్రోష్యద్భిః; శ్రోష్యచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 10. ఇవ – అవ్యయమ్; 11. వచనాని : వచనం – వచనే – **వచనాని**; వచనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమాబహువచనమ్; 12. పృష్ఠతః – అవ్యయమ్.

**సంధులు :** 1. శ్రోష్యతా+ఇవ = శ్రోష్యతేవ – గుణసంధి.

**సమాసాలు :** 1. మన్దరేణ అన్తరితా మూర్తిః యస్య తేన, మన్దరాన్తరితమూర్తినా; 2. శశం బిభర్తి ఇతి, తేన, శశభృతా ; 3. తారకాభిః సహ వర్తత ఇతి, సతారకా; 4. ప్రియాః చ తాః సఖ్యః, తాభిః సమాగతా, ప్రియసఖీసమాగతా.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**రహస్యశ్రవణం :** నాయికా విప్రలంభసంభాషణకూ, అవి వినటంలో నాయకునికి గల

ఉత్సుకతకూ ఇటువంటి సన్నివేశాలు సాహిత్యంలో కనిపిస్తాయి. కవికీ, పాఠకులకూ ఆసక్తిని కలిగిస్తాయి. మన పరోక్షంలో మనగురించిన ప్రస్తావన జరుగుతుంటే వినాలనే ఉత్సుకత సహజం. అది సానుకూలంగా అయితే మరీ ముచ్చట.

అభిజ్ఞానశాకున్తలంలో కూడా ప్రథమ, తృతీయాంకాలలో ఇటువంటి సన్నివేశాలే ఉంటాయి. అనసూయా ప్రియంవదలతో స్వేచ్ఛగా సంభాషిస్తున్న శకుంతలా వచనాలు వినటం దుష్యంతునిలో పూర్వరాగానికి అంకురార్పణ చేస్తుంది. సమయం చూసి తుమ్మెదను తోలే నెపంతో దగ్గరవుతాడు దుష్యంతుడు. తృతీయాంకంలో కూడా శకున్తలా వియోగప్రసక్తితో దుష్యంతుడు ఇలాగే చాటునుండి అంతా గమనిస్తాడు. ఇక్కడ శకుంతల లేఖ, దానికి ప్రతిగా దుష్యంతుడు ప్రత్యక్షమై పలకటం ఉత్తరోత్తర రసావిష్కరణలుగా ఉంటాయి.

శకుంతల లేఖ-

**శ్లో॥ తవ న జానే హృదయం మమ పునః దివాపి రాత్రిమపి ।**
**నిర్ఘృణ! తపతి బలాత్త్వయి యుక్తమనోరథాన్యంగాని ॥**

దుష్యంతవచనం-

**శ్లో॥ తపతి తనుగాత్రి మదనస్త్వామనిశం మాం పునర్దహత్యేవ ।**
**గ్లపయతి యథా శశాంకం న తథా హి కుమద్వతీం దివసః ॥**

**ఉపమాలంకారం :** శ్లోకంలో పూర్వార్ధం ఉపమేయకోటి. ఉత్తరార్ధం ఉపమానకోటి. తారకలతో కూడిన నిశను మందరాచలాంతరితుడై చంద్రుడు చూడటం ఉపమేయం. నెచ్చెలులతో కూడిన పార్వతిని వెనుక నిలిచిన చంద్రధరుడు చూడటం ఉపమానం.

కథాంశాన్ని బట్టి చూస్తే పార్వతీపరమేశ్వరుల విషయమే ప్రకృతం. నిశాచంద్ర విషయం అప్రకృతం. అయితే వర్ణ్యమానతా విశేషాన్ని బట్టి ప్రకృతాప్రకృతాలు తారుమారు అయ్యాయి.

*

**శ్లో॥ రుద్ధనిర్గమనమా దినక్షయాత్పూర్వదృష్టతనుచన్ద్రికాస్మితమ్ ।**
**ఏతదుద్గిరతి రాత్రినోదితా దిగ్రహస్యమివ చన్ద్రమణ్డలమ్ ॥ 60**

**అవ :** చంద్రుడు క్రమంగా పైపైకి వచ్చుట.

**ప.వి. :** రుద్ధ-నిర్గమనమ్ ఆ దిన-క్షయాత్ పూర్వ-దృష్ట-తను-చన్ద్రికా-స్మితమ్ ।
ఏతద్ ఉద్గిరతి రాత్రి-నోదితా దిగ్ రహస్యమ్ ఇవ చన్ద్ర మణ్డలమ్ ॥

**అన్వ :** ఆ దినక్షయాత్ రుద్ధనిర్గమనం పూర్వదృష్టతనుచన్ద్రికాస్మితమ్ ఏతత్ చన్ద్రమణ్డలం రాత్రినోదితా దిక్ రహస్యమివ ఉద్గిరతి.

**ప్ర :** ఆ దినక్షయాత్ = పగలు ముగిసే వరకు, రుద్ధ–నిర్గమనమ్ : రుద్ధ = అడ్డగింపబడిన, నిర్గమనమ్ = పోకగలదియు, పూర్వ... స్మితమ్ : పూర్వ = ముందుగా, దృష్ట = చూడబడిన, తను = స్వల్పమైన, చన్ద్రికా = వెన్నెలనెడి, స్మితమ్ = చిఱునవ్వుగలదీ అయిన, ఏతత్ = ఈ, చన్ద్రమణ్డలమ్ = చంద్రబింబాన్ని, రాత్రి–నోదితా – రేయిచే పంపబడిన, దిక్ = ప్రాగ్దిశ, రహస్యమ్ ఇవ = రహస్యాన్నివలె, ఉద్గిరతి = క్రక్కుచున్నది.

**తా :** రాత్రిచేత పంపబడిన (దూతికలాగా) ప్రాగ్దిశ రహస్యాన్ని చెప్తున్నట్లు చంద్రబింబాన్ని బయటపెడుతోంది. అది (రహస్యం – చంద్రబింబం) పగలు ముగిసే వరకు లోననే అణచివేయబడినది. స్వల్పమైన వెన్నెలయే చిఱునవ్వుగా గలది.

**విభక్తులు – క్రియలు :** 1. రుద్ధనిర్గమనమ్ : **నిర్గమనం** – నిర్గమనే – నిర్గమనాని; రుద్ధనిర్గమనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 2. ఆ దినక్షయాత్ : **క్షయాత్** – క్షయాభ్యాం – క్షయేభ్యః; ఆ దినక్షయశబ్దః అకారాన్తః నపుంసకలింగః పంచమ్యేకవచనమ్; 3. పూర్వదృష్టతనుచన్ద్రికాస్మితమ్ : **స్మితం** – స్మితే – స్మితాని; ... స్మితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 4. ఏతత్ : **ఏతత్** – ఏతే – ఏతాని; ఏతచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 5. ఉద్గిరతి : **ఉద్గిరతి** – ఉద్గిరతః – ఉద్గిరన్తి; ఉత్ పూర్వకాత్ గౄ (నిగరణే) ధాతోః లటి ప్రథమ–పురుషైకవచనమ్; 6. రాత్రినోదితా : **నోదితా** – నోదితే – నోదితాః; నోదితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 7. దిక్ : **దిక్** – దిశౌ – దిశః; దిక్ శబ్దః శకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 8. రహస్యమ్ : **రహస్యం** – రహస్యే – రహస్యాని; రహస్య శబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 9. ఇవ – అవ్యయమ్; 10. చన్ద్రమణ్డలమ్ : **మణ్డలం** – మణ్డలే – మణ్డలాని; చంద్రమణ్డలశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్.

**సంధులు :** 1. ఏతత్+ఉద్గిరతి – ఏతదుద్గిరతి – జశ్త్వసంధి; 2. దిక్+రహస్యమ్ = దిగ్రహస్యమ్ – జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. రుద్ధం నిర్గమనం యస్య తత్ (తథా), రుద్ధనిర్గమనమ్; 2. దినస్య క్షయః, తమ్ అభివ్యాప్య, తస్మాత్, ఆదిన క్షయాత్; 3. పూర్వం దృష్టం తచ్చ తను చ, పూర్వదృష్ట తన్వీ చ సా చన్ద్రికా ఏవ స్మితం యస్మిన్ తత్, పూర్వదృష్టతనుచన్ద్రికా స్మితమ్; 3. రాత్ర్యా నోదితా, రాత్రినోదితా; 4. చన్ద్రస్య మణ్డలమ్, చన్ద్రమణ్డలమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఉద్గిరతి :** ఉద్గిరతి వంటి పదాలు సాధారణస్థితిలో గ్రామ్యాలు. కానీ వాటినే గౌణవృత్తిలో ప్రయోగిస్తే రమణీయంగా ఉంటాయి' అని ఆలంకారికమతం.

శ్లో॥ నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాదిగౌణవృత్తివ్యపాశ్రయమ్ ।
అతిసున్దరమన్యత్ర గ్రామ్యకక్షాం విగాహతే ॥

**చన్ద్రికాస్మితా :** వెన్నెలయే చిఱునవ్వుగా గలది. చన్ద్రికా ఏవ స్మితం యస్యాః సా చన్ద్రికా స్మితా - అని విగ్రహం. చన్ద్రికలో స్మితత్వారోపణ మిక్కడ. అలంకారం రూపకమైనా పోలిక ఉపమానోపమేయాల మధ్యనే. అయితే ఉపమానోపమేయాలు భిన్నలింగాలలో వుంటే అది ఉపమాదోషం.

"ఉపమానోపమేయయోః లింగవ్యత్యాసః లింగభేదః" కావ్యాలంకారసూత్ర-4/12

అయితే పుంనపుంసకలింగవ్యత్యాసం చాలాచోట్ల కనిపిస్తుంది. అందుకే "ఇష్టః పుం నపుంసకయోః ప్రాయేణ" అని (4/13) దానిని సూత్రీకరించాడు వామనుడు. ముఖచన్ద్రః, చన్ద్రః ఇవ ముఖం వంటిచోట్ల ఈ లింగభేదం సుస్పష్టమైనా ఆ వాడుక సమధికం.

ప్రకృతం చన్ద్రికా-స్మితం దగ్గర చన్ద్రికా స్త్రీలింగపదం. స్మితం నపుంసకలింగం. చన్ద్రికాస్మితం సమాసపదం. "**లౌకిక్యాం సమాసాభిహితాయాముపమా ప్రపంచే చ.**" (ఇష్టః) అని వామనుడు సమాసగతంగా పోలిక చెపితే లింగభేదం దోషం కాదన్నాడు. ప్రకృత చన్ద్రికాస్మితాలు భిన్నలింగాలయినా పోలిక సమాసగతం కాబట్టి దోషం లేదు.

**ఉపమ :** రాత్రి చోదితా దిక్-రహస్యమివ - చంద్రమండలమ్ ఉద్గిరతి - ఇది ఉపమాలంకారం. చంద్రమండలం ఉపమేయం. రహస్యం ఉపమానం. ఉద్గిరణం సమానధర్మం. చంద్రమండలానికి రహస్యంతో పోలిక 'ఇవ' పదోక్తం. రాత్రి నాయికతో దిక్కునకు దూతికతో పోలిక ఆర్థికం. "రాత్రేః నాయికోపమా దిశో దూత్యుపమా చార్థాదాయాతీతి ఏకదేశవివర్తినీయముపమా" (వివరణవ్యాఖ్య). *

**శ్లో॥ పశ్య పక్వఫలినీఫలత్విషా బిమ్బలాఞ్ఛితవియత్సరోఽమ్భసా ।**
**విప్రకృష్టవివరం హిమాంశునా చక్రవాకమిథునం విడమ్బ్యతే ॥ 61**

**అవ :** చక్రవాకపక్షుల జంటను వర్ణించటం.

**ప.వి. :** పశ్య పక్వ-ఫలినీ-ఫల-త్విషా బిమ్బ-లాఞ్ఛిత-వియత్-సరః+అమ్భసా ।
విప్రకృష్ణ-వివరం హిమ+అంశునా చక్రవాక-మిథునం విడమ్బ్యతే ॥

**అన్వ :** బిమ్బలాంఛితవియత్సరోమ్భసా హిమాంశునా విప్రకృష్టవివరం చక్రవాకమిథునం పక్వఫలినీఫలత్విషా విడమ్బ్యతే పశ్య.

**ప్ర :** బింబ... మ్భసా : బింబ = బింబ, ప్రతిబింబాలచేత, లాంఛిత = గుర్తింపబడిన, వియత్ = ఆకాశమూ, సరః+అమ్భసా = సరోవరజలమూ గల, హిమ+అంశునా = చంద్రునిచే, విప్రకృష్టవివరమ్ : విప్రకృష్ట = దూరమైన, వివరమ్ = అంతరం గల, చక్రవాక–మిథునమ్ = చక్రవాకపక్షుల జంట, పక్వ... త్విషా : పక్వ = పండిన, ఫలినీ ఫల = ఫలినియొక్క పండు వంటి, త్విషా = కాంతితో, విడంబ్యతే = అనుకరింపబడు తోంది, పశ్య = చూడు.

**తా :** ఆకాశంలో చంద్రబింబముంది. కొలను నీటిలో చంద్రుని ప్రతిబింబముంది. ఈ రెండింటికీ మధ్య ఎంతో దూరముంది. చక్రవాకపక్షుల జంట కూడా దూరాన్ని పాటిస్తుంది రేయిలో. ఆ విధానాన్నే చంద్రుడు అనుకరిస్తున్నట్లుంది పండిన ఫలినీఫలాల కాంతితో.

**విభక్తులు – క్రియలు :** 1. పశ్య : **పశ్య**/పశ్యతాత్ – పశ్యతమ్ – పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 2. పక్వ ఫలినీఫలత్విషా : **త్విషా** – త్విడ్భ్యాం – త్విడ్భిః; పక్వఫలినీ ఫలత్విట్ శబ్దః షకారాన్తః స్త్రీలింగః. తృతీయైకవచనమ్; 3. బిమ్బలాంఛితవియత్సరోఽమ్భసా : **అంభసా** – అంభోభ్యామ్ – అంభోభిః; ... అంభస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 4. విప్రకృష్టవివరమ్ : **వివరం** – వివరే – వివరాణి; విప్రకృష్టవివరశబ్దః అకారాన్తః నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 5. హిమాంశునా : **హిమాంశునా** – హిమాంశుభ్యాం – హిమాంశుభిః; హిమాంశు శబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 6. చక్రవాకమిథునమ్ : **మిథునం** – మిథునే – మిథునాని; మిథునశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. విడంబ్యతే : **విడంబ్యతే** – విడంబ్యేతే – విడంబ్యన్తే; వి పూర్వకాత్ డమ్బ ధాతోః కర్మణి లటి ప్రథమపురుషైకవచనమ్.

**సమాసాలు :** 1. పక్వం చ తత్ ఫలిన్యాః ఫలం, తస్య, త్విట్ తయా, పక్వఫలినీఫలత్విషా; 2. బింబాభ్యాం లాంఛితే వియత్ సరసామ్ అమ్బః చ యస్య, తేన, బింబలాంఛిత వియత్సరోమ్భసా; 3. విప్రకృష్టం వివరం యస్య తాదృశమ్, విప్రకృష్ట వివరమ్; 4. హిమాః అంశః యస్య, తేన, హిమాంశునా; 5. చక్రవాకయోః మిథునమ్, చక్రవాకమిథునమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఫలినీఫలమ్ :** ఫలమస్తి అస్యా ఇతి ఇనిః । జీప్ । ప్రయంగువృక్షః । పర్యాయోఽస్యా

యథా ప్రియంగుః ఫలినీ కాన్తా లతా చ మహిలాహ్వయా । గుంద్రా గుంద్రఫలా శ్యామా విష్వక్సేనాంగనా ప్రియా ॥

**గుణీభూతవ్యంగ్యం :** శ్లోకంలో చంద్రుడు గగనతలంలోనూ, సరోజజలంలో ప్రతిబింబ రూపంలోనూ నిలిచి చక్రవాకమిథునాన్ని అనుకరిస్తున్నాడని వర్ణనం. విప్రకృష్టవివరం అన్న చక్రవాకమిథునవిశేషణ పదం. ఇక్కడ రసస్ఫురణలో ప్రధానపాత్ర వహిస్తుంది.

ప్రకృతరసం సంభోగశృంగారం. ఆ శృంగారరసనికి ఇది పరిపోషకం కావాలి. అయితే విప్రకృష్టవివరం ద్వారా పరస్పరం దూరమైన చక్రవాకమిథునవియోగాన్ని ప్రస్తావించదలచుకొన్నాడా కవి? నూత్నవధువు దగ్గర వియోగవర్ణన ఆమెలో కాతర స్వభావాన్ని మేల్కొల్పదా? లేదా ఇప్పుడు దూరమైనా, ఇది తాత్కాలికమే మరల ఉదయానికి వియోగం పోతుందని చెప్పదలచుకొన్నాడా? మంచిదే. అసలు వియోగ ప్రస్తావన మెందుకు?

పార్వతిలో వియోగభయాన్ని కలిగిస్తున్నాడా? పునస్సంయోగధైర్యాన్ని ప్రోది-చేస్తున్నాడా? ధ్వన్యమానవిషయం సందిగ్ధప్రాయమైంది. కాబట్టి ఇది **గుణీభూత వ్యంగ్యం.**

**శ్లో॥ అగూఢమపరస్యాంగం వాచ్యసిద్ధ్యంగమస్ఫుటమ్ ।**
**సందిగ్ధతుల్యప్రాధాన్యే కాక్వాక్షిప్తమసుందరమ్ ॥** అని గుణీభూతవ్యంగ్యభేదాలు. గుణీభూతవ్యంగ్యమైనా రసవత్తకు భంగం లేదు. *

**శ్లో॥ శక్యమోషధపతేర్నవోదయాః కర్ణపూరరచనాకృతే తవ ।**
**అప్రగల్భయవసూచికోమలాశ్ఛేత్తుమగ్రనఖసమ్పుటైః కరాః ॥ 62**

**అవ :** వెన్నెల వెలుగులు వ్యాపించుటను వర్ణించటం.

**ప.వి. :** శక్యమ్ ఓషధపతేః నవ+ఉదయాః కర్ణ-పూర-రచనా-కృతే తవ ।
అప్రగల్భ-యవ-సూచి-కోమలాః ఛేత్తుమ్ అగ్ర-నఖ-సమ్పుటైః కరాః ॥

**అన్వ :** ఓషధపతేః నవోదయాః అప్రగల్భయవసూచికోమలాః కర్ణపూరరచనాకృతే తవ అగ్రనఖసమ్పుటైః ఛేత్తుం శక్యమ్.

**ప్ర :** ఓషధి-పతేః = చంద్రునియొక్క, అప్రగ... కోమలాః : అప్రగల్భ = ముదరని, యవ = యవలయొక్క, సూచి = ముక్కువలె, కోమలాః = మృదువైనవీ, నవ+ ఉదయాః = అప్పుడే పుట్టినవీ అయిన, కరాః = కిరణాలు, కర్ణ... కృతేః : కర్ణపూర = (పూలతో) చేసిన చెవి కమ్మలుగా, రచనా కృతే = అలంకరించుకొనుటకు, తవ = నీయొక్క, అగ్ర... సమ్పుటైః : అగ్రనఖ = కొనగోళ్ళనెడి, సమ్పుటైః = బరిణెలతో, ఛేత్తుమ్ = గిల్లుటకు, శక్యమ్ = వీలైనవి.

**తా :** పార్వతి! చంద్రుని లేతకిరణాలు ముదరని యవధాన్యాల ముక్కులవలె కోమలమైనవి. కర్ణాభరణాలుగా నువ్వు అలంకరించుకొనదగినవి. నీ కొనగోళ్ళ సంపుటంతో గిల్లదగినవి.

**విభక్తులు - క్రియలు :** 1. శక్యమ్ : **శక్యం** - శక్యే - శక్యాని; శక్యశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. ఓషధిపతేః : ... **పతేః** - పత్యోః - పతీనామ్; ఓషధిపతిశబ్దః ఇకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 3. నవోదయాః : నవోదయః - నవోదయౌ - **నవోదయాః**; నవోదయశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్; 4. కర్ణపూరరచనాకృతే - అవ్యయమ్; 5. తవ : **తవ**/తే - యువయోః/వామ్ - యుష్మాకమ్/వః; యుష్మచ్ఛబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్; 6. అప్రగల్భయవసూచికోమలాః : కోమలః - కోమలౌ - **కోమలాః**; ... కోమలశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహు-వచనమ్; 7. ఛేత్తుమ్ - అవ్యయమ్; 8. అగ్రనఖసంపుటైః : సంపుటేన - సంపుటాభ్యాం - **సంపుటైః**; అగ్రనఖసంపుటశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 9. కరాః : కరః - కరౌ - **కరాః**; కరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్.

**సంధులు :** 1. ఓషధిపతేః+నవోదయాః = ఓషధిపతేర్నవోదయాః - విసర్గసంధి; 2. కోమలాః+ఛేత్తుమ్ = కోమలాశ్ఛేత్తుమ్ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఓషధీనాం పతిః, తస్య, ఓషధిపతేః; 2. నవః ఉదయః యేషాం తే, నవోదయాః; 3. కర్ణపూరరచనార్థమ్, కర్ణపూరరచనాకృతే; 4. అప్రగల్భాశ్చ తే యవాః, సూచితవత్ కోమలాః; అప్రగల్భయవాశ్చ తే సూచివత్కోమలాః, అప్రగల్భయవసూచి-కోమలాః; 5. అగ్రాశ్చ తే నఖాః, తయోః సంపుటాః, అగ్రనఖసంపుటాః

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శక్యమ్ :** 'కరాః ఛేత్తుం శక్యమ్' - అని విధేయవాక్యం. కరాః అన్నది ప్రథమావిభక్తి బహువచనం, పుంలింగః కాబట్టి 'శక్యాః' అని ప్రయోగముండాలి. విశేషణవిశేష్యభావ సంబంధాన్ని బట్టి. మరి శక్యం అని ఎలా కుదురుతుంది? "**భావే ఔత్సర్గికమేకవచనం క్లీబత్వం చ**" అని భట్టోజీ దీక్షితవచనం.

అయితే శక్ ధాతువు వస్తుతః అకర్మకధాతువైనా తుమున్నంతవాచ్యమైన క్రియతో సంబంధముంటే సకర్మకమే అవుతుంది. కాబట్టి కర్మార్థకంలోని విశేషణానికి విశేష్యలింగ వచనాలు రావలసిందే గదా అని సంశయిస్తే... సామాన్యే నపుంసక మన్న న్యాయంతో ఇక్కడ శక్యం కుదురుతుంది. వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తిలో దీన్నిలా సమర్థిస్తాడు-

**శక్యమితి రూపం కర్మాభిధాయాం లింగవచనస్యాపి సామాన్యోపక్రమాత్** - 5/23

యథా -

**శ్లో॥ శక్యమోషధిపతేర్నవోదయాః - కర్ణపూరరచనాకృతే తవ ।**
**అప్రగల్భయవసూచికోమలాః - ఛేత్తుమగ్రనఖసంపుటైః కరాః ॥**

అయితే శక్యమన్నది నియతమేమీ కాదు. విశేష్యాన్ని అనుసరించి లింగవచనాలను ప్రయోగించిన విశేషణాలూ ఉన్నాయి.

**'శక్యా భఙ్క్తుం ఝటితి బిసినీకందవచ్ఛన్ద్రపాదాః'** -

ఈ ప్రయోగవిషయంలో వివరణ వ్యాఖ్య "... తస్మాచ్ఛక్యమిత్యత్ర విశేషవివక్షాభావాత్ లింగవచనవిశేషాభావః । అత్ర శక్యం యత్కించిత్ అస్తీతి సామాన్యోపక్రమే కిం తచ్ఛక్య-మిత్యాకాంక్షాయాం విశేషరూపో వాక్యశేషో ద్రష్టవ్యః । యథా - **'శక్యమరవిన్ద- సురభిః'** (శాకు - 3/4) ఇత్యాదౌ 'శక్యమంజలిభిః పాతుం వాతాః కేతకిగన్ధినః' ఇత్యత్ర చ । -

**సంభవభణితి :** చంద్ర కిరణాలలో కోమలత్వం ఆరోపితం. ఆ కారణంగా అవి ఛేదించటానికి వీలుగా ఉన్నాయి. అది ఆరోపణమే. ఆ రీతిగా ఈ వాక్యార్థమంతా ఉపచార పరంగా ఉంది. లాక్షణికంగా వ్యవహరించటాన్ని **ఉపచార** మంటారు. "**ఉపచార మాత్రం తు భక్తిః**" అని ఆనందవర్ధనవచనం. ఈ ఔపచారికకల్పనను 'సంభవఫణితి' అని కొందరంటారని ప్రకాశికా వ్యాఖ్య "కోమత్వం చారోపితమ్ । తేన ఛేదస్య శక్యతారోపః । ఏవం చ సర్వ ఏవాయం వాక్యార్థః ఉపచారప్రాణకః । అముం చ ప్రకారం **సంభవఫణితి**రితి కేచిదాచక్షతే।"

చంద్రకిరణాలలో కోమలత్వారోపణం మనోహరం. *

**శ్లో॥ అఙ్గులీభిరివ కేశసఞ్చయం సన్నిగృహ్య తిమిరం మరీచిభిః ।**
**కుడ్మలీకృతసరోజలోచనం చుమ్బతీవ రజనీముఖం శశీ ॥ 63**

**అవ :** రజనీశశులలో నాయికానాయకశృంగారప్రతీతికల్పన.

**ప.వి. :** అంగులీభిః ఇవ కేశ-సఞ్చయం సన్నిగృహ్య తిమిరం మరీచిభిః ।
కుడ్మలీకృత-సరోజ-లోచనం చుమ్బతి+ఇవ రజనీ-ముఖం శశీ ॥

**అన్వ :** శశీ అంగులీభిః కేశసంచయమివ మరీచిభిః తిమిరం సన్నిగృహ్య కుడ్మలీకృత-సరోజలోచనం రజనీముఖం చుమ్బతీవ.

**ప్ర :** శశీ = చంద్రుడు, అంగులీభిః = వ్రేళ్ళతో, కేశ-సంచయమ్ ఇవ = కురుల

సమూహాన్ని వలె, మరీచిభిః = కిరణాలతో, తిమిరమ్ = చీకటిని, సంనిగృహ్య = ముడిచి, కుడ్మలీ... లోచనమ్ : కుడ్మలీకృత = ముడుచుకున్న, సరోజ = తామర అనెడి, లోచనమ్ = కన్నుగల, రజనీముఖమ్ = ప్రదోషకాలాన్ని, చుమ్బతి ఇవ = ముద్దిడుతున్నట్టుంది.

**తా :** వ్రేళ్ళతో కురులను ముడిచినట్లు కిరణాలతో చీకట్లను సవరించిన చంద్రుడు ముడుచుకొన్న తామరయే కన్నుగాగల రజనీముఖాన్ని చుంబిస్తున్నట్లుంది.

**విభక్తులు – క్రియలు :** 1. అంగులీభిః : అంగుల్యా – అంగులీభ్యామ్ – **అంగులీభిః**; అంగులీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః తృతీయబహువచనమ్; 2. ఇవ – అవ్యయమ్; 3. కేశసంచయమ్ : **సంచయం** – సంచయౌ – సంచయాన్; కేశసంచయశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 4. సన్నిగృహ్య – అవ్యయమ్; 5. తిమిరమ్ : **తిమిరం** – తిమిరే – తిమిరాణి; తిమిరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 6. మరీచిభిః : మరీచినా – మరీచిభ్యాం; మరీచిభిః – మరీచిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 7. కుట్మలీకృతసరోజలోచనమ్ : **లోచనం** – లోచనే – లోచనాని; ...లోచనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 8. చుంబతి : **చుంబతి** – చుంబతః – చుంబన్తి; చుబి వక్త్రసంయోగే లటి ప్రథమపురుషైకవచనమ్; 9. ఇవ – అవ్యయమ్; 10. రజనీముఖమ్ : **ముఖం** – ముఖే – ముఖాని; రజనీముఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 11. శశీ : **శశీ** – శశినౌ – శశినః; శశిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. అంగులీభిః+ఇవ = అంగులీభిరివ – విసర్గసంధి; 2. చుమ్బతి+ఇవ = చుమ్బతీవ – సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. కేశానాం సంచయః తమ్, కేశసంచయమ్; 2. కుట్మలీకృతం సరోజమ్ ఏవ లోచనం యస్య తత్, కుట్మలీకృతసరోజలోచనమ్; 3. రజన్యాః ముఖమ్, రజనీముఖమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**అంగులీ –అంగులి :** అంగ్ ధాతువుపై **ఉలిచ్** ప్రత్యయం. "కాయమంగులిమూలేఽగ్రే దైవం పిత్ర్యం తయోరధః । మనుస్మృతిః ।

జీప్ ప్రత్యయం చేరితే అంగులీ. జీప్ వైకల్పికం లేకపోతే అంగులిః.

అంగురిః, అంగురీ అని రూపాంతరాలు. **అంగులి అయిదు రకాలు** – అంగుష్ఠః, తర్జనీ, మధ్యమా, అనామికా, కనిష్ఠా (కనిష్ఠికా) –

**కేశః :** కే మస్తకే శేతే - శీ+అచ్-అలుక్సమాసః। మజ్జజాతోపధాతువిశేషః । ... సతు గర్భస్థబాలకస్య అష్టాభిర్మాసైః జాయతే.

కేశాలు తండ్రి ద్వారా సంక్రమిస్తాయని భావప్రకాశకథనం -

శ్లో॥ కేశాః శ్మశ్రు చ లోమాని నఖా దన్తాః సిరాస్తథా ।
ధమన్యః స్నాయవః శుక్రమేతాని పితృజాని హి ॥

కాశతే ప్రకాశతే లోకం అనే వ్యుత్పత్తితో కాశ+అచ్... పృషోదరాదీని యథోపదిష్టమ్. సూత్రం మేర కేశపదం సూర్యాది కిరణాలలో ప్రవర్తిస్తుంది. - శబ్దకల్పద్రుమః

**తిమిరమ్ - తిమిరః :** తిమిరపదం నపుంసకలింగంలో అన్ధకారవాచకం. తిమ్యతీతి - వ్యుత్పత్తి - తిమి ధాతువుపై **కిరచ్** ప్రత్యయం.

తిమిరః పుంలింగంలో కంటిజుట్టుకు వాచకం. రోగార్థకంగా నపుంసకలింగంలోనూ ఉంటుంది. **కానీ అంధకారార్థంలో పుంలింగంలో ఉండదు.**

**వాచ్య వాచక చారుత :** శ్లోకంలో ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష సమాసోక్త్యలంకారాలున్నాయి.

అంగుళులతో కేశసంచయాన్ని పట్టినట్టు కిరణాలతో చీకటిని పట్టటం వర్ణ్య విషయం. అంగులీభిః కేశసంచయం అన్నది ఉపమానం. ఇవ ఉపమావాచకం. 'కుట్మలీకృత **సరోజలోచనం**' అన్నది రూపకాలంకారం, లోచనంలో సరోజత్వాన్ని ఆరోపించటం ద్వారా. చుమ్బతీవ అన్నది ఉత్ప్రేక్ష. ఇవ ఇక్కడ ఉత్ప్రేక్షా వ్యంజకం.

ప్రకృతాంశమిక్కడ ఉత్ప్రేక్షాబోధితమైన రజనీముఖచుంబనరూపమైన శశి ప్రవృత్తి. దాని ద్వారా అప్రకృతమైన నాయికా ముఖ చుంబన రూపమైన నాయక ప్రవృత్తి విశేషణ సామ్యం వలన స్ఫురిస్తుంది. '**విశేషణానాం సామ్యేన యత్ర ప్రస్తుతవర్తినామ్ । అప్రస్తుతస్య గమ్యత్వం సా సమాసోక్తిః**' - । ఇది సమాసోక్తి లక్షణం. సమాసోక్తిలో ధ్వనించే నాయిక ప్రవృత్తిరూపమైన వస్తుధ్వని ధ్వని అయినా దానికన్న వాచ్యవాచకచారుత్వమే మనోజ్ఞతరం. అప్పయ్యదీక్షితులు కువలయానందంలో సమాసోక్తిలో చారుతాహేతువు వాచ్యమా? వ్యంగ్యమా? అని చర్చించి వాచ్యవాచకాలే వ్యంగ్యవ్యంజకాలకన్న సౌందర్యహేతువులని నిర్ణయించాడు. ప్రకృతశ్లోకంలో అటువంటి సమాసోక్తిదే స్థానం.

వాస్తవానికి '**అంగులీభిరివ కేశసంచయమ్**' అని ఉపమాలంకారం లేకపోయినా సమాసోక్తికి లోటు లేదు. అసలు అవసరమూ లేదు. అది విధేయవాక్యార్థానికి కాకుండా అనువాద్యవాక్యార్థానికి సంబంధించినది. పదప్రయోగవైశిష్ట్యంతో, విశేషణసామ్యంతో దానిని స్ఫురింపజేయటం క్లిష్టమని కవి భావించి యుండవచ్చు. *

**శ్లో॥ పశ్య పార్వతి! నవేన్దురశ్మిభిర్భిన్నసాన్ద్రతిమిరం నభస్తలమ్ ।**
**లక్ష్యతే ద్విరదభోగదూషితం సమ్ప్రసీదదివ మానసం సరః ॥ 64**

**అవ :** వెన్నెలల వికాసంతో చీకటి కనుమరుగకుట - పరమేశ్వరవచనం.

**ప.వి. :** పశ్య పార్వతి! నవ+ఇన్దు-రశ్మిభిః భిన్న-సాన్ద్ర-తిమిరం నభః+తలమ్ ।
లక్ష్యతే ద్విరద-భోగ-దూషితం సమ్ప్రసీదద్ ఇవ మానసం సరః ॥

**అన్వ :** పార్వతి! నవేన్దురశ్మిభిః భిన్నసాన్ద్రతిమిరం నభస్తలం ద్విరదభోగదూషితం సంప్రసీదద్ మానసం సరః ఇవ లక్ష్యతే పశ్య.

**ప్ర :** పార్వతి! = హైమవతి!, నవ+ఇన్దు-రశ్మిభిః : నవ = క్రొత్తవైన, ఇన్దురశ్మిభిః = చంద్రకిరణాలచే, భిన్న... తిమిరమ్ : భిన్న = బ్రద్దలు చేయబడిన, సాంద్ర = దట్టమైన, తిమిరమ్ = చీకటిగల, నభస్తలమ్ = గగనతలం, ద్విరద... దూషితమ్ : ద్విరద = ఏనుగులయొక్క, భోగ = అనుభవంచేత, దూషితమ్ = కలుషితమై, సంప్రసీదత్ = తేరుకొనుచున్న, మానసం సరః+ఇవ = మానససరస్సువలె, లక్ష్యతే = కనిపిస్తోంది. పశ్య = చూడు.

**తా :** పార్వతి! గగనతలాన్ని చూడు. దట్టమైన చీకటి చంద్రకిరణాలచే ఛేదింపబడి అది నిర్మల మవుతోంది. ఏనుగుల తాకిడితో కలతపడి మరల తేరుకొంటున్న మానస సరస్సు వలె కనిపిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. పశ్య : **పశ్య**/పశ్యతాత్ - పశ్యతం - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 2. పార్వతి! : పార్వతి! - పార్వత్యౌ! - పార్వత్యః! - పార్వతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధనప్రథమైకవచనమ్; 3. నవేన్దు-రశ్మిభిః : రశ్మినా - రశ్మిభ్యామ్ - **రశ్మిభిః**; నవేన్దురశ్మిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 4. భిన్నసాంద్రతిమిరమ్ : **తిమిరం** - తిమిరే - తిమిరాణి; తిమిరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 5. నభస్తలమ్ : **నభస్తలం** - నభస్తలే - నభస్తలాని; నభస్తల శబ్దః లకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. లక్ష్యతే : **లక్ష్యతే** - లక్ష్యేతే - లక్ష్యన్తే; లక్ష అంకనే ధాతోః కర్మణి లటి ప్రథమపురుషైక-వచనమ్; 7. ద్విరదభోగదూషితమ్ : ...**దూషితం** - దూషితే - దూషితాని; ద్విరదభోగ-దూషితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 8. సంప్రసీదత్ : **సంప్రసీదత్** - సంప్రసీదతీ - సంప్రసీదన్తి; సంప్రసీదత్ శబ్దః తకారాన్తః నపుంసకలింగః ప్రథమైక వచనమ్. 9. ఇవ - అవ్యయమ్; 10. మానసమ్ : **మానసం** - మానసే - మానసాని; మానసశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 11. సరః : **సరః** - సరసీ - సరాంసి, సరశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. రశ్మిభిః+భిన్న = రశ్మిర్భిన్న - విసర్గసంధి; 2. సంప్రసీదత్+ఇవ = సంప్రసీదదివ - జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. నవాశ్చ తే ఇన్దోః రశ్మయః, తైః, నవేన్దురశ్మిభిః;

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**పాఠాంతరం -** సామిభిన్నతిమిరమ్ :

**సామి :** అవ్యయం. "అర్ధకుత్సనయోరయం వర్తతే । అర్ధే - 'సామిసమ్మీలితాక్షీ' । 'సమాధినియతైరపి సామిదృష్టమ్।' కుత్సనే - 'సామి కృతమ్ । అత్ర చ కృత్యస్యాపూరణైక స్వభావకత్వాత్ కుత్సేతి జ్ఞేయమ్।" - అవ్యయకోశః.

'సామి' పాణిని సూత్రం క్తాన్త పదాలతో సమాసవిధాయకం. అయితే కొందరు పూర్వసూత్రంనుండి క్షేపే పదాన్ని అనువర్తింపజేసి క్షేపార్థం గమ్యమానమైనపుడే క్తాన్తపదాలతో సామి పదానికి సమాసమని అంటారు. కానీ మల్లినాథునివంటి వ్యాఖ్యాతలను నిందార్థం లేకపోయినా "**అభివీక్ష్య సామి కృతమణ్డనం శ్రీః**" (మాఘుకావ్యం 13-31) ప్రయోగంలో "అర్ధవిరచితప్రసాధనమ్" అని క్షేపభిన్నార్థంలోనే వ్యాఖ్యానించి నందువల్ల క్షేపార్థం నియతం కాదని భావించవలసిఉంటుంది.

**ఉపమాలంకారం :** మానససరస్సు గజాభోగంతో మలినమైంది. మెల్లగా తేరుకుంటోంది. నభస్తలంలో చీకటి పూర్తిగా వ్యాపించింది. ఇప్పుడు చీకట్లు మెల్లగా తొలగిపోతున్నాయి. ఆ మానససరోవరంతో ఈ నభస్తలానికి పోలిక. మనోహరంగా ఉంది. "ఉపమా కాళిదాసస్య' అన్న అభియుక్తోక్తికి ఉదాహరణప్రాయమై.

ఇక్కడొక విశేషముంది. సరః పక్షంలో ద్విరదభోగదూషణం, సంప్రసాధనం అని రెండు క్రియలూ భిన్నపదోపాత్తాలూ. నభస్తలపక్షంలో సామిభిన్నతిమిరమని ఒకే పదంతో సంభావనీయభిన్నకాలికాలైన రెండు దశలకూ ప్రతిపాదనం.

నభస్తలం సామిభిన్నతిమిరం కావటానికి నవేందుకిరణాలు కారణం. అయితే మానససరోవరం నిర్మలం కావటానికి కారణం? చెప్పలేదు కవి. ఉపమానపక్షంలో అదొక లోపం. న్యూనోపమా రూపమైన దోషం కావలసి వస్తుంది. అయితే ఆ విషయాన్ని మరో కోణంలో నుండీ ఆలోచించాలి.

నభస్తలం భౌతికం. దాని సహజలక్షణం కారణాంతరాలవల్ల అది మారినా, తిరిగి ఆ కారణం పోయినా, తద్భిన్నకారణం సంభవించినా అది సహజలక్షణాన్ని పొందుతుంది. భౌతికం కాబట్టి. కానీ మానసికభావాలూ, లేదా సంఘర్షణలకు బాహ్యకారణమున్నా

అది బాహ్యమే కానీ ఆంతరం కాలేదు. భౌతికంగా ఆపలేదు. అందువల్ల మనోగతులు స్వతః మారవలసినవే. అది మానససరస్సు. మనసుసకు ప్రతినిధి. బాహ్యకారణాలు కలత పరచగలవు కానీ ప్రసన్నీకరించలేవు. '**ఉష్ణత్వమగ్న్యాతపసంప్రయోగాచ్ఛైత్యం హి యత్సా ప్రకృతిరజ్జలస్య**' అని కాళిదాసే ప్రకటించాడు. నీళ్ళు అగ్నివల్లనో, ఎండవల్లనో వెచ్చబడినా మరలా తమంతతామే చల్లబడతాయి. మనస్సూ, మానససరోవరం కూడా ఎన్ని బాహ్యోపచారాలు జరిగినా తమంతతామే చల్లబడవలసినవే. *

**శ్లో॥ రక్తభావమపహాయ చన్ద్రమా జాత ఏష పరిశుద్ధమణ్డలః ।**
**విక్రియా న ఖలు కాలదోషజా నిర్మలప్రకృతిషు స్థిరోదయా ॥ 65**

**అవ :** చంద్రుడు రక్తిమను వీడి పరిశుద్ధుడగుట.

**ప.వి. :** రక్త–భావమ్ అపహాయ చన్ద్రమాః జాతః ఏషః పరిశుద్ధ–మణ్డలః ।
విక్రియా న ఖలు కాల–దోష–జా నిర్మల–ప్రకృతిషు స్థిర+ఉదయా ॥

**అన్వ :** ఏషః చన్ద్రమాః రక్తభావమ్ అపహాయ పరిశుద్ధమణ్డలః జాతః నిర్మలప్రకృతిషు కాలదోషజా విక్రియా స్థిరోదయా న (భవతి) ఖలు.

**ప్ర :** ఏషః = ఈ (కనిపించుచున్న), చన్ద్రమాః = చంద్రుడు, రక్తభావమ్ = ఎఱ్ఱదనాన్ని, అపహాయ = వీడి, పరిశుద్ధ–మణ్డలః : పరిశుద్ధ = నిర్మలమైన, మణ్డలః = బింబం గలవాడుగా, జాతః = అయ్యాడు. నిర్మల–ప్రకృతిషు : నిర్మల = శుద్ధమైన, ప్రకృతిషు = స్వభావంగల వారియందు, విక్రియా = వికారం (మార్పు), స్థిర+ఉదయా = అచంచలమైన పుట్టుక గలదిగా, న (భవతి) ఖలు = కాదు గదా!

**తా :** చంద్రుడు ఎఱ్ఱదనాన్ని (కోపాన్ని) వదలి నిర్మలమైన బింబంతో కనిపిస్తున్నాడు. (అది సరియైనదే) స్వచ్ఛమైన మనస్సుగల వారిలో వికారం స్థిరంగా నిలవదు గదా! అది తాత్కాలికమే.

**విభక్తులు – క్రియలు :** 1. రక్తభావమ్ : **భావం** – భావౌ – భావాన్; రక్తభావశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 2. అపహాయ – అప పూర్వకాత్ హా ధాతోః ల్యప్ ప్రత్యయః – అవ్యయమ్; 3. చన్ద్రమాః : **చన్ద్రమాః** –చన్ద్రమసౌ – చన్ద్రమసః; చన్ద్రమస్ శబ్దః సకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. జాతః : **జాతః** –జాతౌ – జాతాః; జాతశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 5. ఏషః : **ఏషః** – ఏతౌ – ఏతే – ఏతత్ శబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 6. పరిశుద్ధమణ్డలః : **మండలః** – మండలౌ – మండలాః; పరిశుద్ధమండలశబ్దః అకారాన్తః పుంలింగః

ప్రథమైకవచనమ్; 7. విక్రియా : **విక్రియా** - విక్రియే - విక్రియాః; విక్రియా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 8. న - అవ్యయమ్; 9. ఖలు - అవ్యయమ్; 10. కాలదోషజా : **దోషజా** - దోషజే - దోషజాః; కాలదోషజాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 11. నిర్మలప్రకృతిషు : ప్రకృతౌ - ప్రకృత్యోః - **ప్రకృతిషు**; నిర్మల-ప్రకృతిశబ్దః ఇకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 12. స్థిరోదయా : **స్థిరోదయా** - స్థిరోదయే - స్థిరోదయాః; స్థిరోదయాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. చన్ద్రమాః+జాత = చన్ద్రమా జాత - విసర్గసంధి; 2. జాతః+ఏషః = జాత ఏషః - విసర్గసంధి; 3. ఏషః+పరిశుద్ధ = ఏష పరిశుద్ధ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. రక్తస్య భావః, రక్తభావః; 2. పరిశుద్ధం మణ్డలం యస్య సః, పరిశుద్ధమణ్డలః; 3. కాలస్య దోషః, తస్మిన్ జాయతే ఇతి, కాలదోషజా; 4. నిర్మల ప్రకృతిః యేషాం, తేషు, నిర్మలప్రకృతిషు; 5. స్థిరః ఉదయః యస్యాః సా, స్థిరోదయా.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**చన్ద్రమా :** "చన్ద్రమ్ ఆనందం మిమీతే యద్వా చన్ద్రం కర్పూరం సాదృశ్యేన మాతి పరిమాతీతి । చన్ద్ర+మా+"చన్ద్రే మో డిత్" (ఉణా 4/228) ఇతి అసిః స చ డిత్ । చన్ద్రం రజతమ్ అమృతం చ తదివ మీయతే చన్ద్ర ఇతి వా మీయతే ఇతి దాసీభారాదివ్యుత్పాదనే హరదత్తః" (శబ్దకల్పద్రుమః).

**శ్లేషాలంకారం - సమాసోక్తి :** శ్లోకంలో రక్త-మండల-ప్రకృతి శబ్దాలు శ్లిష్టాలు. రక్తశబ్దానికి ఎఱ్ఱదనమనీ, విషయాసక్తి అనీ అర్థాలు. మండల పదానికి వర్తులత్వం, రాష్ట్రం అని అర్థాలు. ప్రకృతి పదం స్వభావానికీ, మంత్రికీ వాచకం. శ్లోకంలో పూర్వోత్తరార్ధాలు విశేషసామాన్యాలు. ఉభయత్ర శ్లిష్టపదోపయోగం గమనించదగిన విశేషం. చంద్రుడు తొలుత రక్తభావుడై ఆ తరువాత పరిశుద్ధ (నిర్మల) మండలుడైనాడు. మొదట విషయాసక్తుడై తరువాత నిర్మలమండలుడైన రాజులాగా. ఇక్కడ ఉపమాలంకారం ధ్వనిస్తుంది. పూర్వార్ధంలోనే సమాసోక్తి అలంకారం ద్వారా. రాగమండలపదగతమైన సామ్యంవలన సమాసోక్తి స్ఫురణ.

**అర్థాంతరన్యాసం :** శ్లోకంలో పూర్వార్ధం విశేషం. ఉత్తరార్ధం సామాన్యం. "**ఉక్తి-రర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**" అని అర్థాంతరన్యాసలక్షణం. విశేష సామాన్యాలు పరస్పరం బింబప్రతిబింబాలే గానీ పరస్పరాపేక్ష ఉండదు. అర్థాంతర-న్యాసంలో. కావ్యలింగంలో సమర్థనాపేక్ష ఉంటుంది. అయినా ఉత్తరార్ధంలోని ప్రకృతి-పదాన్ని కూడా కలుపుకొని ఉపమాలంకారధ్వనిని ప్రదర్శించారు వ్యాఖ్యాతలు-

"రక్తశబ్దేన విషయాసక్తిః. మండలశబ్దేన స్వరాష్ట్రం, ప్రకృతిశబ్దేన అమాత్యాదయశ్చ ధ్వన్యతే. యథా రాజా నవో యౌవనారమ్భే రాగదూషితప్రవృత్తిత్వాత్ క్షయలోభవిరాగాది కలుషితమణ్డలః పశ్చాత్ స్వాభావికేనామాత్యాది కృతేన చ వినయేన యుక్తః సన్నపగతరాగః శుద్ధమణ్డలో భవతి, తథా యపీతి ఉపమాధ్వనిః" (ప్రకాశికావ్యాఖ్య).

వివరణవ్యాఖ్య కూడా దాదాపు ఇలాగే వివరించింది.

మల్లినాథవ్యాఖ్య మాత్రం పూర్వోత్తరార్ధాలకు సంబంధం లేకపోవటాన్ని గుర్తించి పూర్వార్ధానికి పరిమితం చేసి సమాసోక్తిని తద్ద్వారా ధ్వనించే ఔపమ్యాన్నీ ప్రదర్శించింది. "చన్ద్రోఽపి స్వభావనిర్మల ఇతి । యథా కశ్చిద్రాజా కుతశ్చిన్నిమిత్తాత్ విరక్తమణ్డలః పశ్చాత్ ప్రతికృతశుద్ధ్యా స్వస్థమండలో భవతి తద్వదితి భావః ॥

ప్రథమార్థంలోని సమాసోక్తికి, సంపూర్ణశ్లోకగతమైన అర్థాంతరన్యాసానికీ మల్లినాథ-వ్యాఖ్య అంగాంగిభావాన్ని భావించి అలంకారసంకరమన్నది. కానీ పూర్వార్ధం లోని సమాసోక్తిలేకుండా అర్థాంతరన్యాసాన్ని భావించటానికి ఎటువంటి ప్రతిబంధకమూలేదు. కాబట్టి ఇక్కడ అలంకారసంసృష్టి అనటమే సముచితం. తిలతండూల న్యాయంతో. *

**శ్లో॥ ఉన్నతేషు శశినః ప్రభా స్థితా నిమ్నసంశ్రయపరం నిశాతమః ।**
**నూనమాత్మసదృశీ ప్రకల్పితా వేధసా హి గుణదోషయోర్గతిః ॥ 66**

**అవ :** చంద్రుడు పైపైకి వెళ్ళిన ఫలాన్ని వర్ణించటం.

**ప.వి. :** ఉన్నతేషు శశినః ప్రభా స్థితా నిమ్న-సంశయ-పరం నిశా-తమః ।
నూనమ్ ఆత్మ-సదృశీ ప్రకల్పితా వే వేధసా హి గుణ-దోషయోః గతిః॥

**అన్వ :** శశినః ప్రభా ఉన్నతేషు స్థితా. నిశాతమః నిమ్నసంశయపరమ్. నూనం వేధసా గుణదోషయోః గతిః. ఆత్మసదృశీ ప్రకల్పితా హి.

**ప్ర :** శశినః = చంద్రునియొక్క, ప్రభా = కాంతి, ఉన్నతేషు = ఎత్తైన తావుల, స్థితా = ఉన్నది. నిశా-తమః = రేచీకటి, నిమ్న... పరమ్ : నిమ్న = లోతైన తావులను, సంశ్రయ = ఆశ్రయించుటలో, పరమ్ = ఆసక్తి గలది. నూనమ్ = నిశ్చితంగా, వేధసా = బ్రహ్మచేత, గుణ-దోషయోః = మంచి చెడులకు, ఆత్మ-సదృశీ = తమకు తగిన, గతిః = ఉనికి, ప్రకల్పితా హి = ఏర్పరచబడినది.

**తా :** చంద్రకాంతి (వెన్నెల) ఉన్నతప్రదేశంలో ఉంది. రేచీకటి లోతైనతావులలో ఉంది. అవును. బ్రహ్మదేవుడు గుణదోషాలను తమకు తగిన స్థానాలలోనే నిలిపాడు.

**విభక్తులు - క్రియలు :** 1. ఉన్నతేషు : ఉన్నతే - ఉన్నతయోః - **ఉన్నతేషు**; ఉన్నతశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 2. శశినః : **శశినః** - శశినో - శశినామ్; శశిన్ శబ్దః నకారాన్తః పుంలింగః. షష్ఠ్యేకవచనమ్; 3. ప్రభా : **ప్రభా** - ప్రభే - ప్రభాః; ప్రభాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. స్థితా : **స్థితా** - స్థితే - స్థితాః; స్థితాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 5. నిమ్నసంశయపరమ్ : **పరం** - పరే - పరాణి; నిమ్నసంశయపరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. నిశాతమః : **తమః** - తమసీ - తమాంసి; నిశాతమస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. నూనమ్ - అవ్యయమ్; 8. ఆత్మసదృశీ : **ఆత్మసదృశీ** - ఆత్మసదృశ్యౌ - ఆత్మసదృశ్యః; ఆత్మసదృశీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. ప్రకల్పితా; **ప్రకల్పితా** - ప్రకల్పితే - ప్రకల్పితాః; ప్రకల్పితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 10. వేధసా : **వేధసా** - వేధోభ్యాం - వేధోభిః; వేధశ్శబ్దః సకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 11. హి - అవ్యయమ్; 12. గుణదోషయోః : దోషస్య - **దోషయోః** - దోషాణామ్; దోషశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠీద్వివచనమ్. (గుణదోషౌ అన్న ద్వంద్వపదానికి ఏకబహువచనాలుండటం భావదృష్ట్యా ఉచితం కాదు. అందుకే అన్తిమమైన దోషపదశబ్దమే చెప్పటం జరిగింది); 13. గతిః : **గతిః** - గతీ - గతయః; గతిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. గుణదోషయోః+గతిః = గుణదోషయోర్గతిః - విసర్గసంధి.

**సమాసాలు :** 1. నిమ్నానాం సంశ్రయే పరం, తత్, నిమ్నసంశయపరమ్; 2. ఆత్మనా సదృశీ, ఆత్మసదృశీ; 3. గుణశ్చ దోషశ్చ, తయోః, గుణదోషయోః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**నిమ్నమ్ :** 'నికృష్టా మ్నా అభ్యాసః శీలమత్ర । యద్వా నికృష్టం మ్నాతి । మ్నా+క్తః - నీచమ్ । తత్పర్యాయః । గభీరం, గమ్భీరమిత్యమరః । గభీరకమ్ ఇతి శబ్దరత్నావళీ ।

నిమ్నః అనమిత్రస్య పుత్రః । సత్రాజిత ప్రసేనయోః పితా చ ।

శ్లో॥ శినిస్తస్యానమిత్రశ్చ నిమ్నోఽభూదనమిత్రతః ।
సత్రాజితః ప్రసేనశ్చ నిమ్నస్యాథాసతుః సుతౌ ॥ భాగవతమ్ 9-24-12

- శబ్దకల్పద్రుమః.

**గుణదోషౌ :** శ్లోకంలో గుణదోషధర్మాలు ఆ ధర్మాలు కల గుణి, దోషులను లక్షణతో తెలియజేస్తాయి. ఉపమేయకక్ష్యలో చంద్రప్రభ, నిశాతమస్సు వీటికి వస్తువులు. అవి

గుణి, దోషులు. కాబట్టి ఉపమానకక్ష్యలో వీటికి ప్రతి వస్తువులయిన ఇవి ధర్మిరూపంగానే గోచరిస్తాయి.

చంద్రకాంతికి గుణవత్త్వం, నిశాతమస్సులకు దోషత్వం ముందు సిద్ధించాలి. ఆపై బ్రహ్మ గుణదోషాలకు తగిన స్థితిని కల్పించాడని పోలిక. అయితే కాంతికి గుణవత్త్వాన్నీ, తమస్సుకు దోషత్వాన్నీ కల్పించిందీ విధాతయే. లేదా వాటిని సహజధర్మాలుగా విధాత సృష్టిస్తే మనం వాటికి గుణత్వదోషత్వాలను ఆపాదించినట్లు చెప్పాలి. ప్రకృతాంశాన్ని చెప్తున్నది మనమే కాబట్టి మన భావాలను వేధకు తగిలించి మాటాడుతున్నట్టు భావించ వలసి వస్తుంది.

**అర్థాంతరన్యాసమా? :** శ్లోకంలో అర్థాంతరన్యాసమున్నట్లు కనిపిస్తుంది కానీ అర్థాంతరన్యాసం కాదు. వివరణవ్యాఖ్య "అర్థాంతరన్యాసప్రకారశ్చాయమ్" అని అర్థాంతరన్యాసభేదంగా దీనిని ఉటంకించింది. సామాన్యవిశేషాలకు అంతర్గతార్థ సంగతి అర్థాంతరన్యాసంలో ఉండదు. వ్యాఖ్యాత శ్లోకాన్ని వివరిస్తూ "గుణవతాం చన్ద్రికా ప్రభృతీనాం యదాత్మయోగ్యే సమున్నతే స్థలే గతిః కల్పితా. యచ్చ దోషవతాం తమః ప్రభృతీనాం తదధిష్ఠానయోగ్యే నిమ్నప్రదేశ ఏవ వర్తనం కల్పితం, తత్ పరమేష్ఠినః ఏవ కౌశలవిశేషః నాన్యస్యేత్యర్థః" అని సామాన్యవిశేషాలను కలిపియే అన్వయించాడు. కానీ అది సంగతం కాదు.

ఈ శ్లోకంలో **కావ్యలింగాలంకార** ముందనవచ్చు. చంద్రప్రభా ఉన్నతస్థితిని పొందటానికీ, తమస్సు నిమ్నస్థితిని పొందటానికీ కారణంగా శ్లోకోత్తరార్ధం కనిపిస్తుంది. అది సమర్థనను అపేక్షించిన విషయాన్ని సమర్థించటం కాబట్టి ఇది కావ్యలింగాలంకార మవుతుంది. "**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**" అని కావ్యలింగలక్షణం.

ఒకవేళ శ్లోకం "నూనమాత్మసదృశీ హి కల్ప్యతే వేధసా సుగుణదోషయోర్గతిః" అని తద్ధర్మరూపంగా శ్లోకనిర్మాణముంటే అప్పుడు అర్థాంతరన్యాసాలంకారమయ్యేది.

నూనం పదం ఉత్ప్రేక్షావ్యంజకం కూడా కావచ్చు కానీ ఇక్కడ నిశ్చయాత్మకమే. ఉత్ప్రేక్షలో సంభావన ముంటుంది.

*

**శ్లో॥ చన్ద్రపాదజనితప్రవృత్తయశ్చన్ద్రకాన్తజలబిన్దవో గిరౌ ।**
**మేఖలాతరుషు నిద్రితానమూన్బోధయన్త్యసమయే శిఖణ్డినః ॥ 67**

**అవ :** చంద్రోదయంతో చంద్రకాంతశిలలు కరుగుట.

**ప.వి. :** చన్ద్ర–పాద–జనిత–ప్రవృత్తయః చన్ద్ర–కాన్త–జల–బిందవః గిరౌ ।
మేఖలా తరుషు నిద్రితాన్ అమూన్ బోధయన్తి అసమయే శిఖణ్డినః ॥

**అన్వ :** గిరౌ చన్ద్రపాదజనితప్రవృత్తయః చన్ద్రకాన్తజలబిందవః మేఖలా తరుషు నిద్రితాన్ అమూన్ శిఖణ్డినః అసమయే బోధయన్తి.

**ప్ర :** గిరౌ = కొండపై (గన్ధమాదనంపై), చన్ద్ర... ప్రవృత్తయః : చన్ద్ర = చంద్రునియొక్క, పాద = కిరణాలచేత, జనిత = కల్గింపబడిన, ప్రవృత్తయః = నడవడిగల, చన్ద్ర... బిన్దవః : చన్ద్రకాన్త = చలువఱాళ్ళయొక్క, జల = నీటియొక్క, బిన్దవః = బిందువుల, మేఖలా–తరుషు : మేఖలా = కొండనడుమునున్న, తరుషు = చెట్లపై, నిద్రితాన్ = నిద్రిస్తున్న, అమూన్ = ఈ, శిఖణ్డినః = నెమళ్ళను, అసమయే = కానివేళలో, బోధయన్తి = మేల్కొల్పుతున్నాయి.

**తా :** హిమగిరిపై చంద్రకిరణాలు ప్రసరిస్తున్నాయి. ఆ కిరణాలు తాకి చంద్రకాంతశిలలు ద్రవిస్తున్నాయి. ఆ జలబిందువులు కొండల నడుమనున్న చెట్లపై నిద్రిస్తున్న నెమళ్ళను నిదుర లేపతున్నాయి.

**విభక్తులు - క్రియలు :** 1. చన్ద్రపాదజనితప్రవృత్తిభిః : ప్రవృత్తినా - ప్రవృత్తిభ్యాం - **ప్రవృత్తిభిః**; చంద్ర...ప్రవృత్తిశబ్దః ఇకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 2. చంద్రకాన్తజలబిన్దుభిః : బిన్దునా - బిన్దుభ్యాం - **బిన్దుభిః**; చన్ద్రకాన్తజలబిన్దుశబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 3. గిరిః : **గిరిః** - గిరీ - గిరయః; గిరిశబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. మేఖలాతరుషు : తరౌ - తర్వోః - **తరుషు**; మేఖలాతరుశబ్దః ఉకారాన్తః పుంలింగః సప్తమీబహువచనమ్; 5. నిర్వృతాన్ : నిర్వృతం – నిర్వృతౌ – **నిర్వృతాన్**; నిర్వృతశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయాబహు–వచనమ్; 6. ఇమాన్ : ఇవమ్ – ఇమౌ – **ఇమాన్**; ఇదం శబ్దః మకారాన్తః పుంలింగః ద్వితీయాబహువచనమ్; 7. బోధయతి : **బోధయతి** - బోధయతః - బోధయన్తి; బుధిర్ అవగమనే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 8. అసమయే : **అసమయే** – అసమయయోః – అసమయేషు; అసమయశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 9. శిఖండినః : శిఖండినం - శిఖండినౌ - **శిఖండినః**; శిఖణ్డిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ద్వితీయాబహువచనమ్.

**సంధులు :** 1. ప్రవృత్తిభిః+చంద్ర = ప్రవృత్తిభిశ్చన్ద్ర - విసర్గసంధి; 2. బిన్దుభిః+గిరిః = బిన్దుభిర్గిరిః - విసర్గసంధి; 3. బోధయతి+అసమయే = బోధయత్యసమయే - యణాదేశసంధి.

**సమాసాలు :** 1. చన్ద్రస్య పాదైః జనితా ప్రవృత్తిః యేషాం, తైః, చన్ద్రపాదజనితప్రవృత్తిభిః; 2. చన్ద్రకాన్తానాం జలానాం బిన్దవః, తైః, చన్ద్రకాన్తజలబిన్దుభిః; 3. మేఖలాయాం (విద్యమానాః) తరవః, తేషు, మేఖలాతరుషు.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శిఖండీ :** మయూరపుచ్ఛః । గాంగేయారిః । స తు ద్రుపదరాజపుత్రః (అస్య జన్మాది వివరణం మహాభారతే - 5-190 అధ్యాయే ద్రష్టవ్యమ్) । **మయూరః** ఇతి మేదినీ । యథా రఘుః 1-39... షడ్జసంవాదినీః కేకాః ద్విధా భిన్నాః శిఖణ్డిభిః । కుక్కుటః । బాణః ఇతి హేమచన్ద్రః । విష్ణుః శిఖణ్డీ నహుషో వృషా ఇతి తస్య సహస్రనామస్తోత్రమ్ । శివః । యథా మహాభారతే -13-17-31-జటీ చర్మీ శిఖణ్డీ చ సర్వాంగః సర్వభావనః. - శబ్దకల్పద్రుమః.

**చన్ద్రకాన్తః :** (చన్ద్రః కాన్తః ప్రియో యస్య) కైరవమ్ । చన్ద్ర ఇవ కాన్తః కాన్తియుక్తః । (చన్ద్ర కాన్తః అభీష్టః అధిష్ఠాతృదేవోఽస్యేతి వా) మణిభేదః ఇతి మేదినీ । ... అస్య గుణాః శిశిరత్వమ్ । స్నిగ్ధత్వమ్ । అస్రదాహ గ్రహాలక్ష్మీనాశిత్వమ్ । **శివప్రీతికరత్వమ్** స్వచ్ఛత్వం చ తద్భవవారిగుణాః । విమలత్వమ్ । లఘుత్వమ్ ।పిత్తమూర్చ్ఛా పిత్తాస్రదాహకాస మదాత్యయరోగనాశిత్వఞ్చ । ఇతి రాజనిఘంటుః - శబ్దకల్పద్రుమః

**వక్రోక్తి :** గిరిః బోధయతి - అని బోధనక్రియా కర్తృత్వాన్ని గిరికి వర్తింపజేయటం మనోరంజకం. కావ్యాలంకారసూత్రవృత్తిలో వామనుడు దీన్ని వక్రోక్త్యలంకారమన్నాడు. '**సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః**' అని వక్రోక్తిలక్షణం. చేతనకర్తృకమైన బోధనను సాదృశ్యం వల్ల గిరిలో వర్తింపజేయటం వక్రోక్తి.

ఇక్కడ మరో విశేషం. గిరికి సాక్షాత్ కర్తృత్వం లేదు. అదీ లాక్షణికమే. సాక్షాత్కర్తృత్వం చన్ద్రకాంతశిలాజలానిది. వాటికి గిరికి సామీప్యసంబంధమే ఉంది. లేదా ఆధారాధేయ భావసంబంధం. ఆధేయలక్షణాలను ఆధారంలో ఆరోపించి దానికి కర్తృత్వాన్ని కల్పించటం లో ఆధారం మీది గౌరవమై, కవితాచమత్కృతీ కనిపిస్తాయి.

ఈ రీతిగా అచేతనాలకు వాక్యార్థభావాన్ని కల్గించడం కాళిదాసు రచనలలో తరచుగా కనిపించే అంశమే. అభిజ్ఞానశాకున్తలంలో-

వనతరువులు అత్తగారింటికి వెళ్తున్న శకుంతలకు కానుకలనిచ్చే సన్నివేశంలోనూ; విక్రమోర్వశీయంలో అయితే చతుర్థాంకంలో ఊర్వశీవిరహోన్మత్తుడైన పురూరవుడు చెట్టునూ, పుట్టనూ, వాగునూ, వంకనూ ఊర్వశితో అనుసంధానం చేసి ఆవేదనను వెళ్ళగ్రక్కే సందర్భంలో విశేషంగా కనిపిస్తుంది. *

**శ్లో॥ కల్పవృక్షశిఖరేషు సమ్ప్రతి ప్రస్ఫురద్భిరవికల్పసున్దరి! ।**
**హారయష్టిగణనామివాంశుభిః కర్తుమాగతకుతూహలశ్శశీ ॥ 68**

**ప.వి.:** కల్ప-వృక్ష-శిఖరేషు సమ్ప్రతి ప్రస్ఫురద్భిః అవికల్ప-సున్దరి ।
హార-యష్టి-గణనామ్ ఇవ అంశుభిః కర్తుమ్ ఆగత-కుతూహలః శశీ ॥

**అన్వ :** అవికల్ప-సున్దరి! శశీ కల్పవృక్షశిఖరేషు ప్రస్ఫురద్భిః అంశుభిః హారయష్టిగణనాం కర్తుమ్ ఆగతకుతూహలః ఇవ (అస్తి).

**ప్ర :** అవికల్ప-సున్దరి! : అవికల్ప = నిర్వివాదమైన, సుందరి = అందం గలదానా!, శశీ = చంద్రుడు, కల్పవృక్ష-శిఖరేషు = గన్ధమాదనంపైనున్న / కల్పవృక్షాలపైభాగాన, ప్రస్ఫురద్భిః = ప్రకాశిస్తున్న, అంశుభిః = కిరణాలతో, హార... గణనామ్ : హార = ముత్యాలహారాలలోని, యష్టి = పేటలయొక్క, గణనామ్ = లెక్కను, కర్తుమ్ = చేయటానికి, ఆగతకుతూహలః ఇవ = ఆసక్తిపడినట్లుగా, అస్తి = ఉన్నది.

**తా :** సుందరీ! పార్వతి! చంద్రుని కిరణాలు కల్పవృక్షశిఖరాలపై పడుతున్నాయి. అది ఆ చంద్రుడు హారరూపంలో వున్న కల్పవృక్షకుసుమాలయొక్క పేటలను కొలవటానికి వచ్చినట్లున్నది.

**విభక్తులు - క్రియలు :** 1. శిఖరేషు : శిఖరే - శిఖరయోః - **శిఖరేషు**; శిఖర శబ్దః అకారాన్తః నపుంసకలింగః సప్తమీబహువచనమ్; 2. సంప్రతి - అవ్యయమ్; 3. ప్రస్ఫురద్భిః : ప్రస్ఫురతా - ప్రస్ఫురద్భ్యాం - **ప్రస్ఫురద్భిః**; ప్రస్ఫురత్ శబ్దః తకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 4. ఇహ - అవ్యయమ్; 5. పశ్య : **పశ్య**/పశ్యతాత్ - పశ్యతం - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 6. సున్దరి! : **సున్దరి!** - సున్దర్యౌ! - సున్దర్యః!; సున్దరీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధన-ప్రథమైకవచనమ్; 7. హారయష్టిగణనామ్ : **గణనాం** - గణనే - గణనాః; ఆకారాన్తః స్త్రీలింగః హారయష్టిగణనాశబ్దః ద్వితీయైకవచనమ్; 8. ఇవ - అవ్యయమ్; 9. అంశుభిః : అంశునా - అంశుభ్యామ్ - **అంశుభిః**; అంశుః శబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 10. కర్తుమ్ - అవ్యయమ్ - కృధాతోః తుమున్ ప్రత్యయమ్; 11. ఆగతకుతూహలః : **కుతూహలః** - కుతూహలౌ - కుతూహలాః; ఆగతకుతూహల-శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 12. శశీ : **శశీ** -శశినౌ - శశినః; శశిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. ప్రస్ఫురద్భిః+ఇహ = ప్రస్ఫురద్భిరిహ - విసర్గసంధి; 2. ఇవ+అంశుభిః = ఇవాంశుభిః - సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. కల్పవృక్షాణాం శిఖరాణి, తేషు, కల్పవృక్షశిఖరేషు; 2. హారస్యయష్టయః, తేషాం/తాసాం, గణనా, తామ్, హారయష్టిగణనామ్; 3. ఆగతః కుతూహలః యస్మిన్ సః, ఆగతకుతూహలః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శిఖరమ్ :** శిఖా అస్త్యస్య ఇతి । శిఖా+రః హ్రస్వశ్చ । వృక్షాగ్రమ్ । తత్పర్యాయః । శిరః । అగ్రమ్ । ఇత్యమరః ఇతి శబ్దరత్నావళీ పాగ్రమ్ ఇతి రాజనిఘంటుః । – శబ్దకల్పద్రుమః

శిఖరశబ్దం నపుంసకలింగంలో పర్వతాగ్రభాగానికి వాచకం. పుంలింగంలో వృక్షోపరిభాగానికి వాచకం.

**సమ్ప్రతి :** ఇదానీమిత్యర్థోఽస్య '**సంప్రత్యసాంప్రతం వక్తుముక్తే ముసలపాణినా**' (మాఘే 2/70) సమ్+ప్రతి ఇతి ఉపసర్గద్వయసముదాయోఽయం స్వభావాదధునేత్యర్థే వర్తతే।

నఞ్ సంపర్కాత్ **అసంప్రతి** ఇత్యపి । వర్ధమానస్తు తిష్ఠద్గుగణే పఠిత్వా అవ్యయీభావ–సమాసేన అవ్యయత్వమాహ ।

**సమ్యక్** ఇత్యర్థోఽపి వేదే దృష్టః । యథా –

"**ఆత్మానమేవేవం వైశ్వానరం సంప్రత్యధ్యేషి ।**" (ఛాందోగ్య 5–11–6) ఆర్జవార్థకోఽపి క్వచిత్ । – అవ్యయకోశః 361/62

**అవికల్పసున్దరి :** '**ప్రస్ఫురద్భిరిహపశ్య సుందరి ।**' అని **పాఠాన్తరం**. కానీ అవిక్పసుందరి అనటంలో కాళీదాసీయశైలి కనిపిస్తుంది. అభిజ్ఞానశాకున్తలంలో కూడా శకున్తలా సౌందర్యాన్ని వర్ణిస్తూ...

**శ్లో॥ ఇదం కిలావ్యాజమనోహరం వపుస్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి ।**
**ధ్రువం స నీలోత్పలపత్రధారయాసమిల్లతాం ఛేత్తుమృషిర్వ్యవస్యతి ॥**

మనోహరత్వానికి కొన్ని కారణాలూ, కొన్ని సాకులూ కూడా ఉంటాయి. ఎటువంటి వ్యాజమూ నిసర్గంగానే మనోహరంగా కనిపిస్తోంది. శకుంతల బహుకాలసాహచర్యాదులు వ్యాజాలు. ప్రకృతం పార్వతిని అవికల్పసుందరి అనటమూ అటువంటిదే. కాబట్టి ఈ పాఠమే సమంజసమూ, సముచితమూ కూడా.

**ఉత్ప్రేక్ష :** చంద్రుడు తన కిరణాలతో హోరయష్టులను కొలవడానికి వచ్చినట్లున్నదని ఉత్ప్రేక్ష.

శ్లో॥ పాండ్యోయమంసార్పితలమ్బహారః – క్లప్తాంగరాగో హరిచన్దనేన ।
ఆభాతి బాలాతపరక్తసానుః – స నిర్ఝరోద్గార ఇనాద్రిరాజః ॥ *

**శ్లో॥ ఉన్నతావనతభాగవత్తయా చన్ద్రికా సతిమిరా గిరేరియమ్ ।**
**భక్తిభిర్బహువిధాభిరర్పితా భాతి భూతిరివ మత్తహస్తినః ॥** **69**

**అవ :** పర్వతాలపై చంద్రకిరణప్రసారం.

**ప.వి. :** ఉన్నత+అవనత-భాగవత్తయా చన్ద్రికా సతిమిరా గిరేః ఇయమ్ ।
భక్తిభిః బహువిధాభిః అర్పితా భాతి భూతిః+ఇవ మత్త-హస్తినః ॥

**అన్వ :** గిరేః ఉన్నతావనతభాగవత్తయా ఇయం సతిమిరా చన్ద్రికా బహువిధాభిః భక్తిభిః అర్పితా మత్తహస్తినః భూతిరివ భాతి.

**ప్ర :** గిరేః = కొండయొక్క, ఉన్నతా... తయా : ఉన్నత = ఎత్తైనవిగా, అవనత = క్రిందైనవిగా ఉన్న, భాగవత్తయా = భాగాలు కలిగి ఉండుటవలన, ఇయమ్ = ఈ, సతిమిరా = చీకటితో కూడిన, చన్ద్రికా = వెన్నెల, బహువిధాభిః = అనేకవిధాలైన, భక్తిభిః = భక్తులతో (భక్తిరేఖలతో), అర్పితా = సమర్పింపబడిన, మత్తదన్తినః = మదపుటేనుగుయొక్క, భూతిః ఇవ = విబూదివలె, భాతి = ప్రకాశిస్తోంది.

**తా :** ఈ కొండ నిమ్నోన్నతంగా ఎక్కడికక్కడ విడివిడిగా ఏర్పడినట్టుగా ఒక మదపుటేనుగులా ఉంది. దానిపై వెన్నెల ప్రసరించి కాంతిమంతమై వెన్నెల పడనిచోట చీకటిగా ఉంది. అది ఆ ఏనుగుకు బహువిధభక్తులతో సమర్పింపబడిన మదగజం విబూదిలా ఉంది.

**విభక్తులు - క్రియలు :** 1. ఉన్నతావనతభాగవత్తయా : **భాగవత్తయా** - భాగవత్తాభ్యాం - భాగవత్తాభిః; ...భాగవత్తాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 2. చన్ద్రికా : **చన్ద్రికా** - చన్ద్రికే - చన్ద్రికాః; చన్ద్రికాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 3. సతిమిరా : **సతిమిరా** - సిమిరే - సతిమిరాః; సతిమిరాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. గిరేః : **గిరేః** - గిర్యోః - గిరీణామ్; గిరిశబ్దః ఇకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 5. ఇయమ్ : **ఇయమ్** - ఇమే - ఇమాః; ఇదమ్ శబ్దః మకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 6. భక్తిభిః : భక్త్యా - భక్తిభ్యాం - **భక్తిభిః**; భక్తిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః తృతీయాబహువచనమ్; 7. బహువిధాభిః : విధయా - విధాభ్యాం - **విధాభిః**; బహువిధాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయాబహువచనమ్; 8. అర్పితా : **అర్పితా** - అర్పితే - అర్పితాః; అర్పితా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. భాతి : **భాతి** - భాతః - భాన్తి; భా దీప్తౌ ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 10. భూతిః : **భూతిః** - భూతీ - భూతయః; భూతిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 11. ఇవ - అవ్యయమ్; 12. మత్తహస్తినః : **హస్తినః** - హస్తినోః - హస్తినామ్; మత్తహస్తిన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్.

**సంధులు :** 1. గిరేః+ఇయమ్ = గిరేరియమ్ - విసర్గసంధి; 2. భక్తిభిః+బహు = భక్తిభిర్బహు - విసర్గసంధి; 3. విధాభిః+అర్పితా = విధాభిరర్పితా - విసర్గసంధి; 4. భూతిః+ఇవ = భూతిరివ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఉన్నతాః అవనతాః చ భాగాః సన్తి అస్య ఇతి, ఉన్నతావనతభాగవాన్, తస్య భావః తత్తా, తయా, ఉన్నతావనతభాగవత్తయా; 2. తిమిరేణ సహ వర్తత ఇతి, సతిమిరా; 3. బహ్వ్యః చ తాః విధాః, తాభిః, బహువిధాభిః; 4. మత్తశ్చ అసౌ హస్తీ, తస్య, మత్తహస్తినః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**భక్తిభిః :** భక్తి పదం ఇక్కడ భక్తిచేత అలదబడిన రేఖలనే అర్థాన్నిస్తుంది. గజశరీరంపై బూది రేఖలను అద్దటంలో బహువిధభక్తులనటంలో ఔచిత్యం లేదు గాబట్టి. బహువిధత్వం ఆ యా రేఖల స్వరూపానికి సంబంధించింది. శరీరం ఉన్నతావనతభాగసహితం కాబట్టి తదనుగుణంగా భక్తిరేఖలలో బహువిధత్వం.

**చన్ద్రికా :** చన్ద్రః ఆశ్రయత్వేన అస్తి అస్యాః । 'అత ఇనిఠనౌ' (5-2-115) ఇతి ఠన్। జ్యోత్స్నా ఇత్యమరః - శబ్దకల్పద్రుమః.

**ఉన్నతేషు :** ఉన్నతేషు శశినః ప్రభా స్థితా (66) శ్లోకానికి ఇది కొనసాగింపు. వెన్నెల ఉన్నత ప్రాంతాలలోనూ, చీకటి అధః ప్రదేశాలలోనూ ఉన్నదని ఆ శ్లోకంలో వర్ణించిన కవి అక్కడ గుణదోషాలతో పోలికను చెప్పటం లక్ష్యంగా పద్యాన్ని ముగించాడు. ఇక్కడ ఆ చంద్రికావ్యాప్తి ఫలస్వరూపాన్ని వర్ణిస్తూ అలా వ్యాపించిన వెన్నెల మదపుటేనుగు శరీరం మీదున్న భూతిరేఖలవలె ఉన్నదని ఉపమించినాడు. ఈ వర్ణనలో కవి తనకు గల దుర్వృత, గజవర్ణనాసక్తిని ప్రదర్శించాడు.

**ఉపమాలంకారం :** శ్లోకంలో ఉపమాలంకారం శ్రౌతి. గిరిచన్ద్రిక ఉపమేయం. మత్తగజభూతి ఉపమానం. సతిమిరిత్వం చన్ద్రికాగత ధర్మం. భక్తిమత్వం ఉపమాన గత లక్షణం. ఈ రెండింటికీ సమానత్వం వస్తు ప్రతివస్తురూపం. *

**శ్లో॥ ఏతదుచ్ఛ్వసితపీతమైన్దవం సోఢుమక్షమమివ ప్రభారసమ్ ।**
**ముక్తషట్పదవిరావమఞ్జసా భిద్యతే కుముదమా నిబన్ధనాత్ ॥ 70**

**అవ :** చంద్రకళతో కుముదవికాస వర్ణన

**ప.వి. :** ఏతద్ ఉచ్ఛ్వసితపీతమ్ ఐన్దవం సోఢుమ్ అక్షమమ్ ఇవ ప్రభా-రసమ్ ।
ముక్త-షట్పద-విరావమ్ అంజసా భిద్యతే కుముదమ్ ఆ నిబన్ధనాత్ ॥

అన్వ : ఏతత్ కుముదమ్ ముక్తషట్పదవిరావమ్ ఉచ్ఛ్వసితపీతమ్ ఐన్దవం ప్రభారసం సోఢుమ్ అక్షమమ్ ఇవ ఆ నిబన్ధనాత్ భిద్యతే.

**ప్ర :** ఏతత్ = ఈ, కుముదమ్ = కలువ, ముక్త... విరావమ్ : ముక్త = విడువబడిన, షట్పద = తుమ్మెదలయొక్క, విరావమ్ = ధ్వనికలదియై, ఉచ్ఛ్వసిత-పీతం (సత్) : ఉచ్ఛ్వసిత = వికసించుటచేత, పీతమ్ = పచ్చనివన్నె గలదై, ఐన్దవమ్ = చంద్ర సంబంధమైన, ప్రభారసమ్ = కాంతిరసాన్ని, సోఢుమ్ = భరించుటకు, అక్షమమ్ ఇవ = అసమర్థమన్నట్లుగా, ఆ నిబన్ధనాత్ = తొడిమనుండీ, ఆభిద్యతే = విచ్చుకుంటోంది.

**తా :** చన్ద్రోదయంతో కలువ వికసిస్తోంది. అది చన్ద్రప్రభారసాన్ని సహించటానికై అసమర్థమై తొడిమనుండీ కూడా వికసిస్తున్నట్టుంది. తెలవారి దానిలో చిక్కుకున్న తుమ్మెదలు కలువ విచ్చుకోవటం వల్ల బయటపడి ధ్వని చేస్తున్నాయి. కలువ విచ్చుకోవటం వలన పచ్చగా ప్రకాశిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. ఏతత్ : **ఏతత్** - ఏతే - ఏతాని; ఏతచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. ఉచ్ఛ్వసితపీతమ్ : **పీతం** - పీతౌ - పీతాన్; ఉచ్ఛ్వసితపీతశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. ఐందవమ్ : **ఐందవమ్** - ఐందవౌ - ఐందవాన్; ఐందవశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 4. సోఢుమ్ - అవ్యయమ్. షహ ధాతువుపై తుమున్ ప్రత్యయం; 5. అక్షమమ్ : **అక్షమమ్** - అక్షమే - అక్షమాణి; అక్షమశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. ఇవ - అవ్యయమ్; 7. ప్రభారసమ్ : **రసం** - రసౌ - రసాన్; రసశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 8. ముక్తషట్పదవిరావమ్ : **విరావం** - విరావే - విరావాని; ముక్తషట్పదవిరావ శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 9. అమ్భసామ్ : అమ్భసః - అమ్భసోః - **అమ్భసామ్**; అమ్భస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః షష్ఠీబహువచనమ్; 10. భిద్యతే : **భిద్యతే** - భిద్యేతే - భిద్యన్తే; భిదిర్ విదారణే ధాతోః కర్మణి లటి ప్రథమపురుషైకవచనమ్; 11. కుముదమ్ : **కుముదం** - కుముదే - కుముదాని; కుముదశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 12. ఆ(జ్) - అవ్యయమ్; 13. నిబన్ధనాత్ : **నిబన్ధనాత్** -నిబన్ధనాభ్యాం - **నిబన్ధనేభ్యః**; నిబన్ధన శబ్దః అకారాన్తః నపుంసకలింగః పంచమ్యేకవచనమ్.

**సంధులు :** 1. ఏతత్+ఉచ్ఛ్వసిత = ఏతదుచ్ఛ్వసిత - జశ్త్వసంధి.

**సమాసాలు :** 1. ఉచ్ఛ్వసితేన పీతమ్, ఉచ్ఛ్వసిత పీతమ్ ; 2. ప్రభాణాం రసమ్, ప్రభారసమ్; 3. ముక్తానాం షట్పదానాం విరావః యస్మిన్ తత్, ముక్తషట్పదవిరావమ్ అథవా ముక్తః షట్పదానాం విరావః యేన తత్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**కుముదమ్ :** కౌ మోదతే ఇతి । కు+ముద్ "**ఇగుపధజ్ఞాప్రీకిరః కః**" సూత్రంతో 'క' ప్రత్యయం. కిత్తు గాబట్టి గుణాభావం.

'కుముదం పిచ్ఛిలం స్నిగ్ధం మధురం హ్లాది శీతలమ్' అని భావప్రకాశం కుముదలక్షణాలను తెలిపింది.

మేదినీకోశం దీన్ని రక్తపద్మమంటుంది.

**ముక్తషట్పదవిరావమ్ :** సాయం సంధ్యలో తామర ముడుచుకొనే వేళకు అక్కడే ఉండి రాత్రంతా చిక్కుకొని పోయిన తుమ్మెదలు ఉదయమే తమ్మి వికసించిన తరువాత పైకి ఎగరటం కవి సమయసిద్ధం. ఆ మేరకు వర్ణనలూ ఉంటాయి.

**శ్లో॥ రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం**
**భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ॥**

**శ్లో॥ ఇత్థం విచిన్తయతి కోశగతే ద్విరేఫే ।**
**హా హన్త హన్త నళినీం గజ ఉజ్జహార ॥**

అదే విధంగా కాళిదాసు కుముదవిషయంలో కూడా ఆ కవిసమయాన్నే పాటిస్తూ కుముదాలలో ఉదయవేళ తుమ్మెదలు చిక్కుకున్నట్లు, సాయం సంధ్యలో కలువ వికసించగానే అవి అరుస్తూ బయటపడినట్లు వర్ణిస్తున్నాడు. స్నిగ్ధశీతలత్వలక్షణాలు గల **కుముదవికాసాన్ని వర్ణించటం ప్రకృతరసానికి ఉద్దీపకం.**

**షట్పదః :** షట్ పదాని యస్య సః షట్పదః । షట్పదధ్వని శుభశకునం.

**శ్లో॥ యే షట్పదాద్యాశ్శకునాని తేషా – మాశ్చర్యరూపాణి నిరూపయామః ।**
**శ్రయేత వామో యది మంజు గుంజన్ – పశ్యేత వా వామదిశం ప్రసర్పన్ ॥**

**శ్లో॥ ఆస్వాదయేద్వా కుసుమం ప్రశస్తం – భృంగస్తదా స్యాత్ సుమహాన్ ప్రమోదః।**
**అత్రాపరే సన్తి చ షట్పదా యే – యాత్రాసు వైవామగతాః ప్రశస్తాః ॥**

– వసంతరాజశాకునమ్.

**ఆ భిద్యతే :** 'భిద్యతే కుముదమా నిబన్ధనాత్ ' అన్నది శ్లోకపాదం. ఇక్కడ 'ఆనిబన్ధనాత్' (తొడిమనుండి) భిద్యతే అని ఒక అన్వయం. నిబన్ధనాత్ ఆ భిద్యతే అని మరొక అన్వయం.

ఆ భిద్యతే అని అన్వయించినపుడు ఆ ఉపసర్గ. ప్రాదులలో ఒకటి. అయితే ఉపసర్గకూ, ధాతువునకూ మధ్య మరోపదం ఉండవచ్చునా అన్నది ప్రశ్న. కాబట్టి ఇది

ఉపసర్గ కాదు. ఆ నిబన్ధనాత్ అని కాని నిబన్ధనాత్ ఆ భిద్యతే అని అన్వయించవలసినదే. అప్పుడది అవ్యయమవుతుంది. మర్యాదార్థంలో దాని ప్రయోగం. "**ఆఙ్ మర్యాదా వచనే**" (1-4-89) అని ఆఙ్ కర్మప్రవచనీయమవుతుంది 'ఆఙ్ మర్యాదా భివిధ్యోః' అని వికల్పంగా సమాసం చేస్తే **ఆ నిబన్ధనమ్**. సమసింపజేయకపోతే **ఆ నిబన్ధనాత్**.

**అలంకారం :** 'అత్ర పారతద్రవపాయినా పశ్చాత్సోఢుమశక్తేన ఉత్క్రోశతా భిన్నశరీరేణ **సామ్యం** ప్రతీయతే' అని ప్రకాశికా వ్యాఖ్య.

"అత్ర కుముదస్య పీతపారతద్రవేణ పశ్చాత్ తద్వీర్యం సోఢుమశక్తేన భిన్నసర్వాంగేణ క్రందతా పురుషేణ సామ్యం ప్రతీయత ఇతి **సమాసోక్తిః**" అని వివరణవ్యాఖ్య. ఇక్కడ ధ్వనించేది సామ్యమే. కానీ ప్రకాశికసమాసోక్తిని నామ్నా నిర్దేశించలేదు. *

**శ్లో॥ పశ్య కల్పతరులమ్బి శుద్ధయా జ్యోత్స్నయా జనితరూపసంశయమ్ ।**
**మారుతే చలతి చణ్డి! కేవలం వ్యజ్యతే విపరివృత్తమంశుకమ్ ॥ 71**

**అవ :** కల్పతరువులపైని వెన్నెల వెలుగులను వర్ణించటం.

**ప.వి. :** పశ్య కల్ప-తరు-లమ్బి శుద్ధయా జ్యోత్స్నయా జనిత-రూప-సంశయమ్ ।
మారుతే చలతి చణ్డి! కేవలం వ్యజ్యతే విపరివృత్తమ్ అంశుకమ్ ॥

**అన్వ :** చణ్డి! కల్పతరులమ్బి శుద్ధయా జ్యోత్స్నయా జనితరూపసంశయమ్ అంశుకం మారుతే చలతి విపరివృత్తం కేవలం వ్యజ్యతే పశ్య.

**ప్ర :** చణ్డి! = కోపనశీలా!, కల్పతరు-లమ్బి : కల్పతరు = కల్పవృక్షమందు, లమ్బి = వ్రేలాడుతున్నదీ, శుద్ధయా = నిర్మలమైన, జ్యోత్స్నయా = వెన్నెలతో, జనిత.. సంశయమ్ : జనిత = కల్గింపబడిన, రూప = రూపవిషయకమైన, సంశయమ్ = సందియం గలదీ అయిన, అంశుకమ్ = వస్త్రం/ పల్లవం, మారుతే = గాలి, చలతి = కదలుతుండగా, విపరివృత్తం కేవలమ్ = మడతబడియే / వెనుదిరిగియే, వ్యజ్యతే = కనిపిస్తోంది, పశ్య = చూడు.

**తా :** కోపనస్వభావా! పార్వతి ! రూపవిషయంలో సంశయాన్ని కలిగిస్తూ కల్పవృక్షానికి వ్రేలాడుతున్న అంశుకం గాలికి కదలి మడతపడి కనిపిస్తోంది చూడు.

**విభక్తులు - క్రియలు :** 1. పశ్య : **పశ్య**/పశ్యతాత్ - పశ్యతమ్ - పశ్యత; దృశిర్ ప్రేక్షణే ధాతోః లోటి మధ్యమపురుషైకవచనమ్; 2. కల్పతరులమ్బి: **లమ్బి** - లమ్బినీ - లమ్బీని; కల్పతరులమ్బిశబ్దః నకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 3. శుద్ధయా : **శుద్ధయా** - శుద్ధాభ్యాం - శుద్ధాభిః; శుద్ధాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్;

4. జ్యోత్స్నయా : **జ్యోత్స్నయా** - జ్యోత్స్నాభ్యాం - జ్యోత్స్నాభిః; జ్యోత్స్నాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 5. జనితరూపసంశయమ్ : **సంశయం** - సంశయే - సంశయాని; జనితరూపసంశయశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 6. మారుతే : **మారుతే** - మారుతయోః - ...మారుతేషు; మారుతశబ్దః అకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 7. చలతి : **చలతి** - చలతోః - చలత్సు; చలత్ శబ్దః తకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 8. చణ్డి! : **చండి!** - చండ్యౌ! - చండ్యః!; చణ్డీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధనప్రథమైకవచనమ్; 9. కేవలమ్ - అవ్యయమ్; 10. వ్యజ్యతే : **వ్యజ్యతే** - వ్యజ్యేతే - వ్యజ్యన్తే; వి పూర్వకాత్ అఞ్జ్ ధాతోః కర్మణి లటి ప్రథమపురుషైకవచనమ్; 11. విపరివృత్తమ్ : **విపరివృత్తమ్** - విపరివృత్తే - విపరివృత్తాని; విపరివృత్త శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమపురుషైకవచనమ్; 12. అంశుకమ్ : **అంశుకమ్** - అంశుకే - అంశుకాని; అంశుకశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. కల్పతరౌ లమ్బితుం శీలమ్ అస్య ఇతి, కృదన్తలమ్బి (ణిని ప్రత్యయాంతం); 2. జనితః రూపే సంశయః యస్య తత్తథా, జనిత రూపసంశయమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**జ్యోత్స్నా :** జ్యోతిరస్తి అస్యామ్ ఇతి "జ్యోత్స్నాతమిస్రాశృంగిణోజస్విన్నూర్జస్వలగో-మిన్మలినమలీమసాః" సూత్రంతో మత్వర్థనిపాతనం జ్యోతిశబ్దంమీద జ్యోత్స్నా రూపం.

**కేవలమ్ :** కే వృ(సేవనే) + వృషాదిత్వాత్ కలచ్। యద్వా కే (శిరసి - మూర్ధ్వావచ్ఛేదే వలయతి) వల్+అచ్- (అలుక్ సమాసః). **నిర్ణీత**మితి అమరమేదినీకారౌ. జ్ఞానభేదః ఇతి విశ్వః, హేమచన్ద్రశ్చ. సాంఖ్యకారికాయాం యథా -

"అవిపర్యయాత్ విశుద్ధం కేవలముత్పద్యతే జ్ఞానమ్"। **శుద్ధమ్** ఇతి రఘువంశే - 'స కేవలానాం పయసాం (2/63) - శబ్దకల్పద్రుమః.

**పరికరాంకురాలంకారం :** చణ్డి! అని పార్వతి సంబోధనం ఇక్కడ సాభిప్రాయం. '**తవాంశుక పరివర్తనే పరికుప్యసీతి ద్యోతనాయ చణ్డీతి పదమ్**' (ప్రకాశికావ్యాఖ్య). "అత్ర చణ్డీతి సమ్బుద్ధ్యా తవాంశుకపరివర్తనే త్వం కుప్యసీతి ద్యోత్యతే' (వివరణవ్యాఖ్య)। ఆ రీతిగా అది సాభిప్రాయవిశేష్యం కాబట్టి అది పరికరాంకురాలంకారం. 'సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః' అని **పరికరాంకురలక్షణం.**

**నిశ్చయాంత సంశయాలంకారం :** కల్పవృక్షాలపై వ్రేలాడుతున్న వెన్నెల వెన్నెలా? వస్త్రమా అనే సంశయాన్ని కలిగిస్తోంది. అయితే అది ఉత్తరక్షణంలో గాలివాటంవలన తొలగి

పోతోంది. గాలి వీచగానే వస్త్రస్థానీయాలయిన పల్లవాలు కదులుతున్నాయి. వెన్నెల కదలటం లేదు కాబట్టి వెన్నెలే వెన్నెల అనీ. పల్లవాలు పల్లవాలనీ తెలుస్తోంది కాబట్టి ఇది నిశ్చయాంతసందేహాలంకారం.

శక్తిభద్రుని **ఆశ్చర్యచూడామణి** నాటకంలో షష్ఠాంకంలో హనూమంతుడు అశోకవనంలో శింశుపాతరువును అన్వేషిస్తూ పలికిన మాటల్లో కల్పతరువుల పల్లవాలనే అంశుకాలుగా వర్ణించిన ఈ క్రింది శ్లోకాన్ని వివరణవ్యాఖ్య ప్రదర్శించింది-

**శ్లో॥ ఏషాం పల్లవమంశుకాని కుసుమం ముక్తాః ఫలం విద్రుమం**
**వైదూర్యం దలమంకురో మరకతం హైమం చ శాఖాశతమ్ ।**
**ఏతే కే జగతీరుహా వనజుషాప్యజ్ఞాతపూర్వా మయా**
**ప్రాయస్సారమమీ దివో విటపినః కిం తైర్మమాన్యో భరః ॥** *

**శ్లో॥ శక్యమఙ్గులిభిరుద్ధృతైరధశ్శాఖినాం పతితపుష్పపేశలైః ।**
**పత్రజర్జరశశిప్రభాలవైరేభిరుత్కచయితుం తవాలకమ్ ॥** **72**

**అవ :** చంద్రకిరణప్రసారవర్ణన.

**ప.వి. :** శక్యమ్ అంగులిభిః ఉద్ధృతైః అధః శాఖినాం పతిత-పుణ్యపేశలైః ।
పత్ర-జర్జర-శశి-ప్రభా-లవైః ఏభిః ఉత్కచయితుం తవ అలకమ్ ॥

**ప్ర :** శాఖినామ్ = చెట్లయొక్క, అధః = క్రిందుగా, అంగులిభిః = వేళ్ళతో, ఉద్ధృతైః = పైకెత్తబడినదీ, పత్ర... లవైః : పత్ర = ఆకులపై, జర్జర = శిథిలమైన, శశి-ప్రభా = చంద్రకాంతులయొక్క, లవైః = స్వల్పభాగాలు గలవీ, పతిత... పేశలైః : పతిత = పడిపోయిన, పుణ్య = పుణ్యాలయొక్క, లేశైః = అందమైనవీ అయిన, ఏభిః = ఈ కరాలతో (చేతులు కిరణాలు), తవ = నీయొక్క, అలకమ్ = ముంగురులను, ఉత్-కచయితుమ్ = ముడివేయుటకు, శక్యమ్ = సాధ్యమే.

**తా :** పార్వతి! ఈ చెట్ల క్రిందరాలిన ఆకులను వ్రేళ్ళతో పైకెత్తి ఆ కరాలతో నీ ముంగురలను ముడివేయవచ్చు. ఆ కరములు ఆకులపై శిథిలమైన వెన్నెలల కాంతులు గలవి. పడిపోయిన పవిత్రసౌందర్యం గలవీ కూడా.

**విభక్తులు - క్రియలు :** 1. శక్యమ్ : **శక్యం** - శక్యే - శక్యాని; శక్యశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. అంగులిభిః : అంగుల్యా - అంగులిభ్యామ్ - **అంగులిభిః**; అంగులిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః తృతీయాబహువచనమ్; 3. అధః - అవ్యయమ్; 4. శాఖినామ్ : శాఖినః - శాఖినోః - **శాఖినామ్**; శాఖిన్ శబ్దః నకారాన్తః

పుంలింగః షష్ఠీబహువచనమ్; 5. పతితపుణ్యపేశలైః : పేశలేన – పేశలాభ్యాం – **పేశలైః**; పతితపుణ్యపేశల శబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 6. పత్రజర్జరశశిప్రభాలవైః : లవేన – లవాభ్యాం – **లవైః**; పత్ర జర్జరశశిప్రభాలవశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 7. ఏభిః : అనేన – ఆభ్యామ్ – **ఏభిః**; ఇదం శబ్దః మకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 8. ఉత్కచయితుమ్ – అవ్యయమ్; 9. తవ : **తవ**/తే – యువయోః/వామ్ – యుష్మాకం/వః; యుష్మత్‌శబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్.

**సంధులు :** 1. అంగుళిభిః+ఉద్ధృతైః = అంగుళిభిరుద్ధృతైః – విసర్గసంధి; 2. ఉద్ధృతైః + అధః = ఉద్ధృతైరధః – విసర్గసంధి; 3. లవైః+ఏభిః = లవైరేభిః – విసర్గసంధి; 4. ఏభిః+ఉత్కచయితుమ్ = ఏభిరుత్కచయితుమ్ – విసర్గసంధి; 5. తవ+అలకమ్ = తవాలకమ్ – సవర్ణదీర్ఘసంధి.

**సమాసాలు :** 1. పతితాని చ తాని పుష్పాణి । తద్వత్ పేశలాః, తైః, పతితపుణ్యపేశలైః; 2. పత్రైః జర్జరాః శశినః ప్రభాణామ్ లవాః, తైః, పత్రజర్జరశశిప్రభాలవైః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

62వ పద్యంలో ("శక్యమంగుళిభిః...") చంద్రకిరణాలు కర్ణపూరరచనాయోగ్యాలని వర్ణించాడు. ఇక్కడ అదే విధమైన ఔపచారికతతో చంద్రప్రభలతో పార్వతి కొప్పుముడి వేయవచ్చని ప్రకటిస్తున్నాడు కవి. శక్యపదప్రయోగంలోని వైశిష్ట్యాన్ని కూడా ఆ శ్లోకం దగ్గర చెప్పినట్లే స్వీకరించాలి.

ఇక్కడ శ్లోకం ద్వారా నాయకునిలోని అనుకూలనాయకత్వం, నాయికలోని స్వాధీనపతికాత్వం వ్యక్తమవుతాయి. వివాహం తర్వాత గడిచిన సమయం తక్కువే అయినా వారిరువురూ సాధారణదంపతులు కాకపోవటం ఆ అన్యోన్యతా హేతువు. వారిరువురూ పరస్పర తపస్సంపత్ఫలాయితపరస్పరులు. వాగార్థాలవలె అవిభాజ్యశరీరులు. ఆ అంతఃప్రేరణ ఆ అన్యోన్యతకు మూలకారణమవుతుంది.

ఆ ఇరువురి తొలి స్పందనలలోనే కాళిదాసు ఆ అమరికను వ్యక్తపరచాడు మదనుని బాణాలకు చలించిన శివుని తొలి కదలికలో...

**శ్లో॥ హరస్తు కించిత్పరివృత్తధైర్య – శ్చన్ద్రోదయారమ్భ ఇవాంబురాశిః ।**
**ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే – వ్యాపారయమాస విలోచనాని ॥**

చన్ద్రోదయారంభంలో సాగరుడిలాగా పరమశివుడు పొంగినట్లు వర్ణించాడు. **ఆ**

**బంధం చిరస్థాయి. అవిభాజ్యం**. దానినే ధ్వనింపజేశాడు. అలాగే పార్వతికూడా కపటవటువు పరమేశ్వరుడుగా కనబడిన క్షణంలో...

**శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీం సరసాఙ్గయష్టిర్నిక్షేప ఏవ పటముద్ధృతముద్వహన్తీ ।**
**మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ ॥**

పార్వతి కొండ ఎదురువచ్చిన నదిలాగా అక్కడనుండి కదలలేకపోయిందీ, అక్కడే నిలువలేకపోయింది - అని పార్వతిలోని శివానురక్తిని(అవిభాజనీయభావాన్ని) ప్రకటించాడు. శివపార్వతుల ఆ అన్యోన్యతయే ప్రకృతశ్లోకంలో వారిని అనుకూలస్వాధీన-పతికలను చేసింది.

*

**శ్లో॥ ఏష తారముఖి! యోగతారయా యుజ్యతే తరలబిమ్బయా శశీ ।**
**సాధ్వసాదుపగతప్రకమ్పయా కన్యయేవ నవదీక్షయా వరః ॥ 73**

**అవ :** చంద్రవర్ణన.

**ప.వి. :** ఏషః తార-ముఖి! యోగ-తారయా యుజ్యతే తరల-బిమ్బయా శశీ ।
సాధ్వసాద్ ఉపగత-ప్రకమ్పయా కన్యయా ఇవ నవదీక్షయా వరః ॥

**అన్వ :** తారముఖి! ఏషః శశీ సాధ్వసాత్ ఉపగత-ప్రకమ్పయా నవ-దీక్షయా కన్యయా వరః ఇవ తరల-బిమ్బయా యోగ-తారయా యుజ్యతే.

**ప్ర :** తారముఖి! : తార = ప్రకాశవంతమైన, ముఖి! = మోముగలదానా!, ఏషః =ఈ, శశీ = చంద్రుడు, సాధ్వసాత్ = సిగ్గువలన, ఉపగతప్రకమ్పయా : ఉపగత = పొందబడిన, ప్రకమ్పయా = వణకుగలదీ, నవ-దీక్షయా = నూతన (వైవాహిక) దీక్ష గలదీ అయిన, కన్యయా = వధువుచే, వరః ఇవ = వరునివలె, తరలబిమ్బయా : తరల = చంచలమైన, బిమ్బయా = మండలం (బింబం) గల, యోగ-తారయా = యోగతారతో, యుజ్యతే = కలుస్తున్నాడు.

**తా :** తారముఖి! పార్వతి! ఈ చంద్రుడు తరలబింబంగల తారకతో కలుస్తున్నాడు. అది సిగ్గుపడుతూ కంపిస్తున్న నవవధువుతో వరుడు కలిసినట్లుంది.

**విభక్తులు - క్రియలు :** 1. ఏషః : **ఏషః** - ఏతౌ - ఏతే; ఏతచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 2. తారముఖి! : **తారముఖి!** - తారముఖ్యౌ! - తారముఖ్యః!; తారముఖీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధనప్రథమైకవచనమ్; 3. యోగతారయా : **తారయా** - తారాభ్యాం - తారాభిః; యోగతారాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైక-వచనమ్; 4. యుజ్యతే : **యుజ్యతే** - యుజ్యేతే - యుజ్యన్తే; యుజిర్ యోగే ధాతోః

కర్మణి లటి ప్రథమపురుషైకవచనమ్; 5. తరలబిమ్బయా : **బిమ్బయా** - బిమ్బాభ్యాం - బిమ్బాభిః; తరలబిమ్బాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 6. శశీ : **శశీ** - శశినౌ - శశినః; శశిన్ శబ్దః నకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 7. సాధ్వసాత్ : **సాధ్వసాత్** - సాధ్వసాభ్యాం - సాధ్వసేభ్యః; సాధ్వసశబ్దః అకారాన్తః నపుంసకలింగః పంచమ్యేకవచనమ్; 8. ఉపగతప్రకమ్పయా : **ప్రకమ్పయా** - ప్రకమ్పాభ్యాం - ప్రకమ్పాభిః; ఉపగత ప్రకమ్పాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 9. కన్యకా : **కన్యకా** - కన్యకే - కన్యకాః; కన్యకా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 10. ఇవ - అవ్యయమ్; 11. నవదీక్షయా : **దీక్షయా** - దీక్షాభ్యాం - దీక్షాభిః; నవదీక్షాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృతీయైకవచనమ్; 12. వరః : వరః - వరౌ - వరాః; వరశబ్దః ఆకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. సాధ్వసాత్+ఉపగత = సాధ్వసాదుపగత - జశ్త్వసంధి; 2. కన్యకా+ఇవ = కన్యకేవ - గుణసంధి.

**సమాసాలు :** 1. తారం ముఖం యస్యాః తస్యాః సంబుద్ధౌ తారముఖి!; 2. యోగాభ్యా తారా, తయా, యోగతారయా; 3. ఉపగతః ప్రకమ్పః యయా, తయాః, ఉపగత-ప్రకమ్పయా; 5. నవా దీక్షా యస్యాః, తయా, నవదీక్షయా.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**యోగతార :** "**యస్యాం తారాయాం చన్ద్రస్తిష్ఠతి సా యోగతారా**" (ప్రకాశికా వ్యాఖ్య). జ్యోతిషపరిగణనలో తొమ్మిది తారలుంటాయి. జన్మ, సంపత్, విపత్, క్షేమ, ప్రత్యక్; సాధన, నైధన, మిత్ర, పరమమిత్రతారలు. వీటిలో ఏ నక్షత్రంలో జన్మించిన వారికైనా చంద్రుడున్న తార సాధనతార అవుతుంది. కాబట్టి యోగతారాపదానికి సాధనతార అని అర్థం.

ఇక 27 యోగాలు విష్కంభాదులు. ఇవి నక్షత్రాలవలె వరుసగా ఏర్పడుతుంటాయి. అయితే కలియుగంలో ఈ యోగాల ప్రభావంలేదనే అభిప్రాయాన్ని కాశీఖండం చెప్తోంది.

"**శ్లో॥న సిద్ధ్యతి కలౌ యోగో న సిద్ధ్యతి కలౌ తపః ।**" - కాశీఖండం 6-32

"**శ్లో॥చంచలేంద్రియవృత్తిః స్యాత్ కలికల్మషజృమ్భణాత్ ।**

**అల్పాయుః స్యాత్తథా నృణాం క్వేహ యోగమహోదయః ॥**"- కాశీఖండం-42

**తారముఖి! :** తారముఖి! - సాభిప్రాయసంబోధనమ్. '**తారమత్యుజ్జ్వలం**' అని వివరణవ్యాఖ్య. శుద్ధమౌక్తికమని శబ్దకల్పద్రుమం, తారశబ్దంః పుంలింగమైతే.

నపుంసకలింగమైతే (తారమ్) రూప్యమని అర్థం. అది స్వర్ణమయమైనా కావచ్చు రజితాదిమయమైనా కావచ్చు. వెండి, ముత్తెం అనికూడా అర్థాలు. మౌక్తికమిక్కడ ఉజ్జ్వలత్వానికీ, నిర్మలత్వానికీ సంకేతం. **ఉత్తమతారలక్షణమ్ -**

**శ్లో॥ దగ్ధోత్తీర్ణం సుశీతం యన్నిర్మలం కుందసన్నిభమ్ ।**
**గురుస్నిగ్ధకుమారఞ్చ తారముత్తమమిష్యతే ॥**

చంద్రుడు యోగ**తార**తో కలుస్తున్నాడు అనటం ద్వారా తారముఖి అయిన పార్వతికి కూడా యోగకాలమాసన్నమైనదని ధ్వని.

**నర్మ :** నాయకవ్యాపారరూపమైన వృత్తి కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి అని నాలుగు రకాలు. కైశికి నర్మ, నర్మస్ఫింజ, సర్మస్ఫోట, నర్మగర్భరూపంగా నాలుగు విధాలు.

శ్లో॥ **వైదగ్ధ్యక్రీడితం నర్మ ప్రియోపచ్ఛన్దనాత్మకమ్** । అని నర్మ లక్షణం. సశృంగారనర్మ నర్మభేదాలయిన మూడింటిలో ఒకటి. శృంగారనర్మ కూడా మూడు విధాలు. వాటిలో సంభోగేచ్ఛా ప్రకాశనరూపమైన భేదమొకటి.

ప్రకృతశ్లోకంలో పరమేశ్వరుడు స్వీయసంభోగేచ్ఛను ప్రకటిస్తున్నాడు. వాగ్వ్యవహారంతో కాక తారాచన్ద్రసంయోగాన్ని సూచిస్తూ ధ్వనిరూపంగా. కాబట్టి ఇది నర్మ. ఇది వాగ్రూపం.

**ఉపమాలంకారం :** నవదీక్షిత అయిన కన్యతో వరుడు కలిసినట్లు తరలబింబ అయిన యోగతారతో శశి కలుస్తున్నాడని పోలిక. ఇక్కడ శశికీ, వరునికీ, యోగతారకూ, పార్వతికీ, తరలలంబితత్వానికీ, ఉపగతప్రకమ్పతకూ బింబప్రతిబింబభావంతో ఔపమ్యం. "**వస్తుతః భిన్నయోరపి పరస్పరసాదృశ్యాత్ అభిన్నయోః ఉపమానోపమేయయోః పృథగుపాదానం బింబ ప్రతిబింబభావః**" *

**శ్లో॥ పాకభిన్నశరకాణ్డగౌరయోరుల్లసత్ప్రతికృతిప్రసన్నయోః ।**
**రోహతీవ తవ గణ్డలేఖయోశ్చన్ద్రబిమ్బనిహితాక్షి! చన్ద్రికా ॥** **74**

**అవ :** చన్ద్రవర్ణనోపసంహారం.

**ప.వి. :** పాక-భిన్న-శర-కాణ్డ-గౌరయోః ఉల్లసత్-ప్రతికృతి-ప్రసన్నయోః ।
రోహతి+ఇవ తవ గణ్డ-లేఖయోః చన్ద్ర-బిమ్బ-నిహిత+అక్షి! చన్ద్రికా ॥

**అన్వ :** చన్ద్రబిమ్బనిహితాక్షి! పాకభిన్నశరకాణ్డగౌరయోః ఉల్లసత్ప్రతికృతిప్రసన్నయోః తవ గణ్డలేఖయోః చన్ద్రికా రోహతీవ.

**ప్ర :** చన్ద్ర... తాక్షి : చన్ద్ర = చంద్రునియొక్క, బిమ్బ = మండలంపై, నిహిత =

నిలుపబడిన, అక్షి! = కన్నులు గలదానా!, పాక... గౌరయోః : పాక = పండుటచేత, భిన్న = బ్రద్దలైన, శర = రెల్లుయొక్క, కాణ్డ = దుబ్బువలె, గౌరయోః = తెల్లనై, ఉల్లస... సన్నయోః : ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, ప్రతికృతి = ప్రతిబింబంతో, ప్రసన్నయోః = ప్రసన్నాలైన, తవ = నీయొక్క, గణ్డలేఖయోః = చెక్కిలిపొరలపై, చన్ద్రికా = వెన్నెల, రోహతి ఇవ = పొడుచుచున్నట్లున్నది.

**తా :** పార్వతి! చంద్రబింబంవైపే దృష్టిపెట్టి ఉన్నావు. నీ చెక్కిళ్ళు పక్వానికి వచ్చి బ్రద్దలైన రెల్లు బ్రద్దలవలె తెల్లగా ఉన్నాయి. ప్రతిబింబాలతో ప్రకాశిస్తూ ప్రసన్నంగా ఉన్నాయి. ఆ చెక్కిళ్ళపై చంద్రిక పొడిచినట్లుంది.

**విభక్తులు - క్రియలు :** 1. పాక... గౌరయోః : గౌరాయాః - **గౌరయోః** - గౌరాణామ్; పాకభిన్నశరకాణ్డగౌరాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః షష్ఠీద్వివచనమ్; 2. ఉల్లసత్ప్రతికృతి-ప్రసన్నయోః : ప్రసన్నాయాః - **ప్రసన్నయోః** - ప్రసన్నానామ్; ప్రసన్నాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః షష్ఠీద్వివచనమ్; 3. రోహతి : **రోహతి** - రోహతః - రోహన్తి; రుహ ప్రాదుర్భావే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్; 4. ఇవ - అవ్యయమ్; 5. తవ : **తవ**/తే - యువయోః/వామ్ - యుష్మాకం/వః - యుష్మచ్ఛబ్దః; దకారాన్తః షష్ఠ్యేకవచనమ్; 5. గణ్డరేఖయోః : రేఖాయాః - **రేఖయోః** - రేఖానామ్; గణ్డరేఖాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః షష్ఠీద్వివచనమ్; 6. చంద్రబిమ్బనిహితాక్షి! : **నిహితాక్షి!** - నిహితాక్ష్యౌ! - నిహితాక్ష్యః!; నిహితాక్షీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః సంబోధన ప్రథమైకవచనమ్; 7. చన్ద్రికా : **చన్ద్రికా** - చన్ద్రికే - చన్ద్రికాః; చన్ద్రికాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. గౌరయోః+ఉల్లసత్ = గౌరయోరుల్లసత్ - విసర్గసంధి; 2. రోహతి+ఇవ = రోహతీవ - సవర్ణదీర్ఘసంధి; 3. రేఖయోః+చన్ద్ర = రేఖయోశ్చన్ద్ర - విసర్గసంధి.

**సమాసాలు :** 1. పాకేన విభిన్నం చ తత్ శరకాండ, తద్వత్ గౌరే, తయోః, పాకభిన్నశరకాణ్డగౌరయోః; 2. ఉల్లసన్త్యా ప్రతికృత్యా ప్రపన్నే, తయోః, ఉల్లసత్ప్రతికృతి-ప్రపన్నయోః; 3. గణ్డయో రేఖే, తయోః, గణ్డరేఖయోః; 4. చన్ద్రస్య బిమ్బే, నిహితే అక్షిణీ యయా సా తస్యాః సంబుద్ధౌ, చన్ద్రబిమ్బనిహితాక్షి.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శరమ్ :** జలమితి మేదినీ । బాణ ఇత్యమరః । దధ్యగ్రభాగ ఇతి మేదినీ । దుగ్ధశరస్య నామాన్తరం సన్తాలికః । దధిశరస్య నామాన్తరం దధిసారః । దధిస్నేహః । **తృణవిశేషః** । యథా మహాభారతే 1-138-15

**శ్లో॥ ఆచార్యః కలశాజ్జాతో ద్రోణః శస్త్రభృతాం వరః ।**
**గౌతమస్యాన్వవాయే తు శరస్తమ్బాచ్చ గౌతమః ॥**

తృణజాతులు పరిపక్వదశలో చీలినప్పుడే తెల్లని తెల్లదనాన్ని పొందుతాయి. అంతటి తెల్లదనం గల పార్వతి చెక్కిళ్ళపై చంద్రబింబం ప్రతిబింబించి చెక్కిళ్ళపై వెన్నెల పొడము తున్నట్టు కనిపించింది.

**మనోహరమైన ఉత్ప్రేక్ష ఇది.** వస్తూత్ప్రేక్ష రోహతీవ – అని ఇవ పదంతో వ్యక్త చేయబడిన ఉత్ప్రేక్ష.

చెక్కిళ్ళపై చంద్రబింబం ప్రతిబింబిచాలంటే చంద్రబింబానికెదురుగా ముఖముండాలి. అప్పుడే సాధ్యమవుతుంది. అందుకే కాళిదాసు పరమేశ్వరుని చేత 'చంద్రబింబ నిహితాక్షి' అని పార్వతిని సంబోధింపజేసినాడు. పార్వతి చూపు చంద్రబింబంపై ఉంది కాబట్టి చంద్రప్రతిబింబం ఆమె చెక్కిళ్ళపై స్థితిని పొందగలిగింది.

**భావస్పష్టత కోసం ప్రతిపదాన్నీ ఎంతో సమర్థతతో, ప్రధానభావపరిపోషకంగా, ఉపస్థితి సాఫల్యానికి అనుగుణంగా ఉపయోగించి రచించిన శ్లోకమిది.**

**కావ్యాంగాలలో ప్రకీర్ణాలుగా వామనుడు ప్రకటించిన ఆరింటిలోని అవేక్షణానికి ఈ శ్లోకం ఆదర్శప్రాయం. 'పదాధానోద్ధరణమవేక్షణమ్'**" అని **అవేక్షణ**లక్షణమ్. పదస్వీకార పరిత్యాగాలకు సంబంధించిన దృష్టి సమగ్రంగా కనిపిస్తే అవేక్షణమ్. దాన్ని **శబ్దపాక** మంటారని చెప్తూ, శబ్దపాక స్వరూపాన్ని వివరించే శ్లోకాన్ని ప్రదర్శించాడు వామనుడు–

**"శ్లో॥ యత్పదాని త్యజన్త్యే పరివృత్తి సహిష్ణుతామ్ ।**
**తం శబ్దశాస్త్రనిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే ॥**" కావ్యాలాంకారసూత్రవృత్తి–3–15

ప్రకృతశ్లోకంలో ఆశబ్ద పాకం స్ఫుటంగా కనిపిస్తుంది.

శబ్దపాకంవలె అర్థపాకం కూడా శ్లోకరచనలో కనిపిస్తుంది. దీప్తరసత్వరూపమైన కాంతి (అర్థగుణం) ప్రస్ఫుటంగా ఉంటే అర్థప్రతీతి రసస్ఫోరకంగా ఉంటుంది. సంభోగేచ్ఛా ప్రకటన రూపమైన కైశికీ వృత్త్యంగమైన నర్మ ఇక్కడ రసాన్ని దీప్తిమంతం చేసింది.

చంద్రబింబనిహితాక్షి! – అనే సంబోధనలోని పరికరాంకురాలంకారం కరణ–వ్యుత్పత్తితో అలంకారమై శృంగారరసానికి అలంకారశోభను కల్గిస్తోంది. *

**శ్లో॥ లోహితార్కమణిభాజనార్పితం కల్పవృక్షమధు బిభ్రతీ స్వయమ్ ।**
**త్వామియం స్థితిమతీముపస్థితా గన్ధమాదనవనాధిదేవతా ॥ 75**

**అవ :** మధుపానరూపమైన ఉద్దీపనవిభావవర్ణన.

**ప.వి.:**లోహిత+అర్క-మణి-భాజన-అర్పితం కల్ప-వృక్ష-మధు బిభ్రతీ స్వయమ్ ।
త్వామ్ ఇయమ్ స్థితిమతీమ్ ఉపస్థితా గన్ధ-మాదన-వన+అధిదేవతా ॥

**అన్వ :** స్థితిమతీ ఇయం గన్ధమాదనవనాధిదేవతా లోహితార్కమణి భాజనార్పితం కల్పవృక్ష మధు స్వయం బిభ్రతీ త్వామ్ ఉపస్థితా.

**ప్ర :** స్థితిమతీమ్ = మర్యాద లెరిగిన, ఇయమ్ = ఈ, గన్ధమాదన-వన+అధిదేవతా : గన్ధమాదన = గన్ధమాదనగిరిపై నున్న, వన = అడవికి, అధిదేవతా = అధిష్ఠాన-దేవత, లోహి... భాజనమ్ : లోహిత = ఎఱ్ఱని, అర్క...మణి = సూర్యకాంతమణి నిర్మితమైన, భాజన = పాత్రయందు, అర్పితమ్ = ఉంచ (నింప) బడిన, కల్పవృక్ష-మధు = కల్పతరువుయొక్క, తేనెను, స్వయమ్ = తానే, బిభ్రతీ = మోస్తూ, త్వామ్ = నిన్ను, ఉపస్థితా = సమీపించినది.

**తా :** అదిగో! గన్ధమాదనవనంయొక్క అధిష్ఠానదేవత మర్యాద తెలిసింది కాబట్టి కల్పవృక్షమధువును సూర్యకాంతమణులతో చేసిన పాత్రలో నుంచి తానే స్వయంగా మోస్తూ నిన్ను సమీపిస్తోంది.

**విభక్తులు - క్రియలు :** 1. లోహితార్కమణిభాజనార్పితమ్ : **అర్పితమ్** - అర్పితే - అర్పితాని; అర్పితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 2. కల్పవృక్షమధు : **మధు** - మధునీ - మధూని; కల్పవృక్షమధుశబ్దః ఉకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 3. బిభ్రతీ : **బిభ్రతీ** - బిభ్రతౌ - బిభ్రత్యః; బిభ్రతీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 4. స్వయమ్ - అవ్యయమ్; 5. త్వామ్ : **త్వామ్**/త్వా - యువామ్/వామ్ -యుష్మాన్/వః; యుష్మచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 6. ఇయమ్ : **ఇయమ్** - ఇమే - ఇమాః; ఇదం శబ్దః మకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 7. స్థితిమతీమ్ : **స్థితిమతీం** - స్థితిమత్యౌ - స్థితిమతీః; స్థితిమతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 8. ఉపస్థితా : **ఉపస్థితా** - ఉపస్థితే - ఉపస్థితాః; ఉపస్థితాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. గన్ధమాదనవనాధిదేవతా : **దేవతా** - దేవతే - దేవతాః; దేవతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. లోహితశ్చ అసౌ అర్కః, స ఏవ మణిభాజనం, తస్మిన్ అర్పితా, లోహితార్కమణిభాజనార్పితం; 2. కల్ప ఇతి వృక్షః, తస్య మధు, కల్పవృక్షమధు; 3. స్థితిః అస్యాః అస్తి ఇతి, తామ్, స్థితిమతీమ్ (తద్ధిత ప్రత్యయాన్తం); 4. గన్ధమాదనే (పర్వతే) వనం, తస్య అధిదేవతా, గన్ధమాదనవనాధిదేవతా.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

గన్ధమాదనవనాధిదేవత స్థితిమతి అయిన పార్వతికి కల్పవృక్షమధువును స్వయంగా అందించింది. ఆమె వైభవానికి సంకేతమని వ్యాఖ్యాతలు. “అత్ర స్వయమేవ ఉద్ధరణం ఆత్మనః కైంకర్యం చ ద్యోతయతి.. స్వప్రభావేణైవ ప్రవర్తితసకలలోకమర్యాదామిత్యర్థః। అనేన **త్రైలోక్యవాసినాం సర్వేషామపి సేవ్యత్వం దేవ్యాః ప్రతిపాదితమ్**” (వివరణవ్యాఖ్య)

ఈ వైభవాన్నే సౌందర్యలహరి ఇలా ప్రస్తుతిస్తుంది.

**శ్లో॥ శివశ్శక్త్యా యక్తో యది భవతి శక్తః ప్రభవితుం**
**న చేదేవం దేవో భవతి కుశలః స్పందితుమపి।**
**అతస్త్వామారాధ్యాం హరిహరవిరించ్యాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి॥**

“**న కంచన వస తౌ ప్రత్యాచక్షీత। తద్ వ్రతమ్**” అని తైత్తిరీయోపనిషద్వచనాన్ని వనాధిదేవత ‘అతిథిదేవోభవ’ తో మేళవించి ప్రదర్శించింది. అతిథిని దేవుడిలా చూడాలి. దేవుడే అతిథి అయితే ఉపచారభంగం అసలు జరుగకూడదనే ధ్వని. *

**శ్లో॥ ఆర్ద్రకేసరసుగన్ధి తే ముఖం రక్తమత్తనయనం స్వభావతః।**
**అత్ర లబ్ధవసతిర్గుణాన్తరం కిం విలాసిని! మదః కరిష్యతే॥ 76**

**అవ :** మధుపాన న్యూనీకరణం.

**ప.వి. :** ఆర్ద్ర-కేసర-సుగన్ధి తే ముఖం రక్త-మత్త-నయనం స్వభావతః।
అత్ర లబ్ధ-వసతిః గుణ+అన్తరం కిమ్ విలాసిని! మదః కరిష్యతి॥

**అన్వ :** విలాసిని! ఆర్ద్రకేసరసుగన్ధి తే ముఖం స్వభావతః రక్తమత్తనయనమ్. అత్ర లబ్ధవసతిః మదః గుణాన్తరం కరిష్యతి కిమ్?

**ప్ర :** విలాసిని! = విలాసవతి!, ఆర్ద్ర... సుగంధి : ఆర్ద్ర = క్రొత్తదైన (అప్పుడే వికసించిన), కేసర = పొగడపూవువలె, సుగన్ధి = పరిమళంగల, తే = నీయొక్క, ముఖమ్ = మోము, స్వభావతః = నైసర్గికంగానే, రక్త... నయనమ్ : రక్త = ఎఱ్ఱనైన, మత్త = మదించిన, నయనమ్ = కన్నులుగలది. అత్ర = ఈ మోముపై, లబ్ధ-వసతిః = తావుపొందిన, మదః = మత్తు, గుణ+అన్తరమ్ = మరోగుణాన్ని, కరిష్యతి కిమ్? = కల్గించగలదా?

**తా :** పార్వతి! విలాసిని! నీ ముఖం క్రొత్తపొగడపూలవలె పరిమళభరితం. నైసర్గికంగానే నీ కళ్ళు మత్తుతో ఎఱ్ఱగా ఉంటాయి. అటువంటి ముఖంలో స్థానాన్ని పొందిన మత్తు ఇంకా ఏ గుణాన్ని కల్గించగలదు?

**విభక్తులు – క్రియలు :** 1. ఆర్ద్రకేసరసుగన్ధి : **సుగన్ధి** – సుగన్ధినీ – సుగన్ధిని; సుగంధిన్ శబ్దః నకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. తే : తవ/**తే** – యువయోః/వామ్ – యుష్మాకమ్/వః; యుష్మచ్ఛబ్దః దకారాన్తః షష్ఠ్యేకవచనమ్; 3. ముఖమ్ : **ముఖం** – ముఖే – ముఖాని; ముఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 4. రక్తమత్తనయనమ్ : **నయనం** – నయనే – నయనాని; రక్తమత్తనయనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 5. స్వభావతః – అవ్యయమ్; 6. అత్ర – అవ్యయమ్; 7. లబ్ధవసతిః : **వసతిః** – వసతీ – వసతీన్; లబ్ధవసతి శబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 8. గుణాన్తరం – **గుణాన్తరం** – గుణాన్తరే – గుణాన్తరాణి; గుణాన్తరశబ్దః అకారాన్తః నపుంసకలింగః, ద్వితీయైకవచనమ్; 9. కిమ్ – అవ్యయమ్; 10. విలాసిని! : **విలాసిని!** – విలాసిన్యౌ! – విలాసిన్యః!; విలాసినీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః. సంబోధన–ప్రథమైకవచనమ్; 11. మదః : **మదః** – మదౌ – మదాః; మదశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 12. కరిష్యతి : **కరిష్యతి** – కరిష్యతః – కరిష్యన్తి; డుకృఞ్ కరణే ధాతోః లృటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. వసతిః+గుణ = వసతిర్గుణ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఆర్ద్రం చ తత్ కేసరం, తద్వత్ సుగంధి, ఆర్ద్రకేసరసుగంధి; 2. మత్త మత్తం చ తత్ నయనమ్, మత్తమత్తనయనమ్; 3. లబ్ధా వసతిః యస్మిన్ సః, లబ్ధవసతిః; 4. అన్యః గుణః, గుణాన్తరమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఆర్ద్రమ్ :** ఆర్ద్+రక్ దీర్ఘశ్చ – ఆర్ద్రమ్ – తచ్చ ద్వివిధం యదుక్తమ్। ఆర్ద్రం ద్రవ్యం ద్విధా ప్రోక్తం సరసం నీరసం తథా । సదుగ్ధం గుప్తరసకం ద్విధా నీరసముచ్యతే ॥ వాస్తూకం సర్షపం శాకం నిర్గుండ్యోరండమార్షకమ్ । దుస్తూరాద్యమిదం సర్వమార్ద్రం సరసముచ్యతే ॥... శబ్దకల్పద్రుమః.

సుగంధిత్వాన్నీ, మాదకత్వాన్నీ, కాళిదాసు మద్యలక్షణంగా చెప్తున్నాడు. అవి రెండూ పార్వతికి స్వాభావికాలు కాబట్టి మద్యం పార్వతిపై ప్రభావాన్ని చూపలేదని ఈశ్వర వచనం. వివరణ వ్యాఖ్య – "ముఖసౌగన్ధ్యం హి మద్యస్య ప్రథమం ఫలమ్ । ... యత్ పునః శీధుపానసమయే **నయనాదే విశేషతః విలాసప్రాదుర్భావ**రూపం ఫలం తదపి తే వదనస్య స్వభావసిద్ధమేవ."

ఈ వ్యాఖ్యను బట్టి నాటి మద్యపానం, నేటి మద్యపానం భిన్నవిషయాలుగా కనిపిస్తాయి. ప్రధానంగా ముఖసౌగన్ధ్యం దాని ఫలమనటం వలన.

**విశేషోక్తి - అతద్గుణం :** '**కార్యాజనిర్విశేషోక్తిః సతిపుష్కలకారణే**' అని విశేషోక్తి. ఇక్కడ కిం కరిష్యతి? అన్న ప్రశ్న ద్వారా కాకుస్వరం ద్వారా ఏమీ చేయలేదని అర్థస్ఫూర్తి. కాబట్టి మదమున్న మదప్రభావం ముఖంపై పడకపోవటం కార్యోత్పత్తి లేకపోవటం. కాబట్టి విశేషోక్తి. దానికి కారణం మరొకటి ఉండవచ్చు.

'**సంగతాన్యగుణానంగీకారమాహురతద్గుణమ్**' అని అతద్గుణలక్షణం. సమీపంలో వున్న అన్యవస్తుగుణాన్ని స్వీకరించకపోవటం అతద్గుణం. శ్లోకంలో పార్వతీవదనం మద్యమాదకత్వాన్ని స్వీకరించదని ధ్వనింపజేయటం ద్వారా **అతద్గుణాలంకారధ్వని** కనిపిస్తుంది.

*

**శ్లో॥ మాన్యభక్తిరథవా సఖీజనః సేవ్యతామిదమనఙ్గజీవనమ్ ।**
**ఇత్యుదారమభిధాయ శఙ్కరస్తామపాయయత పానమఙ్గనామ్ ॥ 77**

**అవ :** శివుడు పార్వతిచే మధువును త్రాగించుట.

**ప.వి. :** మాన్య-భక్తిః అథవా సఖీ-జనః సేవ్యతామ్ ఇదమ్ అనంగజీవనమ్ ।
ఇతి ఉదారమ్ అభిధాయ శంకరః తామ్ అపాయయత పానమ్ అంగనామ్॥

**అన్వ :** అథవా సఖీజనః మాన్యభక్తిః అనంగజీవనమ్ ఇదం సేవ్యతామ్. ఇతి శంకరః ఉదారమ్ అభిధాయ తామ్ అంగనాం పానమ్ అపాయయత.

**ప్ర :** అథవా = అయినా (కాకపోతే), సఖీజనః = నెచ్చెలులు (వనదేవత వంటివారు), మాన్య-భక్తిః = మన్నింపదగిన భక్తి భావన గలవారు (కాబట్టి), అనంగ-జీవనమ్ = మదనుని ఉద్దీపింపజేయగల, ఇదమ్ = ఈ మధువు, సేవ్యతామ్ = సేవింపబడు గాక, ఇతి = అని, శంకరః = పరమేశ్వరుడు, ఉదారమ్ = పెద్దమనస్సుతో, తామ్ = ఆ, అంగనామ్ = పార్వతిచే, పానమ్ = పానీయాన్ని, అపాయయత = త్రాగించాడు.

**తా :** అయినా పార్వతి! వనదేవతల వంటి ఆప్తమిత్రుల భక్తిభావాన్ని మన్నించాలి. అందుకోసమైనా ఈ మధువును సేవించాలి అని శివుడు పెద్దమనస్సుతో పార్వతిచే ఆ మధువును త్రాగించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. మాన్యభక్తిః : **భక్తిః** - భక్తీ - భక్తయః; మాన్యభక్తిశబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 2. అథవా - అవ్యయమ్; 3. సఖీజనః : **జనః** - జనౌ - జనాః; సఖీజనశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. సేవ్యతామ్ : **సేవ్యతాం** - సేవ్యేతాం - సేవ్యన్తామ్; షేవృ సేవనే ధాతోః కర్మణి లోటి ప్రథమపురుషైకవచనమ్; 5. ఇదమ్ : **ఇదమ్** - ఇమే - ఇమాని; ఇదం శబ్దః మకారాన్తః

నపుంసకలింగః. ప్రథమైకవచనమ్; 6. అనంగజీవనమ్ : **జీవనం** – జీవనే – జీవనాని; అనంగజీవనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. ఇతి – అవ్యయమ్; 8. ఉదారమ్ – అవ్యయమ్; 9. అభిధాయ – అవ్యయమ్; 10. శంకరః : **శంకరః** – శంకరౌ – శంకరాః; శంకరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 11. తామ్ : **తామ్** – తే – తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 12. అపాయయత : **అపాయయత** – అపాయయేతామ్ – అపాయయన్త; పాపానే ధాతోః ప్రేరణే లటి ప్రథమపురుషైకవచనమ్; 13. పానమ్ : **పానం** – పానే – పానాని; పానశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 14. అంగనామ్ : **అంగనామ్** – అంగనే – అంగనాః; అంగనాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్.

**సంధులు :** 1. భక్తిః+అథవా = భక్తిరథవా – విసర్గసంధి; 2. ఇతి+ఉదారమ్ = ఇత్యుదారమ్ – యణాదేశసంధి; 3. శంకరః + తామ్ = శంకరస్తామ్ – విసర్గసంధి.

**సమాసాలు :** 1. మాన్యా భక్తిః యస్మిన్ సః, మాన్యభక్తిః; 2. సఖీ చ అయం జనః, సఖీజనః; 3. అనంగస్య దీపనమ్, అనంగదీపనమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

'**తామ్ పానమ్ అపాయయత**' అన్నది ప్రధానవాక్యం. త్రాగించింది కల్పవృక్ష మధువును. అది తేనె కావచ్చు. అయితే మదః కిం కరిష్యతి' అన్న పదం కల్పవృక్ష–మధువు అనటాన్ని ప్రతిబంధించవచ్చు. మధువుకు (తేనె) మాదనసామర్థ్యం ఉండదు కాబట్టి.

ఈ మధుపానం ఆధునికంగా తీవ్రమైన చర్చలకూ, ఆపరాని అలవాటుకూ లోనైన అంశం. దీని పూర్వస్థితిని గమనిస్తే సోమపానంతో ఇది ప్రారంభమైనదనవచ్చునేమో! అంతకు ముందు స్థితి మనమెరుగం కాబట్టి.

ఋగ్వేదం దశమమండలంలోని 119వ సూక్తం – సోమసూక్తంగా వ్యవహరింప బడుతుంది. – ఒక ఏకపాత్రాభినయం వంటిది. ఇంద్రుడు సోమరసాన్ని అమితంగా త్రాగి మాటాడే సూక్తమది.

అప్పటి మధుపానప్రవృత్తికీ, ఇప్పటి ప్రవృత్తికీ మధ్య తేడా ఉండవచ్చు. స్వరూపంలో మార్పు ఉండి ఉండవచ్చు. గన్ధమాదనవనదేవతలు దానిని స్వాగతం తోనే అందిచ్చారంటే అది ఒక మర్యాదగా ఉండవచ్చు ఆనాడు. అయితే పరమేశ్వరుడు పార్వతికి ఆ పానాన్ని అందిచ్చి సఖీజనుల కోరికను మన్నించాలి' అంటూ ఒత్తిడి చేయటం భక్తిభావుకులకు నచ్చే అవకాశం లేదు. కావ్యపాఠకులు కావ్యమాత్రంగా భావించగలిగితే తప్ప అంగీకరించ లేరు.

మహాకావ్యలక్షణాలైన అష్టాదశవర్ణనలలో మధుపాన మొకటి.

శ్లో॥ నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్ ।
ఉద్యానసలిలక్రీడా**మధుపాన**రతోత్సవాః ॥

శ్లో॥ విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్ ।
ఏతాని యత్ర వర్ణ్యన్తే త**న్మహాకావ్య**ముచ్యతే ॥

ఈ సర్గలోనే సూర్యాస్తమయ, చంద్రోదయ, ఉద్యాన, సలిలక్రీడా, మధుపాన, రతోత్సవాలను కాళిదాసు వర్ణించి చూపాడు. ఈ అష్టాదశవర్ణనలూ నియతాలు కాకున్నా కావ్యానికి, యథావకాశంగా వాటిని వర్ణించటం లేదా – తదనుకూలసన్నివేశాలను కల్పించటం మహాకవి సంప్రదాయం.

శృంగారరసానికి ఉద్దీపకవిభావాలను వర్ణించటంలో ఈ సర్గలో కృతకృత్యత కనిపిస్తుంది. తృతీయసర్గలో రాగోదయానికి అనుకూలంగా ఉద్దీపనాలను వర్ణించి మనస్సులను రంజింపజేసిన కవి ఇక్కడ సంభోగశృంగారానికి తిర్యగ్గతంగా రసవర్ణన ద్వారా రసాభాసనూ అద్భుతంగా వినియోగించి చూపాడు. *

**శ్లో॥ పార్వతీ తదుపయోగసమ్భవాం విక్రియామపి సతాం మనోహరామ్ ।**
**అప్రతర్క్యవినియోగనిర్మితామామ్రతేవ సహకారతాం యయౌ ॥ 78**

**అవ :** పార్వతి పరమేశ్వరునకు సహకర్త్రి అగుట.

**ప.వి. :** పార్వతీ తద్–ఉపయోగ–సమ్భవా విక్రియామ్ అపి సతీం మనః – హరామ్।
అప్రతర్క్య–వినియోగ–నిర్మితామ్ ఆమ్రతా+ఇవ సహకారతాం యయౌ॥

**అన్వ :** పార్వతీ తదుపయోగసమ్భవాం విక్రియాం సతీమపి మనోహరామ్. అప్రతర్క్య వినియోగనిర్మితామ్ సహకారతామ్ ఆమ్రతా ఇవ యయౌ

**ప్ర :** పార్వతీ = హైమవతి, తదు... సమ్భవామ్ : తద్ = దాని (ఆ మధువు) యొక్క, ఉపయోగ = వినియోగంవలన, సమ్భవామ్ = పుట్టినదీ, విక్రియామ్ = వికారంగా, సతీమ్ = ఉన్నప్పటికీ, మనోహరామ్ = మనస్సును హరించేదీ అయిన ఆ వికారాన్ని, అప్రతర్క్య... సమ్భవామ్ : అప్రతర్క్య = ఊహించని ఫలంగల, వినియోగ = వాడుకచే, సమ్భవామ్ = పుట్టినట్టి, సహకారతామ్ = సహకారత్వాన్ని (ఆమ్రత్వాన్నీ, సహకారాన్నీ), ఆమ్రతా ఇవ = మావివలె, యయౌ = పొందినది.

**తా :** ఆ మధువును వినియోగించటంవలన ఆమెలో మనోహరమైన వికారం కలిగింది. అది ఆమ్రత్వం ఊహించని ఫలితంగా సహకారత్వాన్ని పొందినట్లు కనిపించింది.

**విభక్తులు – క్రియలు :** 1. పార్వతీ : **పార్వతీ** – పార్వత్యౌ – పార్వత్యః; పార్వతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 2. తదుపయోగసమ్భవామ్ : **సమ్భవాం** – సమ్భవే – సమ్భవాః; తదుపయోగ సమ్భవాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 3. విక్రియామ్ : **విక్రియాం** – విక్రియే– విక్రియాః; విక్రియాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 4. అపి – అవ్యయమ్; 5. సతీమ్ : **సతీం** – సత్యౌ – సతీః; సతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 6. మనోహరామ్ : **మనోహరాం** – మనోహరే – మనోహరాః; మనోహరాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 7. అప్రతర్క్యవినియోగ నిర్మితామ్ : **నిర్మితాం** – నిర్మితే – నిర్మితాః; నిర్మితాశబ్దః కారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 8. ఆమ్రతా : **ఆమ్రతా** – ఆమ్రతే – ఆమ్రతాః; ఆమ్రతా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. ఇవ – అవ్యయమ్; 10. సహకారతామ్ : **సహకారతాం** – సహకారతే – సహకారతాః; ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 11. యయౌ : **యయౌ** – యయతుః – యయుః; యా ప్రాపణే ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. ఆమ్రతా+ఇవ = ఆమ్రతేవ – గుణసంధి.

**సమాసాలు :** 1. తస్య ఉపయోగః, తేన సమ్భవా, తామ్, తదుపభోగసమ్భవామ్; 2. మనః హరతీతి, తామ్, మనోహరామ్; 3. అప్రతర్క్యశ్చ అసౌ వినియోగః తేన నిర్మితా, తామ్, అప్రతర్క్యవినియోగ సమ్భవామ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**విక్రియా :** వికరణమ్ । వి+కృ "**కృఞః శచ**" (3–3–100) ఇతి శః । టాప్ । వికారః ఇత్యమరః । ... ప్రకృతేరన్యధాభావః । యథా మార్కండేయే –

'**అస్నేహశ్చాపి గోధూమయవగోరసవిక్రియాః ।** ' విరుద్ధాక్రియా । – శబ్దకల్పద్రుమః.

'**విక్రియామపి సతీమనోహరామ్**' అనటంలో వ్యతిరేకాలంకారధ్వని. విక్రియ మనోహరంగా ఉండదు. పార్వతిలోని విక్రియ సాధారణవిక్రియలకన్న భిన్నంగా మనోహరంగా ఉండటం వలన ఇది వ్యతిరేకాలంకారం ధ్వనిరూపం. "**వ్యతిరేకో విశేషశ్చే-దుపమానోపమేయయోః**" అని వ్యతిరేకలక్షణం. వివరణ వ్యాఖ్య ఇలా అన్నది.

"ఈషత్స్వాదుఫలశ్చూతవిశేష ఇహామ్రశబ్దేనోచ్యతే । ...యథా మన్దస్వాదుఫలత్వాత్ పూర్వమామ్రతాముపగతా చూతలతా పునర్మణిమన్త్రయోగాత్ అతిస్వాదుఫలాం సహకారతాం ప్రాప్నోతి, తథా పార్వత్యపి మధుపానేన పూర్వాపేక్షయా అతిమనోహరాం విక్రియామాప"

స్వతః సహకారత గల సహకారం సహకారతను పొందినదనటం విధ్యలంకారం. “**సిద్ధస్యైవ విధానం యత్తమాహుర్విధ్యలంకృతమ్**” అని విధ్యలంకార లక్షణం.

‘**వికారహేతౌ సతి విక్రియన్తే, యేషాం న చేతాంసి త ఏవ ధీరాః**’ అని (కుమార 1-58) ప్రథమసర్గలో పార్వతి తన తపస్సుకు ప్రత్యర్థివంటిదైనా ఆమె సేవలకు అంగీకరించాడనీ వికారహేతువు కలిగినా వికృతిని పొందనివాడే ధీరుడనీ ప్రకటించాడు కాళిదాసు. ప్రకృతశ్లోకంలో వికారాన్ని పొందినా మనోహరతను కోల్పోలేదని వివరిస్తున్నాడు. వికారకారణాలు మానవప్రవృత్తిలో కలిగించగల అవస్థాభేదాలను వివరిస్తున్నాడు కాళిదాసు భిన్నభిన్న తత్తదుచితపరిసరాలలో. *

**శ్లో॥ తత్క్షణం విపరివర్తితహ్రియోర్నేష్యతోశ్శయనమిద్ధరాగయోః ।**
**సా బభూవ వశవర్తినీ ద్వయోశ్శూలినస్సువదనా మదస్య చ ॥ 79**

**అవ :** పార్వతి మదపరమేశ్వరులకు వశమగుట.

**ప.వి. :** తత్క్షణం విపరివర్తిత-హ్రియోః నేష్యతోః శయనమ్ ఇద్ధ-రాగయోః ।
సా బభూవ వశ-వర్తినీ ద్వయోః శూలినః సువదనా మదస్య చ ॥

**అన్వ :** తత్ క్షణం సా సువదనా విపరివర్తితహ్రియోః ఇద్ధరాగయోః శయనం నేష్యతోః ద్వయోః వశవర్తినీ బభూవ. శూలినః, మదస్య చ...

**ప్ర :** తత్-క్షణమ్ = ఆ క్షణంలోనే, సా = ఆ, సువదనా = అందమైన ముఖంగల పార్వతి, విపరివర్తిత-హ్రియోః : విపరివర్తిత = వెనుకకు మరల్చబడిన, హ్రియోః = సిగ్గుగలవాడూ/(దీ), ఇద్ధ-రాగయోః : ఇద్ధ = పెరిగిన, రాగయోః = అనురాగం గలవాడూ (దీ), శయనమ్ = పడకవైపు, నేష్యతోః = కొనిపోతున్నవాడూ (దీ), అయిన, ద్వయోః = ఇద్దరికీ/ రెండింటికీ, శూలినః = శివునకూ, మదస్య చ = మత్తుకు కూడా, వశవర్తినీ = లోబడినదిగా, బభూవ = అయినది.

**తా :** తత్క్షణమే పార్వతి శివునికీ, మదానికీ కూడా లొంగిపోయింది. శివుడిలో మత్తులో ఇద్దరిలో సిగ్గు వెనుకంజవేసింది, రాగం పెల్లుబికింది.

**విభక్తులు - క్రియలు :** 1. తత్క్షణమ్ : **తత్క్షణం** - తత్క్షణౌ - తత్క్షణాన్; తత్క్షణశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 2. విపరివర్తితహ్రియోః : హ్రియః - **హ్రియోః** - హ్రియామ్; విపరివర్తితహ్రి శబ్దః ఇకారాన్తః పుంలింగః షష్ఠీద్వివచనమ్; 3. నేష్యతోః : నేష్యతః - **నేష్యతోః** - నేష్యతామ్; నేష్యచ్ఛబ్దః తకారాన్తః పుంలింగః షష్ఠీద్వివచనమ్; 4. శయనమ్ : **శయనం** - శయనే - శయనాని; శయనశబ్దః అకారాన్తః నపుంసకలింగః

ద్వితీయైకవచనమ్; 5. ఇద్ధరాగయోః : ఇద్ధరాగస్య – **ఇద్ధరాగయోః** – ఇద్ధరాగాణామ్; ఇద్ధరాగశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠీబహువచనమ్; 6. సా : **సా** – తే – తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 7. బభూవ : **బభూవ** – బభూవతుః –బభూవుః; భూ సత్తాయామ్ ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 8. వశవర్తినీ : **వశవర్తినీ** – వశవర్తిన్యౌ – వశవర్తిన్యః; వశవర్తినీ శబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 9. ద్వయోః : ద్విశబ్దః నిత్యద్వివచనాన్తః షష్ఠీవిభక్తిః ; 10. శూలినః : **శూలినః** – శూలినోః – శూలినామ్; శూలిన్ శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 11. సువదనా : **సువదనా** – సువదనే – సువదనాః; సువదనాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ప్రథమైకవచనమ్; 12. మదస్య : **మదస్య** – మదయోః – మదానామ్; మదశబ్దః అకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 13. చ – అవ్యయమ్.

**సంధులు :** 1. హ్రియోః+నేష్యతోః = హ్రియోర్నేష్యతోః – విసర్గసంధి.

**సమాసాలు :** 1. సః చ అసౌ క్షణః, తత్, తత్క్షణం; 2. విపరివర్తితా హ్రీః యయోః, తయోః, విపరివర్తితహ్రియోః; 3. ఇద్ధః రాగః యయోః, తయోః, ఇద్ధరాగయోః. *

**శ్లో॥ ఘూర్ణమాననయనం స్ఖలద్వచః స్వేదబిన్దుమదకారణస్మితమ్ ।**
**ఆననేన న తు తావదీశ్వరశ్చక్షుషా చిరముమాముఖం పపౌ ॥ 80**

**అవ :** పరమేశప్రవృత్తివర్ణనం.

**ప.వి. :** ఘూర్ణమాన–నయనం స్ఖలద్–వచః స్వేద–బిన్దుమత్ అకారణ–స్మితమ్ ।
ఆననేన న తు తావత్ ఈశ్వరః చక్షుషా చిరమ్ ఉమా–ముఖం పపౌ ॥

**అన్వ :** ఘూర్ణమాననయనం స్ఖలద్వచః స్వేదబిందుమత్ అకారణస్మితం ఉమాముఖం ఈశ్వరః తావత్ చిరం చక్షుషా పపౌ తు ఆననేన న

**ప్ర :** ఘూర్ణ... నయనమ్ : ఘూర్ణమాన = తిరుగుతున్న, నయనమ్ = కన్నులుగలదీ, స్ఖలద్–వచః : స్ఖలత్ = తడబడుతున్న, వచః = మాటలు గలదీ, స్వేద–బిందువత్= చెమటబిందువులు గలదీ, అకారణ–స్మితమ్ : అకారణ = నిమిత్తంలేని, స్మితమ్ = చిఱునవ్వు గలదీ అయిన, ఉమా–ముఖమ్ = పార్వతి మోము, శంకరః తావత్ = శంకరుడు మాత్రం, చిరమ్ = చాలాసేపు, చక్షుషా = కంటితో, పపౌ = త్రాగాడు. తు = కానీ, ఆననేన న = ముఖంతో కాదు.

**తా :** పార్వతికి కళ్ళు తిరుగుతున్నాయి. మాటలు తడబడుతున్నాయి. చెమట క్రమ్ముతోంది. అకారణంగానే నవ్వుతోంది. ఆ దశలోని పార్వతిని గమనించి పరమేశ్వరుడు చాలాసేపు కంటితోనే త్రాగేశాడు. ముఖంతో ముట్టుకోలేదు.

**విభక్తులు – క్రియలు :** 1. ఘూర్ణమాననయనమ్ – అవ్యయమ్; 2. స్ఖలద్వచః – అవ్యయమ్; 3. స్వేదబిన్దుమత్ – అవ్యయమ్; 4. అకారణస్మితమ్ – అవ్యయమ్ – (ఈ నాలుగూ క్రియావిశేషణాలు); 5. ఆననేన : **ఆననేన** – ఆననాభ్యామ్ – ఆననైః; ఆననశబ్దః అకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 6. న – అవ్యయమ్; 7. తు – అవ్యయమ్; 8. తావత్ – అవ్యయమ్; 9. ఈశ్వరః : **ఈశ్వరః** – ఈశ్వరౌ – ఈశ్వరాః; ఈశ్వరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 10. చక్షుషా : **చక్షుషా** – చక్షుర్భ్యాం – చక్షుర్భిః; చక్షుస్ సకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 11. చిరమ్ – అవ్యయమ్; 12. ఉమాముఖమ్ : **ముఖం** – ముఖే – ముఖాని; ఉమాముఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 13. పపౌ : **పపౌ** – పపతుః – పపుః; పాపానే ధాతోః లటి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. తావత్+ఈశ్వరః = తావదీశ్వరః – జశ్త్వసంధి; 2. ఈశ్వరః+చక్షుషా = ఈశ్వరశ్చక్షుషా – విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఘూర్ణమానే నయనే యస్య తత్తథా, ఘూర్ణమాన నయనమ్; 2. స్ఖలన్తీ కథా యస్య తత్తథా, స్ఖలత్కథమ్; 3. స్వేదస్య బిన్దవః యస్మిన్ తత తథా, అకారణస్మితమ్; 5. ఉమయాః ముఖమ్, ఉమాముఖమ్.

**పాఠాన్తరాలు :** స్కలత్ కథమ్ – స్కలద్వచః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**ఉమాముఖం పపౌ :** పూర్వశ్లోకంలో తనను శయ్యవైపు నడుపుతున్న పరమేశ్వరునకు, మదానికి కూడా పార్వతి వశమైనదని చెప్పాడు. "**శూలినః సువదనా మదస్య చ**" అంటూ. మరి ఆ దశలో పరమేశ్వరుడు (ఉమాముఖం చక్షుషా పపౌ) పార్వతి మోమునే ఎందుకు కంటితో త్రాగేశాడు? పార్వతీవదనసౌందర్యం మీదనే కాళిదాసు ప్రత్యేకదృష్టితో వర్ణన సాగించాడు మొదటినుండి.

**శ్లో॥ చంద్రంగతా పద్మగుణాన్న భుంక్తే – పద్మాశ్రితా చాంద్రమసీమభిఖ్యామ్ ।**
**ఉమాముఖం తు ప్రతిపద్య లోలా – ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః ॥**1/42

మదనుడు పార్వతిని మాధ్యమంగా స్వీకరించి హరునిపై బాణాలను ప్రయోగించినప్పుడూ...

శ్లో॥ హరస్తు కించిత్పరివృత్తధైర్య–శ్చన్ద్రోదయారమ్భ ఇవాంబురాశిః ।
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే – వ్యాపారయామాస విలోచనాని ॥ 3–67

ప్రకృతం కూడా పూర్వశ్లోకంలో సువదనా పదాన్నే ప్రయోగించాడు. కళగల ముఖం కంటబడి దృష్టి మరెటూ ప్రసరింపదు స్త్రీపురుషులలో ఎవరికైనా.

పరమేశ్వరుని సమాధిస్థితి అచంచలమైనది. తృతీయసర్గలో మదనబాణవైయర్థ్యభావం కూడా లోకానికి కలగకూడదని చివరిక్షణంలో తలవంచాడు. అంతవరకు ఎన్ని ప్రేరణలను మదనుడు కల్పించినా నిరర్థకాలే అయ్యాయి.

శ్లో॥ శ్రుతాప్సరోగీతిరపి క్షణేఽస్మిన్ - హరః ప్రసంఖ్యానపరో బభూవ ।
ఆత్మేశ్వరాణాం నహి జాతు విఘ్నాః - సమాధిభేదప్రభవో భవన్తి ॥ 3-40

ప్రకృతంలో కూడా ఆ సమాధిస్థితినే వర్ణిస్తున్నాడు. గతంలో ఉమాముఖంమీద దృష్టి పెట్టడంవలన సమాధిభంగమైంది. ఆ సమాధిభంగాన్ని సఫలం చేయటానికి ఇప్పుడు ఆ పార్వతి ముఖపానంతో సమాధిలో నిలిచిపోయాడు. ఆ సమాధిదశను తెలియజేస్తూ చిరమ్ అని వాడుతున్నాడు మహాకవి కాళిదాసు. చేస్తున్న ఏ పనినైనా అవధానదృష్టితో సమాధిభావనతో చేయగలగటం ఆత్మేశ్వరులకే సాధ్యం. పానసామర్థ్యం కంటికి లేదు. కాబట్టి '**చక్షుషా పపౌ**' అన్నది వక్రోక్తి అవుతుంది. '**సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః**' (కావ్యాలంకారసూత్రవృత్తి) *

**శ్లో॥ తాం విలమ్బితపనీయమేఖలాముద్వహన్ జఘనభారదుర్వహామ్ ।**
**ధ్యానసమ్భృతవిభూతిభాస్వరం ప్రావిశన్మణిశిలాగృహం హరః ॥ 81**

**అవ :** పరమేశ్వరునికి పార్వతియొక్క వశవర్తినీత్వవర్ణన.

**ప.వి. :** తామ్ విలమ్బి-తపనీయ-మేఖలామ్ ఉద్వహన్ జఘన-భార-దుర్వహామ్ ।
ధ్యాన-సమ్భృత-విభూతి-భాస్వరం ప్రావిశత్ మణి-శిలా-గృహం హరః ॥

**అన్వ :** విలమ్బితపనీయమేఖలాం జఘనభారదుర్వహాం తామ్ ఉద్వహన్ హరః ధ్యాన-సమ్భృతవిభూతిభాస్వరం మణిశిలాగృహం ప్రావిశత్ ॥

**ప్ర :** విలమ్బి... మేఖలామ్ : విలమ్బి = వ్రేలాడుతున్న, తపనీయ = స్వర్ణమయమైన, మేఖలామ్ = మొలనూలు గలదియూ, జఘన... దుర్వహామ్ : జఘన = మొలయొక్క, భార = బరువుచే, దుర్వహామ్ = క్లిష్టంగా మోయదగినదీ, అయిన, తామ్ = ఆ పార్వతిని, ఉద్వహన్ = మోస్తూ, హరః = శివుడు, ధ్యాన... భాస్వరమ్ : ధ్యాన = తలంపుచేతనే, సమ్భృత = ప్రోదిచేయబడిన, విభూతి = సంపదచే (కార్యానుగుణమైన సంపత్తి), భాస్వరమ్ = ప్రకాశిస్తున్న, మణి-శిలా-గృహమ్ : మణి = మణిమయములైన, శిలా = రాళ్ళచే నిర్మింపబడిన, గృహమ్ = వసతిని, ప్రావిశత్ = ప్రవేశించాడు.

**తా :** పార్వతి మొలనూలు సువర్ణమయం. అది వ్రేలుతోంది. జఘనభారంచేత ఆమె మోయటానికి వీలు కాకుండా ఉంది. అయినా పరమేశ్వరుడు ఆమెను ఎత్తుకొని, తాను తలచినంతనే సమకూరిన రత్నగృహంలోనికి ప్రవేశించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. తామ్ : **తాం** - తే - తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 2. విలమ్బితతపనీయమేఖలామ్ : **మేఖలాం** - మేఖలే - మేఖలాః; మేఖలా శబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 3. ఉద్వహన్ : **ఉద్వహన్** - ఉద్వహన్తౌ - ఉద్వహన్తః; ఉద్వహత్ శబ్దః తకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. జఘనభారదుర్వహామ్ : **దుర్వహాం** - దుర్వహే - దుర్వహాః; దుర్వహాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 5. ధ్యానసంభృతవిభూతిభాస్వరమ్ : **భాస్వరం** - భాస్వరే - భాస్వరాణి; ...భాస్వరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 6. ప్రావిశత్ : **ప్రావిశత్** - ప్రావిశతాం - ప్రావిశన్; ప్ర పూర్వకాత్ విశ ప్రవేశనే ధాతోః లఙ్ ప్రథమపురుషైకవచనమ్; 7. మణిశిలాగృహమ్ : **గృహం** - గృహే - గృహాణి;... గృహశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 8. హరః : **హరః** - హరౌ - హరాః; హరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. ఉద్వహన్+జఘన = ఉద్వహఞ్జఘన - శ్చుత్వసంధి; 2. ప్రావిశత్+మణి = ప్రావిశన్మణి - అనునాసికసంధి.

**సమాసాలు :** 1. విలమ్బినీ తపనీయ (మయా) మేఖలా యస్యాః, తామ్, విలమ్బితపనీయ-మేఖలామ్; 2. జఘనయోః భారః, తేన దుర్వహా, తామ్, జఘనభారధుర్వహామ్; 3. ధ్యానేన సంభృతాభిః విభూతిభిః భాస్వరం, తత్, ధ్యానసంభృతివిభూతిభాస్వరమ్; 4. మణిమయాశ్చ తాః శిలాః, తాభిః (నిర్మితం) గృహమ్, మణిమయశిలాగృహమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమణాలు :**

**మేఖలా :** (మీయతే ప్రక్షిప్యతే కాయమధ్యభాగే ఇతి మి+ సంజ్ఞాయాం ఖలః గణశ్చ స్త్రియాం టాప్ । ఇత్యమరటీకాయాం భరతమతమ్) స్త్రీకట్యాభరణమ్ । కాంచీ, సప్తకీ, రసనా, సారసనమ్ **ఇత్యమరః** । కాంచిః, రశనా, కక్షా, రసనమ్, రశనమ్, కక్ష్యా, సప్తకా, సారశనమ్ ఇతి **శబ్దరత్నావళీ** కలాపః ఇతి జటాధరః । సారసనం స్త్రీకట్యాం వస్త్రగ్రన్థనమ్ ఇతి **జటాధరః** । కేచిత్తు -

శ్లో॥ ఏకయష్టిర్భవేత్ కాంచీ **మేఖలా త్వష్టయష్టికా** ।
రసనా షోడశ జ్ఞేయా కలాపః పంచవింశకః ॥ - **శబ్దకల్పద్రుమః**

**మణిశిలాగృహం :** అది ధ్యానసంభృతం. ధ్యానమాత్రంచేత సంపాదితం. ఇది పదార్థ హేతుక కావ్యలింగాలంకారధ్వని. అక్కడ ఆ సమయంలో మణిశిలాగృహసిద్ధి ఎలా అన్న ప్రశ్నకు సమాధానం ధ్యానసంభృతమని. వివరణ వ్యాఖ్య ఇలా అన్నది-

"నను వనాన్తరే కథం సురతోపకరణసంభవోపపత్తిరితి కిం మణిశిలాగృహప్రవేశే-నేత్యాశంక్య మణిశిలాగృహం విశినష్టి - **ధ్యానసంభృతవిభూతిభాస్వరమితి।**" *

**శ్లో॥ తత్ర హంసధవలోత్తరచ్ఛదం జాహ్నవీపులినచారుదర్శనమ్ ।**
**అధ్యశేత శయనం ప్రియాసఖః శారదాభ్రమివ రోహిణీపతిః ॥ 82**

**అవ :** పరమేశ్వరుడు శయనసేవన చేయటం.

**ప.వి. :** తత్ర హంస-ధవళ-ఉత్తర-ఛదం జాహ్నవీ-పులిన-చారు-దర్శనమ్ ।
అధ్యశేత శయనం ప్రియా-సఖః శారద+అభ్రమ్ ఇవ రోహిణీ-పతిః ॥

**అన్వ :** ప్రియాసఖః (సః) తత్ర హంసధవళోత్తరచ్ఛదం జాహ్నవీపులినచారుదర్శనం శయనం రోహిణీపతిః శారదాభ్రమివ అధ్యశేత.

**ప్ర :** ప్రియా-సఖః = వల్లభతోడుగా, సః = ఆ శివుడు, తత్ర = ఆ వసతిలో, హంస... ఛదమ్ : హంస = రాయంచవలె, ధవళ = తెల్లనైన, ఉత్తర-ఛదమ్ = పైపక్క గలదీ, జాహ్నవీ... దర్శనమ్ : జాహ్నవీ = గంగానదీతీరమందలి, పులిన = ఇసుకవలె, చారు = అందమైన, దర్శనమ్ = వీక్షణ గలదీ, అయిన, శయనమ్ = పక్కపై, రోహిణీ-పతిః = చంద్రుడు, శారద+అభ్రమ్ ఇవ = శరత్కాలమేఘంపై వలె, అధ్యశేత = శయనించాడు.

**తా :** ఆ రత్నగృహంలోని శయ్యపై హంసలా తెల్లగా గంగానదీతీరమందలి ఇసుకలా చూడముచ్చటగా ఉన్న పక్కపై శివుడు ప్రియాసఖుడై శయనించాడు. అది శరత్కాలమేఘంపై చంద్రుడు శయనించినట్లుంది.

**విభక్తులు - క్రియలు :** 1. తత్ర -అవ్యయమ్; 2. హంసధవలోత్తరచ్ఛదమ్ : **ఛదం** - ఛదే - ఛదాని; ...ఛదశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 3. జాహ్నవీపులినచారుదర్శనమ్ : **దర్శనం** - దర్శనే - దర్శనాని; దర్శనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 4. అధ్యశేత : **అశేత** - అశయాతామ్ - ఆశేరత; అధి పూర్వకాత్ శీఙ్ స్వప్నే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్; 5. శయనమ్ : **శయనం** - శయనే - శయనాని; శయనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 6. ప్రియాసఖః : **సఖః** - సఖౌ - సఖాః; ప్రియాసఖ శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 7. శారదాభ్రమ్ : **అభ్రమ్** - అభ్రౌ - అభ్రాణి; అభ్ర

శబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 8. రోహిణీపతిః : **పతిః** – పతీ – పతయః; రోహిణీపతి శబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. హంస ఇవ ధవళమ్ ఉత్తరచ్ఛదం యస్య తత్, హంసధవళోత్తరచ్ఛదమ్; 2. జాహ్నవ్యాః పులినం తద్వత్ చారు దర్శనం యస్య తత్, జాహ్నవీ పులిన చారు దర్శనమ్; 3. ప్రియాయాః సఖా, ప్రియాసఖః; 4. శరది భవం శారదం, తచ్చ తత్ అభ్రమ్, శారదాభ్రమ్; 5. రోహిణ్యాః పతిః, రోహిణీపతిః.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**చారుదర్శనమ్ :** శయనానికి రెండు విశేషణాలు. ఒకటి ఉత్తరచ్ఛదం (పక్క) తెల్లటి వస్త్రం. రెండు చారుదర్శనీయత్వం. ఒకటి శుభ్రతను సూచించేది. మరొకటి సౌందర్యాన్ని సూచించేది. భరతుడు శృంగారాన్ని రసీకరిస్తూ చెప్పిన లక్షణాలు ఇక్కడ కనిపిస్తున్నాయి. “**యత్కించిల్లోకే శుచి మేధ్యముజ్జ్వలం దర్శనీయం చ తచ్ఛృంగారేణోపమీయతే**” (నాట్యశాస్త్రం – షష్ఠాధ్యాయం)

వాత్స్యాయనుడు కూడా కామసూత్రాలలో ఈ శయ్యా విషయాన్ని ప్రస్తావించాడు. “**సుకష్టముభయోపధానం మధ్యే వినతం శుక్లోత్తరచ్ఛదం బద్ధవితానం శయనీయం స్యాత్.**”

కామం సామాన్యేచ్ఛ. దాని భౌతికసుఖరూపం రతి. దాని ఉజ్జ్వలరూపం శృంగారం (రసీభావం). దాని ఫలం సంతానప్రాప్తి. కాబట్టి సత్సంతానసిద్ధికై సాధారణకామం శృంగారాత్మకరసీభావాన్ని పొందాలి. అది ఆ దశలో మనోధర్మం కూడా. మనోధర్మానికి భౌతిక, తటస్థ పరిసరాలు ఉద్దీపకాలు. కాబట్టి బాహ్యోపకరణాలను ఇంత సున్నితంగా, ఫలవంతంగా వర్ణించటం. ఇంతవరకు దేవతలూ, ఋషులూ జోక్యం చేసుకొన్నదీ, మదనుడు తనుత్యాగం చేసిందీ ఆ సఫలసంతానసిద్ధికోసమే.

**శారదాభ్రమివ రోహిణీపతిః :** శివుడు పక్కపై చేరాడు. రోహిణీపతి శరత్కాలమేఘంపైకి వెళ్ళినట్లు. చక్కని పోలిక. అయితే రోహిణీపతిః అనటంలో మరో చమత్కారం రోహిణీపతి పదం ద్వారా రోహిణీ, చంద్రుడూ ఇద్దరినీ చెప్పినట్లయింది. పదం ఏకవచనమైనా. ఉపమేయకక్ష్యలో ప్రియాసఖః అని విశేషణపదమే కానీ అసలు విశేష్యపదమే లేదు. పూర్వశ్లోకం నుండీ ‘హరః’ అన్న పదాన్ని అధ్యాహారం చేసికొనవలసినదే. అంతేకాదు పూర్వశ్లోకంనుండియే ‘**తామ్ ఉద్వహన్**’ కూడా తెచ్చుకోవాలి.

‘రోహిణ్యాః పతిః’ అనే విగ్రహంతో చంద్రుడు రోహిణికి చెందినవాడయ్యాడు. పరమేశ్వరుడు కూడా పార్వతి సొత్తు అయ్యాడు అని ధ్వని. ప్రియాయాః సఖా అని విగ్రహంతో దానిని తెలిపినా అసలక్కడ పరమేశ్వరుని అస్తిత్వమే లేదు విశేష్యరూపంగా.

**అధ్యశేత :** పక్కమీద పడుకోవటం సహజం. పక్క పడుకోవటానికి ఆధారమే. అయితే అధిపూర్వకమైన శీఙ్ ధాతురూపమైన శయనం కర్మగా మారుతుంది. "**అధి శీఙ్ స్థాసాం కర్మ**" సూత్రంతో. కాబట్టి శయనమని ద్వితీయావిభక్తి. *

**శ్లో॥ క్లిష్టకేశమవలుప్తచన్దనం వ్యత్యయార్పితనఖం సమత్సరమ్ ।**
**తస్య తచ్ఛిదురమేఖలాగుణం పార్వతీరతమభూన్నతృప్తయే ॥ 83**

**అవ :** సాక్షాద్రతి వర్ణన.

<u>ప.వి. :</u> క్లిష్ట-చన్ద్రమ్ అదయైః కచగ్రహైః ఉత్పథ+అర్పిత-నఖం సమత్సరమ్।
పాఠాంతరం తస్య తత్+ఛిదుర-మేఖలా-గుణం పార్వతీ-రతమ్ అభూత్-అతృప్తయే॥

**అన్వ :** అదయైః కచగ్రహైః క్లిష్టచన్ద్రమ్ ఉత్పథార్పితనఖం సమత్సరం ఛిదురమేఖలాగుణం పార్వతీరతం తస్య అతృప్తయే అభూత్.

**తా :** అదయైః = నిర్దాక్షిణ్యమైన, కచ-గ్రహైః = జుట్టు పట్టుకొనుటలతో, క్లిష్ట-చన్ద్రమ్ : క్లిష్ట = బాధింపబడిన, చన్ద్రమ్ = (శివుని తలమీది) చంద్రుడ గలదీ, ఉత్పథ నఖ+అర్పితమ్ : ఉత్పథ = బాటను అతిక్రమించి, నఖ = గోళ్ళయొక్క, అర్పితమ్ = గ్రుచ్చుటలు గలదీ, సమత్సరమ్ = (జయేచ్ఛచే) మాత్సర్యంతో కూడినదీ, ఛిదుర... గుణమ్ : ఛిదుర = తెగిపోయిన, మేఖలా = మొలనూలియొక్క, గుణమ్ = దారం గలదీ అయిన, పార్వతీ-రతమ్ = పార్వతితో మైథునం, తస్య = ఆ పరమశివునకు, అతృప్తయే = అసంతృప్తికే, అభూత్ = సంభవించినది.

**తా :** పార్వతితో రతి పరమేశ్వరునకు అసంతృప్తి హేతువుగానే మిగిలింది. కారణం - కేశగ్రహణ సమయంలో తలమీది చంద్రుడు కష్టపడుతున్నాడు. శాస్త్రమార్గాన్ని అతిక్రమించి గోటిగ్రుచ్చుటలు జరుగుతున్నాయి. ఆమె మొలనూలు తెగిపోయింది. ఇద్దరిలోనూ మాత్సర్యం మిగిలింది.

**విభక్తులు - క్రియలు :** 1. క్లిష్టచన్ద్రమ్ : **క్లిష్టచన్ద్రం** - క్లిష్టచన్ద్రే - క్లిష్టచన్ద్రాణి; క్లిష్టచన్ద్రశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 2. అదయైః : అదయేన - అదయాభ్యామ్ - **అదయైః**; అదయశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 3. కచగ్రహైః : కచగ్రహేణ - కచగ్రహాభ్యాం - **కచగ్రహైః**; కచగ్రహశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 4. ఉత్పథార్పిత నఖమ్: **నఖం** - నఖే - నఖాని; ఉత్పథార్పిత నఖ శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 5. సమత్సరమ్ : **సమత్సరం** - సమత్సరే - సమత్సరాణి; సమత్సర శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్;

6. తస్య : **తస్య** - తయోః - తేషామ్; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః షష్ఠ్యేకవచనమ్; 7. తచ్ఛిదురమేఖలాగుణమ్ : **గుణం** - గుణే - గుణాని; మేఖలాగుణశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 8. పార్వతీరతమ్ : **రతం** - రతే - రతాని; పార్వతీరత శబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 9. అభూత్ : **అభూత్** - అభూతామ్ - అభూవన్; భూ సత్తాయామ్ ధాతోః లుఙి ప్రథమపురుషైకవచనమ్; 10. అతృప్తయే : **అతృప్తయే** - అతృప్తిభ్యామ్ - అతృప్తిభ్యః; అతృప్తిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః చతుర్థ్యేకవచనమ్.

**సంధులు :** 1. గ్రహైః+ఉత్పథా = గ్రహైరుత్పథా - విసర్గసంధి.

**సమాసాలు :** 1. క్లిష్టః చన్ద్రః యేన తత్, క్లిష్టచన్ద్రమ్; 2. కచానాం గ్రహాః తైః, కచగ్రహైః; 3. ఉత్పథం యథా తథా అర్పితాని నఖాని యస్మిన్ తత్, ఉత్పథార్పితనఖమ్; 4. మత్సరేణ సహ వర్తత ఇతి, సమత్సరమ్; 5. ఛిదురః మేఖలాయాః గుణః యస్మిన్ తత్, ఛిదురమేఖలాగుణమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శ్లో॥ చుమ్బనేష్వధరదానవర్జితం సన్నహస్తమదయోపగూహనే(నమ్) ।**
**క్లిష్టమన్మథమపి ప్రియం ప్రభోర్దుర్లభప్రతికృతం వధూరతమ్ ॥** - 8/8

అని ముందు వర్ణించిన శ్లోకానికి ప్రకృతశ్లోకవర్ణితస్థితి ప్రతియోగి. ఆ శ్లోకంలో అది దుర్లభప్రతికృతం. కాబట్టి ఎదురులేనిది. ప్రస్తుతం ప్రతికృతం. అయినా అతృప్తి హేతువు. ఈ అతృప్తి పునః పునః ప్రాప్తిభావనాచోదనాత్మతమైన అసంతృప్తియే కాని సాధారణమైన అసంతృప్తి కాదు.

**శ్లో॥ కృతే ప్రతికృతం కుర్యాచ్చుమ్బితే ప్రతిచుమ్బితమ్ ।**
**కరణేన చ తేనైవ తాడితే ప్రతితాడితమ్ ॥**

అని కామశాస్త్రం చెప్పినట్లు ప్రకృతశ్లోకం లబ్ధప్రతికృతం. కాబట్టి సఫలం. *

**శ్లో॥ కేవలం ప్రియతమాదయాలునా జ్యోతిషామవనతాసు పఙ్క్తిషు ।**
**తేన తత్ప్రతిగృహీతవక్షసా నేత్రమీలనకుతూహలం కృతమ్ ॥ 84**

**అవ :** రతోత్తరకాలకుతూహలవర్ణనం.

**ప.వి. :** కేవలం ప్రియతమా-దయాలునా జ్యోతిషామ్ అవనతాసు పంక్తిషు ।
తేన తత్-పరిగృహీత-వక్షసా నేత్ర-మీలన-కుతూహలం కృతమ్ ॥

**అన్వ :** జ్యోతిషాం పంక్తిషు అవనతాసు తత్–పరిగృహీతవక్షసా తేన కేవలం ప్రియాతమా దయాలునా నేత్రనిమీలనకుతూహలం కృతమ్.

**ప్ర :** జ్యోతిషామ్ = తారలయొక్క, పంక్తిషు = వరుసలు, అవనతాసు = వాలిపోగా, తత్... వృక్షసా : తత్ = ఆ పార్వతిచే, పరిగృహీత = ఆక్రమింపబడిన, వక్షసా = ఉరః ప్రదేశం గల, తేన = ఆ శివునిచే, కేవలమ్ = బొత్తిగా, ప్రియాతమాదయాళునా : ప్రియతమా = అత్యంతమూ ఇష్టమైన భార్యమీద, దయాళునా = దయగలవాడగుటచే, నేత్ర... కుతూహలమ్ : నేత్ర = కళ్ళను, మీలన = మూయుటయందలి, కుతూహలమ్ = కుతుకం, కృతమ్ = పాటింపబడింది.

**తా :** తారల వరుసలు క్రిందికి వాలాయి. (తెలవారటానికి సంకేతం). పార్వతి పరమేశ్వరుని గుండెలపై వ్రాలి ఉంది. పరమశివుడు దయామయుడు. అందుకే పార్వతిని గమనించి మరల మెలకువరానట్లు నేత్రనిమీలనం చేశాడు.

**విభక్తులు – క్రియలు :** 1. కేవలమ్ – అవ్యయమ్; 2. ప్రియతమాదయాలునా : **దయాలునా** – దయాలుభ్యాం – దయాలుభిః; దయాలుశబ్దః ఉకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 3. జ్యోతిషామ్ : జ్యోతిషః – జ్యోతిషోః – **జ్యోతిషామ్**; జ్యోతిశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః షష్ఠీబహువచనమ్; 4. అవనతాసు : అవనతాయామ్ – అనతయోః – **అవనతాసు**; అవనతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః సప్తమీబహువచనమ్; 5. పంక్తిషు : పంక్త్యాం/పంక్తౌ – పంక్త్యోః – **పంక్తిషు**; పంక్తి శబ్దః ఇకారాన్తః స్త్రీలింగః సప్తమీబహువచనమ్; 6. తేన : **తేన** – తాభ్యాం – తైః; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 7. తత్పరిగృహీతవక్షసా : **వక్షసా** – వక్షోభ్యాం – వక్షోభిః; వక్షస్ శబ్దః సకారాన్తః నపుంసకలింగః తృతీయైకవచనమ్; 8. నేత్రమీలనకుతూహలమ్ : **కుతూహలం** – కుతూహలే – కుతూహలాని; ... కుతూహలశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 9. కృతమ్ : **కృతం** – కృతే – కృతాని; కృతశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సమాసాలు :** 1. ప్రియతమాయాం దయాలుః, తేన, ప్రియతమాదయాలునా; 2. తయా పరిగృహీతం వక్షః యస్య తేన, తత్పరిగృహీతవక్షసా; 3. నేత్రయోః మీలనే కుతూహలమ్, నేత్రనిమీలన కుతూహలమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**కేవలమ్ :** ఏకమాత్రే, అద్వితీయేఒ_సహాయే చార్థేఒ_స్య స్వరాదిత్వం తిలకప్రభృతయో

ఉంగీకుర్వన్తి । శబ్దకల్పద్రుమాదిషు తు త్రిలింగోఽయం విశేష్యనిఘ్నత్వేన పఠితః । 'కేవలం స్మరణేనైవ పునాసి పురుషం యతః॥" (రఘు 10-29) అవ్యయకోశః-160

**దయాలు :** దయతే ఇతి । దయ "**స్పృహిగృహిపతిదయినిద్రాతన్ద్రాశ్రద్ధాభ్య ఆలుచ్**" (3-2-158)। దయా యుక్తః । తత్పరాయః కారుణికః । కృపాలుః । సూరతః ఇత్యమరః॥

**చేష్టాస్వభావవర్ణనం :** శ్లోకంలో స్వభావోక్తి ఉన్నది. "**స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్**" ఇది స్వభావోక్తిలక్షణం. నక్షత్రాలు క్రిందకు జారుతున్న సమయంలో పరమేశ్వరుడు - పార్వతి గుండెలపై శయనించి ఉండగా - అలా అలవోకగా నేత్రనిమీలన చేశాడు. అద్భుతంగా చేష్టావర్ణన. ఒక చక్కని భావచిత్రంలా శ్లోకం కనిపిస్తుంది. *

**శ్లో॥ స వ్యబుధ్యత బుధస్తవోచితశ్శాతకుమ్భకమలాకరైస్సమమ్ ।**
**మూర్ఛనాపరిగృహీతకైశికైః కిన్నరైరుషసి గీతమఙ్గలః ॥ 85**

**అవ :** పరమేశ్వరునికి మేలుకొలుపులు

**ప.వి. :** సః వ్యబుధ్యత బుధ-స్తవ-ఉచితః శాతకుమ్భ-కమల+ఆకరైః సమమ్ ।
మూర్ఛనా-పరిగృహీత-కైశికైః కిన్నరైః ఉషసి గీత-మంగళః ॥

**అన్వ :** బుధస్తవోచితః సః మూర్ఛనా పరిగృహీత కైశికైః కిన్నరైః గీతమంగళః శాతకుమ్భ-కమలాకరైః సమమ్ ఉషసి వ్యబుధ్యత.

**ప్ర :** బుధ... చితః : బుధ = పండితులయొక్క, స్తవ = స్తుతులకు, ఉచితః = తగినట్టి, సః = ఆ పరమశివుడు, మూర్ఛణా... కైశికైః : మూర్ఛనా = మూర్ఛనతో, పరిగృహీత = స్వీకరించబడిన, కైశికైః = ప్రాభాతికమంగళగీతాలతో, కిన్నరైః = కిన్నరులచేత, గీతమంగలః = మంగలగీతాలు పాడబడి, శాత... కరై సమమ్ : శాతకుమ్భ = సువర్ణమయమైన, కమల = తారలకు, ఆకరైః సమమ్ = నిలయాలైన కొలనులతో పాటు, ఉషసి = వేకువన, వ్యబుధ్యత = మేల్కొన్నాడు.

**తా :** తెలవారుతుండగా కిన్నరులు మూర్ఛనా సహితంగా ప్రాభాతిక మంగళగీతాలు పాడుతూ పరమశివుని మేల్కొల్పారు. పండితస్తుతులకు తగిన ఆ పరమేశ్వరుడు ఆ కిన్నరగీతాలు విని బంగారుతామరలు గల కొలనులతోపాటు మేల్కొన్నాడు.

**విభక్తులు - క్రియలు :** 1. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 2. వ్యబుధ్యత : **వ్యబుధ్యత** - వ్యబుధ్యేతామ్ - వ్యబుధ్యన్త; వి పూర్వకాత్ బుధ అవగమనే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్; 3. బుధస్తవోచితః :

**ఉచితః** - ఉచితౌ - ఉచితాః; బుధస్తవోచితశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. శాతకుమ్భకమలాకరైః : ఆకరేణ - ఆకరాభ్యామ్ - **ఆకరైః**; కమలాకరశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 5. సమమ్ - అవ్యయమ్; 6. మూర్ఛనాపరిగృహీత-కైశికైః : కైశికేన - కైశికాభ్యాం - **కైశికైః**; కైశికశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహు-వచనమ్; 7. కిన్నరైః : కిన్నరేణ - కిన్నరాభ్యాం - **కిన్నరైః**; కిన్నరశబ్దః అకారాన్తః పుంలింగః తృతీయాబహువచనమ్; 8. ఉషసి : **ఉషసి** - ఉషసోః- ఉషస్సు; ఉషశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః సప్తమ్యేకవచనమ్; 9. గీతమంగలః : **గీతమంగలః** - గీతమంగలౌ - గీతమంగలాః; గీతమంగలశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. కిన్నరైః+ఉషసి = కిన్నరైరుషసి - విసర్గసంధి.

**సమాసాలు :** 1. బుధానాం స్తవస్య ఉచితః, బుధస్తవోచితః ; 2. శాతకుమ్భమయాని కమలాని, తేషామ్ ఆకరాః । తైః, శాతకుమ్భకమలాకరైః; 3. మూర్ఛనయా పరిగృహీతః కైశికః యైః తైః, మూర్ఛనాపరిగృహీతకైశికైః; 4. గీతం మంగలం యస్మై సః, గీతమంగలః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**శాతకుమ్భమ్ :** (శతకుమ్భే పర్వతే భవమ్ । శతకుమ్భ+అణ్) కాంచనమ్. (యథా-మాఘే 9-9 - ద్రుతశాతకుమ్భనిభమంశుమతో వపురర్ధమగ్నవపుషః-పయసి) ధుస్తూరః ఇత్యమరః । - శబ్దకల్పద్రుమః

**మూర్ఛనా : 'క్రమయుక్తాః స్వరా సప్త మూర్ఛనా పరికీర్తితా'** - నాట్యశాస్త్రమ్.

అమూర్ఛనలతో కూడిన ప్రాభాతికరాగవిశేషం కైశికి.

**బుధస్తవోచితః :** పరమేశ్వరునిలో ఇంతవరకు వర్ణించిన రాగిత్వం లోకసంగ్రహం కోసం ఆరోపితమే కాని వాస్తవికం కాదంటూ ఈ సామాజికపదం ద్వారా వివరణవ్యాఖ్యాత నిరూపిస్తున్నాడిలా-

"అనేన ప్రకరణేన పరమేశ్వరౌ రాగిత్వోపవర్ణనం కృతం తన్న పరమార్థతయా మన్తవ్యమిత్యాహ. బుధస్తవోచిత ఇతి । బుధానామాధ్యాత్మశాస్త్రవిదాం స్తవస్య స్తుతేరుచితః । యోగ్యః । స్వరూపజ్ఞానాధీనా హి స్తుతిః । పరమేశ్వరస్య స్వరూపజ్ఞానం తు సకలోపనిషదర్థతత్త్వావధారణేన మృదితకషాయాణామేవ సమ్భవతి. నాన్యేషామితి తేషామేవ స్తుతేరయముచితః । తస్మాత్ పరమేశ్వరస్య న సకలజనసాధారణం రాగిత్వం, భక్తానుగ్రహార్థమారోపితమేవేతి భావః"

**సహోక్తి :** శ్లోకంలో సహోక్త్యలంకారముంది. శాతకుమ్భకమలాకరాలతో పాటు పరమేశ్వరుడు మేల్కొన్నాడని వర్ణించటం సహోక్తి. జనరంజకమైన సహభావాన్ని చెప్పటమే సహోక్తి. "**సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః**" *

**శ్లో॥ తౌ క్షణం శిథిలితోపగూహనౌ దమ్పతీ రచితమానసోర్మయః ।**
**పద్మభేదపిశునాః సిషేవిరే గన్ధమాదనవనాన్తమారుతాః ॥ 86**

**అవ :** గన్ధమాదనమారుతాలు పార్వతీపరమేశ్వరులను సేవించటం.

**ప.వి. :** తౌ క్షణం శిథిలిత+ఉపగూహనౌ దమ్పతీ రచిత-మానస+ఊర్మయః ।
పద్మ-భేద-పిశునాః సిషేవిరే గన్ధమాదన-వన+అన్త-మారుతాః ॥

**అన్వ :** రచితమానసోర్మయః పద్మభేదపిశునాః గన్ధమాదనవనాన్తమారుతాః క్షణం శిథిలతోపగూహనౌ తౌ దమ్పతీ సిషేవిరే.

**ప్ర :** రచిత... ర్మయః : రచిత = కల్పింపబడిన/సమకూర్చిన, మానస = మానస సరోవరమందలి, ఊర్మయః = అలలు గలదీ, పద్మ... పిశునాః : పద్మ = తామరలయొక్క, భేద = వికాసానికి, పిశునాః = సూచకములూ అయిన, గన్ధ... మారుతాః : గన్ధమాదన = గన్ధమాదనగిరిపైని, వన+అన్త = తోటలలోని, మారుతాః = గాలులు, క్షణమ్ = క్షణకాలం, శిథిల+ఉపగూహనౌ : శిథిల = సడిలినట్టి, ఉపగూహనౌ = కౌగిలిగల, తౌ = ఆ, దమ్పతీ = ఆలుమగలను, సిషేవిరే = సేవించాయి.

**తా :** పార్వతీపరమేశ్వరుల పరిష్వంగం క్షణమాత్రం శిథిలమైంది. ఆ స్థితిలోని ఆ దంపతులను గన్ధమాదనవనాన్తరమారుతాలు సేవించాయి. ఆ గాలులు అప్పటికే మానససరస్సులో అలలను కలిగించి వచ్చాయి.

**విభక్తులు - క్రియలు :** 1. తౌ : సః - **తౌ** - తే; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలింగః ప్రథమా ద్వివచనమ్; 2. క్షణమ్ : **క్షణం** - క్షణౌ - క్షణాన్; క్షణశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. శిథిలితోపగూహనౌ : ఉపగూహనః - **ఉపగూహనౌ** - ఉపగూహనాః; ఉపగూహనశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాద్వివచనమ్; 4. దమ్పతీ : **దమ్పతీ** - దమ్పత్యః; ద్వివచన, బహువచన మాత్రమ్; 5. రచితమానసోర్మయః : ఊర్మిః - ఊర్మీ - **ఊర్మయః**; రచితమానసోర్మి శబ్దః ఇకారాన్తః పుంలింగః ప్రథమాబహు-వచనమ్; 6. పద్మభేదపిశునాః : పిశునః - పిశునౌ - **పిశునాః**; పద్మభేదపిశునశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్; 7. సిషేవిరే : సిషేవే - సిషేవాతే - **సిషేవిరే**; షేవృ సేవనే ధాతోః లిటి ప్రథమపురుష బహువచనమ్; 8. గన్ధమాదనవనాన్త-

మారుతాః : మారుతః - మారుతౌ - **మారుతాః**; గన్ధమాదనవానన్తమారుత శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమాబహువచనమ్.

**సమాసాలు :** 1. శిథిలమ్ ఉపగూహనౌ యాభ్యాం తౌ, శిథిలితోపగూహనౌ; 2. జాయా చ పతిశ్చ దమ్పతీ; 3. రచితాః మానసస్య ఊర్మయః యైస్తే, రచితమానసోర్మయః; 4. పద్మానాం భేదస్య పిశునాః, పద్మభేదపిశునాః; 5. గన్ధమాదనే విద్యమానానాం వనాన్తానాం మారుతాః, గన్ధమాదనవాన్తమారుతాః.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

**దమ్పతీ :** జాయా చ పతిశ్చ। రాజదన్తాదిగణేపాఠాత్ జాయాయా దమ్భావో వా నిపాత్యతే. భార్యాపతీ ఇత్యమరః. దమ్పతీ ప్రవృత్తిని - ఆతిథేయతను మనుస్మృతి ఇలా చెప్తోంది-

శ్లో॥ భుక్తవత్స్వథ విప్రేషు స్వేషు భృత్యేషు చైవ హి ।
భుంజీయాతాం తతః పశ్చాదవశిష్టన్తు **దమ్పతీ** ॥ *

**శ్లో॥ ఊరుమూలనఖమార్గరాజిభిస్తత్క్షణం హృతవిలోచనో హరః ।**
**వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమామవారయత్ ॥87**

**అవ :** పరమేశ్వరచేష్ట.

**ప.వి. :** ఊరు-మూల-నఖ-మార్గ-రాజిభిః తత్క్షణం హృత-విలోచనః హరః ।
వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమామ్ అవారయత్ ॥

**అన్వ :** ఊరుమూనఖమార్గరాజిభిః హృతవిలోచనః హరః ప్రశిథిలస్య వాససః సంయమం కుర్వతీం ప్రియతమామ్ అవారయత్

**ప్ర :** ఊరు... రాజిభిః : ఊరు = తొడలయొక్క, మూల = మొదళ్ళలోని, నఖ = గోళ్ళ (గోటి గుర్తుల) యొక్క, మార్గ = చారలయొక్క, రాజిభిః = పంక్తులచే, హృత-విలోచనః = హృత = అపహరింపబడిన, విలోచనః = కన్నులుగల, హరః = పరమేశ్వరుడు, ప్రశిథిలస్య = ప్రక్కకు జారిన, వాససః = వస్త్రం యొక్క, సంయమమ్ = సర్దుబాటును, కుర్వతీమ్ = చేస్తున్న, ప్రియతమామ్ = ఇష్టురాలైన పార్వతిని, అవారయత్ = నివారించాడు.

**తా :** పార్వతి ఊరువులపై నున్న బట్ట తొలిగింది. అక్కడ నఖ మార్గ పంక్తులు పరమశివుని కళ్ళనాకట్టుకొన్నాయి. దానితో వస్త్రాన్ని సర్దుకోబోతున్న పార్వతిని పరమేశ్వరుడు వారించాడు.

**విభక్తులు - క్రియలు :** 1. ఊర్ధ్వమూలనఖమార్గరాజిభిః : రాజ్యా - రాజిభ్యాం - **రాజిభిః**; ఊర్ధ్వమూలనఖమార్గరాజిశబ్దః ఇకారాన్తః స్త్రీలింగః తృతీయాబహువచనమ్; 2. తత్క్షణమ్ : **క్షణం** - క్షణౌ - క్షణాన్; తత్క్షణంశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. హృతవిలోచనః : **విలోచనః** - విలోచనౌ - విలోచనాః; హృతవిలోచనశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. హరః : **హరః** - హరౌ - హరాః; హరశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 5. వాససః : **వాససః** - వాససోః - వాససామ్; వాసశ్శబ్దః సకారాన్తః నపుంసకలింగః షష్ఠ్యేకవచనమ్; 6. ప్రశిథిలస్య : **ప్రశిథిలస్య** - ప్రశిథిలయోః - ప్రశిథిలానామ్; ప్రశిథజలశబ్దః అకారాన్తః నపుంసకలింగః షష్ఠ్యేకవచనమ్; 7. సంయమమ్ : **సంయమం** - సంయమౌ - సంయమాన్; సంయమశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 8. కుర్వతీమ్ : **కుర్వతీం** - కుర్వత్యౌ - కుర్వత్యః; కుర్వతీశబ్దః ఈకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 9. ప్రియతమామ్ : **ప్రియతమాం** - ప్రియతమే - ప్రియతమాః; ప్రియతమాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 10. అవారయత్ : **అవారయత్** - అవారయతామ్ - అవారయన్; వృఞ్ ఆవరణే ధాతోః లఙి ప్రథమపురుషైకవచనమ్.

**సంధులు :** 1. రాజిభిః+తత్క్షణమ్ = రాజిభిస్తత్క్షణమ్ - విసర్గసంధి.

**సమాసాలు :** 1. ఊర్వోః మూలయోః విద్యమానాః నఖానాం మార్గాణాం రాజయః, తాభిః, ఊరుమూలనఖమార్గరాజిభిః; 2. హృతాని విలోచనాని యస్య సః, హృతవిలోచనః (శివపరం కాబట్టి బహువచనం 'విలోచనాని' అని).

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

ఈ శ్లోకాన్ని క్షేమేంద్రుడు ఔచిత్యవిచారచర్చలో ప్రబన్ధార్థానౌచిత్యానికి ఉదాహరణగా చూపాడు.

ప్రబన్ధార్థౌచిత్యస్వరూపం -

**శ్లో॥ ఉచితార్థవిశేషేణ ప్రబన్ధార్థః ప్రకాశ్యతే ।**
**గుణప్రభావభవ్యేన విభవేనేవ సజ్జనః ॥** - 13

అమ్లానప్రతిభాప్రకర్షోత్ప్రేక్షితేన సకలప్రబన్ధావ్యాయి పీయూషవర్షేణ సముచితార్థ-విశేషేణ మహాకావ్యం స్ఫురదివ చమత్కారితామాపద్యతే - అని తన ప్రబన్ధార్థౌచిత్యాన్ని వివరించి కాళిదాసు శ్లోకాన్నే దానికి ఉదాహరణగా చూపాడు -

**శ్లో॥ జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం**
**జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః ।**

**తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబన్ధుర్గతోఽహం**
**యాఞ్చా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా ॥ -మేఘదూతమ్ - 1/6**

తిరిగి ప్రత్యుదాహరణాలను చూపుతూ కుమారసంభవంలోని ప్రకృతశ్లోకాన్నే ప్రదర్శించాడు. దానిని సమర్థిస్తూ పలికిన మాటలు -

"అత్రామ్బికాసమ్భోగవర్ణనే పామరనారీ సముచితనిర్లజ్జస్తనఖరాజి విరాజితోరుమూల హృతవిలోచనత్వం త్రిలోచనస్య భగవతస్త్రిజగద్గురోర్యదుక్తం తేనానౌచిత్యమేవ పరం ప్రబన్ధార్థః పుష్ణాతి' - ఇది అనౌచిత్యమే అని క్షేమేంద్రుని నిరూపణ. *

**శ్లో॥ స ప్రజాగరకషాయలోచనం గాఢదన్తపరితాడితాధరమ్ ।**
**ఆకులాలకమరంస్త చిత్రకం వీక్ష్య భిన్నతిలకం ప్రియాముఖమ్ ॥ 88**

**అవ :** పార్వతిని చూసి పరమేశ్వరుడు ఆనందించుట.

**ప.వి. :** సః ప్రజాగర-కషాయ-లోచనం గాఢ-దన్త-పద-తాడిత+అధరమ్ ।
ఆకుల+అలకమ్ అరంస్త రాగవాన్ ప్రేక్ష్య భిన్న-తిలకం ప్రియా-ముఖమ్॥

**అన్వ :** సః ప్రజాగరకషాయలోచనం గాఢదన్తపదతాడితాధరమ్ ఆకులాలకం భిన్న తిలకం ప్రియాముఖం ప్రేక్ష్య రాగవాన్ (సన్) అరంస్త.

**ప్ర :** సః = ఆ పరమేశ్వరుడు, ప్రజాగర... లోచనమ్ : ప్రజాగర = ఎక్కువగా మేల్కొనుట చేత, కషాయ = ఎఱ్ఱజీరగల, లోచనమ్ = కనులు గలదీ, గాఢ... తాధరమ్ : గాఢ = లోతైన, దన్త-పద = పంటినొక్కులచేత, తాడిత = పీడింపబడిన, అధరమ్ = పెదవి గలదీ, ఆకుల+అలకమ్ = చెదిరిన ముంగురులు గలదీ, భిన్న-తిలకమ్ = చెదిరిన తిలకం గలదీ అయిన, ప్రియా-ముఖమ్ = ప్రియురాలి ముఖాన్ని, వీక్ష్య = చూసి, రాగవాన్ (సన్) = రాగవంతుడై, ఆరంస్త = క్రీడించాడు.

**తా :** పరమేశ్వరుడు ఉదయకాలంలో ఆ పార్వతిముఖాన్ని చూసి అనురాగభరితుడై ఆనందించాడు. ఆమె కన్నులు రేయి ఎక్కువ మేలుకొన్నందువల్ల ఎఱ్ఱబడి ఉన్నాయి. ఆమె పెదవిపై దంతక్షతాలు కనిపిస్తున్నాయి. ముంగురులు చెదిరి ఉన్నాయి. తిలకం కొంత చెదిరింది.

**పాఠాన్తరం :** చిత్రకం - రాగవాన్; వీక్ష్య - ప్రేక్ష్య.

**విభక్తులు - క్రియలు :** 1. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 2. ప్రజాగరకషాయలోచనమ్ : **లోచనం** - లోచనే - లోచనాని;

లోచనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 3. గాఢదన్తపదతాడితాధరమ్ : ... **అధరమ్** – అధరే – అధరాణి; గాఢదన్తపదతాడితాధరశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 4. ఆకులాలకమ్ : **అలకమ్** – అలకే – అలకాని; ఆకులాలకశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 5. అరంస్త : **అరంస్త** – అరంసాతామ్ – అరంసత; రమ్ క్రీడాయామితి ధాతోః లుజి ప్రథమపురుషైకవచనమ్; 6. ప్రేక్ష్య – అవ్యయమ్. ప్రపూర్వకాత్ ఈక్ష్ దర్శనే ధాతోః ల్యప్ (క్త్వాస్థానే) ప్రత్యయః; 7. భిన్నతిలకమ్ : **తిలకం** – తిలకే – తిలకాని; భిన్నతిలకశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్; 8. ప్రియాముఖమ్ : **ముఖం** – ముఖే – ముఖాని; ప్రియాముఖశబ్దః అకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనమ్.

**సమాసాలు :** 1. ప్రజాగరేణ కషాయే లో చనే యస్యాః తత్, ప్రజాగర కషాయలోచనమ్; 2. గాఢేన దన్తస్య పదేన దారితమ్ అధరం యస్యా స్సా, గాఢదన్తపదదారితాధరమ్; 3. ఆకులాః అలకాః యస్య తత్, ఆకులాలకమ్; 4. భిన్నః తిలకః యస్య తత్, భిన్నతిలకమ్; 5. ప్రియాయాః ముఖమ్, ప్రియాముఖమ్.

**పదవ్యుత్పత్తి – కావ్యనిఘంటుప్రమాణాలు :**

**కషాయః :** (కష+ఆయః) సురభిః । యథా మేఘదూతే ''ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః" । **లోహితః** ఇతి మేదినీ । ...రక్తపీతమిశ్రితవర్ణ ఇతి అమరటీకాయాం స్వామి । – శబ్దకల్పద్రుమః

**ఉద్దీపక విశేషణాలు :** శ్లోకంలో '**ప్రియాముఖ**' మన్న విశేష్యానికి నాలుగు విశేషణాలున్నాయి. "ప్రజాగరకషాయలోచనం, గాఢదన్తపదదారితాధరమ్, ఆకులాలకం, భిన్నతిలకమ్" – నాలుగు విశేషణాలూ రాగోద్దీపకాలే. పూర్వరాగంలాగానే ఇది ఉత్తర రాగం. పూర్వపరిచయంలోని స్త్రీపుంగతశరీరమనోలక్షణాలు రాగవర్ధకాలయినట్లు పరిచయానన్తర స్థితిలోని శరీరమనోధర్మాలు రాగవివర్ధకాలు అవుతాయి. ఇక్కడ ప్రదర్శించిన నాలుగు విశేషణాలలో ఒక్కొక్కటీ రాగసంవర్ధకమే. శ్లోకంలో నాలుగింటినీ ఒకేచోట ప్రతిపాదించటం వలన పరమేశ్వరునిలోనూ అనురాగం పెల్లుబికింది. అందుకే కాళిదాసు '**రాగవాన్**' అని పరమేశ్వరుని నిర్దేశించాడు. *

**శ్లో॥ తేన భఙ్గివిషమోత్తరచ్ఛదం మధ్యపిణ్డితవిసూత్రమేఖలమ్ ।**
**నిర్మలేఽపి శయనం నిశాత్యయే నోజ్ఝితం చరణరాగలాఞ్ఛితమ్ ॥89**

**అవ :** పరమేశ్వరుడు శయ్యను వీడలేకపోవుట.

**ప.వి. :** తేన భంగ–విషమ+ఉత్తర+ఛదం మధ్య–పిండిత–విసూత్ర–మేఖలమ్ ।
నిర్మలే అపి శయనం నిశా+అత్యయే న ఉజ్ఝితం చరణ–రాగ–లాంఛితమ్ ॥

**అన్వ :** తేన భంగవిషమోత్తరచ్ఛదం మధ్యపిణ్డితవిసూత్రమేఖలం చరణరాగలాంఛితం శయనం నిశాత్యయే నిర్మలే అపి న ఉజ్ఝితమ్ ॥

**ప్ర :** తేన = ఆ పరమేశ్వరునిచే, భంగ... చ్ఛదమ్ : భంగ = చెదిరి, విషమ = ముడుతలు పడియున్న, ఉత్తర–ఛదమ్ = పైన పరిచిన దుప్పటి గలదీ, మధ్య... మేఖలమ్ : మధ్య = పక్క నడుమ, పిండిత = పోగుబడినట్టి, విసూత్ర = దారం లేని, మేఖలమ్ = మొలనూలు గలదీ, చరణ... లాంఛితమ్ : చరణ = పాదాలయొక్క, రాగ = లత్తుకరసంచే, లాంఛితమ్ = గుర్తింపబడినదీ అయిన, శయనమ్ = పక్కను, నిశాత్యయే = తెల్లవారువేళ, నిర్మలే అపి = అచ్చంగా పొడసూపినా, న ఉజ్ఝితమ్ = విడువబడలేదు.

**తా :** అచ్చంగా తెల్లవారినా కూడా పరమేశ్వరుడు పక్కను వీడలేదు. ఆ పక్కపై పరిచిన దుప్పటి ముడుతలు పడి ఉంది. దాని మధ్యలో సూత్రం తెగిన మేఖల పడి ఉంది. పార్వతి పాదాల కలదిన లత్తుక ఎఱ్ఱదనం ఆ పక్కపై గుర్తుగా ఉంది.

**విభక్తులు - క్రియలు :** 1. తేన : **తేన** – తాభ్యాం – తైః; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః తృతీయైకవచనమ్; 2. భంగవిషమోత్తరచ్ఛదమ్ : **ఛదం** – ఛదే – ఛదాని; ఉత్తరచ్ఛదశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 3. మధ్యపిండితవిసూత్రమేఖలమ్ : **మేఖలం** – మేఖలే – మేఖలాని; ...సూత్ర మేఖల శబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 4. నిర్మలే : **నిర్మలే** – నిర్మలయోః – నిర్మలేషు; నిర్మలశబ్దః అకారాన్తః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 5. అపి – అవ్యయమ్; 6. శయనమ్ : **శయనం** – శయనే – శయనాని; శయనశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 7. నిశాత్యయే : **నిశాత్యయే** – నిశాత్యయయోః – నిశాత్యయేషు; నిశాత్యయ శబ్దః పుంలింగః సప్తమ్యేకవచనమ్; 8. న – అవ్యయమ్; 9. ఉజ్ఝితాని : ఉజ్ఝితమ్ – ఉజ్ఝితే – **ఉజ్ఝితాని**; ఉజ్ఝితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 10. చరణరాగలాంఛితమ్ : **లాంఛితమ్** – లాంఛితే – లాంఛితాని; లాంఛితశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** 1. నిర్మలే+అపి = నిర్మలేఽపి – పూర్వరూపసంధి; 2. న+ఉజ్ఝితమ్ = నోజ్ఝితమ్ – గుణసంధి.

**సమాసాలు :** 1. భంగైః విషమః ఉత్తరచ్ఛదః యస్య తత్, భంగవిషమోత్తరచ్ఛదమ్; 2. మధ్యే పిండితా విసూత్రా చ మేఖలా యత్ర తత్, మధ్యపిండితవిసూత్రమేఖలమ్; 3.

నిశాయాః అత్యయః, తస్మిన్, నిశాత్యయే; 4. చరణయోః రాగః, తేన లాంఛితమ్, చరణరాగలాంఛితమ్.

**పదవ్యుత్పత్తి - కావ్యనిఘంటుప్రమాణాలు :**

రత్నావళిలో హర్షవర్ధనుడు విరహవర్ణన సందర్భంలోని శయ్యను వర్ణిస్తూ...

**శ్లో॥ పరిమ్లానం పీనస్తనజఘనసంగాదుభయత-**
**స్తనోర్మధ్యస్యాన్తః పరిమిలనమప్రాప్య హరితమ్ ।**
**ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజాక్షేపవలనైః**
**కృశాంగ్యాస్సన్తాపం వదతి బిసినీ పత్రశయనమ్ ॥**

ఆ శయ్య విరహిణి అయిన నాయికయొక్క విరహాన్ని తెలియజేస్తోందని హేతుదృష్టిని ప్రదర్శించాడు.

ప్రకృతశ్లోకానికది కొనసాగింపు. ప్రకృతశ్లోకంలో కాళిదాసు శయ్యాస్వరూపాన్ని మాత్రమే వర్ణించి తద్వారా ధ్వనించే విశేషాలను ధ్వనిమార్గంలోనే తెలియజేశాడు. పక్కను వర్ణిస్తూ ప్రయోగించిన విశేషాల ద్వారా పార్వతీపరమేశ్వరుల అనుభవంలోని రతిభేదాలు వ్యక్తమవుతున్నాయని వ్యాఖ్యాతలు -

"అత్ర ఉత్తరచ్ఛదస్య నిమ్నోన్నతత్వప్రతిపాదనేన బహవో రతివిశేషాః సూచితాః । సంవిష్టరతమ్, ఉపవిష్టరతమ్. ఉత్థితరతం చేతి త్రివిధా హి కరణవిశేషాః సంక్షేపతః కామశాస్త్రప్రసిద్ధాః । ...సూత్రప్రోతానాం మేఖలానాం సూత్రే సురతభేదేన భగ్నే సతి శయనీయస్య మధ్యభాగే సమూహీభూయ అవస్థానమ్ అనేన దర్శితమ్. తేన విష్ణువిక్రమాఖ్యం రతం సూచితమ్ । ... యోషిధేకచరణే సముద్ధృతే జాయతే చ హరివిక్రమాహ్వయమ్' ఇతి । ... చరణే పాదే యో రాగః అలక్తకరసః తేన లాంఛితమ్ అంకితమ్ । అన్యేధైనుకం రతం వివక్షితమ్ ॥ - వివరణవ్యాఖ్య. *

**శ్లో॥ స ప్రియాముఖరసం దివానిశం తర్షవృద్ధిజననం సిషేవిషుః ।**
**దర్శనప్రణయినామదృశ్యతామాజగామ విజయానివేదనాత్ ॥ 90**

**అవ :** పరమేశ్వరుడు పార్వత్యేకపరాయణుడు కావటం.

**ప.వి. :** సః ప్రియా-ముఖ-రసం దివా-నిశం తర్ష-వృద్ధి-జననం సిషేవిషుః ।
దర్శన-ప్రణయినామ్ అదృశ్యతామ్ ఆజగామ విజయా-నివేదనాత్ ॥

**అన్వ :** తర్షవృద్ధిజననం ప్రియాముఖరసం దివానిశం సిషేవిషుః సః విజయానివేదనాత్ దర్శనప్రణయినామ్ అదృశ్యతామ్ ఆజగామ.

**ప్ర :** తర్ష వృద్ధి జననం ప్రియాముఖరసం దివానిశం సిషేవిషుః సః విజయా నివేదనాత్ దర్శన ప్రణయినామ్ అదృశ్యతామ్ ఆజగామ.

**ప్ర :** తర్ష... జననమ్ : తర్ష = దప్పిక/తృష్ణయొక్క, వృద్ధి = పెరుగుదలను, జననమ్ = కల్గించే, ప్రియా-ముఖ-రసమ్ : ప్రియా = వల్లభ అయిన పార్వతియొక్క, ముఖ = ముఖమునందలి, రసమ్ = పెదవులకు చెందిన రసాన్ని, దివా-నిశమ్ = పగలూ-రేయీ, సిషేవిషుః = సేవింపగోరినవాడై (నను), సః = ఆ పరమేశ్వరుడు, విజయా-నివేదనాత్ = విజయయొక్క నివేదన ననుసరించి, దర్శన-ప్రణయినామ్ = దర్శనం కోరుతున్న వారికి, అదృశ్యతామ్ = కనిపింపకపోవుటను, ఆజగామ = పొందెను.

**తా :** పార్వతీముఖరసం పరమేశ్వరునిలో తృష్ణను వర్ధిల్లజేస్తోంది. దానితో ఆ రసాన్నే పగలూ రేయీ కూడా సేవించాలని భావించాడు పరమేశ్వరుడు. అందుకే విజయ (పార్వతి ప్రియసఖి) వచ్చి చెప్పినా తన దర్శనాన్ని కోరేవారికి దర్శనం కూడా ఇవ్వటం లేదు.

**విభక్తులు - క్రియలు :** 1. సః : **సః** - తౌ - తే; తచ్ఛబ్దః దకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 2. ప్రియాముఖరసమ్ : **రసం** - రసౌ - రసాన్; ప్రియాముఖరసశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 3. దివానిశమ్ : **దివానిశం** - దివానిశే - దివానిశాని; దివానిశశబ్దః అకారాన్తః నపుంసకలింగః ప్రథమైకవచనమ్; 4. తర్షవృద్ధిజనకమ్ : **జనకం** - జనకౌ - జనకాన్; తర్షవృద్ధి జనకశబ్దః అకారాన్తః పుంలింగః ద్వితీయైకవచనమ్; 5. సిషేవిషుః : **సిషేవిషుః** - సిషేవిషూ - సిషేవిషః; సిషేవిషు శబ్దః ఉకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్; 6. దర్శనప్రణయినామ్ : ప్రణయినః - ప్రణయినోః - **ప్రణయినామ్** - దర్శన ప్రణయిన్‌శబ్దః నకారాన్తః పుంలింగః షష్ఠీబహువచనమ్; 7. అదృశ్యతామ్ : **అదృశ్యతామ్** - అదృశ్యతే - అదృశ్యతాః; అదృశ్యతాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః ద్వితీయైకవచనమ్; 8. ఆజగామ : **ఆజగామ** - ఆజగ్మతుః - ఆజగ్ముః; ఆఙ్‌పూర్వకాత్ గమ్లృ గతౌ ధాతోః లిటి ప్రథమపురుషైకవచనమ్; 9. విజయానివేదనాత్ : నివేదనాత్ - నివేదనాభ్యాం - నివేదనేభ్యః; నివేదితశబ్దః అకారాన్తః పుంలింగః ప్రథమైకవచనమ్.

**సంధులు :** సః+ప్రియా = సప్రియా - విసర్గసంధి.

**సమాసాలు :** 1. ప్రియాయాః ముఖం, తస్మిన్ రసః, తమ్, ప్రియాముఖరసమ్; 2. దివా చ నిశా చ తయోః సమాహారః, దివానిశమ్; 3. తర్షస్య వృద్ధిః, తస్యాః జనకః, తమ్, తర్షవృద్ధిజనకమ్; 4. సేవితుమ్ ఇచ్ఛుః, సిషేవిషుః; 5. దర్శనే ప్రణయినః, తేషామ్, దర్శనప్రణయినామ్; 6. విజయయా నివేదనః, విజయానివేదనః.

తన దర్శనం కోసం వస్తున్న వారికి దర్శనం కూడా ఇవ్వకుండా పరమేశ్వరుడు పార్వతియందు అనురక్తితో ప్రవర్తిస్తున్నాడు. 'విషయైరింద్రియగ్రామః న తృప్తిమధిగచ్ఛతి । అజస్రం పూర్యమాణోఽపి సముద్రః సలిలైరివ' అని **అశ్వఘోషవచనం**. విషయాలను ఎంతగా అందించినా ఇంద్రియాలకు తృప్తి వుండదు. పరమేశ్వర విషయంలోనూ అదే న్యాయమా? అంటే భౌతికప్రాపంచికప్రవృత్తిలో ఉన్నప్పుడది అనివార్యమే అవుతుంది. నిర్గుణనిరాకారతాలక్షణాలనుండీ సగుణసాకారతలకు కొనివచ్చిన తరువాత ఆ లక్షణాలే ఉండటం ప్రకృతిధర్మాలను గౌరవించటమే.

పరమాత్మ పరంగా భావిస్తే సంతానప్రాప్తి కుమారస్వామిని పొందటం తనకసాధ్యమా? ఈ భౌతికప్రవృత్తి లేకుండా. అసాధ్యమని భావించినందువల్లనే గదా ఇంతవరకూ వచ్చింది కథ. పరాశరుడు సత్యవతి శరీరదుర్గంధాన్ని పోగొట్టగలిగాడు. దిక్కాలాలను నియంత్రించగలిగాడు. కానీ సత్యవతీ సంయోగాన్ని పరిహరించటం గానీ, ఆ ఆలోచనను తొలగించుకోవటం గానీ కుదరలేదు. కాబట్టి మహనీయులకైనా పుట్టుక యథాక్రమంగా జరగవలసినదే. ఆ విషయాన్ని నొక్కి చెప్పటానికే ప్రకృతవర్ణనా విషయమంతా. అందునా ఇక్కడ లక్ష్యం **కుమారోత్పత్తి**. తదనుగుణంగానే మనోభావాల కల్పన.

ఇంతకుముందే ఆరవసర్గలో –

**శ్లో॥ అణిమాదిగుణోపేతమస్పృష్టపురుషాన్తరమ్ ।**

**శబ్దమీశ్వర ఇత్యుచ్చైః సార్ధచన్ద్రం బిభర్తి యః ॥** అని పరమేశ్వరతత్త్వాన్ని చెప్పి ఉన్నాడు. ఆయన అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అనే సిద్ధులు గలవాడు. ప్రాణ్యుత్పాదన ఈశత్వాదుల వలన సంభవమే అయినా దానికి నైసర్గికవిధికి తలవంచి ఆయన ప్రవర్తించటం లౌకికమర్యాదవలననే. *

## శివసమ్భోగాతృప్తివర్ణనమ్

**శ్లో॥ సమదివసనిశీథం సఙ్గినస్తత్ర శమ్భో–**
**శ్శతమగమదృతూనాం సాగ్రమేకా నిశేవ ।**
**న తు సురతసుఖేభ్యశ్ఛిన్నతృష్ణో బభూవ**
**జ్వలన ఇవ సముద్రాన్తర్గతస్తజ్జలేషు ॥ 91**

**అవ :** బడబాగ్నివలె పరమేశ్వరుడు ఆరనికోరికతో ఉండటం.

**ప.వి. :** సమ–దివస–నిశీథం సంగినః తత్ర శమ్భోః
శతమ్ అగమత్ ఋతూనాం సాగ్రమ్ ఏకా నిశా+ఇవ ।

